

హిమగిరి మంచుగుట్ట. మంచు కరగినప్పుడు కరగును; కరగనప్పుడు వట్టి రాళ్లు. మంచురాళ్లు, మంచుగడ్డలు. అచ్చట నదు లేర్పడుట చిత్రము. నదులేర్పడుట యనగా గొంతకాలము మంచుకరగునని యర్థము. కరగని భాగ ముండును. అవి రాళ్లుగా నుండును. ఆ రాళ్లపైన నున్న మంచు కరగి జలముగా ప్రవహించును. రాళ్లు కనిపించును. రాళ్లు రెండు వైపుల కన్పించును. అనడుమ రాళ్లు లోతుగానుండును. ఆ ప్రదేశములో నీ మంచు జలముగా ప్రవహించును. దాని పేరు నది. ఇట్లే హిమగిరియందు నదులు ప్రవహించుచుండును. అంతయు రాతినేలయే. రాయియైనను పూర్తిగా రాయి యనుటకు వీలులేదు. ఒక పర్వతమువద్దకు పోయి చూచినచో రెండు రాళ్లుకలసిన చోట గడ్డి మొలచును. మొక్కలు మొలచును. అంత ఎందుకు? కొన్ని పర్వతములు మహారణ్యములచేత నిండియుండును. అనగా పర్వతములయందు రాళ్ల నంమన మన్ను ఉండు నన్నమాట. అది వట్టి మన్ను కాదు. సారవంతమైన మన్ను. అందుచేత కొండల మీద వ్యవసాయము చేయుదురు. పర్వతముల పార్శ్వములయందేటవాలుగా దున్నుదురు. ఏటవాలుగా నాటుదురు. ఎంత చేసినను నిజమున కడవిగా దానియంతట నది పెరిగిన వృక్షములయొక్క ఫలితము చేసిన వ్యవసాయమునందు కన్పించదు. లోకమున నొక సామెత యున్నది: "పెంటమీది చెట్టు ప్రబలము; నీరు పోసిన చెట్టు నిర్మూలము." మానవసృష్టియట్లుండును. విశ్వవిషయమును తిరస్కరించును. లోకోక్తులు భాషలో మిక్కిలిగా నుండును. అది తిరస్క

రించుటయో, మానవస్వభావములోని రహస్యమును చెప్పుటయో తెలియదు. "చదువుకొనినవానికంటె చాకలివాడుమే" లనియొకసామెత. ఈ సామెతలోని యర్థ మేమనగా చదువుకొన్నవాడు దురాచారవంతు డైయుండును. ఎక్కువమంది చదువుకొన్నవాండ్రు తాము విద్యా వంతుల మనియు, తమకు తెలిసినంత పరులకు తెలియ దనియు, తా మెట్లు చేసిన నేమి, సాగిపోవుననియు తలంతురు. విద్యావంతు లనగా నందరును విద్యావంతులే. విద్య, జ్ఞానము, సంగీతము, కవిత్వము, దేహబలము మొదలైనవి గుణములు. వాని కవధి లేదు. విద్య యున్నది. వేదవేదాంగపారంగతుడును విద్యావంతుడే; నాల్గు దేశభాషా కావ్యములు చదివినవాడును విద్యావంతుడే. జ్ఞాన మున్నది. "అహం బ్రహ్మాస్మి" అన్న ప్రత్యయమునందు నిరూఢుడైనవాడును జ్ఞానవం తుడే; పురాణములు చెప్పికొని వానిలోని ధర్మముల నుపన్యసించెడి వాడును జ్ఞానవంతుడే. సంగీతములో తుంబురునారదులు, నొక లల్లాయి పాటగాడు నిద్దరు పాటకులే. కవిత్వమునందు వాల్మీకియు కవియే; గొడ్లను కాచుచు నోటివెంట నేలపాటలుదయించినవాడును కవియే. నడిమి తారతమ్యము లెన్ని? ఇందులో మరల నీ తారతమ్యము లెరు గుట యొక జ్ఞానము. అది యొక విద్య. సామాన్యజను లీగజిబిజి పడలేక వారి సంస్కారమున కేది బాగుగా నుండునో దానినె విద్య యందురు. దానినే జ్ఞాన మందురు. దానినే కవిత్వ మందురు. కొన్ని చోట్ల నదియే ప్రమాణము.

హిమాలయగుహాంతరములలో వెలుతురు గ్రుడ్డిగా నుండును. అచ్చోటు కదలనివాని కదియే వెలుతురు. రెం డెత్తైన కొండ లున్నవి. ఏటవాలుగా లేవు. కచ్చితముగా కోసినట్లు మింటిలోనికి వెళ్లినవి. ఆ నడుమ నొక సందు. ఆ కొండలమీద నున్నతములైన వృక్షములు. అచ్చటికి రెండుజాముల యెండకూడ రాదు. వెలుతురు వచ్చును. అచ్చటనే నివసించువారికి సూర్యు డొక డున్నాడని, అతడు మండ బెట్టునని, వడకొట్టి జనులు చచ్చిపోదురని, కొన్నిచోట్ల నాయెండలలో దిరిగినచో నొడలులందు పొక్కులు పొక్కునని చెప్పి యొప్పించ గలమా? కొంచ రనుకొందురుగదా, వానిని తీసికొనివచ్చి నిజమైన యెండలు చూపించినచో వా డొప్పికొను నందురు. చూపింపుము. వా

డొప్పికొనడు; తప్పికొనును. వా డంగీకరింపడు. పుట్టినది మొదలు బుద్ధిఏర్పడువరకు, నేర్పడినతరువాత కొంతకాలమువరకు దేనియందు బ్రతికెనో దానిని వదలి వాని బుద్ధి మరియొకదానిని విశ్వసింపదు. ప్రత్యక్షముగా చూచుచున్నను వా డంగీకరింపడు. అందుకనియే "పుత్తెను పుట్టిన బుద్ధి పుడకలతోగాని పో"దందురు.ఇంతకును "చదువు కొన్నవానికంటె చాకలివాడుమే"లనగా నేమి? చాకలివా డొక కులము వాడు. విద్యావంతు డనాచారవంతు డైనచో వానికంటె చాకలివాడు మేలనుట. అనగా చాకలివాడు వస్త్రములను శుభ్రము చేయును. సంఘమునందు శుభ్రతావిషయమున వాని కొక గొప్పస్థానము కలదు. బహిష్ఠలైన స్త్రీల వస్త్రములు మైలపడును. అది అశుచి. ఇట్టివి కొన్ని మానవశరీరగతదోషములు కలవు. వానిని మానవులు, నాగరకత వృద్ధిపొందినచో, శుద్ధిపరచకుండ స్వీకరింపలేరు. మట్టి చేరినచో నీటితో కడుగవచ్చును. దేనితోనైన గీకవచ్చును. కొంతమేర నిప్పుతో దహింప వచ్చును. వీని కతీతమైన స్థలమునందు పరిశుభ్రత సంపాదించుట యెట్లు? అందుచేత సంఘము చాకలివాని నేర్పరచినది. వాని కది వృత్తి. వాని జీవయాత్ర సాగుచుండును. మరియు వాడు తడిపినచో నా వస్త్రము పవిత్రమగును. వాడు వస్త్రము లుదికినచో వస్త్రగతము లైన రెండు మాలిన్యములు పోవును; ఒకటి పరార్థగతమైన మాలిన్యము; రెండు భావగతమైన మాలిన్యము. భావగతమైన మాలిన్యము చాకలివాడు జన్మించినకులమునం దనాదినుండి సంఘ మేర్పరించిన మర్యాదచేత నివారితమగుచున్నది. ఇది యొక హద్దు. నాగరకత యనగా హద్దు. చదువుకొన్నవానికంటె చాకలివాడు మేలనగా నర్థ మిది. ఈ మాలిన్యనిరాకరణము వానియందు సంఘనియామకముచేత సహజముగా నున్నది. చదువుకొన్నవాడు ప్రయత్నించి యాచారము లాచరించినగాని యది సిద్ధింపదు. చదువుకొన్నవా డట్లు చేయడు. చదువుకొన్నవా డనగా 'అ ఆ' లు మాత్రము చదివి నేను చదివినవాడ ననుకొనెడివాడు. 'అ ఆ'లు నేర్చినవాడే తాను పండితుడ ననుకొన్నచో గుణింతముదాక నేర్చినవా డెందుకు కాడు? విద్య యనగా మానవ ప్రపంచమున నిట్లయినది. వేని బుద్ధి వానికే ప్రమాణము. దీనిని అవ్యవస్థ యందురు.

ఇట్లే కొండలమీద చేసిన వ్యవసాయముకంటె వానియంతట నవి యథేచ్ఛగా మొలచిన చెట్లే యధికఫలము నిచ్చుచుండును. కొన్ని చోట్ల నడిమిగా పెరిగిన చెట్లిచ్చు ఫలసాయముచేత దున్నుట, పండించుట మొదలైనవి చేయుదురు. వానినే తిందురు. వానినే అమ్మికొందురు. వచ్చిన ధనముతో పెరవస్తువులు తెచ్చికొందురు. ఒక్కొక్కప్పు డవి సమృద్ధిగా పండును. అచ్చటి జనులు ప్రయత్నము లేకుండ గొప్ప ధనవంతు లగుదురు. ధనవంతులైనంతనే "యెంత యున్నది? ఈ ధనము నెక్కువ చేయవలయు" నని మొదట. దానికితరుల ధనమును హరించుట రెండవది. అట్టిపనికి అడ్డంకివచ్చినచో వానితో విరోధము మూడవది. చిన్నయెత్తులో నిట్లుండును. పెద్ద యెత్తులో తానున్న భూభాగము తనది చేసికొని, అచ్చట రాజై, యింకొక చోట రాజైనవానిని గెలువబోవుట. అది సాధ్యమగును; కాదు. తానున్నచోట తాను రాజగును. ఇంక రాజై వాడు పట్టి భోజనముతో బ్రతుకడు. వట్టి ధనముతోడనే బ్రతుకు తెల్లవార్చుకోడు. వానికి తెలియకుండ వానిలో నొక తెలివి యున్నది. అది యెంత గ్రహించినచో నంతయే గ్రహించునుగాని తెలివి మాత్ర మగును. ఇంతకు మున్ను చెప్పిన విద్యా, జ్ఞాన, సంగీత. కవిత్వములవంటిదే యిదియును. దీనిలో ననంతములైన భేదములుండును. కాని మానవుడు తెలివిని తెలివిగా నుండనియడు. దానికి తన యితరశక్తులను తోడుపరచును. ఒకని కెక్కువ తెలివి యున్నది; తక్కువ ధన మున్నది; తక్కువబల మున్నది. మరియొకనికి తక్కువ తెలివి యున్నది; ఎక్కువ ధన మున్నది; ఎక్కువ బల మున్నది. వీనికి వాడు లొంగిపోవును; లొంగి పోవలయును. ఎందుచేత ననగా, నీ మానవసృష్టి భగవంతు డున్నచో, వాడు చేసినచో శరీరము ప్రధానముగా నిర్మించును. తెలివి, జ్ఞానము, విద్య, సంగీతము-సర్వమును లోకమునందు దేహధారుల నాశ్రయించి యుండునట్లు సృష్టి జరిగినది. తెలివి, జ్ఞానము మొదలైనవి యెంత ప్రధానముగా మానవుడు చెప్పినను నిజముగా ప్రధానమైనది శరీరము. ఇంత ప్రధానమైన శరీరమునకు చిరస్థాయిత్వము లేదు. ఇది మిక్కిలి యెక్కువ కాల మున్నచో నూటముప్పదియేం డ్లుండును. ఆనూటముప్పదియేం డ్లవధి. ఈ యవధికూడ కాలమునుబట్టి, తినెడి

యాహారమునుబట్టి, వాని యలవాటులనుబట్టి, వాని మనోగుణము లనుబట్టి. ఈ యవధి దుష్టమైన కాలమున, దుష్టమైన రాజ్యమున నరువదికంటె మించిపోదు. ఇరువదికూడ కావచ్చును. కనుక ప్రధాన మైనది శరీరము. జ్ఞానాదు లింతకంటె శాశ్వతము. ఇది యశాశ్వతము. ఇది లేకుండ వానికి స్థితిలేదు. అది గొప్పది, ఇది తక్కువదియైనను దీనికి ప్రాధాన్యము వచ్చినది. నిజానికి దీనికి దాని యంతటి ప్రాధాన్యము లేదు. ధనమో, విద్యయో, జ్ఞానమో, బలమో మిక్కిలిగా కలిగియున్నచో నప్పుడు శరీరమునకు ప్రాధాన్యము వచ్చును. ఈ తాత్కాలికమైన ప్రాధాన్య మెట్టిదనగా శరీరము నిత్యమనిపించునది. ఇది మానవసృష్టి. ఇంతకంటె జ్ఞానవంతమైనది లేదు;ఇంతకంటె నజ్ఞానమైనది లేదు. భగవంతుడే యీ సృష్టిచేసినచో నత డెంత చిత్రమైన సృష్టి చేసినాడు? అందుచేత మహాయోగులు, మహావేత్తలైనవారు నిజమైనజ్ఞానము సృష్టిరహస్యమును తెలిసికొనుట యందురు. కొందరు తెలిసికొందురు.తెలిసికొని దీని యందే రమింతురు.అది యెట్టిదనగాఅగ్ని యగ్నియని తెలిసి, దానిని తాకి కాల్పించుకొనుటవంటిది. ఇట్లుండగా నా హిమగిరిశిఖరములందు సమృద్ధిగా నడవులు కలవు.అవియంతయు సారవంతమైన నేల. రెండురెండురాళ్ల మధ్య మన్నుండును. తొలుత నది పెద్ద మట్టిగుట్టయై ఘనీభవించి ఎక్కువమేర శిలామయమై మన్నైనది మన్నుగానే నిలచిపోయి పెద్దపర్వతమై యుండనోవు. దీని కెన్ని కోట్ల సంవత్సరములు కావలయును? కోట్లు చాలునా? అర్బుదములు, న్యర్బుదములు, శంఖములు, మహాశంఖములు కావలయును. అందుచేత నీ భూమియు, పర్వతములు నెప్పుడు పుట్టినవో ఎవ్వడును చెప్పలేడు.

లోకమునం దొక విషయ మున్నది. వృక్షము లున్నవి. అవి యడవిలో హానియంతట నవి మొలుచుచున్నవి. ఎవరు వి త్తనహా వేసిరి? ఇట్లనవచ్చును. ఆ కాయలే పండును. నేలపడును. ఎండిపోవును. గుజ్జు,రసము, చర్మము కుళ్లి ఎండిపోవునుగాని గింజ లట్లు కావు. ఆ గింజలలో నుండి మరల మొక్కలు మొలచును. అట్లే మరి పెద్దగాలికి చెట్టు మొదలంట విరిగిపోవును. పడిపోవును. భూమికి సంబంధములేకుండ నా మోడులోనుండి మొక్క బయలుదేరును.

ఇది యెట్లు? అసలు మొట్టమొదట నొక చెట్టుండవలయునుకదా? ఆ వృక్ష మెట్లుబయలుదేరినది? దీని రహస్యముమాత్ర మనిర్వేద్యముగ నున్నది. విచారించగా మన జ్ఞానము మన యనుభూతిలో నున్నంత మేర మనము కార్యకారణములు కల్పించికొని చేసినదేకాని సర్వాంకషముగా తెలిసినది కా దనిపించును. మరియు నీ జ్ఞానముయొక్క యహంకార మెట్టిదనగా నిజముగా తా నవివేకియై మించి యూహించెడువాని నవివేకి యని చెప్పెడునది. ఈ యహంకార మెచ్చట పుట్టినది? ధనములోనుండి పుట్టిన. సంఘములోనుండి పుట్టినది. మంది బలములోనుండి పుట్టినది. చదువనిపించికొనెడి కొన్ని గ్రంథము లెక్కువగా చదువుటలోనుండి పుట్టినది. కనుక సృష్టిలో ప్రతివిషయమునందును తారతమ్యము కలదు. తారతమ్యము లేకుండ సృష్టి లేదు. కాని యహంకారము తారతమ్యమును సహించదు. వాని గొప్ప యేమి, నా తక్కువ యేమి అన్న భావముమీదనే కథ యంతయు నడచును.

ఇదియే సగముసృష్టి. కాని ఈ తారతమ్యమును కొండలు, నదులు, కొలనులు, చెట్లు పరిగణించుచున్నట్లు లేదు. పల్లపునేల నది ప్రవహించుచున్నది. మెట్టనేల చెట్లు మొలచుచున్నవి. ఈజలము పల్లపునేల ప్రవహించుటచేతనే మెట్టనేల చెట్లు మొలచుచున్నవి. జలము భూమిలోని కినికి, భూమి మన్నుగనుక, మన్ను చెమ్మ నాకర్షించునుగనుక నీరు ప్రవహించని మేర కూడ నుబికిన చెమ్మచేత వృక్షములు సముద్భూతములై ఫలించుచున్నవి. అట్లే కొందరి మనస్సు తమకంటె తెలివికలవారు, తమకంటె చదివినవారునైన జనుల తెలివి యన్న నదీప్రవాహము కలిగిన యితరులైనవారి తెలివిని తమ తెలివి తక్కువ యన్న మన్నులోనికి చెమ్మలింకించుకొని ఫలించుచుందురు. ఆ ప్రదేశమంతయు నాకాలువక్రింద పండు నన్నట్లుగా నా జనసమూహ మందరు నా వివేకియొక్క యూహలచేత పాలింపబడుచుందురు. లోకమునందు నదు లున్నవి. ప్రక్కన సారవంతమైన నేలయున్నది. ఆ నేల మెరక; ఈ నది పల్లము. దీని జలముచేత నవి పండును. మరియు కొంతమేర మిక్కిలి మెరక. జలమే ప్రవహించదు. చెమ్మ యురుకనేయురుకదు. ఇది యెట్లో మానవసంఘము నట్లే. ఒకచోట

పెద్ద నది; ఒకచోట చిన్న నది. ఎన్నినదులు లేవు? పరమోత్కృష్ట మైనది గంగానది-భాగీరథీనది. ఆమె హిమవత్పర్వతరాజు కుమార్తె. దేవతలు త్రావ నీరు లేక పోయి యాయన నభ్యర్థించిరి. దయతో నాయన యిచ్చెను. స్వర్గలోకమునకు గొంపోయిరి. భూమిమీద పంటలు లేకపోయెను. మానవులు మరల దేవులాడిరి. ఆమె "నేను స్వర్గమునుండి క్రిందికి దూకుదును. నన్ను మోయు నా డెవ" డని యడిగెను. శివుడు తన జటాజూటమును విప్పెను. ఆ గంగ సర్వ కల్మషహారిణి. అందులో నియిష్టమువచ్చినయంత మాలిన్యమును త్రోయుము. అది కడిగివేయును. ఇది ప్రత్యక్షమైన విషయము. ఆధ్యాత్మికముగా నీవు నమ్మవేని నీపదార్థవిషయికవిజ్ఞానముచేత గూడ నిది యథార్థము. "గంగ కడుగలేని మాలిన్యము సృష్టిలోలేదు;గంగ కడుగ లేని పాపముకూడ లే"దని యొక డనగా నింకొకడు కాదనును. వాడు పాపమే లేదనును. కడుగవలసిన యవసరములేదు. మలభూయిష్ఠ మైన శరీరమును ధరించి పదార్థమైన మలము లేదని వాడు వాదించదు. అది మానవజాతి కొక యదృష్టము. గంగానది యున్నట్లే ఇతర నదు లున్నవి. అట్లే మహావేత్త యున్నట్లు సామాన్యవేత్త లున్నారు. మనుష్యుడు చనిపోయినచో నస్థికలను గంగలో కలుపవలయును. గంగదాక పోలేడు. కృష్ణలో కలుపును. కావేరిలో కలుపును. దానినే గంగ యనును. అట్లే యెవని కందుబాటులోనున్న యొక జ్ఞానితో, వాని యుపదేశములతో వాడు తృప్తిపడును. ఇది సహజమేకాని ఈ సహజత్వముతోపాటు మానవున కహంకార మన్న యింకొక సహజ లక్షణమున్నది. అందుకనియే "తాను వలచినది రంభ, తాను మునిగినది గంగ" యను సామెత పుట్టినది.

హిమాచల ముత్తర దిశయందు భారతదేశ మెంత వెడల్పున్నదో అంత వెడ ల్పున్నది. పర్వతము దిగువ నంత పాదవున వరుసగా దేశము లున్నవి. పర్వతముమీద నంతవరుసగా దేశములు లేవు. కాని కొన్ని దేశము లున్నవి. జంతువు లెచ్చట నుండును? తాను తినుట కాహారము దొరకినచోట నుండును. దొరకెడు నాహారమునుబట్టి యా యాహారమును భుజించెడి జంతువు లుండును. లేళ్లు, కుందేళ్లు, అడవిదున్నలు పచ్చిగడ్డి సమృద్ధిగా దొరకెడి చోట

నుండును. అవి యున్నచోట సింహము లుండును. ఫలాదు లున్నచోట వానరము లుండును; మనుష్యులుందురు. లేళ్లు, దున్నలు కొన్నాళ్లుండి తరువాత సంఖ్య తగ్గినచో సింహాదు లచటి నుండి లేచిపోవును. అట్లే మనుష్యులును లేచిపోవుదురు. సింహాదుల కాహారము దొరకనిచో చనిపోవును. మనుష్యుడు మరియొక యాహారమును సంపాదించుటకు ప్రయత్నించును. వాడు దున్నును; పండించును. ఒక సోమరి. పులులవలె వాడుకూడ మాంసమును తినుచుండును. మనుష్యునకు రెండు లక్షణములు కలవుకదా! ఒకటి శరీరము; రెండు లోపలనున్న తెలివి. శరీరధారణ కెట్టి ప్రయత్నము చేయునో, వాని ప్రయత్నము లెట్లుండునో తెలివి పొలములందుకూడ వాని ప్రయత్నము లట్లే యుండును.

హిమాచలమున నున్న రాజ్యములలో రెండు రాజ్యములు ప్రసిద్ధములైనవి. పశ్చిమమున కాశ్మీరము; తూర్పున నేపాళము. రెండు ననాదినుండియు నున్నవే. రెండు రాజ్యముల చరిత్రలు భారతయుద్ధమునకంటె బూర్వమప్పటినుండియు గలవు. కాశ్మీర చరిత్రమును కల్హణుడన్న పండితుడు రాజతరంగిణి యన్న గ్రంథమును వ్రాసి జగత్ప్రసిద్ధమైనదానినిగా జేసెను. నేపాళ రాజవంశ కథను తాదృశముగా చిత్రించిన కవి లేడు. కాని కాశ్మీరమునకు, మగధమునకు, నయోధ్యకు, హస్తినాపురమునకు రాజవంశావళు లెట్లున్నవో నేపాళ దేశమునకుగూడ నట్లే యున్నది. ఈ రాజవంశావళులయందు జెప్పబడిన యంశములు పురాణములయందుగూడ గలవు. అభాగ్యవశమున నేటి భారతదేశచరిత్ర పాశ్చాత్యులచేత వ్రాయబడియుండుట వలనను, పాశ్చాత్యులు మన భారతదేశమును పాలించి, వారి చదువులు చదివించి మనలో నెక్కువమందిచేత వారి సిద్ధాంతములు నమ్మించుటవలనను మనలో బలుమంది మన పురాణములను నమ్మకపోవుటయేకాక వారు చెప్పినట్లుగా మన పురాణములన్నియు మృషాకల్పనములని విశ్వసించుచుండిరి. అయిదు వేల యేండ్లక్రింద జరిగిన మహాభారత యుద్ధము రెండువేల యేండ్ల క్రిందనో, మరెప్పుడో జరిగినట్లు వ్రాసినారు. ఆంగ్లేయుల రాజనీతి

యెట్టిదనగా వా రనుకొనిన ప్రకారము భారతదేశమును వట్టి కత్తితో గెలిచిన లాభము లేదు; మనస్సుతో గెలువవలయు ననియు వా రనుకొనిరి. మనస్సుతో గెలిచిరి. మనస్సుతో గెలుచుట యనగా మనోలక్షణము తెలిసికొని దానిని వశపరుచుకొనుట. మనోలక్షణ మేమి ? మనోలక్షణము పరిచితమైనదానియం దనురాగము గలిగి యుండుట. చిన్నప్పటినుండి చదివినదే నిజమనుకొనుట. అట్లు జరిగినది. కాని యథార్థమైనది వేరు. పాశ్చాత్య చరిత్రకారులు వ్రాసినది చదువగా వా రెంతటి దురాలోచనతో నిపని చేసిరో తెలియ గలదు. పాశ్చాత్యులు నిర్మించిన పాఠశాలలలో జెప్పబడు చరిత్రలో వారి దురాలోచన లుండవు; వారి దురాలోచనల ఫలితము లుండును. కనుక భారతీయులైన విద్యార్థులకు వానిలోని మర్మ ములు తెలియవు. మరియు నింకొక పద్ధతి యున్నది. మానవునకు లోపల జీవుడున్నాడు. వాని ప్రధాన లక్షణ మెట్టిదైనను, బాహిరమైన లక్షణ మెట్టిదనగా నూహచేయుట, తర్కముచేయుట. వాని తర్కము వాని యూహనుబట్టి యుండును.

ఊహ యనగా నేమి ? ఉన్న పరిస్థితులనుబట్టి, తెలిసిన విషయములనుబట్టి కార్యకారణసంబంధమును నిరూపించికొనుట. దీనినే యూహ యందురు. ఇంతకు మించి యూహ యుండదు. మరియు నూహించు మార్గములను గొన్నింటి నేర్పరచి పెట్టుట. దాని నొక శాస్త్రముగా సిద్ధపరచుట. ఈ శాస్త్రములు భిన్ననాగరకతల యందు భిన్నములుగా నున్నను మానవు లెచ్చట బుట్టినను ప్రధా నములైన విషయములు సమానముగా నుండుటచేత నొక సామ్య ముండును. శరీరమునం దెట్లో మనస్సునం దట్లే. మానవసృష్టిలో ప్రధానమైన దొక్కటియే. దేహములయొక్క వర్ణము, నొడ్డుపొడుగుల లక్షణము, ముక్కు కన్ను చెవి నోరు మొదలైన యవయవముల తీరులలో భేదము లుండును. భిన్నజాతులయం దీభేదము స్పష్టముగా గనిపించును. సామాన్యధర్మ మవయవముల కలిమి. ఒక జాతిలో ననే భిన్నవ్యక్తుల లక్షణములు భిన్నముగానే యుండును, కాని యొక సామాన్యలక్షణము ప్రధానముగా భాసించును. భిన్నజాతుల యం దీ సామాన్య లక్షణము భేదించును. దీనిమీద నొక పెద్ద శాస్త్రము

వ్రాయుట. ఆ జాతుల పుట్టుకలనుగూర్చి, వారి తొలి నివాసస్థానము లనుగురించి యెదో యెదో పెంచి, యది ప్రధానమైన చదువుగా చదివించుట. మరికొన్ని సిద్ధాంతములను నమ్మించుట. చీకటి వేరు, వెలుగు వేరు; నత్తు వేరు, అనత్తు వేరునని చెప్పినచో నత్తు, ననత్తుకాని దొకటి యున్నదని చిన్నప్పటినుండి నేర్పినచో నదనత్తులు రెండు నున్నవి, వానికంటె భిన్నమైనది లేదని నిర్మించిన శాస్త్ర మంతయు వ్యర్థమై, యనంగతమై, యవిశ్వసనీయమైన దగుచున్నది. మరియు జనుల యాయుర్దాయము భిన్నదేశములయందు భిన్నాంతర్బహిః పరిస్థితులమీద నాధారపడియుండును. స్వచ్ఛమైన గాలి పీల్చుచు స్వచ్ఛమైన యాహారము తినుచు స్వచ్ఛమైన జలమును గ్రోలుచున్న వారి జీవితము నిస్సంశయముగా దీర్ఘమైయుండును. అవి యన్నియు దుష్టములైనపుడు వాని యాయువు హ్రస్వ మగును. ఈ హ్రస్వా యువులైనవారి యాయుఃపరిమాణమునుబట్టి దీర్ఘాయువులు కల వారి దేశములో నున్న రాజులేలిన రాజ్యకాలము నిర్ణయింపరాదు.

శ్రీకృష్ణుడు నూటముప్పదియేండ్లు బ్రదికెను. ఒక్కొక్కడు వందయేండ్లుగా పదిమంది రాజులు వేయియేండ్లేలి రనగా దానిని విశ్వసింపక యొక్కొక్క రాజున కిరువది యారేండ్లు లెక్కకట్టి యా పదిమంది రాజ్యకాలము రెండువందల యరువది యేండ్లలో జరిగిన దన్నచో బురాణములయందలి యంశములు పొసగవు. రాజవంశావళుల కథ లదుకవు. ఆయుర్దాయము లీయాహారపదార్థములమీదనే కాక మానవుల శీలముమీదగూడ నాధారపడి యుండును. ఎక్కువ యుద్వేగి తక్కువకాలము బ్రదుకును. అధర్మప్రవర్తనము కలవాడు తక్కువకాలము బ్రదుకును. అకల్మషమైన పల్లెజీవనమందున్నవారు దీర్ఘకాలము బ్రదుకుటయు, నెక్కువ యారోగ్యవంతులుగా నుండుటయు కనిపించుచునే యున్నది. కనుక చరిత్ర వ్రాయుట తేలిక కాదు, ఒక్క యూహ పనికిరాదు. ఏ దేశపు చరిత్ర వ్రాయుచున్నావో యచ్చటి దేశకాల పరిస్థితులను విచారించి వ్రాయవలయును. పైగా కాలనిర్ణయము చేయుట యొక కష్టమైన పని. పాశ్చాత్యుల ఖగోళజ్ఞానము మిక్కిలి యర్వాచీనమైనది; భారతీయుల ఖగోళజ్ఞానము మిక్కిలి ప్రాచీనమైనది. కనుక చెట్టు మొదటనే దెబ్బ

కొట్టవలయునని పాశ్చాత్త్యు లేమి చేసిరనగా భారతీయులకు ఖగోళ జ్ఞానమే లేదనిరి. ఉన్నచో గ్రీకులయొద్ద నేర్చుకొన్నా రనిరి. అని, యా చదువు చెప్పిరి. అట్లే చదివించిరి. అచదువు చదివినవారికి పెద్ద యుద్యోగములు వచ్చుచున్నవి. ఎంత చేసినను 'శరీర మాద్యం ఖలు ధర్మసాధనం' — ధర్మసాధనములలో మొదటిది శరీరము. దేహ మున్నచో చదువు. దేహ మున్నచో ధనము. దేహ మున్నచో నధికారము. దేహములేనిచో నేదియు లేదు. ప్రధానమైనది దేహము. బ్రదికియున్న ప్రతివానికి దేహపోషణము, దేహరక్షణము ముఖ్యకర్తవ్యములు. నీ దేహరక్షణ కెవరు సాయపడుచున్నారో నీవు వారి మాట విందువు. వారు నీమీద నధికారులు. దేహరక్షణమనగా వట్టి దేహరక్షణము గాదు. భోగము ననుభవించుట. మన పిల్లలకు ధనమిచ్చి పోవుట మనము నివసించుటకు సౌధమొకటి యుండుట. కనుక ప్రతివాని బ్రతుకులోని రహస్యమిది. ఈ సంగతి రాజనీతిజ్ఞుడైనవానికి తెలియును. అతడెంతయైన చేయవచ్చును. మానవుని యాశమీద నతడు రాజ్యములు నిర్మించును. అతని యధికారమును స్థిరపరచుకొనును-రాజ్యము అతని చేతిలో నున్నది కనుక.

అందుచేత భారతదేశపూర్వచరిత్ర చదువుట యనగా పాశ్చాత్త్యులు చదివించిన చరిత్ర నవతల పెట్టి, మనయుద్యోగమును మన్నింపక, యలవాటుగా మన మాలోచించెడి లక్షణమును పెడద్రోచి చదువవలయును. అట్లు చదువగలిగినచో నేపాళ రాజవంశము పూర్వ మెన్నివేల సంవత్సరములుగానున్నదో తెలియదుగాని నేపాళ రాజవంశావళిమాత్రము మహాభారతయుద్ధమునకు బూర్వము కలియుగప్రవేశమునకు పూర్వము సుమారు వేయియేండ్లుగా నున్నదని తెలియుచున్నది. నేపాళరాజ్యమునుపరిపాలించుచున్న రాజు పేరు జితేదాస్తి. ఇతడు మహాభారతయుద్ధములో జనిపోయెను. అతని కుమారుడు గాలి. మహాభారతయుద్ధము క్రీస్తు పూర్వము మూడువేల నూటముప్పది యెనిమిదవ సంవత్సరమునందు జరిగినది. ఈ మహాభారతయుద్ధము జరిగిన తరువాత ముప్పదియారేండ్లకు కలియుగము ప్రవేశించినది. ఈ మహాభారతయుద్ధకాలమున మగధ రాజ్యమును పరిపాలించుచున్నవాడు సహదేవుడు. అతడు జరా

సంధుని కుమారుడు. ఇతని యుద్ధవర్ణనము మహాభారతమునందు కలదు. మహాభారతయుద్ధకాలమునాడు కాశ్మీరదేశమును పాలించు చుండిన రాజుపేరు దామోదరుడు. నేపాళరాజైన జితేదాస్తి చనిపో యెను. భారతయుద్ధములో జనిపోయెను. అతని కుమారుడు గాలి రాజ్యమునకు వచ్చెను. మగధదేశాధిపతియైన సహదేవుడు చనిపో యెను. అతని కుమారుడు మార్జారి రాజ్యమునకు వచ్చెను. ఆనాటికి కాశ్మీరాధిపతి దామోదరుడు. అతడు చనిపోయెను. ఆయన భార్య యశోవతి. అతని కుమారుడు రెండుమూడేండ్ల వయస్సు గలిగిన గోనందుని సింహాసనమునందుంచి తాను రాజ్యము చేయుచుండెను. అనగా మహాభారతయుద్ధానంతరమున యుద్ధము జరిగిన రెండుమూ డేండ్లలో కాశ్మీరములో యశోవతి, గిరివ్రజమున మార్జారి, అయోధ్యలో బృహద్బలుడు, హస్తినాపురమున ధర్మరాజు, నేపాళదేశమున గాలియు రాజ్యము చేయుచుండిరన్నమాట.

కాశ్మీరాధిపతులకు పాండవులకు, బడదు. కాశ్మీరరాజులకు కృష్ణు నితో వైరము. కాని నేపాళరాజు లట్టివారు కారు. వారు పాండవులకు మిత్రులు. పాండవులు వనవాసము చేయుచున్నప్పుడు కూడ జితే దాస్తి వారితో గొన్నాళ్లు కలిసియుండెను. కాశ్మీరము సంపన్నమైన దేశము. నేపాళమంత సంపన్నమైన దేశము కాదు. నేపాళ మచ్చముగా హిమాలయోపరిభాగమునందున్న శిలామయదేశము. కాశ్మీరమున నన్నియు మహానదులే. అన్నియు తోటలే. అది యొక నందనము. నేపాళ మట్టిది కాదు కాని నేపాళమునందలి ప్రజలు మహాయోధులు. ఈ సర్వదేశములయందనాదినుండియు వేదమతమే యుండెడిది.

వేదమత మొక విచిత్రమైన మతము. అందులో నిది యుండు, నిది యుండ దని యుండదు. జీవు డుత్తమలోకములకు జేరుటకు నెంతమహాప్రయత్నము చెప్పబడియున్నదో అతడాయుత్తమలోకము లకు జేరకుండుటకు నన్నిదుష్టమార్గములు చెప్పబడియున్నవి. అనగా వేదమతము సర్వసృష్టిని పర్యాలోచనముచేసి మానవుల యనంత బుద్ధిలక్షణములను పర్యాలోచనముచేసి వేనికి దగినట్లు వానికి జెప్పె నని యర్థము. వందసోపానము లున్నవి. మొదటి సోపానముమీది యతడు నూరవసోపానము వెంటనే యెక్కలేడుగదా! అతడు

రెండవసోపానము నెక్కుట కొక మతము. ఇట్లే వందమతములు. ఈ నృష్టి యజ్ఞానముమీదగాని సాగదు. ఈనృష్టి యథార్థము. ఇదేమియు లేదు అంపరును మరణించెడివారే! ఇది యశాశ్వతము అనెడు విశ్వాసము, తద్విశ్వాసమున కనుగుణమైన ప్రవర్తన నర్వజనులకు నుండినచో నృష్టి సాగునా? సాగదు. సాగకపోయినచో నెవరికి నష్టము? ఎవరికి నష్టమో తెలియదు. ఎవరికో నష్టము లేనిచో నీనృష్టి నిట్లు సాగించవలయు నన్న యుద్దేశ మెవరికో యధికముగా నున్నట్లు కనిపించుచున్నది. లేనిచో నొక వ్యర్థమైన నృష్టి నిట్లుగా నెందుకు సాగించవలయును? దానియంతట నది సాగుచున్నదా? దానియంతట నది సాగుట యేమి? దానియంతట నది సాగునేమో మనకు తెలియదు గాని మన మూహచేయుదుముగదా! మనము తర్కింతుముగదా! మన తర్కము, మన యూహయు మన మెరిగిన కార్యకారణముల మీద నాధారపడియుండును. మన మెంతసేపటికి ప్రతిదానికి నొక మొదలున్నదని భావింతుము. ఒక కర్త యున్నాడని భావింతుము. అందుకనియే భగవంతుని చెప్పుచు నతడు ఆదిమధ్యాంతరహితు డందుము. మన మెరిగిన దంతయు నాదిమధ్యాంతసహితము. అన్నింటికిని భగవంతుడు కర్త యందుము. ఈనృష్టిని జూచినచో నిది యొక పథకముమీద సాగుచున్నట్లుండును.

పథకమనగా నొక వివేకి పన్నిన పన్నుదల. దానియందు నర్వాంకషముగా ప్రతిచిన్నవిషయమునందు పూర్వాపరసందర్భముల నంయోగము దూరాలోచనకాలప్రమాణమును బట్టి ఫలవంత మగుట మొదలైనలక్షణము లుండును. ఈ నృష్టియం దవి యున్నవి. అందుచేత దీని కొక కర్త యున్నాడని మన మూహించవలసియున్నది. ఈ మహాపథకములో నొకడు పైకిలాగబడుట, మరియొకడు క్రిందికి గుంజబడుట, తన పనిని సాధించుకొనుట కొకనిని మోసముచేయుట, వానిని వెర్రుత్రోవపట్టించుట. మనుజునకు నహజముగా నహంకారమున్నది గదా! ఆ యహంకారముచేత తాను పట్టిన కుందేటికి మూడేకాళ్లనుట. ఎక్కడనైన కుందేటికి మూడుకాళ్లుండునా యన్నచో వెంటనే మరియొక డున్నాడు, వాడనునుగదా—"నీవన్నికుందేళ్లను జూచితివా? కొన్నిటికి మూడు కాళ్లెందు కుండరాదు" అని వాదించును. నీవు

చేసెడిదేమి? అందుచేత సర్వంకషమైన ఈ వైదికమతములో సిద్ధులున్నారు, సాక్షాదీశ్వరు లున్నారు, భగవంతుడే యన్నవా రున్నారు, మహర్షు లున్నారు. శాక్తేయులు, పాశుపతులు, గాణాపత్యులు, కాపాలికులు, బౌద్ధులు, మరల వీరిలో వందతెగలు. వీరందరు పరదేశములకు బోయి యీమతములో నుండి చిలువలుపలవలు పుట్టించిరి. ఇది యంతయు వేదమతము. ప్రధానమైన వేదమతమునకంటె భిన్నముగా గనిపించును. ఇది యిట్లు నడచుచుండగా భగవంతుడైన శ్రీకృష్ణదేవుడు స్వచ్ఛమైన వేదమతమును వెలయించుట కుదయించెను. ఉదయించినవాడు తన వెంటనే యొక బుద్ధునిగూడ తెచ్చెను.

# 2

నేపాళదేశము నదులచేతగాని, పర్వతముల పంపకముచేతగాని, మరియేంకేపథకముచేతగాని నాల్గువిధములుగా పంచవచ్చును. ప్రధానమైనది పరమపశ్చిమదేశము. అదియంతయు పర్వతమయము. దక్షిణమంతయు పల్లపుదేశము. అచట జనసమృద్ధి మెక్కువ. ఇచ్చట పంటలన్నియు పండును. ఈ దేశమును, దానియందు ప్రవహించు నదులచేత నాలుగువిధములుగా విభజించవచ్చును. మొత్తముమీద నన్నినదులును పోయి గంగానదిలో కలియును. సప్తగండకి యన్న నదు లేడునుమాత్రమే గండకీనదిలో కలియును. దక్షిణమున కిరాతదేశ మని యున్నది. ఇది ప్రధానమైన దేశము. ఈ దేశమున కా పేరు నివసించు ప్రజలు కిరాతులగుటచేత రాలేదు. అచట పాలించు రాజువంశము పేరు కిరాతవంశము. జితేదాస్తి కిరాతవంశపు రాజు. అది చాల పల్లమైన దేశము. పంటలు సమృద్ధిగా నుండును. కాంతారము లెక్కువగా నుండును. నేపాళముయొక్క సంపదయంతయు నాప్రాంతముది. అచట నన్నివృత్తులుచేసెడివారును

కలరు. నీవారజాతి యని యొక టున్నది. వారు కుండలు చేయుదురు. వడ్రంగము చేయుదురు. ఇటుకలు చేయుదురు. గొప్ప సంపన్నమైన జాతి. కాని వారు తమ వృత్తులను పరిత్యజించరు. ఎంత ధనమున్నను పేదవారివలెనే కనిపింతురు. అనాదినుండి వచ్చు నాచారములను పరిత్యజించరు. ధనవంతుల మన్న యహంకారము కల జాతి. నేపాళదేశస్థులయందే యొకలక్షణ మున్నది. వారి కోపములు వారి ముఖములయందు కన్పించవు. వారి కత్తి ఎప్పుడును శత్రువు గుండెకు సూటిగా పోవును. వారి కున్న ధైర్యము సృష్టిలో మరి యొకరి కుండుననుట కష్టము. వారిలో పురుషు లెట్టివారో స్త్రీలు నట్టి వారే. వారితో విరోధము పెట్టికొనుట కొరవితో తలగోకికొనుట. ఈ నీవారజాతిలో నొక యాచార మున్నది. వారు తమ యాడపిల్లలను, వేలావృక్ష మను నొకవృక్షముయొక్క పుష్పములు తీసికొనివచ్చి, యా పూవులకు బెండ్లి జేయుదురు.

అపుష్పము గొనగినదిలోనో, కాంచనగంగలోనో, సూర్యకోసీనదిలోనో వదలిపెట్టుదురు. అపుష్పము దాని దారి నది పోవును. అనాటి నుండి యా బాలిక పుణ్యస్త్రీయే. బ్రతికియుండగా నామెకు వైధవ్యము లేదు. ఆమెను తరువాత పురుషు లెవరైన పెండ్లాడవచ్చును. అది పెండ్లి క్రింద లెక్కకాదు. ఒక పురుషుడితోడి సంపర్కముమాత్రమే. ఆమెయు, నింకొక పురుషుడును కలసి సంసారము చేయుచుందురు. ఆ పురుషునియం దామె కిష్టము లేనిచో రాత్రి నిద్రలేచినతరువాత తెలవారుకడ వాని తలగడదిండుక్రింద నామెయొక్క పచ్చిపోకచెక్కను పెట్టును. వాడు దానిని చూచికొని యింక తనకు, నామెకు సంబంధము లేదని వెడలిపోవలెను. లేదా యామెయే వెడలిపోవును. వానికామెమీద నున్న యధికారము తావన్మాత్రమే. అతడు సంపాదనపరుడై యాస్తి వానిదైనచో నామె వెడలిపోవును. ఈ పోకచెక్కను చూచినంతనే వానికి దెలిసిపోవును. ఆమె సంపాదనపరురాలైనచో వాడు వెడలిపోవలెను. ఇది యొక పెద్దసంప్రదాయముగా, ననాదియైన సంప్రదాయముగా నాతక్కువయైన కులములో పాతుకొనిపోయిన సంప్రదాయము. పురుషు లందరు నొక స్త్రీ యిట్లు చేసినంతనే తమ స్థితిని తాము తెలిసికొందురు. తరువాత నేమియు నిబ్బందిలేదు. ఒక

నంప్రదాయ మున్నది ఒక ఆచారమున్నది. నంఘములో పదివేల మంది కట్టుబడియుందురు. ఒక డెవడో యెదురుతిరుగును. ఎదురు తిరిగినవాడు బలవంతుడైనచో నది పెద్ద విప్లవము. నంఘనంస్కరణము. బలహీనుడైనచో నది వానికి నాశనహేతువు. లోకలక్షణమంతయు నింతియే. చిన్ననుంచి పెద్దవరకు నింతియే. చిన్న సంఘములలోనేకాదు; మహారాజ్యములయందుకూడ నింతియే. రాజున కొకడెదురుతిరుగును. వాడు గెలిచినచో వాడు రాజును గెలిచెను, నూత్న రాజ్యమును స్థాపించె నన్న కీర్తి వచ్చును. వా డోడినచో వాడు విప్లవకారుడు. రాజు వానివిప్లవము నణచివేసెను. వానిని ఉరితీసెను. ఇది చరిత్ర.

ఇట్లే యారీతిగా నెవనితో కలసి కొన్నాళ్లుండెనో యాయువతి అతని తలద్రెంచ పోకచెక్క పెట్టినచో, నతడు సామాన్యుడైనచో—సామాన్యత రెండువిధములు: ఒకటి ధనాధికారములకు నంబంధించినది; రెండవది అతని జీవశక్తికి, వాని క్రియాశక్తికి నంబంధించినది. అతడు సామాన్యుడైనచో—వ్యవహారము పరిసిపోవును. అత డసామాన్యుడైనచో కోతిపుండు బ్రహ్మరాక్షసి యగును. దీనిపేరే లోకము. ఇదియే చరిత్ర. ఇదియే విప్లవము. ఇట్టిమానవప్రకృతినిగూర్చి యల్పమతులు గోరంతలు కొండంతలు చేసికొని జీవితములను వృథాపరచుకొందురు. అంతియే కాదు; అదియే జీవితపరమార్థ మందురు. అది ప్రచారముచేయుదురు. ఎవరి వివేక మట్టి ప్రమాణము కలదో వారనుయాయులు. సృష్టిలక్షణముచేత, వివేకముయొక్క ప్రమాణము తక్కువగుటచేత వా రధికసంఖ్యాకులుగా నుందురు.

ఆమెపేరు నిరాలంబ. ఆమె నేపాళదేశమున పరమసౌందర్యవతులలో నొకర్తుక. ఆ దేశస్థులు సహజముగా పొట్టివారు. కఠినదేహులు. ఎంతయైన నోర్మి కలవారు. సామాన్యముగా వారి శరీరములు శిథిలీకృతములు కావు. వారి యౌవనము పాలిపోనిది. చల్లని దేశము. వారల్పాహారులు. ఆమెయందమును చూచి యెవ్వరైనను వలతురు. ఒకస్త్రీని వలచి యామెను బలవంతముగా నెత్తికొనిపోవుట, నామె నవమానించుట, యామెకు మానభంగము చేయుట మొదలైన వీదేశములో సామాన్యముగా నుండవు. బౌద్ధునందు కృపాణమును గలిగి

శత్రువును పురుష డెంత నూటిగా వధించునో స్త్రీకూడ నంత లఘువుగా లంఘించి నూటిగా చంపగలిగినదైనచో స్త్రీలకు మానభంగమెట్లు కలుగును? ఈ నిరాలంబ యెంత యందకత్తియయో యంత లఘుశరీరి. అంత కత్తియొడుపు దెలిసిన స్త్రీ. ఇప్పు డామెచేత తలాపిక్రింద పోకచెక్క పెట్టించుకొనిన యతడు అతడును సాహసుడే. వాడును సుందరుడే. అతడును వీరు డని పేరుమోసినవాడు. అతని పేరు గుళూచి. గుళూచి నిరాలంబను స్వీకరించినప్పుడు తమ యిద్దరి సంయోగము జీవితాంత ముండునని తలచెను. తన వంటి పురుషుడు నీవారజాతిలో మరియొకడు లేడు. నిరాలంబ తనను వదలి యెచటికి పోవును? నిరాలంబకూడ నట్లే యనుకొనెను. తనవంటి స్త్రీ తమ జాతిలో లేదు. తనను వదలి గుళూచి యెచటికి పోవును? కాని యామె యనుకొన్నది నిజమే. అతడనుకొన్నది నిజము కాదు ఇట్టి సందర్భములో పురుషు డాస్త్రీని పిలచి కారణమడుగుట మొదలైనవి యుండవు. అది సంప్రదాయము కాదు. నోరు మూసికొని యూరకుండుటయే పరమోత్తమము.

ప్రసిద్ధముగానున్న యాచారమునుగూర్చి యెవరితో చెప్పి యేమి లాభము? పైగా ఊరకే నవ్వించుకొనుట యగును. దానివలన వచ్చిన యప్రతిష్ఠ లేదు. ఒకానొకసంఘములో నొకని భార్య యొకనిని వదలి వెళ్లిపోయినచో వాని భార్య లేచిపోయిన దని చెప్పికొందురు. అది అప్రతిష్ఠ. ఆ పురుషునకు పౌరుషహీనత. ఈ నీవారజాతిలో నది యట్టిది కానేకాదు. అది కొంతవరకు సామాన్యవిషయము ఇట్టి సందర్భములలో కొన్ని పరిస్థితు లేర్పడును. ఒకస్త్రీకి ఆ పురుషునియందు ప్రేమ పోదు. కొన్ని పరిస్థితు లట్లేర్పడి వానిని వదలిపెట్టిపోవుట జరుగును. మరియొకప్పుడు పురుషున కామెమీది మమకారము పోదు. వాడు దానిని తట్టుకోలేడు. కొందరి జీవలక్షణము విలక్షణముగా నుండును. సంఘాచారము, సంఘసంప్రదాయము పరివ్యాప్తమై యున్న మతము స్త్రీపురుషుల జీవితము లేకవ్యక్తినిష్ఠములుగా నుండవలయునని శాసించునవి; నిర్ణయించునవి.

అట్టి సంఘములో కొందరు వ్యక్తులు బహు పురుష నిష్ఠలు, బహు స్త్రీ నిష్ఠులు. ఇది యంతయు రహస్యము. వెలికివచ్చినప్పు

ఉల్లరి. కాని సంఘము మొత్తముమీద నెక్కువమంది సంప్రదాయ మునకు కట్టుబడియుందురు. ఇట్లే మరియొక సంఘములో పలు మంది స్త్రీలను పెండ్లియాడుట దోషము కాదు. అట్టి సంఘములో నొక పురుషుడు జన్మించును. వా డేక పత్నీవ్రతస్థుడు.

పాపము, గుళూచి యట్టివాడు. ఇబ్బంది యక్కడ వచ్చినది. నిరాలంబ వానిని వదలిపెట్టి పోయినచో వాని పరిశిష్టజీవితము శ్మశాన మునందు మండుచున్న కాష్ఠమువంటిది. నిరాలంబ పోకచెక్క తన తలక్రింద పెట్టినది. పెట్టుచుండుట దైవాద్యా గుళూచి చూచెను. ఆమెయు నతడు చూడవలెననియే పెట్టెను. కాబోయెడు రద్ది యప్పుడే కానిమ్మని యామె యాపని చేసెను. తాను పోకచెక్క పెట్టుటయు, వెళ్లిపోవుటయు, గుళూచి తనకోసమై వెదకుటయు, నెచ్చటనో పట్టు కొనుటయు, నిలువదీసి యడుగుటయు, పదిమంది చేరుటయు ననవ సరము. జరిగెడు రద్దీ తము యిద్దరి నడుమనే జరుగవలయును; అది పరులవరకు వ్యాపింపరాదని యామెయూహ. గుళూచి తనను చంపునా? చంపడు; చంపలేడు.

తమ కలసియుండిన జీవితములో నిద్దరును పెక్కుసార్లు బాహా బాహి పోరాడిరి. కత్తులతోగూడ యుద్ధముచేసిరి. అప్పుడంతయు స్నేహములో జరిగినది. అది యంతయు వలపులోని వ్యవహారము. ఇద్దరు సమానులన్న విషయము నిర్ణీతమైనది. కనుక నతడు కత్తి పూని తనపైకి వచ్చు నన్న మాట కల్ల. మరి యేమి చేయును? దుఃఖిం చును. తనతో వాదన చేయునేమో? తనను బ్రతిమాలునేమో? నిరాలంబ యెంత నిర్ణయించుకొనినను గుళూచిమీద నామె కున్న ప్రేమలోని తొలివచ్చి సంపూర్ణముగా నారిపోయెనని చెప్పుటకు వీలులేదు. తొలి వచ్చి యెప్పు డారును? అతడు చేసిన పనులవలన తనకు ద్వేష ముద యించి అతని వలపునందు తనకు లోపము కన్పించి వాని గుణము లందు తనకు వెగటు పుట్టినప్పుడు కలుగును. ఇప్పుడు గుళూచి యం దట్టి వేవియు లేవు. ఇవి యన్నియు వెలిపరిస్థితులు. నిరాలం బకు తెలియకుండగనే తా నట్లు చేయక తప్పకవచ్చెను. నిజానికి గుళూచిమీద ప్రేమ తగ్గవలసిన యవసరము లేదు. బహిఃపరిస్థితులు తగ్గించినవి. బయట నెవరితోడనో యామె ప్రమాణము చేసినది.

అయ్యయ్యో! వట్టి శరీరముల నడుమ నున్న నియమములకంటె మనస్సులో చేసికొన్న నియమము గట్టిది కదా! ఆ నియమము వట్టి మనోనియమము కాదు. ఆధ్యాత్మిక మైనది; భగవంతునకు సంబంధించిన దన్న ట్లుండెను. ఈ పరిస్థితులలో నిరాలంబ గుళూచికి తెలియకుండ నా పోకచెక్క పెట్టి వెడలిపోవలసినది. కాని గుళూచి మీద తన కున్న ప్రేమ, అతనియందు తన కున్న గౌరవము తన నట్లు చేయనీయలేదు. వారి నడుమ ప్రసంగ మిట్లు సాగినది:

గుళూచి:—ఏమిటి చేయుచున్నావు?

నిరాలంబ:—కనిపించుటలేదా?

గుళూచి:—అది నే ననుకొన్నదే యైనచో నేను గ్రుడ్డివాడ నైతిని. నాకు కన్పించుటలెదు.

నిరా:—నీ వే మనుకొంటివి?

గుళూచి:—నేను గ్రుడ్డివాడను కాదైనదనుకొంటిని. నేను కుంటివాడను కాదైన దనుకొంటిని. నేను బ్రతికియుండియు చచ్చిన వానిక్రింద లెక్క యైనవాడుగా కాదగినవాడను కావలసిన దనుకొంటిని.

నిరా:—ఇవి యన్నియు ప్రేమపు మాటలు. స్త్రీ పురుషులు లోకమునందు సామాన్యముగా కలిసికొందురు. ప్రవాహములయందు కాష్ఠములవలె కలిసికొందురు. విడిపోదురు.

గుళూచి:—ఈమాట యెచ్చట నేర్చుకొంటివి? పురాణములు చెప్పువారు చెప్పుదురు. నీవు పురాణము లెప్పుడు వినుచుంటివి? ఇద్దరమును పొలములలోనికి పోయి పాట్లు చేసికొనుచుంటిమి. నీ పొలము నీకున్నది; నా పొలము నాకున్నది. ఇద్దరము మన మన పొలములను చూచికొనకుండినచో మనకు జీవయాత్ర దుర్ఘటము. కనుక నిన్ను కాచికొని నేనును, నన్ను కాచికొని నీవు నుండుట దుర్ఘటము. మన పొలముల పనులతో మనకు పురాణములు వినుట ఎట్లు తటస్థించును?

నిరా:—అది పురాణములలో మాటయని నీ కెట్లు తెలిసెను?

గుళూచి:—ఓహో! నీవుకూడ నట్లే వింటివా? కానిమ్ము. నీ కీ యూహ యెందుకు పుట్టినది? నేను భర్తను, నీవు భార్యవు; నిజానికి నేను నిన్ను పోషించుట లేదు. నీవు నాచేత భరింపబడుట లేదు;

నేను నిన్ను భరించుట లేదు. ఇంతకును దైవదుర్వశమున మనకు సంతానము కలుగలేదు. సంతానము కలిగినచో మన బంధము దృఢతర మయ్యెడిది. లోకములో మగవాండ్రు స్త్రీలను కొట్టి తిట్టినట్లు నిన్ను నేను చేయలేదు. స్త్రీ యెంత స్వతంత్రురాలై నను, పురుషు డెంత పనికిమాలినవాడైనను కోపమువచ్చినప్పుడు అతడు కొట్టుటయు, తిరిగి కొట్టగలిగియు కొట్టకుండుటయు మర్యాద ననుసరించి జరుగును. ఇట్లు పూర్వము నాకు కోపము వచ్చినప్పుడు నిన్ను ఒకటి రెండుసార్లు కొట్టలేదు గాని నీపై నధికారము చేసితిని. నీవు దానిని మన్నించితివి. నేడు పరిస్థితి యట్టిది కాదు. ఎచ్చటికి పోదుపనికాని, పోవుటకు వీలు లేదనికాని నే నిప్పు డన్నచో ప్రయోజనము లేదు. మన పాలములో నాకంటె వీరుడు, నాకంటె సుందరుడు, నాకంటె నిన్నధికముగా ప్రేమించగలిగినవాడు లేడని నీవే పలుసార్లు చెప్పితివి. ఇప్పుడు నన్ను వదలిపెట్టిపోవుటకు విపరీతమైన పరిస్థితు లేమి కలిగినవి? నాకంటె వీరుని జూచితివా? నాకంటె వాడు వీరుడగునో కాదో మే మిద్ద రము మల్లయుద్ధమో, కత్తియుద్ధమో చేయవలెను. అప్పుడుకదా నిర్ణయించవలెను! అతడు నీతో నాకంటె వీరుడ నని చెప్పెనా? అది నీవు విశ్వసించితివా? లేదా, నీవు వానితో కత్తియుద్ధ మాడితివా? వాడు నిన్ను కత్తియుద్ధమున గెలిచినచో వాడు నాకంటె గొప్పవాడని నే నంగీకరింతును. అయినను జయాపజయములు దైవాధీనములు. ఒకప్పుడు అతనికి మన మోడిపోదుము. మరియొకప్పుడు గెలుతుము. గెలిచెడి గీత యున్నచో శత్రు వనుకొని యొక పరిస్థితి మనకు స్ఫురించును. అతడు నిర్వైరపోవును. ఓడిపోవును. గెలుచుట యన్నది యంతటి సందిగ్ధమైన విషయము. కాదు; అతడు నాకంటె సందగా డందువా? నాకు ముప్పదియేండ్లు దాటినవి. నీకును ముప్పదియేండ్లు దాటినవి. మన కిరువదియేండ్ల వయస్సునాడు మన కున్న నేవళము, లేతతములపాకుదనము నేడు మనయం దుండవు కదా! అతడు చిన్నవాడై నిన్నాకర్షించెనేమో తెలియదు. అతడు ని న్నాకర్షించవచ్చునుగాని నీవు అతని నాకర్షింపలేవుగదా! అత డిరువది యేండ్ల వాడైనచో నతడు తవటాకువంటి ఇరువదియేండ్ల పిల్లకోసము పోవును. కాని దానియందు నీకున్న పాండిత్యము, నీకున్న సామర్థ్యము,

నీకున్న యాస్తి, నీకున్న కత్తి నుపయోగించు నేర్పు లేకుండ పోవచ్చును. వీనిని జూచి అతడు నీకు వశుడైనాడా? ఒకవేళ నయ్యో నందము. అతడు నాతో విరోధము తెచ్చికొనుచున్నాడు కదా! నీవు సర్వదా వానిని రక్షించుచు కూర్చుండవు కదా! అతనిని నే నెప్పుడు వధించినను వధించవచ్చును కదా! నీవు మరల నావద్దకే రావలెను. అప్పుడు నావద్దకే వత్తువు. అప్పుడు మనయిద్దరి నడుమ నీ నడుమ జరిగిన పరిస్థితి యింతకు ముందువలె సంపూర్ణమైన ప్రణయముతో గూడియుండదు కదా! ఈమె యిట్లు చేసిన దన్న భావము నా మన స్సులో నుండి తొలగిపోదు. ఈ చెడ్డ సన్నివేశమే చాలును. కాదా, నీవు నన్ను పరీక్షించుటకు చేయుచున్నావా? నీయందు నాకు తొలి నాడున్న ప్రేమ యున్నదా లేదా అని విచారించుట కిట్లు చేయు చున్నావేమో! మొదట నీ కట్టి సందేహము కలుగుటకు నే నేమి చేసి తిని? స్వప్నమునందుకూడ నేను పరస్త్రీని వాంఛించలేదు. నాకు చెప్పుము.

నిరా:—నీ వనుకొన్న దేదియు కాదు. నా మనస్సు మారిపోయి నది. నీయందు ప్రేమ చెడి కాదు. శరీరమునందే యొక వెగటు కలిగినది. ఈ శరీరమునం దేమి యున్నది? ఈ స్త్రీ పురుష సంయో గమువలన నేమి సుఖ మున్నది? ఎప్పటికైన నీ శరీరములు నశించె డివే కదా! బ్రతికియున్నప్పుడే పరలోకము సంగతి విచారించుకొన వలెను. నా కా యూహ యుదయించినది. నిన్ను వదలిపో నెంచితిని.

గుళూచి:—అంతమాత్రమునకు నన్ను వదలిపోవుటయెందుకు? ఇచ్చటనే యుండుము. సంసారము చేయకుము. నీవు తపస్సుచేయ నెంచితివా? ఇంటిలో కూర్చుండి చేసికొనుము. యోగాభ్యాసము నెవ దైన నేర్చినా? దాని నాచరింపుము నిన్ను వలదన్న దెవడు? ఇటు యోగాభ్యాసము, అటు పొలము చూచికొనుట రెండు నెట్లు కుదు రును? నీ పొలమును నేను చూచిపెట్టెదను. నీ విల్లు వెడలిపోయినచో యోగమునందో ధ్యానమునందో లగ్నమనసువైనచో నీ పొలము బీడుపడును. దాని నింకొకడు సాగుచేసికొనును. మోక్షార్థినివైన నీకు నష్టము లేదుగాని నీకు తల్లిదండ్రు లున్నారు; సోదరులున్నారు. వారి కిచ్చిపొమ్ము. ఇచ్చిపోవుట యెందుకు? ఇచ్చి రమ్ము. నాయింట

నుందువుకాని. నీవు యోగినివై యుండగా నీకు గుప్పెడన్నము పెట్ట లేని దరిద్రుడను కానుగదా!

నిరా:—అట్లు కాదు. నాయాస్తిని నేను వదలను. అది నా గురువున కియవలెను.

గుళూచి:—గురువా? అవ్యక్తి పురుషుడా? స్త్రియా?

నిరాలంబ :—ఇంటిలోనుండి త్రోసివేయగా చూరు పట్టుకొని వ్రేలాడినట్లు నిన్ను వదలిపోవుమన్న స్త్రీనిగురించి నీకీ వివారణ యెందులకు?

గుళూచి:—నేను నిన్నంతమాత్రముతో వదలుదునా? ఆ గురువును నేను కనుగొనలేనా? నీవు నన్ను వదలినచో నేను నిన్ను వదలను. నా యాస్తిని పరిత్యజింతును. నా బంధువులను పరిత్యజింతును. నాకు నీతోడిదే మోక్షము. ఆ గురువెవ్వరో చెప్పుము. నేను వానికి శిష్యుడ నయ్యెదను. ఇద్దరము కలసియే యుందము.

నిరాలంబ :—అన్నియు వదలిపెట్టినతరువాత కలసియుండుట యేమి?

గుళూచి :—ఎవరి యుపదేశములు విని నీ వన్నియు వదలి పెట్టుదు ననుచున్నావో అత డేమియు వదలిపెట్టినట్లు లేదే! అతనికి నీ యాస్తి కావలె ననుచున్నావు. అది యేదో దేశములో నొక కథ యున్నది. బ్రాహ్మణుడు పురాణము చెప్పుచుండెను. ఉల్లిపాయ తిన రాదని పురాణములో చెప్పెను. ఇంటికి వచ్చినతరువాత భార్య పప్పు చారు వడ్డించినది. ఆమె యందులో నుల్లిపాయ వేయలేదట. మగడైన యాబ్రాహ్మణుడు కోపించెను. ఆ భార్య "ఉల్లిపాయ తినకూడదని మీరే పురాణములో చెప్పితిరికదా"యన్నదట. భర్త "అది పురాణములోని మాట, పప్పుచారులోని మాట కా"దన్నాడట. అట్లున్నది యీ వ్యవహారము. శిష్యులు సర్వమును పరిత్యజించవలెనా? గురు వేమియు పరిత్యజించనక్కరలేదా?

నిరాలంబ:—నీవు నన్నేమన్నను నే నూరకొందునుగాని నా గురువు నేమైన నన్నచో నే నూరకుండను.

గుళూచి :—ఊరకుండనుండ నన్నమాట కున్న యర్థములో పరమావధిభూతమైనది భర్తను వదలి లేచిపోవుట. అది చేయదలచు

కొన్నావు. కనుక నీబెదరింపులో నర్థము లేదు. గాక, నాతో మల్లయుద మాడుదువా? కత్తియుద్ధ మాడుదువా? వానిలో మన మిద్దరము నరి నమానము. నన్ను నీ వేమియు చేయలేవు. నేను నిన్నేమియు చేయ లేను. కనుక మన యిద్దరినడుమ వ్యవహారము పరిష్కరింపబడవలె ననగా వాగ్వాదముచేతనే పరిష్కరింపబడవలెను. కనుక చెప్పుము. నీ గురువు నర్వసంగపరిత్యాగి కాడు. అట్టి పరిత్యాగము నీ వెందుకు చేయవలెను? అట్టి పరిత్యాగము నీవు చేయుదలచినచో నీ యాస్తి యేమైపోయిన నీకేమి? దానిని గురువు తినుట యెందుకు-మేకలను తిననీయుము. అది పరిత్యాగలక్షణము. నీకు తోచిన యెవరికో యీవలెననిన నది నర్వసంగపరిత్యాగలక్షణము కాదు. కనుకకొన్నాళ్లు నాతో నున్నావుకదా! ఆ యాస్తిని నా కిచ్చిపొమ్ము. ఇన్నాళ్లు అతనితో నంసారము చేసితిని; వాని కిచ్చిపోవుట న్యాయమే యనుకొందువు. తీసికొనిపోయి యా యెవ్వడో బైరాగివాని కిచ్చినచో లోక మేమను కొందురో తెలియునా? నీకును వానికిని నంబంధ మున్న దనుకొందురు. గులాబివంటి పురుషుని వదలిపెట్టి ఈ నత్రదష్టను పట్టుకొన్నదేమిరా యనుకొందురు. నిజమునకు నీకును, అతనికిని నంబంధముండక పోవచ్చును. లోక మున్నదని చెప్పుకొనును. నీవంటివా రేమందురో తెలియునా? అనుకొన్నచో ననుకోనిమ్ము; నేను లెక్క చేయ నందు వేమో. అట్లందరు నందురు; లెక్కచేయకపోవుట యంత తేలిక కాదు. అది పరిణతయోగులు చేయదగినది. ఓసీ! నీకొక్కటి చెప్పె దను. మన రా జెవ్వరు? జితేదాస్తి. ఆయన కెవ్వరితో స్నేహము? పాండవులతో స్నేహము. పాండవు లెవరు? శ్రీకృష్ణభక్తులు. శ్రీకృష్ణు డెవడు? భగవదవతారము; సాక్షాచ్ఛ్రీమన్నారాయణమూర్తి. మన రాజువెంట నెప్పుడును కొంత పరివారము వెళ్లుచుండును. ఆ పరివా రములో నాకు స్నేహితు డున్నాడు. ఆ పాండవులతో మన రాజున్న ప్పుడు వారివద్దకు మహర్షులు వత్తురు. భగవంతుడే వచ్చును. ధర్మ రాజు మహాజ్ఞాని. అవియన్నియు మనరాజు వినును; ఈ పరివారము విందురు. నా స్నేహితుడు వాని నవగాహనచేసికొన్నట్లు మరియొకడు చేసికోలేడు. అతడు రాజునకు పరిచారకుడు. నిత్యనన్నిహితుడు- అతడు నాతో నవి యన్నియు చెప్పును. భగవదనుగ్రహమువలన నా

కెంత తెలియవలెనో యంత తెలియుచున్నది. నీ మనస్సున కాధ్యాత్మికప్రవృత్తి యున్నదని నే నెరుగను. లేనిచో నీకును జెప్పెడివాడనే. నే నెందుకు? నా స్నేహితు డున్నాడే—అతని పేరు చిరంతనుడు. చిరంతనుని తీసికొనివచ్చి నీకు జెప్పించెడివాడను. ఈ మాత్రానికి నన్ను వదలిపోనక్కరలేదు.

నిరాలంబ:—నీవు శ్రీకృష్ణుడు భగవంతు డనుకొనుచున్నావు. నేను కాదనుకొనుచున్నాను.

గుళూచి యామెవంక నివ్వెరపోయి చూచెను. కొంతసేపటి కిట్లనెను: "ఎందు కనుకొనుచున్నావు? శ్రీకృష్ణునిగురించి నీ వేమి విన్నావు? ఆయననుగురించి నీ కేమితెలియును? ఏమియు తెలియకుండ నతడు భగవంతుడు కాడని యెట్లనుకొన్నావు? అది తప్పుకదా? ఒకనినిగూర్చి మనము మన యభిప్రాయములు చెప్పునప్పుడు అతనినిగూర్చి సర్వాంకషముగా తెలిసికొని చెప్పవలెను."

నిరాలంబ:—ఆ శ్రీకృష్ణుని గూర్చి నీకే తెలియదు. భారతదేశమునందు మెడకాయమీద తలకాయ యున్నవారందరికి తెలియును. అదియంతయు నెందుకు? నేను పోవుచున్నాను. నిన్ను వదలిపెట్టిపోవుట యనగా నాకు తొలుత కష్టముగానే యున్నది. కాని, నీవు నా గురువును నిందచేసినతరువాత నా కష్టము కొంచెము తగ్గినది.

గుళూచి:—నేను నీ గురువును నింద చేయలేదు. నీ గురువు భగవంతుడు గాడని చెప్పుచున్నాను. భగవంతుడు శ్రీకృష్ణదేవుడని చెప్పుచున్నాను.

నిరాలంబ:—అందుచేత నీకును, నాకును సంబంధములేదు.

గుళూచి:—ఓసీ! నిజాని కెవరికి, నెవరికి సంబంధము లేదు. సంబంధ మైహికము. ఐహిక మున్నన్నాళ్లు సంబంధ మున్నది. ఒకరి కొకరికి సంబంధము లేదన్న స్థితి సంప్రాపించువరకు మనుజులకు పరస్పరమైన సంబంధమున్నది. ఈ సంబంధ మొక నియమము. అంతవరకు దీనిని త్రెంచరాదు. అప్పుడు దాని యంతట నదియే తెగిపోవును. కామక్రోధాదులు చాల విలక్షణములైనవి. ఆధ్యాత్మిక విద్య యనుకొందురు. జ్ఞానము వచ్చిన దనుకొందురు. జ్ఞానము కామక్రోధదూషితమై యుండును. నీ వామార్గమున బడిపోవుచున్నావు.

నీ కాస్తిమీద కోరిక పోలేదు. దాని నెవరికో ఈయవలెనన్న వాంఛ పోలేదు. ఓసీ! నిజమైన జ్ఞానోదయము కలవారు నీవలె మగని తలాపి క్రింద పోకచెక్క పెట్టరు. ఎవతె పెట్టుననగా అతనినివదలి యింకొక నితో బోవలెననుకొను స్త్రీ పెట్టును. ఆ నీ గురువు నిజముగా గురువు కాదగిన జ్ఞానలక్షణములు కలవాడైనచో అతనికి నీ యాస్తి యెందులకు? అట్టివాడు కామమును గెలిచెనా? రేపు నీ యౌవన మును జూచి, నీ సామర్థ్యమును జూచి అతడు నిన్ను కామించు ననుకొనుము. అతనికి లొంగిపోదువా, ఎదురుతిరుగుదువా? కొన్ని మతము లున్నవట; వానిలో కామముకూడ నొక భావము. దుష్టము లైన యుపాసనలు చేయుదురు. ఈ నీ గురు వటువంటివాడేమో! నేను నిన్నుగురించి తెలిసికొన్నతరువాతకాని నిన్ను వదలిపెట్టను.

నిరాలంబ:—నన్ను నీవు వదలిపెట్టెడిదేమి? నేనే లేచిపోవు చున్నాను.

గుళూచి:— నిన్ను వదలిపెట్ట ననగా నర్థమేమో చెప్పెదను. నిన్ను పట్టికొని నేను నిలబెట్టలేను. ఈ వదలిపెట్టుట కాదు. నీ వెచ్చ టికి పోవుచున్నావు? నీ గురు వెవరు? అతని లోతుపాతు లేమి? అతని యానుపాను లేమి? అత డెక్కడనుండి వచ్చినాడు? అతని పూర్వచరిత్ర యేమి? అతడు స్త్రీలను శిష్యురాండ్రుగా చేర్చికొనుట యెందులకు? ఇది యంతయు కనుగొనెదను.

నిరాలంబ:—ఆయనకు పురుషులుకూడ చాలమంది శిష్యులు కలరు.

గుళూచి:—ఓసీ! కొందరు పురుషు లుందురు. వారు స్త్రీల కంటె కనాకష్టము. ఒకడు తనయుద్యోగము బ్రహ్మాండముగా చేయును. అతడు కత్తి పుచ్చుకొన్నచో అతనిముందు నిలువలేము. కాని అతడు తన పైయుద్యోగికి దాసానుదాసుడు. స్వతంత్రించి యూహించలేడు. వట్టి చవట. ఆ యుద్యోగము చేయుటలోని పది సంగతులును అతనికి తెలియును. అతని జ్ఞానమంతే. ఆ రాజునకు తన తల కోసియిచ్చును. అది గొప్ప ధర్మము. నేను కాదనను. కాని అతని కింకొకటి తెలియదు. అతని కదియే తెలియును. అతడు పశువునకంటె నీ యొక్క విషయ ములో తప్ప నధికుడు కాడు. అతడుకూడ పురుషుడేనా? పురుషు

డనగా సర్వవిషయపరిజ్ఞాత. ఆలోచనాసమర్థుడైనవాడు. సదసద్వివే కము కలిగి సద్విషయము నాచరించువాడు పురుషుడు. 'బయట పల్లకీల మోత, యింట నీగల మోత' యని బయట నెంతో ప్రతిష్ఠ, ఇంటిలో నాడదానికి లోకువ. ఆ యాడది వీనికి నిజమైన సంసార సుఖముగూడ నొసగదు. వీనికి కామతృప్తి ఆమెయొక్క దయాధర్మ భిక్షము. అతడు కూడ పురుషుడే? అతనికిని సంతానము కలుగును. లోకమందరు అతనిని పురుష డనుకొందురు ఛీ! ఛీ! ఇట్టిపురుషులు అతనికి శిష్యులేమో! వారును శతవిధముల నీవంటివారేయైయుందురు. పురుషులని చెప్పవచ్చితివా ?

నిరాలంబకు పట్టరాని కోపము వచ్చెను. వ్యవహారము వ్యత్యస్త మయ్యెను. అతనికి కోపము వచ్చుచు. తాను తన కాపుదల తాను చేసికొనవలె ననుకొనెను. ఇప్పుడు తనకు కోపము వచ్చెను. అతని నేమి చేయవలయును? తా నేమి చేయగలదు? తన గురూపదేశ మంతయు నిచ్చట వ్యర్థమగుచున్నది.

ఆమె యిట్లనెను: "మే మహింసావాదులము. నేను నిన్నేమియు చేయను."

గుళూచి: —ఇది యేమి? ఏదియైనను చేయదలచుకొంటివా? ఏమిచేయదలచుకొంటివి? అహింస యన్న మాట వచ్చి వాడితివి. నన్ను కత్తితో నరుకనెంచితివా? గాయపెట్ట తలపెట్టితివా? ప్రేమలో నట్లు చేసినచో చేసియుండగలవు. ఇప్పుడు నా ప్రేమ విఘటితమైపోయినది. అట్టి పిచ్చి యూహ చేయకుము. మన మిద్దరము క్రీడాకరవాలకలహ సమయములయందు సమానముగ నున్నను నేను నీకంటె నధికు డను. స్నేహయుద్ధములలో రెండవ వానిని చంపుటయని యుండదు. ఎదిరివాడు నిజమైన విరోధియైనచో నప్పటి యుద్ధము వేరు. నేను శత్రువును వందవిధములుగా చంపగలుగుదును. నేను నిన్నెప్పుడును చంపను. నీవు నాకు శత్రువవు కావు. కాని నిన్ను నేను గాయపరుప గలను. నీచేయియో కాలో జీవితాంతము పనికిరానట్లు చేయగలను. నీకు నాయెడల హింసాబుద్ధి కలిగెనేని నేను నిన్నట్లు చేసి బ్రతికి నన్నాళ్లు నిన్ను నామంచములో పడియుండునట్లు చేయగలను. అంత పని చేసికోకు. నీవు నాయింట మంచములో బడియుండినను నాకు

నీమీద ప్రేమ పోదు. నే నొక స్త్రీగతబుద్ధిని. నీవు నన్ను వదలిపోయి నచో జీవితాంత మిట్లే యుందును. అహింసయా? ఎక్కడ నేర్చితి వీమాటను?

నిరాలంబ నిర్వేరపోయి చూచుచుండెను. ఆమె యిట్లనెను, "అట్లనా? నాచేయో కాలో తొలగించి నీయింటిలో నుంచెదవా? నీయుద్దేశ్యము నీవు నన్నట్లు చేసి నాతో భోగించవలెనని యున్న ట్లున్నది. కుంటిదానితో రమింతువా? నా మాట విని ప్రేమలేని స్త్రీ కోసము పెనగులాట యెందులకు? ఎవతెనో చేసికొనుము. దానియందు సంతానము కనుము. నీకు తృప్తియగును. నీవంటివా రంతకంటె నేమి చేయుదురు?''

గులాబి: — మరి నీవంటివా రింతకంటె నేమి చేయుదురు?

నిరాలంబ:— మేము మోక్షమును సంపాదింతుము.

గులాబి:— వాడా నీకు మోక్ష మిచ్చునది? ఏమి మోక్షమే? కపాలమోక్షమా? నీ స్థితి చూచినచో నాకెట్లున్న దనగా నిన్ను వదలి పెట్టి వాడు నీచేత కరపించెడి గడ్డి నిన్ను కరపించి నీకు తల తిరిగి ముద్ద నోటిలోనికి వచ్చునట్లు చేసి పశ్చాత్తప్తురాలైన నిన్ను-దిక్కులేని నిన్ను మరల దీసికొనివచ్చి యస్పృశ్యమాపాత్రురాలను జేయవలెనని యున్నది. నీవు వెడలిపోయినచో పొమ్ము; కాని, నీ కొక హితమును చెప్పెదను. నాయింటిలోననె యుండుము. నేను నిన్ను నా స్త్రీగా భావించను. అట్లు ప్రవర్తించను. ఇదిగో వాగ్దానము చేయుచున్నాను నేను నీగురువును గూర్చి కనుగొందును. అతని పుట్టుపూర్వోత్తరములు తెలిసికొందును. అతని మత మెట్టిదో, అతడు నీకిచ్చు మోక్ష మెట్టిదో తెలిసికొని అతడు నిజముగా నీ వనుకొన్నంతటి దక్షుడేయైనచో నిన్ను వదలిపెట్టెదను. పోయి యా మోక్షమును సంపాదించుకొనుము. నేను చెప్పెడిమాటలు నీకు గిట్టనిచో పోయి నీ చావు నీవు చావుము. కాని, యిదిగో చెప్పుచున్నాను: నేను అతనితో బలవద్విరోధము పూనినాను. అతని మెడ నరకువరకు నేను నిద్రపోను. అతని పుట్టువెంట్రుక లేరె దను! ఓసీ! పిచ్చిదానా! నీవంటి స్త్రీ సృష్టిలో నింతవరకు లేదు. ద్వాపరయుగము పూర్తికాబోవుచున్నది. ఇంకనలుబదియైదేబది వత్స రములలో ద్వాపరము పోవును. కలి వచ్చును. ఈ కాలమునుగూర్చి

నీకు చెప్పెదను. విని వెడలిపొమ్ము.

నిరాలంబ :— నా కక్కరలేదు.

గుళూచి :— నీ కక్కరలేకపోయినను వినవలసినదే! ఇదిగో నేను గడపకడ్డముగా నిలుచున్నాను. నీవు పోవలెనన్నచో నన్ను త్రోసి కొని పోవలెను. నీవు దానికై ప్రయత్నించితివా? మనము మల్లయుద్ధము చేసిన ట్లగును. కత్తితో నాపైకి వచ్చితివా? నేను ని న్నేదో చేయుదునని చెప్పితినే, అది యిప్పుడే చేసెదను. కనుక, వినుము. కాలముయొక్క స్వరూపము తెలియకుండ వ్యవహరించెడి వారికంటె పరమాజ్ఞానులు సృష్టిలో నుండరు.

"కృతత్రేతాద్వాపరకలియుగములని నాలుగు. కృతమనగా చేయబడినది. అనగా సర్వము సుసంపన్నమై యుండు నన్నమాట. కలి యనగా పాపము. త్రేతయన్న మాటలో మూడు అన్న అర్థ మున్నది. నాల్గుభాగములలో మూడుభాగము లున్నవని యర్థము. ద్వాపర మనగా రెండు గడచిపోయిన వని యర్థము. కృత మన్న మాట యర్థమును విచారించవలెను. చేయబడినది అని యర్థము కదా! ఏమి చేయబడినది? చేయుట యన్నది యేది యున్నదియో యది చెయబడిన దన్నమాట. తక్కిన యుగములలో నట్లు కాదు. ఏది చేయబడరాదో దానిని చేయుచుందురు. ఏ ప్రమాణములో చేయుచుందురు? అచట నున్న పేర్లే యాప్రమాణమును పేర్కొను చున్నవి. ఇట్లుండగా కృతముయొక్క చివర త్రేతాలక్షణములు కన్పించును. తరువాత వచ్చు యుగముయొక్క లక్షణములు తత్పూర్వయుగముయొక్క చివర కన్పించును. ఇది ద్వాపరాంతము. కలి లక్షణములు స్పష్టముగా కన్పించునని యర్థము.

"ఇందులో మఱియొకటి యున్నది. కాల మనగా నేమి? సూర్యు డుదయించి,యస్తమించి యొక దినమును చేయుచున్నాడు.చంద్రుడు వృద్ధిపొంది, క్షీణించి యొక మాసమును చేయుచున్నాడు. సూర్యు డుత్తర దక్షిణములందు సంచరించి యొక సంవత్సరము చేయు చున్నాడు.ఒక దినమును తీసికొందము.అవి యామములు,గడియలు, నిమేషములు, లిప్తలు. మొత్తముమీద సర్వదినము లిప్తలక్రింద విభా గింప బడవచ్చును. అట్లే సర్వకాలము లిప్తలక్రింద విభాగింపబడ

వచ్చును. అనగా లిప్తయే పెరిగిపెరిగి సంవత్సర మగుచున్న దన్న మాట. కొన్ని లిప్తలు పెరిగి యొక గడియ యగుచున్నది. అట్టి కొన్ని గడియలు యామ మగుచున్నది. లిప్తగానున్న కాలమున కొక లక్షణము లేదు. సూక్ష్మముగా నుండునుగాని తెలియదు. యామ మగువేళకుదాని లక్షణము పూర్తికట్టును. ఆ యామమే తిరిగితిరిగి వచ్చుచుండును. ఇంకొక చమత్కార మేమనగా యామ మనినంతనే పట్టి లిప్తల సముదాయమే కాక లోకమునందు జరిగెడి కొన్ని లక్షణములతో కూడినది యగుచున్నది. ప్రథమయామ మనిపించుకొన్న లిప్తల సమూహము దానియందున్న చలువయో వేడియో, పుణ్యమో పాపమో, వానితో వానితో తిరిగివచ్చుచుండు నని యర్థము.

"ఈ నాలుగు యుగములు వానిలో నవి తిరుగుచుండును. వాని యంతట నవి వచ్చుచుండును. కాని, యేయుగమునకు ప్రాధాన్య ముండునో యాయుగ లక్షణము లెక్కువగా కన్పించును. కృతయుగ మంతయు పుణ్యకాలమైనను దానిలోకూడ త్రేత వచ్చును. ద్వాపరము వచ్చును. కలి వచ్చును. కృతములో కృతమైనప్పుడు నాల్గుపాళ్లు ధర్మ ముండును. కృతములో త్రేత యైనప్పుడు మూడుపాళ్లే ధర్మముండును; ఒకపాలు అధర్మ ముండును. కాని యదియుండి లేనట్లుండును. కృతములో కలి తిరుగును. నాల్గుపాళ్లు అధర్మమే కాని ప్రధానమైనది కృతయుగము కనుక దానికి శక్తియుండదు. అట్లే కలియుగములో కూడ కృతయుగము వచ్చును. ఆ కృతముకూడ మిక్కిలి శక్తిహీనమై యుండును. లక్షణముచేత కృతము; శక్తిచేత కాదు. కలియు, ద్వాపరము దగ్గరవి. అవి రెండును అన్నదమ్ము లని చెప్పవచ్చు. అందుచేత ద్వాపరాంతము సంపూర్ణముగా కలివలె నుండును. ఏ యుగమైనను ప్రవేశించినతోడనే దాని లక్షణములు సంపూర్ణముగా కన్పించవు. ఒక యైదారువేల యేండ్లు గడువవలెను. కాని యాయుగము రాబోవుచు వచ్చుచున్నాననియు, వచ్చి వచ్చితి ననియు చెప్పును. కృత యుగములో నంతయు వేద ధర్మము నిండియుండదు. అబద్ధము లేదు. అసత్యము లేదు. పాపము లేదు. కుత్సితము లేదు. పరద్రవ్యాపహరణము లేదు. పరదారాపహరణము లేదు. కొడుకు తండ్రి కెదురుతిరుగుట లేదు. భార్య భర్తను వదలిపోవుట లేదు."

# 3

కిరాతదేశమునకు ధనకోట రాజధాని. భారతదేశములోని బహు నగరములకు పూర్వపుపేర్లు వేరు; నేటి పేర్లు వేరు. సామాన్యముగా నొక దేశమున కొక రాజధాని నగరముండును. రాజధానులు కాకపోయినను ప్రాముఖ్యముచేత నట్టినగరములు మరి నాలుగైదుండును. ఆ నగరముల స్థితి విచిత్రముగా నుండును. అన్నివిధముల రాజధానికున్నంత ప్రాముఖ్యము దాని కున్నది; రాజధానిమాత్రము కాదు. అక్కడనున్న యధికారులు, పత్రికలు, విద్యావంతులు రాజధానిలో నుండెడువా రెంత ప్రతిభావంతులో అంత ప్రతిభావంతులు. కాని వీరి కా ప్రాధాన్య ముండదు. వీరి ప్రాధాన్యము లేకపోవుట వాచ్యముగా నుండదు. గుణతః కన్పించుచునే యుండును. ఇట్టి స్థలములు రాజద్రోహమున కునికిపట్టులు. ప్రశస్తిచేత రాజధాని యంతది. రాజాధికారప్రభావముచేత కొంత తక్కువది. రాజధానిలో నొక యల్లరి జరుగును. అది వెంటనే పట్టుబడును. ఈ పట్టణములలో నట్టి యల్లరియే జరుగును. ఇది పట్టుబడుటకు కాలము పట్టును. ఇక్కడనున్న యధికారులు రాజధానికి వార్తపెట్టవలెను. రాజ్యాంగ యంత్రము మిక్కిలి నెమ్మదిగా నడచును. రాజపురుషులు తామే రాజుల మనుకొందురు. వారు కాళ్లు కదుపు వేళకు కొన్ని మహాపదలు జరుగవచ్చును. ఒక రామరాజ్యము తరువాత ధర్మరాజుయొక్క రాజ్యము. ఆ రాజ్యములలో నధికారులు నిత్యవ్యగ్రులై యుందురు. ఎందుచేత? రౌతుకొద్ది గుఱ్ఱము. మొగమోటమి లేకుండ రాజు శిక్షింపవలయును. అలస్యమును సహించరాదు. అతడు వైయక్తికముగా నెంత దయావంతుడైనను న్యాయదృష్టితో పరమకఠినుడు కావలెను. ఒకటి

బంధుత్వము; రెండు స్వార్థలాభము; మూడు స్త్రీప్రియత్వము; నాల్గు దురభిమానము.—ఈ గుణములు రాజ్యమునం దరాజకత్వ మును ప్రబలించును.

నేపాళమునందు కిరాతదేశములో 'దిలహరి' యన్న పట్టణము కలదు. నేపాళరాజచరిత్రము చూచినచో తక్కిన రాజ్యములందు వలెనే యొక రాజవంశము కొన్నివందలయేండ్లు పాలించును. ఆ రాజ వంశము పోయి మరియొక రాజవంశము వచ్చును. ఎందుకు వచ్చును? ఆ చివరి రాజునకు సంతానము లేకపోవుటచేత సన్నిహితబంధువులలో నొకనిని-యోగ్యుని-తెచ్చి మంత్రులు వానిని సింహాసనమున కూర్చుండ బెట్టుదురు. మరియొకప్పుడు రాజుయొక్క గుణములు ప్రజారంజక ములు గానిచో జనము వానియం దనురక్తులుగానుండగా రాజ్యమును కబళించుట కది మంచి సమయమని యొక వీరుడు, ఒక రాజ బంధువు లోపలలోపల గోతులు త్రవ్వి, కొందరు మంత్రులను కూడ గట్టుకొని సేనాపతులను తనవైపు మరలించుకొని హఠాత్తుగా నా రాజును మడియించి రాజ్యమును వశముజేసికొందురు. నేపాలరాజ్య మునం దిట్టి రహస్యసంఘటనలకు వేలయేండ్లుగా దిలహరినగరము ప్రసిద్ధమైనది. తెలివిగల రాజు రాజ్యమునకు వచ్చినంతనే తొలుత జేయదగినది దిలహరినగరమును నిర్మూలముచేయుట. దానియం దీరాజద్రోహశక్తులను నాశనముచేయుట. ఒక రాజు పూర్వపు రాజును మడియించి తాను రాజ్యమునకు వచ్చును. వా డట్లు వచ్చుటకు దిలహరినగరము మిక్కిలి సాయపడెను. వా డానగరమును నిర్మూ లించుటకుగాని, అచటి యాశక్తులను నిర్మూలించుటకుగాని నమర్థుడు కాడు. వాని బలమంతయు నా శక్తులమీద నాధారపడియున్నది. తన బలమును తాను చెరచికొనునా? ఆదిలో సమర్థుడుకాడు. కాలము గడచునరికి వారును, రాజు నొక్కటియై యన్యోన్యాశ్రయులై యేమి చేయుటకును చాలడు. ఆ నగరమునందలి గొప్పయధికారులు, గొప్పధనవంతులు రాజధానియందలి ధనవంతులవలె, నధికారులవలె ప్రతిభావ్యుత్పత్తులు కలవారైనను వీరి దృష్టి యెప్పుడును మంచిని నాశనము చేయుటకు, చెడ్డదానిని ప్రోత్సహించుటకు నభిముఖముగా నుండును. ఇది దిలహరినగరము యొక్క యప్రతిష్ఠ.

దిలహరినగరమును చూచినచో రాజధాని యెప్పుడును భయ పడుచుండును. అది రాజధాని యంతటి నగరము. రాజధానియందు లక్షయేబదివేల జనమున్నచో నంతజన మిచ్చటను కలరు. రాజధాని సైన్యము దిలహరి నగరమునందుకూడ గలదు. ఎంత సైన్యమైనను పెద్ద పండుగులు, నుత్సవములు, మత విషయికములైన యుపన్యాస ములు, సంగీత సాహిత్యముల ప్రాచుర్యములు మొదలైనవాని సభలు జరిగినప్పుడు సైన్యాధికారులు, నగరములోని ధనవంతులు, సైనికేత రోద్యోగులు కలసికొనుట జరుగును. విందులు జరుగును. రాకపోకలు జరుగును. వారి కుటుంబములకు వీరి కుటుంబములకు సన్నిహితత్వ ముండును. ఒక సేనాపతి భార్య ఒక ధనవంతుని భార్యకు స్నేహితు రాలు; మరియొక సేనాపతి భార్యనుచూచి మరియొక సైనికేతరోద్యోగి భార్య ముచ్చటపడుచుండును. వారి పిల్లలకు, వీరి పిల్లలకు స్నేహము కుదురును. సంఘములో నెన్నివిధములైన సంయోగములుండును? ఒక ధనవంతుడు రాజద్రోహి. అతనిని బంధించవలెనని సేనాపతి కాజ్ఞాపత్రము వచ్చినది. ఆ ధనవంతునిభార్యయు, సేనాపతిభార్యయు స్నేహితురాండ్రు. ఆ సేనాపతి యేమి చేయును? రహస్యముగా నా ధనవంతునకు వార్తపెట్టును — నీవు నగరమునుండి పారిపొమ్మని. వాడు పారిపోవును. లేదా ఎక్కడనో యణగిమణగియుండును. బంధించుట యెట్లు? వాడు బంధితుడైనచో నొకటి, అణగిమణగి యున్నచో నొకటి. బంధితుడైనచో వాని వ్యవసాయము కట్టుబడును. వానిక్రింద బనిచేయు రాజద్రోహి సంఘము చుక్కాని లేని పడవ యగును. వా డణగిమణగియున్నచో చుక్కాని కనిపించక పోయినను పడవను నడుపుచునే యుండును. రాజకీయముగా నిట్టి వ్యవహార ములు వంద లుండును. అట్టిది దిలహరినగరము.

ఒక రాజకీయవిప్లవమో, సాంఘికవిప్లవమో, మతవిషయక విప్లవమో సామాన్యముగా నేపాళదేశమునందు దిలహరినగరమునందు మొలకలెత్తును. తొలుత నది సామాన్యముగా కన్పించును. మేఘము మాత్ర మెట్లుండును? తొలుత పదిచినుకుల సమాహారమువలె నుండును. ఉబ్బియుబ్బి యాారంతయగును. ఊతంతయైన మబ్బు పదియూళ్లమీద కురియును. అది మబ్బుయొక్క శక్తి. దూరాని

కూతంత యుండునుగాని యాకాశములో దాని పరిమాణము పదియా ళ్లంత. చంద్రుని చూడుము. వాడు చూచుటకు పెద్ద పూలచెండంత యుండును. వాడు దేశదేశములందు కన్పించును. వాని వెన్నెల యిరువదివేల చదరపుమైళ్లు కన్పించినను కన్పించవచ్చును. మింటిలో నున్న గ్రహమది. ఒక విప్లవము మింటిలో నుండును. మిన్ను అనగా మానవుల మనస్సు. ఆ మనస్సులోని యభిప్రాయములు ఈ యభి ప్రాయములలో నొక విప్లవము తలచూపున దొక్కనగరమునందే. దాని వైశాల్యము దేశమునందంతయు కలదు. ఒక సౌధ మున్నది. దానికి పదిదిక్కులున్నవి. ఆ భవనముయొక్క మొగము ప్రాఙ్ముఖ ముగా నూడుట మంచిదని యనాదినుండి సంప్రదాయముగా నున్నది. అది మంచిదని యొకవిశ్వాసము. ఆ యూరిలోనున్న వేయియిండ్లలో రెండు మూడువందల యిండ్లు ప్రాఙ్ముఖముగా నున్నవి. ప్రాఙ్ముఖముగా నున్న పదిగృహములు పాడైపోయినవి. తూర్పునుండి వచ్చిన యొక ఝంఝామారుతము వానిని కూలద్రోసి నది. ఆ మూడువందల యిండ్లవారు సంపన్నగృహస్థులు. ఆ గృహ స్థులమీద కొందరికి కోపము. గృహము ప్రాఙ్ముఖముగా కట్టినచో నచ్చి రాదని యొక వదంతిని వారు రేపిరి. పడిపోయిన పదియిండ్లవారికి నామాట నచ్చినది. పడిపోయిన తమ యిండ్లను వారు త్రిప్పికట్టికొనిరి. తక్కినవారు కట్టికొనలేదు. వారిని సాధించుట సాధించుట విరోధము. మానవప్రకృతి యిట్లుండును. విప్లవముయొక్క రహస్య మిది. దీనికి గారణ మేమనగా, గృహములు ప్రాగ్దిశాభిముఖముగా నెందుకు నిర్మింపవలయు నన్న విషయము గట్టిగా తెలియకపోవుట. తెలిసిన దేమనగా? వాస్తుశాస్త్ర మట్లు చెప్పుచున్నదని. వాస్తుశాస్త్ర మెందు కట్లు చెప్పుచున్నది? దానివెనుక నున్న రహస్య మేమి? ఎవడును విచారించదుసరికదా, శాస్త్రమును నిందించును. ఆ శాస్త్రము నిజమై నచో నీ పదియిండ్లు నెందుకు కూలిపోయినవి? సమాధానము లేదు. లేకపోలేదు. లేనట్లు కన్పించును. సమాధానములు నిగూఢములై యుండును. గృహము ప్రాఙ్ముఖముగా కట్టవలసినదే. ఆ గృహము పడిపోవుటకు దాని ప్రాఙ్ముఖత్వము కారణము కాదు. ఇంక నేవో కారణములు కలవు. ప్రాఙ్ముఖత్వముకంటె బలియములగు కారణ

ములు. అంతకంటె బలవత్తరములగు కారణములున్నప్పు డల్పిష్ఠమైన యీ కారణమునకు ప్రాముఖ్య మిచ్చు టెందులకు? అది గృహ విషయముగా చెప్పబడినది. నీవు తక్కిన విషయములు చూచికొనుము. ఇది లోక ధర్మము. ఏకదేశమునందలి సుష్ఠుత్వము సర్వదేశపరివ్యాప్తి కాదు. అందుచేత నేకదేశసుష్ఠుత్వము సుష్ఠుత్వము కాకపోదు. తర్కము వేరు; శాస్త్రము వేరు. ఆలోచన వేరు; విప్లవ భావము వేరు. ఒక కాలము విప్లవమున కనుకూలముగా నుండును.

ఇట్లే మరియొక విషయము విచారింతము. భార్యాభర్తలున్నారు. భార్య భర్త కణగియున్నది. కొన్నికోట్ల సంవత్సరము లణగియున్నది. కొన్ని లక్షల సంవత్సరము లణగియున్నది. అప్పుడు, నిప్పుడు, నెప్పుడును భర్త కణగియుండని భార్య లుండనేయున్నారు. భార్య చెప్పు చేతలలోనుండు భర్త లున్నారు. భార్యాభర్తలుకాదు; ఇద్దరు స్నేహితులనుకొందము. ఇద్దరు సమానమైన గౌరవప్రపత్తులతో నుందురు. ఒకప్పుడు వీడధికారము చేయును; ఒకప్పుడు వా డధికారము చేయును. ఇద్దరు స్నేహితులే. ఒకయిద్దరి మధ్య నెప్పుడును నొకడే యధికారము చేయుచుండును. ఇట్లే భార్యాభర్తలును. ఒక విప్లవవాది స్త్రీలయం దీ భావములను మొలకెత్తించును. ఎవడో యీభావమును విత్తును. ఆ దినము లావిత్తనములు పెరుగుటకు యోగ్యమైనవి కావు. వాడు పరిహాసభాజను డగును. మరియొకప్పు డివే భావము పూరిపాక చూరునకు నిప్పుముట్టించినట్లు ప్రాకిపోవును. అంతయు నంటికొనును. సంసారములు దగ్ధము లగును. అప్పుడుకూడ కొందరు భర్తలీభావమున కనుకూలురైనచో సంసారములు బాగుగనే సాగును. ఇట్టిభావముల కనుకూలుడుగాని భర్త యున్నచోట వ్యవహారము చెడిపోవును. సంసారము విచ్ఛిత్తిపొందును. మరియొకప్పు డింకొక కథ జరుగును. ఇట్టి భావములచేత ప్రేరేపితులైన స్త్రీలును, పురుషులును కలిసి యీ భావమునకు వ్యతిరేకాభిప్రాయములు కల స్త్రీలమీద దండెత్తి యల్లరి చేసి వారిని లజ్జపరుపవచ్చును. ఇది సాంఘికమైన వ్యవహారము. రాజకీయములందేమి, సారస్వతవిషయములందేమి, మతాభిప్రాయము లందేమి-విప్లవముయొక్క లక్షణ మిది. పురుషుల ప్రాబల్యము కలిగినచో విప్లవము తీవ్రరూపము దాల్చును. ఆ పురుషు లాయుధవంతు

లైనచో దేశములు, రాజ్యములు గగ్గోలగును. దీనియంతటికి ప్రధాన సూత్రము మానవుల ప్రకృతియు, వారి యజ్ఞానము, అధికారము నంపాదించవలెనన్న దురహంకారము, పగతీర్చికొనవలెనన్న పట్టుదల.

ఈ విప్లవములు ధర్మముమీదకంటె లోకమునందు జరుగు నన్యాయములమీద నెక్కువ యాధారపడియుండును. ధర్మముగా పాలించుట కేర్పడినవాడు రాజు. రాజు అధర్మముగా పాలించెను. వానిని జంపుము. వానిని తొలగింపుము. అసలు రాజే పనికిరాదనుట యేమి? రాజుబదులు నీవు కొంపరనేర్పరచితివి. అప్పుడు పూర్వము రాజును, వాని యధికారులును చేసెడి దుర్మార్గములకంటె నీ ప్రజా ప్రతినిధులు చేసెడి దుర్మార్గములు పదిరెట్లెక్కువగా నుండును. ఒక న్యాయసూత్రమో, ఒక ధర్మసూత్రమో, ఒక రాజ్యాంగసూత్రమో తొలుత సకల్మషభావముతోనే సృష్టింపబడినది. వాని నాచరణలోనికి పెట్టు జనము దుర్వ్యాపారులై స్వార్థపరులై, క్రోధవంతులై యాసూత్రములలోని స్వచ్ఛత్వమును పాడుచేయుదురు. అందుచేత నే సూత్రమైనను తొలినాటి స్వచ్ఛత్వమును క్రమక్రమముగా మాయించికొనును.

ఇది కాలములో నున్న లక్షణము ప్రాతఃకాలము స్వచ్ఛముగా నుండును. మధ్యాహ్నము మండిపోవును. సాయంకాలము ధూళి ధూసర మగును. అట్లే కృతయుగమునందు ధర్మము పలకముగా నుండును. అంచరెక్కలవలె నుండును. త్రేతాయుగమునందు కొంత దుమ్ముపడును. ద్వాపరమున దాని స్వచ్ఛత్వము సగానికి సగము చెడిపోవును. కలిలో నీ పక్షి తెల్లనిదా, నల్లనిదా యనిపించును. దాని నల్లదన మెంత యుండు ననగా దాని రెక్కలు తెగనరకినగాని దాని నల్లదనము మాయ దన్నంత యుండును.

ఇవి నాల్గుయుగముల లక్షణములు. ఈ లక్షణములు యుగము లందే కాదు, యుగైకదేశములందుకూడ నిట్లేయుండును. ఏయుగము నందైనను - మరియు కృతయుగమునందు వందయేండ్ల కాలమును దీసికొని విచారించుము. ఒక దేశమునందు జరిగిన పరిస్థితులను గూర్చి విచారించుము. పదియేండ్లకు పదియేండ్లకు భావములు మారు చునేయుండును. ఒకప్పుడు సారస్వతమునకు ప్రతిష్ఠ. పదియేండ్లు మారినంతనే సాంఘికవిషయములకు ప్రాధాన్యము. మరి పదియేండ్లు

సాగినంతనే రాజకీయవిషయములకు ప్రాముఖ్యము. అంతే కాదు. ఒక్క సారస్వతవిషయమే తీసికొందము. నాల్గు పదియేండ్లలో సారస్వతాభిప్రాయములు నాల్గువిధములుగా మారును. అట్లే మతాభిప్రాయములు. అట్లే అన్నియును. దీని పేరు కాలము.

ఈకాలమునకు దిలహరినగరమువంటి నగరములు క్రీడాస్థలములు, జన్మస్థానములు. ఈ దిలహరినగరములో నేమూల నేమి జరుగుచున్నదో నెవ్వరికి నేమియు తెలియదు. ఆ నగరమునందు రాజభటు లుందురు. వారి కదుపాట్లుండవు. వారు జారులతో, చోరులతో,జూదగాండ్రతో గలసి స్నేహముగానుందురు. జూదగాండ్రకు, వారికి ప్రధానముగా చెలిమి. ధనవంతు లుండెడి పేట వేరు; పేదవారుండెడి పేట వేరు. పేదవా రుండెడి పేటలోని వినోదములకు పరిమితి లేదు. ఆ వినోదము లిట్లుండునని చెప్పుటకు వీలులేదు. ఎవడో చిన్న డమరువువంటిది వాయించుచుండును. దాని కనుగుణముగా నొకర్తుక నృత్యము చేయుచుండును. ఆ స్త్రీ యించుమించు నగ్న. చుట్టును చేరిన జనమందరు నీలలు, ననభ్యపు కేకలు వేయుచుందురు. ధనము వారికి కురియుచుండును. ధనమనగా నల్పములైన నాణెములు. కొందరు వేషములు వేయుదురు. ఎంత వికారముగా నుండిన నంత వినోదము. ఒకడు చిరుతపులివేషము వేయును. ఒకడు భల్లూకవేషము వేయును. వేయుననగా, వాని తలలు, వాని తోకలు తగిలించికొని ప్రక్కన జనము తప్పెటలు మ్రోగించుచుండగా గంతులు వేయుదురు.

ఇతర గ్రామములలో పల్లెలలో నిట్టి వ్యవహారములు పండుగలకు, పబ్బములకు జరుగుచుండును. దిలహరినగరములో రెండు మూడుపేటలలో నివి నిత్య వినోదములు. అచ్చట కొన్ని గృహము లుండును. అవి ద్యూతగృహములు. ద్యూతగృహము లనగా నా గృహస్వాములు జూదగాండ్రు. అది యందరకును తెలియును. కాని యది యొక రహస్యము. విచారణకు వచ్చినచో నెవరు నెరుగమందురు. కాని అందరు నెరుగుదురు. రాజభటుల కచట దినబత్తెములు; నెలబత్తెములు. అచ్చట జరిగెడి ఘోరముల కవధిలేదు. దూరపుటూళ్ల నుండి జనము జూదమాడుటకు వత్తురు. ధనము తెచ్చికొందురు. ఆ

ధనమిచ్చుట కోల్పోదురు. వారేమి చేయుదురు? ఆపేట దిలహరి నగరముయొక్క చివర. అపేట నానుకొని సప్తగండకిలో నొక నది ప్రవహించుచుండును. వా డానదిలో ప్రాణములు తీసికొనును. అభి యోగము లేదు, విచారణలేదు. మరియు చెప్పరాని ఘోరములు జరుగుచుండును. ఏదేశమునందైన, నేకాలమునందైన నిట్లే యుండు నేమో! రాజధాని నగరములు వేరు. పల్లెటూళ్లు వేరు. నడిమినగరముల లక్షణములు వేరు. ఈ నడిమినగరములలో కొన్నినందులలో నేమి జరిగిన జరుగవచ్చును. ఈ స్థలములలో నిట్టి పాపకృత్యములేగాక పుణ్యోపపనులవంటివిగూడ జరుగుచుండును. వీరందరు జూదమాడు దురు. సురాపానము చేయుదురు. కొందరు స్త్రీలను పరమనీచమైన వృత్తులయందు ప్రవేశపెట్టుదురు. వారికి లజ్జయనునది యుండదు. అందులో కొంత విద్య, కొంత నేర్పు, కొంత ప్రశంస. వారికిని కీర్తి యనునది యుండునేమో తెలియదు

ఇట్లుండగా వారిలో కొంత భక్తి, కొంత దైవారాధన, కొంత దానము, కొంత యోగము విచిత్రముగా కలిసియుండును. ఒకడు జూదమాడి మోసముచేసి యెదుటివాని ధనము నపహరించును. అపహరింపబడ్డ ధనము గలవాడు గుండె చెరువైపోయి గండకిలో పడి చచ్చును. ఈ ధన మపహరించినవాడు దారివెంట బోవుచు గ్రుడ్డి వాండ్రకు,కుంటివాండ్రకు నిచ్చును. దేవాలయము కట్టుటకు ధనము దానముచేయును. ఒక యోగి కూర్చుండి యభ్యాసముచేయుచుండగా వానివద్ద నొక బంగారునాణెమును బెట్టిపోవును. ఇంకొకడు భగవంతుని గూర్చి, ధర్మమునుగూర్చి, న్యాయమునుగూర్చి యుపన్యాసము చేయు చుండగా పోయి కూర్చుండును. అతనికి తగినంత ధనమునిచ్చును. ఈవైపున నెన్ని పాపకార్యములు చేయునో ఆవైపున నన్ని పుణ్యకార్య ములు చేయును. ధర్మవ్యాఖ్యానముచేసి నచ్ఛీలమును బోధించి పర లోకముల గడించుటకు మార్గముల నుపన్యాసములుగా జెప్పనేర్చిన వాడు ధనము నాపేటలలో నంపాదించినంత మరియొకచోట నంపా దింపలేడు.

ధనమేకాదు, నీ వొక క్రొత్తమతమును నిర్మింపదలచినచో నీ కది పరమయోగ్యమైన స్థలము. ధనమునకు ధనము, వందలాదిశిష్యులు

బయలుదేరి నీమీద నీగ వ్రాలనీయరు. అది నీవు కట్టనికోట. వారు నీకు పెట్టనికోట. అచ్చట నొక మతప్రవక్త బయలుదేరినాడు. అత డెచ్చటినుండి వచ్చెనో, యెప్పుడు వచ్చెనోగూడ నెవరికిని తెలియదు. అతడు సన్యాసి యనుటకు వీలులేదు. దండకమండలువులు లేవు. ముండితమైన శిరస్సుగాదు. తల పెరిగియున్నది. జడలు కట్టలేదు. నిత్య తైలసంస్కారముచేత జుట్టు తుమ్మెదరెక్కలవలె నిగనిగ లాడుచుండెను. ముడివేయడు. జుట్టు బుజములమీద, వీపుమీద వ్రేలాడుచుండును. ఆ వ్రేలాడుచున్న వెంట్రుకలు గమగమలాడు చుండును. అతడు పరిమళతైలములను తప్ప వాడడు. అతడు చీనా దేశమునుండి నేపాళదేశమునకు సమృద్ధిగా పట్టుబట్టలు వచ్చును- వానినే ధరించును. వానికి కావిరంగును మాత్రము కొంచెముగా వేయును. అతడు నేపాలదేశస్థుడు కాడు. నేపాలదేశస్థులు కొంచెము పొట్టివారు; ఇతడు పొడుగరి, ఆజానుబాహువు. దృఢశరీరి. అతడు నిశ్చలు పావకోళ్ళమీద నడచును. మొగమున పూర్వము తిలకము పెట్టెడివాడుకాడు. ఇప్పుడు పెట్టుకొనును. తిలకములేనిచో అతని యుపన్యాసములకు జనము వచ్చెడివారు కారు. ఈ రహస్యమును తెలిసి అతడిప్పుడు తిలకమును ధరించుచుండెను. అతనిని జూచినచో నతడు మతప్రవక్తయనిగాని, యాధ్యాత్మిక విద్యాప్రవచనము చేయు వాడనిగాని యెవ్వరు ననుకొనరు. అనుకొన రనగా క్రొత్తవారెవ్వరు నట్లు తలచరని యర్థము. క్రొత్తవారి ప్రశస్తియేమి? సుమారు ఒక్క పదివేల జనమున కాతడు సమారాధనీయుడాయెను.

ఈపేటలు గౌరవముకలవారు సామాన్యముగా వచ్చెడి పేటలు కావు. కాని యచ్చటచ్చట నీపేటలలోకూడ ధనవంతులున్నారు. ధన ముతో మర్యాద పెరుగును. శుభ్రములైన యలవాట్లు పెరుగును. ఒక మర్యాద పెరుగును. అట్టివారును కలరు. పట్టణములో నితరస్థలముల యందున్న ధనవంతులతో, మర్యాదస్థులతో వీరికి బంధుత్వములు కలవు. ఒక ధనవంతుడు తన కుమార్తెను మరియొక ధనవంతుని కొడుకునకిచ్చును. నూటికి తొంబదిసార్లు వాని ధనమునే చూచునుగాని వాని యార్జేయపౌరుషేయములు చూడడు. తొలుత గొన్నాళ్ళు నగ రములోని ధనవంతు లీపేటలోని ధనవంతులతో సంబంధములు

చేసెడివారు కారు. క్రమక్రమముగా నదియు నలవాటైనది. ఎందుకు చేసెడివారు కారనగా ఈ పేటలలోని ధనవంతుల కుమారులు చుట్టుపట్లనున్న పరిస్థితులచేత నాగమ్మ కాకు లగుచుండిరి. ధూర్తులగుచుండిరి. కిరాతక కృత్యములు చేయుచుండిరి.

అది తొల్లిటిమాట. ఇప్పుడంతయు కలిసిపోయినది. ఇతరములైన పేటలలోని ధనవంతుల సంసారములతో నానాటి ధనవంతుల సంసారములకు బంధుత్వములు, పరిచయములు బలిసినవి. వారును వచ్చుచుందురు, పోవుచుందురు. ఇచ్చటి హరికథలకు, ఇచ్చటి నాటకములకు, ఇచ్చటి ఉపన్యాసములకు, ఇచ్చటి భజనలకు నితరములైన పేటలలోని ధనవంతుల భార్యలు, వారి సంసారములుకూడ వచ్చుచుండెను. అందుచేత నీ మతప్రవక్తకు మర్యాద హెచ్చినది. అతని రాబడి హెచ్చినది. అతని పలుకుబడి హెచ్చినది. అత డాజానుబాహువగుటవలన, సుసంస్కృత దీర్ఘ శిరోజములు కలవాడగుటవలన, పరిశుదమైన పీతాంబరధారియగుటవలన అతనిని నమిషించుట వెగటుగా లేదు. అన్నిటికన్న. అతడు నవ్వును-అతని నవ్వు జగన్మోహనముగా నుండును. పురుషులే దానికి మోహపడుచుందురు. స్త్రీలు మోహపడుటలో నాశ్చర్యము లేదుగదా!

కాని అతని కొక ప్రతిష్ఠ వ్యాపించెను. అత డస్ఖలిత బ్రహ్మచారియని, పరమయోగ్యుడని, మహాయోగియని. అత డర్ధరాత్రమున వియన్మార్గమున వారణాసీక్షేత్రమునకుబోయి యచట క్రుంకులిడి తెల్లవారకముందే వచ్చునట. అంతటి యోగి! ఇట్టి ప్రథలు అతనిని గురించి నాలుగైదు కలవు. ఎవరును చూచినవారు లేరుగాని అతని శిష్యు లవి చెప్పుచుందురు. అతని కెందరో నివసించుటకు సౌధము లిత్తుమన్నారు. అతడు స్వీకరించలేదు. తానొక చిన్న పూరిపాకలో నివసించుచుండును. అతని శిష్యులుమాత్రము ప్రక్కలందున్న భవనములయం దుందురు ఆ చుట్టుపట్ల స్త్రీసంచారము పనికిరాదు. అతని కుటీరమునం దతడొక్కడే యుండును. కుటీరము పరిశుభ్రముగా నుండును. తుంగచాపలు, పులితోలు, లేడిచర్మములు మాత్రము చక్కగా పరచబడియుండును. అతడు తన వస్త్రములు తానే యుదికికొనును. వానిని మల్లెపువ్వులవలె నుంచును. కావివన్నె వేయునుగనుక లేతయెఱ్ఱదామరలవలె నుంచు

నని చెప్పవచ్చును. అతడు నెలలతరబడి భోజనము చేయడని ప్రతీతి. అతని పేరెవరికిని తెలియదు. గురువుగారు అన్నది ప్రసిద్ధిగల మాట.

అతడు ప్రక్కనున్న సౌధమునందు పెద్ద సావడిలో రాత్రులందు బోధచేయును. దానికి జనము గుంపులుగుంపులుగా వత్తురు. అతని కంఠస్వానము మేఘగంభీర మనవలెను. అతని యుపన్యాస కాలము పరిమితముగా నుండును. అతడు స్త్రీలను దగ్గరకు రానీయడు. వారేదైన కానుక లీయదలచినచో నతని పాదసమీపమునందుంచి వెడలిపోవలెను. అత డా కానుకలను చేతితో తాకడు. అట్లీయబడిన కొన్ని కానుకలు శిష్యులచేత నతడు పేదవాండ్ర కిప్పించుట పలుమంది చూచి యతని ప్రతిష్ఠ యిబ్బడియు ముబ్బడియు నయ్యెను.

అతనికి నలుగురు శిష్యులు కలరు. ఆ నలుగురిలో నొకడు పరమప్రియశిష్యుడు. అతని పేరు భారద్వాజుడు. గురువుయొక్క రహస్యములన్నియు నతనికి తెలియును. ఈ నలుగురుశిష్యు లొక భవనమునం దుందురు. ఆ భవన మొక పెద్ద జూదగానిది. ఆ జూదగాడు గొప్ప ధనవంతుడు. అతడార్జించిన ధనమంతయు జూదము మీదనే యార్జించెను. ధనవంతుడైన తరువాత నొక పెద్దవర్తకు డాతనికి తన కుమార్తె నిచ్చెను. అతడు జూదమాడడు; ఆడించును. ఆ పేటలో పదిచోట్ల పది ద్యూతగృహములు కలవు. ఇతని పక్షమున ద్యూతవిద్యానిపుణులు ప్రతిస్థలమునందు నలుగురైదుగు రుందురు. వారు సంపాదింతురు. అందులో నితనికి ప్రధానభాగము నిత్తురు. ఆరీతిగా నీతని సంపాదన లక్షలకు పెరిగినది. అతని పేరు రామరుడు. రామరుని పేరు మంత్రమువంటిది. ఈ పని రామరుడు చేయుమన్నాడనగా చేయకుండుట కెవరికి గుండెలాడవు. అతని చేతిలో వందమంది దుర్జను లున్నారు. కటారికాండ్రున్నారు. రేపుప్రొద్దుటికి వాడు కన్పించరా దనగా వాడు కన్పించడు.

ఈ రామరుడు తన యాభవనమును గురువుగారి శిష్యుల కిచ్చివేసెను. సంపూర్ణముగా నిచ్చెను. గురువుగారు వచ్చి యేడాదిపైన నైనది. రామరుడు తన భవనమును గురువుగారికి వ్రాసియిత్తు నని భరద్వాజునిచేత కబురుపెట్టగా గురువుగారు తన కాస్తి యక్కరలేదని నిరాకరించెను. అంతటి కఠోరుడైన రామరుడు గురువుగారి యా

నిర్లిప్తతకు ముగ్ధుడైపోయెను. ఆ సాధమును భరద్వాజుని పేర చెల్లు బడిచేయుదు ననెను. భరద్వాజు డిట్లనెను: "అయ్యా! నా క్రిందనే యున్నదికదా! దానికి వేరే ప్రమాణమెందులకు? సాక్షు లెందులకు? మీరు దానిని మాకిచ్చినను ఈయకపోయినను గురువులకు మీయం దనుగ్రహము సంపూర్ణముగా నుండు"ననెను. గురువుగారికి భవన మిత్తునన్న నాటినుండి రామునిని రాబడి రెండురెట్లయ్యెను. ఇత్తునన గనే యిట్లైనచో నిచ్చినచో నెట్లగును?

క్రమముగా నేమయ్యె నన, సర్ధరాత్రములందు గురువుగారి హితోపదేశములు వినుటకు వచ్చెడివారిలో స్త్రీల సంఖ్య ఎక్కువైనది. ఆ స్త్రీలు ధనవంతుల భార్యలు. ఉద్యోగస్థుల భార్యలు. సేనాపతుల భార్యలు. సేనానుల భార్యలు. అందరును భూషణములు ధరించి, వెలగల చీరెలు దాల్చి బండ్లమెద వత్తురు. గురువుగారు కానుకలు పుచ్చుకొనడని యందరకును తెలియును. కాని, అందరును తచ్చరణ పీఠమున కానుక లుంచిపోవుదురు. గురువుగా రుపన్యసించుచు నంత మంది స్త్రీలలో నెవరివంకను చూచిన ట్లుండడు.

ఆ స్త్రీలలో కొందరు భరద్వాజుని, తక్కిన శిష్యులను నాశ్ర యింతురు. వారి కోరికలు చిత్రచిత్రముగా నుండును. వా రిచ్చిన కానుక గురువుగారు చేతితో తాకునట్లు చేయించుమని, గురువుగారు పరధ్యానముగా నుండగా తాము వారి పాదస్పర్శ చేయుదుమని, భరద్వాజుడు చూచిచూడన ట్లుండవలెనని,అన్నిటికంటె గురువుగారిని వారి కుటీరమునందు దర్శించునట్లు చేయించుమని. భరద్వాజుడు ససేమిరా యనును.

కొందరు శిష్యురాండ్రు తక్కినవారందరు వెడలిపోగా మిగిలి పోదురు. ఆ మిగిలినవారి కోరికలకు చెల్లుబాటు కలుగునని కొందరు చెప్పుకొందురు. ధనవంతుల భార్యలలోకూడ కొందరికి స్వంతయాస్తు లుండును. కొంద రధికస్వతంత్ర లుందురు. ఇద్దరుముగ్గురు వివేక వతులు సమంజసమైన యూహ చేసిరి. గురువుగారు పీతాంబరము లను ధరించును. లేతకావివన్నెకలవి. తొలుత వారు తాదృశములైన వస్త్రములను దెచ్చి కానుకలిచ్చిరి. అవి నిరాకరింపబడలేదు. మరి యొకర్తుక రహస్యముగా గురువుగా రుపయోగించు పరిమళతైల

మును గ్రహించి యట్టి తైలమును బుడ్డిలో పోసి దానిపేరు చెప్పి భారద్వాజున కిచ్చెను. అదియు స్వీకరింపబడెను.

ఒకానొక పరమ వివేకవతి యొక పేదరాలిని స్వామి తన కుటీరమును తానే శుభ్రము చేసికొనును కాబోలు, నీవు పోయి యూడ్చి పెట్టుమని పంపెను. ఆ పేదరాలు మిక్కిలి పేదది. దానిని చూచి స్త్రీ యనుకొనుటకు గూడ వీలులేదు. కామము కలిగించు నన్న లక్షణమునకు,దానికి సహస్రయోజనముల మేర. గురువు దాని పరిచర్యను స్వీకరించెను.దాని మొగ మెంత వికారమో దాని తెలి వంత చురుకైనది. దీనివలన గురువుగారి కుటీరములోని సంగతులన్నియు పరులకు దెలియవచ్చెను.

అలోపల దుప్పిచర్మము లున్నవి. పులిచర్మము లున్నవి. ధవళగిరియన్న హిమాలయ పర్వతముమీద నొక శిఖరముకెలన మాత్రమే గోచరించు నొకవిధమైన గడ్డితో చేయబడిన చాపలున్నవి. గుడ్డలు వేసికొనుటకు దుప్పి కొమ్ములున్నవి. అన్నిటికంటె నాశ్చర్యమేమనగా ఖడ్గమృగముయొక్క ముట్టెమీది కొమ్ము మట్టిగోడలో నదుకబడి దానికి గురువుగారి అంగీ యొకటి తగిలించబడినది స్వామి యంగీ ధరించునన్న మాట.

మరియు గురువుగారి కుటీరములో రెండుమూడు పాత్రలున్నవి. ఆ పాత్ర లలభ్యములు. ఆ పాత్రలు వేనితో చేయబడినవో తెలియదు. ఆ వస్తువు రాయియా ? మరేదైన పదార్థమా? అది యిది యని తెలిసికొనుట యెట్లు? దానిని రహస్యముగా దొంగిలించవలెను నిజముగా దొంగిలించుట కాదు. వెలికి తీసికొనివచ్చి రహస్యముగా నెవరికైన చూపించి దాని స్వరూపము తెలిసికొన్న తరువాత మరల రహస్యముగా నచ్చట పెట్టవలెను. రహస్యము రహస్యమే. వీనిచేత స్వామి యొక్క యిష్టానిష్టములు తెలియగలవు. ఆయనకు సామాన్యములైన కానుకలు పనికిరావని తెలిసెను. అపూర్వములైన వస్తువులు కావలెను. అందుచేత సామాన్యలైన స్త్రీలు అతని సంపూర్ణానుగ్రహమును పొందలేరు. మహాధనవంతుల భార్యలు చేయవలెను. స్వంత యాస్తిగల స్త్రీలు చేయవలెను. దుర్ఘటములైన కార్యములు

చేయగలిగిన స్త్రీలు వారి యనుగ్రహమును సంపాదించవలెను. ఈ రహస్యము తెలిసిపోయినది.

ఒకనాడు గొప్పయింటి పడుచు ప్రార్థనలన్నియు నైపోయిన తరువాత, రాత్రి రెండుజాములు దాటిపోయిన తరువాత నెవరి దారిని వారు పోగా దాను పోక యచ్చటనే నిలుచుండెను, గురువుగా రందరు వెడలిపోయిన తరువాతగాని భవనమును పరిత్యజించరు. చిట్టచివరి కీమె యున్నది. గురువు భరద్వాజునితో 'నామెను పంపించు' మని చెప్పెను. భరద్వాజు డామెను పొమ్మనెను. ఆమె పోలేదు. "గురువు పాదమును స్పృశించిగాని నేను పోను. లేనిచో నే నిచ్చట నాత్మహత్య చేసికొందును. నాబొడ్డులో కైజారు కల"దని చెప్పెను. గురువుగారి కామెయందు ప్రసన్నత కలిగెను. లేనిచో నామె నిస్సందేహముగా నాత్మహత్య చేసికొనున ట్లున్నది.

గురువుగారు కూర్చుండియున్నారు. ఆమె సమీపించినది. గురువుగా రామెవంక తీవ్రముగా చూచుచుండిరి. ఆమె గురువుగారిని తీవ్రముగా చూచుచుండినది. ఆమె స్వామి పాదములను పట్టుకొన వలెను. పట్టుకొనలేదు. ఊరకే యతనిని చూచుచు నిలుచున్నది కొంతసేపటికి గురువుగా రిట్లనిరి: "పాదములు తాకవచ్చితివిగదా! తాకవేమి ?"

ఆమె:—గురూ! నేను నీతో మాటాడవలెను. అనగా భరద్వాజుడు గూడ నిందుండరాదు.

గురువు:—నిన్ను నమ్ముటకు వీలులేదు. నీవద్ద కైజారున్నది. నేను నిన్ననుగ్రహించనిచో దీనితో నాత్మహత్య చేసికొందు నంటివి. నా పాదములను తాకుటకు నే నంగీకరించితిని. నీవు పాదములను స్పృశింపవు నా శిష్యుని దూరముగా పొమ్మందువు. అతడు పోయిన తర్వాత నాకత్తితో నన్ను సంహరించినచో నా కేది దిక్కు ?

ఆమె:—నేను సంహరింప దలచినచో నీ భరద్వాజు డడ్డము రాడు. నేను నీతో మాటాడుటకు వచ్చితిని!

గురువు:—నీకు నాతో మాటాడుట కేమి యవసరమున్నది?

ఆమె:—నీకు తెలియును. మరచిపోయితివేమో నాకు తెలియదు. జ్ఞాపకము చేసినచో జ్ఞాపకమునకు వచ్చును. ఇచ్చట మాటా

ఱుట కిష్టము లేనిచో నీ కుటీరమునకు వత్తును. అచ్చటికి స్త్రీలు రాకూడదు కాబోలు. నేను రావచ్చుననుకొందును.

గురువు:—నాకు నలుగురు శిష్యులు. వారిలో పెద్ద భరద్వాజుడు. భరద్వాజుడు వివేకి. వ్యవహారము తెలిసినవాడు. ఔచిత్య పరిజ్ఞాత.ఇతడు నా వ్యవహారమును జూచుటకుమాత్రమే. తక్కిన ముప్వురు వేరువేరు శక్తులు కలవారు. అందులో నొకని పేరు.......

అమె:—ధన్వంతరి.

గురువు:—నీకు తెలియునన్నమాట.

అమె:—తెలియకుండ నింతదూరము వచ్చితినా?

గురువు:—తెలిసినచో నత డెట్టివాడో చెప్పుము?

అమె:—అతడు ఖడ్గవిద్యానిపుణుడు. గుండెలోని పచ్చి నెత్తురు త్రావువాడు. నిజానికి అతడు రామరుని దళములో నుండదగినవాడు.

గురువు:-తెలిసి ఎందుల కీసాహసము చేయుటకు వచ్చితివి?

అమె:—నేను వాని నిచ్చటనుండి పంపివేసి వాని స్థానమునందుండుటకు వచ్చితిని. వానిని నీ విచ్చటనుండి పంపివేయుము. కరవాలము పుచ్చికొని వాడు నీ కెంత సహాయము చేయునో నేను నంత సహాయము చేయుదును. ఇప్పుడు నేను నీవెరిగియున్న నాటి స్త్రీని కాను. చాల మారిపోతిని. చాల శక్తులు సంపాదించితిని. అతడు నాముందు పనికిరాడు. నా మాటలలోని నిజమును నీవు పరీక్షించ దలచినచో అతనిని పిలిపింపుము.

గురువున కేమియు పాలుపోలేదు. ఇంత మాటాడుచున్నను అమె యెవరో తన కర్థము కాలేదు. అమె యెవరో తాను గ్రహించినట్లు ప్రసంగించుచుండెను. తా నెరుగనట్లు మాటాడినచో తన సర్వజ్ఞత్వమునకు భంగమనుకొనెను. అత డిట్లనెను: "నా దీదేశముకాదు. నీవు నేపాళదేశపు స్త్రీవి. నేను పూర్వ మెప్పుడో పదునేనేండ్లక్రిందటనే ఈ దేశమునకు వచ్చితిని. మరల రాలేదు. నిన్ను నే నెప్పుడు చూచితిని? ఎట్లు చూచితిని? నీ పేరేమి?

అమె:—పదునేనేండ్లలో నంత మరచిపోదురా? నేను మారిపోయితినేమో! పదునేనేండ్లలో మారిపోవచ్చునుకదా! నీ వేమియు

మారిపోలేదు. అప్పు డెట్లుంటివో యిప్పుడు నట్లే యుంటివి. ఈ రూప మును, ఈ యారోగ్యమును, ఈ యౌవనము నెట్లు నిలబెట్టుకొను చున్నావు? అప్పు డెంత స్పృహణీయుడవుగా నుంటివో యిప్పు డట్లే యున్నావు. నేను నీ కెందుకు జ్ఞాపకములేనో నాకు తెలియదు. నాపేరు చెప్పినచో జ్ఞాపకమువచ్చునేమో! నా పేరు గిలా. జ్ఞాపకము వచ్చి నదా?

గురువు:— నేను నిన్నెరుగను. నాకు జ్ఞాపకము రాలేదు. జ్ఞాపకము వచ్చుటకేమున్నది? నేను పదునేడేండ్ల క్రింద నెట్లుంటినో యిప్పు డట్లు లేను. నీవు నే నెవరనో యనుకొనుచుంటివి. నే నొక యోగిని.

ఆమె:— యోగుల కీశక్తి యుండును. వారు తమ యారోగ్య మును, యౌవనమును రక్షించుకొనగలరు. నీ పేరు నాకు తెలియును. చెప్పమందువా?

గురువు:— చెప్పుము.

ఆమె:— నీ పేరు నీకు తెలియునుగదా! నీ పేరు గురువుకాదు గదా! అసలు నీపే రేదో నీ వీ యాకుమీద వ్రాయుము. నేను రెండా కులు తెచ్చితిని. ఒకయాకుమీద నేను వ్రాయుదును. రెం డాకులమీది పేరు లొక్కటియైనచో నీపేరు నాకు తెలియునన్నమాట. ఎందు కనగా నేను నీపేరు చెప్పుదును. నీ వది నీపేరు కాదందువు. అందుకని.

గురువు:— నాకు చిన్నప్పటినుండియు పేరు లేదు. నేను పుట్టుచునే యోగిగా పుట్టితిని.

ఆమె:— గురువుగాగూడ పుట్టితివేమి? పోనిమ్ము. నీ దేశ మేదియో నేను చెప్పెదను. చెప్పెద ననగా నాకుమీద వ్రాసెదను. నీవు వ్రాయుము. ఏమందువు? నీ వేదేశమునందును పుట్టలేదందువా? ఏదేశములోనను పుట్టకుండ నొక మనుష్యు డెట్లుండును?

గురువు:— నేను ధన్వంతరిని పిలుతును.

ఆమె:— నేను సిద్ధముగానే వచ్చితిని.

గురువు:— నే నిచ్చట మర్యాదగా జీవితము గడుపుకొను చున్నాను. నీవెవరవో, యెందుకు వచ్చితివో నాకు తెలియదు. ఈ రభస యెందులకు? నీకేమి కావలయునో చెప్పుము.

ఆమె:—నే నిచ్చటనుండి పోను. నీతో నుందును. నీ కుటీర ములో వసింతును. నీవు దాని కంగీకరింపవలెను.

గురువు:—అది యెన్నటికిని సాధ్యముకాదు

ఆమె "ఎందుకు సాధ్యము కాదు? సాధ్యమగునో కాదో నీవు నన్నెరుగుదునని చెప్పుము. నీ నిజమైన పేరు చెప్పుము. నేను వెడలి పోదును. ప్రస్తుతము వెడలిపోదును. మరల వత్తును. చాలప్రొద్దు పోయినది. నాకు తెలియును. నిన్ను అల్లరిపెట్టవలెనని నాకు లేదు. నాకు న్యాయమైనదానిని నేను సంపాదింపవలెనని యున్నది. నీవు భర్తవు. నేను భార్యను. మరల రేపు వత్తును" అని వెడలిపోయెను.

# 4

ఇది కలి యింకను ప్రవేశించనినాటి కథకదా! పాండవులు వనవా సము చేయునాటి కథ. వనవాసమైనతరువాత నజ్ఞాతవాస మున్నది. యుద్ధ మున్నది. ధర్మరాజు పట్టాభిషేకమైనతరువాత ముప్పదియారేండ్లు రాజ్యముచేసెను. అప్పుడు కలి ప్రవేశించెను. కలి ప్రవేశించినతరువాత నీనాటి కైదువేల యరువది యేండ్లు జరిగి నవి. ఆ ప్రాంతాల జరిగినది.

ఆంధ్రులొకజాతిగా నెప్పుడైరో తెలియదు. అది తెలియకపోయి నను ఆంధ్రజాతి, ఆంధ్రభాష కాకపోయినను ఆంధ్రసారస్వతము నన్నయగారితో మొదలుపెట్టిన దని ప్రతీతి. నన్నయ్యగా రాంధ్ర భారతము వ్రాసి సుమారు వేయియేండ్లైనదని చెప్పికొనుచున్నారు. పరిశోధకులు తత్పూర్వమింకను ఏడెనిమిదిశతాబ్దములనాడే యాంధ్ర భాషలో పద్యరచన యున్నదని శాసనములద్వారా వ్రాయుచున్నారు.

తెలుగుభాషలో పద్యరచన యప్పటికే యున్నచో కనీసము రెండు వేల యేండ్లనుండి యాంధ్రభాష యనునది యొకటి రూపుకట్టియున్నదని చెప్పవచ్చును. ఆంధ్రభాషయు, కన్నడభాషయు నొకటియే భాష యనియు, రెండుశాఖలనియు నొక సిద్ధాంతమున్నది. అదియంతయు నేమైననేమి? ఆంధ్రభాషకు సంబంధము లేకుండ నాంధ్రదేశ మున్నది.

ఎప్పుడో త్రేతాయుగమునాడు నాటి యొక పురాణకథాపురుషు డైన యొక చక్రవర్తి కైదుగురు కొడుకులు. అందులో నొకని పే రాంధ్రుడు. ఆ చక్రవర్తి భారతదేశములో పలుభాగములను తన యైదుగురు కొడుకులకు పంచియిచ్చెను. ఆంధ్రు డన్నవాని కీ భూభాగము వచ్చెను. అందుచేత నీదేశమున కాంధ్రదేశ మని పేరువచ్చెను. ఆధునిక పరిశోధకు లాంధ్ర, త్రిలింగశబ్దములకు నాలుగైదు వ్యుత్పత్తులు చెప్పుదురు. వానికిని, మన పురాణకథలకును సంబంధమున్నట్లు లేదు. పురాణకథలన్నియు నభూతకథలని మనకు నేర్పిరికదా! భూతమనగా కడచిన కాలము. పురాణములు భూతకల్పనలు; అభూత కల్పనలు కావు. అభూతకల్పనలు అయినచో నేటివి కావలెను.

ఇట్లుండగా నాంధ్రదేశము ప్రధానముగా ననాదినుండియు కృష్ణా గోదావరీ పినాకినీ మహేంద్రతనయానదులు ప్రవహించుచున్న దేశమని చెప్పవచ్చును. మహేంద్రతనయాప్రవాహ పరిస్విన్నమైన దేశము నోఢ్రులు తమ దనవచ్చును. ఏమన్నను కృష్ణా గోదావరీ పినాకినీనదులకు భద్రము. ఆ యైదువేల వందయేండ్లకు పూర్వ మాంధ్రదేశ మిట్లుండెనని చెప్పుట కెట్లు సాధ్యపడును? కాని కథ లున్నవి. మహాభారతయుద్ధమున కాంధ్రరాజుకూడ వెళ్లెను. మరి యప్పటి కాంధ్రదేశమున్న దన్నమాటయే కదా? అప్పుడనగా వీరు చెప్పినప్పుడు కాదుకదా! అది యైదువేల యేండ్లకు పూర్వముకదా? దేశములు మారును. భాషలు మారవచ్చును. రాజ్యములు నిస్సందేహముగా మారును. ప్రజలు మారరు. అప్పటివాడు జుట్టు పెంచినచో నిప్పటివాడు కత్తిరించవచ్చును. అప్పటివాడు మేన నంగీ లేకుండ తిరిగినచో నే డంగీ లేకుండ తిరుగుట యగౌరవ మనిపించవచ్చును. కామక్రోధ లోభమోహ మదమాత్సర్యంబులు అప్పుడెట్లో

యిప్పు డట్లే. ఇక్కడ నెట్లో యింకొకచోట గూడ నట్లే. ఇదియే సృష్టి యొక్క సామాన్యధర్మము. సామాన్యముగా నేటి కొందరు కవిత్వము సార్వజనీనముగా నుండవలెనందురు. సార్వజనీనమనగా సర్వజను లకు సంబంధించిన కామక్రోధాదుల యైక్యము. దానికి భిన్నత యెప్పుడును లేదు. కృతయుగములోని జనులు కామక్రోధాదులు కలవారే. కలియుగములోని జనులును కామక్రోధాదులు కలవారే. భేద మేమనగా నొకప్పుడు పడి యెక్కువ, యొకప్పుడుపడి తక్కువ. ఒక్క భారతదేశము దీసికొన్నచో సేతువునొద్ద నివసించు జనము కామక్రోధములు కలవారే. హిమాచలమున నివసించు జనులకును నవి చక్కగా నున్నవి. పరమోష్ణమండలమైన భూమధ్యరేఖయందు నివసించువారికి కామక్రోధాదు లున్నట్లే యుత్తర ధ్రువమునందు నివసించువారికిని కలవు. భేదము లేదు. భేద మెందున్నది? అహారా చారములయం దున్నది. పరిస్థితులయం దున్నది. జనులు నివ సించు ప్రదేశములందలి పర్వతనదీనస్యాదులయం దున్నది. విశ్వజనీ నత యని యుబ్బితబ్బిబ్బులగువా రీరహస్యమును గ్రహించలేదేమో! కనుక భాషలో నేమున్నది? దేశములో నేమున్నది? ఉన్నదంతయు మానవ స్వభావములో నున్నది. పరమేశ్వరుని యనుగ్రహములో నున్నది.

అందుచేత, ప్రతిచిన్నవిషయమును పెద్దదిగా చెప్పినచో చిన్న చిన్న విషయములకే లోకము చాలుట లేదు. పెద్దపెద్ద విషయము లతో లోకము క్రిక్కిరిసి పోవును. స్థలము చాలదు. ఒకానొక దేశము నాలుగైదువందల యేండ్ల క్రిందట నాగరకతను ప్రారంభించెను. ఈ నాలుగువందల యేండ్ల చరిత్రను వ్రాసికొన్నది. ఆ గ్రంథములే బండ్ల కొలది యున్నవి. ఆ దేశముయొక్క నాగరకతయే నాల్గువేల యేండ్ల నుండి యున్న దనుకొందము. ఈ లెక్కలో నింత విస్తారముగా నిన్ని వేల యేండ్ల చరిత్రయు, తద్దేశసంబంధమైనది వ్రాయబడినచో బండ్లు చాలవు. విమానములు చాలవు. ఆ గ్రంథము లొకదానిమీద నొకటి బొత్తులుగా పేర్చినచో చంద్రమండలముదాక పోవునేమో! అంతవర కది యదృష్టమే. పొరపాటున సూర్యమండలముదాక పోయినచో పై గ్రంథము లంటుకొనును. ఆ నిప్పు క్రిందివానివరకు వచ్చును. సర్వ

మును దగ్ధమైపోవును. కాదయ్యా ఆక్రొత్తదేశము బహువిషయములను గూర్చి బహుగ్రంథములను రచించినది. వానినన్నిటి నెవరు చదువు చున్నారు? చదువుటకు మనుజుని యాయుర్దాయము చాలునా? ప్రధానమైన గ్రంథములు చదువుదురు. కావలసిన జ్ఞానము వచ్చును. అతని జీవితములో నతడు పదివేల గ్రంథములు చదివెను అన్న యత డెవడైన నుండునా? ఉన్నచో నట్టివారి సంఖ్య యెంత? ఈ విష యము తెలిసికొని బుద్ధిమంతుడు ప్రవర్తించును. వెఱ్ఱివేషాలు పిచ్చి కూతలతోడి పదిపుటల గ్రంథ ముండును. అదికూడ గ్రంథమే. అట్టివి వేయిగ్రంథములు చదివి వాడు బహుగ్రంథపఠనము చేసినా డన్నచో నేమి రమ్యతకలదు? కొందరు శతాధిక గ్రంథకర్తల మందురు. ఆ వంపలో తొంబదిగ్రంథము లిట్టివే యైయుండును.

ఒక వ్యాసమహర్షి, ఒక ఆదిశంకరుడు వారు బహుగ్రంథకర్తలు. నేటి పాశ్చాత్యదేశములందుకూడ నట్టివారు కొలదిమంది కలరు. అందుచేత భారతదేశపూర్వులు ప్రతివానిని వ్రాసిపెట్టలేదు. వేయబడిన శిలాశాసనములే వివాదగ్రస్త విషయము లగుచున్నవి. కొన్ని రాజ వంశావళు లున్నవి. మగధరాజ్యము, కాశ్మీరరాజ్యము, అయోధ్యా రాజ్యము, నేపాళరాజ్యము మొదలైన దేశములకు మాత్రమే వంశా వళులు కలవు. అట్లే ఆంధ్రరాజ్యవంశావళి, కన్నడరాజ్యవంశావళి, ద్రావిడరాజ్యవంశావళి, కేరళరాజ్యవంశావళి యన్న గ్రంథములులేవు. ఉన్నవనుకొనుము. ఉండి యేమి ప్రయోజనము? ఆ రాజుతరువాత నీరాజు వచ్చెను; ఆరాజునకు సంతానము లేకపోవుటచేత వాని నెవ నినో పెంచికొనెను; నాడు క్రొత్తరాజవంశము ప్రారంభించినది. ఇది యొక విషయము. లేదా ఆరాజుయొక్క సేనాపతికిని, రాజుయొక్క భార్యకును సంబంధ ముండెను. ఇద్దరు నారాజును వధించిరి. ఆ సేనాపతి రాజయ్యెను. క్రొత్తరాజవంశము ప్రారంభించెను. ఇదియొక విషయము. దీని కంతకు చరిత్రయని పేరు. నూటికి కోటి కొక మహా విషయ ముండవచ్చును. ఆయొక్కదానికోసము పుట్టెడు మన్ను ప్రోగుచేసెదవా? బియ్యములో మట్టి బెడ్డ లేరవచ్చును. మట్టి బెడ్డలలో బియ్యపుగింజ లేరరు. అందుచేత విస్మరింపరాని మహావిషయ ములను మాత్రము వ్రాసి యట్టిపెట్టుకొనుట బుద్ధిమజ్జాతి లక్షణము.

అవియే పురాణములు. మరి రాజవంశావళు లున్నవి. కొన్ని యౌత్త రాహ రాజ్యముల చరిత్రములు. దాక్షిణాత్యరాజ్యములం దంతటి సుస్థిరత్వము లేదేమో!

ఆనాటి యాంధ్రదేశ మిట్టిదని చెప్పుటకు వీలులేదు. ఎల్లలును సునిర్ణీతములై లేవు. ఉన్నవో లేవో తెలియదు. కాని జనమున్నారు. స్త్రీలు పురుషులు కలరు. ఉన్నచో వారు భోజనముచేయువలెను. అనాగరకులైనచో మృగములను జంపి మాంసమును తిందురు; నాగరకులైనచో పండించుకొందురు. ఆంధ్రులు ప్రధానముగా మృగమాంస ఖాదులైన జాతిగా వినికిడి లేదు. మానవప్రకృతి యెప్పుడు నొక్కటియే కదా? ఒక వేయియేండ్లక్రిందవరకు జూచినచో నాంధ్రులలో మహా పండితులున్నారు. మహారాజు లున్నారు. మహావీరులున్నారు. బుద్ధిమంతులున్నారు. మానవజాతిలో జడులు నుందురు. కితవు లుందురు. దుర్జను లుందురు. సోమరు లుందురు. అట్లే యాంధ్రులలోకూడ నుండియుందురు.

ఉండియుందురేమి? ఒకడున్నాడు. ఆతడు చరిత్రకెక్కదగిన శీలము కలవాడు. శీల మనుటకంటె ప్రవర్తనయనుట మంచిది. లక్షణము లనుట యంతకంటె మంచిది. ఆతని పేరు శాకయ్య.

ఆంధ్రుల నామములు అనాదినుండియు అనాగరకులై సామాన్యమై దేశీయమైన ప్రజవి కానిచో సంస్కృతనామములు. పెద్దపెద్ద పండితులు, పెద్దపెద్ద కవులు, వారి నామములు చూచినచో దేశ్యములైన శబ్దములే. కాని ఆ నామములకు అన్న యన్న ప్రత్యయ ముండుచుండు-బద్దన్న, ఎఱ్ఱన్న మొదలైనవి. ఇట్టి ప్రత్యయములు మిక్కిలిగా నుండెడివేమో! 'అయ్య' యన్న ప్రత్యయముకూడ ననాదిదే. క్రమక్రమముగా నీ 'యయ్య' 'అన్న'ను తొలగించి తాను పైకివచ్చినది. 'అన్న' అన్నప్రత్యయమేమో యగౌరవమును సూచించు ననియు, 'అయ్య' యన్న శబ్దము గౌరవవాచకమనియు నాధునికముగా నొక యూహ ప్రబలినట్లు కన్పించెడిని. 'అయ్య' శబ్దము ఆర్యశబ్దభవముగా చెప్పబడుచున్నది. 'అన్న' శబ్దము ఏశబ్దమునుండి పుట్టినది? దాని కర్మ మందుచేత కాలినదేమో! అదియుకాక మానవబుద్ధి లక్షణము విలక్షణముగా నుండును. ఒక కాలమునం దొక సంఘపరిస్థితి

యున్నది. కాలము మారి యా పరిస్థితి మాననది. క్రొత్తపరిస్థితిలో బ్రతుకుచున్న జనులకు పాతపరిస్థితియందు ద్వేషము కలిగినది. ఆ ప్రాతపరిస్థితి కలనాళ్లలో కొన్నివర్ణములవారు మరికొన్నివర్ణములవారిని బుద్ధిపూర్వకముగా నణగద్రొక్కిరన్న యూహ ప్రబలినది. అందుచేత నానాటి సర్వమును మార్చివేయబడును. ఆ నామము లగౌరవమును సూచించునని తలచబడును. అరీతిగా 'అన్న' యన్నది తొలగిపోయి, 'అయ్య'యన్నది వచ్చెను.

తెలుగుశబ్దములకు చివర ప్రత్యయ ముండితీరును. ప్రథమా విభక్తియందు సామాన్యముగా నొక ప్రత్యయ ముండును. హిందీ భాషలో నుండదు. హిందీభాష కొక గౌరవము వచ్చినది. అందుచేత నాంధ్రదేశీయుల నామములు సహితము క్రమముగా ప్రత్యయవిరహితము లగుచున్నవి. మానవులకే ప్రత్యయము పోవుచున్నప్పుడు శబ్దములకు బోయినచో నష్టమేమి?

ఇంతకు నతని పేరు శాకయ్య. ఆంధ్రుడు. కృష్ణాతీరవాసి. వారిది పట్టణమును, పల్లెయును కాని యొకయూరు. వారిది మిక్కిలి పేదసంసారము. అతని పయి స్వంత యని అతనిని సృష్టించిన బ్రహ్మ గూడ చెప్పలేడు. ఎందుకనగా వారి యింటి యరుగుమీద నతడు కూర్చుండెను. అతని భార్య యతనితో మాటాడుచుండెను. అది యిల్లు కాదు. అది యరుగు కాదు. ఆ పాకపైని కప్పు వాడు, నామెయు తాల్చిన వసనములవలెనే శతసహస్రపరిచ్ఛేద సంఘటితము. అరుగు మీది రాళ్ళన్నియు విశ్లథములైపోయినవి. ఆరాళ్లు మంటియిటుకలు. ఇటుక లనుటకంటె మన్ను పేడతో కలిపి పెద్దపెద్ద యుండలుచేసి వాని నెండించి వితర్దికాకృతి కలుగునట్లుగా చేసిన స్థలము. గోడలు గూడ నట్టివే.

ఆయూరు కొంత సముద్రతీరముగనుక చాలయేండ్లమీద చవుడు రాలి గోడ క్రిందిభాగము సన్నగా, పైభాగము లావుగా నుండెను. అది యెప్పుడు పడిన నప్పుడే పడవచ్చును. ఆగోడ యింకను పడవలయు నని తలచుకొన్నట్లు లేదు.

వారి కారుగురు పిల్లలు. అయింటిలో వెడల్పు తక్కువై పొడవు వెడల్పునకు రెట్టింపైన యొక గది యున్నది.

అదియే వంటయిల్లు, అదియే గది, అదియే సావడి, అదియే నర్వ న్వము. ఇల్లేయది. ఏబదియేండ్లక్రింద నీ గృహమును శాకయ్య తండ్రి నిర్మించెను. అతడు తన యేకైకపుత్రునకు గృహమైన నిచ్చిపోవలెనని యూపని జేసెను. చేసిన పనిలో తెలివిగా జేసిన దేమనగా నాయి ల్లెంత మేర యున్నదో యంతమేర బయట, గడప కటునిటు రెండు అరుగులును, దానిపైన కూడ కప్పును కలుగునట్లు చేసెను.

అయనపోయి పదియేండ్లయినది. అతండ్రి బ్రతికియున్నన్నాళ్లు వారికి నాలుగువేళ్లును లోనికి బోయినవి. ఈ శాకయ్య తల్లి చిన్నప్పుడే చనిపోయెను. తండ్రి మరల వివాహము చేసికొనలేదు. శాకయ్య తల్లి లేని పిల్లవాడైనాడని వానిని మిక్కిలి గారబముచేసెను. వానిని కాలు క్రింద పెట్టనియలేదు. ఒక్కొక్కప్పుడు తాను పస్తుండి పిల్లవాని కన్నము పెట్టెడివాడు. వాని కక్షరపుముక్కరాదు. వా డేమైపోవునో యని తండ్రి విచారించలేదు. కాని వాని జాతకమును పలువురికి చూపించెడివాడు. అందరు నతని జాతకము చాల గొప్ప జాతకమని చెప్పజొచ్చిరి. ఇది యొక మహారాజు జాతకము వంటిది. ఇత డైనచో నొక మహా రాజగును; లేనిచో నొక గొప్ప మఠాచార్యుడగును. ఏమైనను నిత డనుభవించు భోగములకు మితిలేదు. కాని యితనికి ముప్పదియేండ్ల వయసు రావలెను. అప్పటినుండి యితనికి దశ యెత్తుకొనును. ఈ మాటలయందు విశ్వాసముతో తండ్రి వానిని మరియు ముద్దుగా పెంచెను. అతనికి పదునేనవయేట వివాహముచేసెను. ఆ బాలిక కప్పటికి పదియేండ్లు. ఆ పిల్ల తల్లిదండ్రులేమి ధనవంతులా? అయినచో వీని కెందుకిత్తురు? ధనవంతులైనచో బాలికకు ఎనిమిదేండ్లకే వివాహము చేయుదురు. పదియేండ్లవరకు పిల్ల నట్టిపెట్టవచ్చును. ఒకవేళ పిల్ల పెద్దమనిషి యయినచో మేనమామపోయి కృష్ణలో నిల్లు గట్టుకొనవలెను. ఆ పిల్ల యితనికి ఇతని పదియేడవ యేట కాపురమునకు వచ్చెను. అతని కిరువదియువయేడు వచ్చినది. తండ్రి చనిపోయెను.

అప్పటికే యితని కొక కుమారుడు. తరువాత పదియేండ్లు గడచినవి. కడచినవనగా వాని తప్పగాని యతడు కడపినది లేదు. ఇతని కన్నము పెట్టినచో తినును, లేనిచో నరుగుమీద కూర్చుండును. తండ్రి చనిపోయినతరువాత మరల నైదుగురు పిల్లలు పుట్టిరి. తండ్రి

లేకపోయినను సంతానము కలుగును గాబోలు. నెలకు ముప్పది దిన ములు. పదునేనుదినములు తిండిలేదు. తక్కిన పదునేను దినము లలో నాలుగైదు దినములు రెండుపూటల భోజనము చేయుదు రేమో ! తక్కినదినము లొక్కపూటయే. అట్టి స్త్రీ పురుషులకు సంతా నము కలుగుననగా సంతానమునకు బుద్ధిలేదు. అది యేమయ్యా యనగా అది కర్మాధీనము కావలయును. కర్మ యనునది ధాత్రిపైని సూర్యుడు జలమును తన కిరణములతో నాకర్షించుట దగ్గర మొదలు పెట్టిన దండము. అప్పటినుండి కర్మమొదలు. ఈ జలబిందువులు మేఘాకారముగా నగును. ఆమేఘ మెక్కడ కురియు నన్నది ప్రశ్న. పట్టినచోట కురియు నని యున్నదా? మొయిళ్లు నెట్టిన చోట కురి యును. కొండలును, మహావృక్షములును కొట్టినచోట కురియును. కొంత యట్లు కురిసి మిగిలినది పట్టణమీద చినుకుచు బోవచ్చును. ఆ పట్టలలో ముండ్లకంపలు మొలకలెత్తును. అవి వానికి తోచిన కాయ లవి కాచును. అచ్చటివారి కది యాహారము. భిన్న స్థలములయందు వర్షించిన మేఘము భిన్నశక్తులు గల యాహారము నుత్పాదించు చున్నది. ఒకప్పుడు వాన చినుకు లేదు. అనంతకాలమునుండి యెరుగని యేకాలమునందో తెగకురిసిన మేఘములచేత నాడు తడి సిన నెల చెమ్మను దాచుకొన్నదో? లేదా! పూర్వము నేడు పృథివీ పదార్థముగానున్న యీధరిత్రి జలమని చెప్పుచున్నారు కనుక ఆ జలము ఘనీభవించినది గనుక దాని తొలినాటి జలలక్షణము వదలి పెట్టక యెంత రాతిప్రదేశమైనను తనలో నొక కొంత చెమ్మను మిగిల్చి కొని యుండునుకనుక ఆ చెమ్మయొక్క లక్షణముచేత దానిలోనుండి మొక్కలు మొలచును. ఆమొక్క లెవో కాయలు కాచును.

అన్నాతురుడు ఫలములనే తినునా? మొక్కలను తినును. వేళ్లను తినును. అవియును వాని శరీరమునందు రక్తమును, చేత నైనట్లు, సంపాదించును. రక్తమునుండి రేతస్సు కలుగును ఆ రేతస్సు నిక్షిప్తమై స్త్రీకుక్షియందు పిండ మేర్పడును. అందులో జీవు డుండును. ఇది యంతయు కర్మ. ఆ కర్మయొక్క ఫలిత మాజీవుని పట్టలలో మొలిచిన గడ్డిని తినెడివానినిగా చేయుచున్నది.

ఒకప్పు డాపట్టను దొర యెవడో జలప్రవాహము కలదానినిగా

చేసి కొన్ని యేండ్ల వ్యవసాయముచేత దానిలోని చవుడు చచ్చి కొంత పండెడు దానినిగా చేయవచ్చును. అందుచేత తొలినాటి జీవుల కర్మ కర్మ కాదనుటకు వీలులేదు. ఈనా డానేల బాగుపడినచో నంతకంటె నుత్తమములైన కర్మలు చేసినవా రిప్పు డిచ్చట పుట్టుదురు. ఆ తొలి నాటి నీచకర్మ చేసిన జీవులు మరియొక చోటు జూచుకొందురు. ధాత్రియం దెచ్చటను పట్టియే లేదు. అందరు గోధుమలు వరి ధాన్యమే తినవచ్చును. లేదా దినమునకు కొన్నిలక్షల యావులను దున్నలను ఎడ్లను చంపించి యామాంసమును సర్వజనులచేత తిని పింతుము. మా రాజ్యములో నాహారము లేనివాడే యుండ డన్న ప్రతిజ్ఞాశాలియైన రాచరికము జగత్తున ప్రతిష్ఠితమైనచో, పాపము, కర్మ ఏమి చేయును? వాడు పూర్వము చేసిన కర్మను భోజనముకందు కాక మరియొక దానియం దనుభవింప నట్లు చేయునేమో!

ఏమైన నేమి? మొత్తముమీద నారుగురు జీవులు శాకయ్యదంప తుల కడుపున బడిరి. వారి వయస్సు లెనిమిదియేండ్ల మొదలు మూడేండ్లవరకు నున్నవి. సంతాన మారుగురు. ముగ్గురు స్త్రీలు. ముగ్గురు పురుషులు. ఆరుగురు నిజానికి తల్లికివలెనే తిండిలేనివారు. తండ్రి కున్నదా అన్నప్రశ్న అతని కున్నదో లేదో భగవంతునకు దెలి యును. అందుకనియే తొట్టతొలుత నతని వయస్సెంతయో ఎవ్వరికిని తెలియదని చెప్పుట. భార్యయు నతడు ను మాటాడుచుండిరికదా! ఆమె కిప్పుడు సుమారు ముప్పదియేం డ్లుండవచ్చును. ఏబదియేండ్ల స్త్రీవలె కన్పించును. తల నెరసినది. ఒకదంత మూడినది. దంత మూడు టకు కారణము వయస్సు కాదు. ఒకప్పుడు శాకయ్య కామెమీద కోపమువచ్చి ఆమెను కఱ్ఱతో గొట్టెను. తలమీద కొట్టెను. నెత్తురు వచ్చెను. అది తలమీదిమాట. ఆదెబ్బ కదిరి దంత మూడెను.

ఆమె యాతిండితో, ఈ భర్తతో, నీయారోగ్యముతో నారుగురు పిల్ల లను కన్న దన్నచో సృష్టిలో స్త్రీని సంతానము కనుటకొరకే భగవంతు డేర్పరచినా డన్నట్లుండును. కొంత జనము లేనిచో సృష్టి లేదు. రాజ్యములు లేవు. రాజుల యాటలు సాగవు. రాజపురుషుల దురు ద్యోగములు మరెట్లు సాగును? మతములను ప్రచారము చేసెడివారి పాండిత్యవివేకములు, వారి ప్రతిభాదులు నెట్లు సాగును? అందుచేత

నెక్కడో యక్కడ, నెప్పుడో యప్పుడు జనము పుట్టుచునేయుండ వలెను. ఆ పుట్టెడువారు తిండి కల చోట పుట్టినచో నెవరైనను నంతోషింపవచ్చును. ఆపుట్టుటకు తిండికలిమి లేమి యవసరములేదు. తిండి కలవాడు గోడలు కట్టడుకదా! మంటిపళ్లికలు మోయడుకదా! గుడ్డ లుతుకడు కదా! క్షౌరము చేయడుకదా! రమాచంద్రుడన్నయొక యుద్యోగి, లేనిచో పెద్దవీరుడు, కనీనము గొప్ప కవి. "రమాచంద్రుడు జయించుగాక!" "రమాచంద్రుడు జయించుగాక!" యని యరచుచు వీధివెంట బోవుటకు పేదవారు కావలెను. తిండి సరిగా సాగనివారు కావలెను. నగమాకలితో బ్రతికెడివారు కావలెను వారున్నప్పుడే పైవారు జయింతురు. అందుచేత భగవంతుడు సృష్టిని విపక్షలేకుండ చేయవలెను. చెట్టుక్రింద నంసారము చేయుదురు. వారి కిండ్లు లేవు. పొలములు లేవు. వానలు కురిసినప్పుడు వారెచ్చట నుందురో తెలియదు. వానలు కురిసినప్పుడు గృహములు కలవారు తమ గృహములలో భద్రముగా నుందురు. ఈ చెట్లక్రిందివా రప్పు డెచ్చట నుండిరో? చూచెడివా రెవరు? అందుచేత వా రెచ్చట నుందురో తెలియదు. ఒక్కొక్కప్పుడు మరియొకటి జరుగును. అతడు చెట్టు క్రిందపుట్టును; పెరుగును. ఎందుకో! అతడొక యింటిలోనికి వచ్చును. క్రమముగా సౌధములోనికి పోవును. అతడు 'రమాచంద్రుడు జయించుగాక!' యని యరపడు. వాడే రమాచంద్రు డగును. 'వీడు జయించుగాక!' యని యరచెడువారు వేరయుందురు.

శాకయ్యకు వయస్సెంతయో యింతవరకు నిర్ణయమే. ఎందుకనగా నతనికి పదునేనవయేట పెండ్లి జరిగినది. ఇరువదియవయేట తండ్రిపోయినాడు. తండ్రిపోయి పదియేండ్లయినది. అందుచేత ముప్పదియేండ్లు. ఇవి లెక్కయే. తరువాత నితని వయస్సు లెక్కయుండదు. ఈ ముప్పదియేం డ్లతడు హేలాగ్రామ మన్న తన పుట్టిన యూరిలో తన పెరిగినయూరిలో నున్నాడు గనుక నిజము తెలిసినది. అయినను పదిమందియు నెరుగుదురుగనుక నతని వయస్సు ముప్పది. ఎరుగకపోయినచో ముప్పదియని యెట్లు? ఇరువదియైయేవేమో! ఇరువది యేమొ! కొందరికరువది యేండ్లుండును. అతనిని చూచి చాలమంది యేబదియేం డ్లనుకొందురు. మరికొందరు మి కరువదియేం డ్లున్నవా

యని యడుగుదురు. కొందరు డెబ్బదియేండ్లా అండీ! అని అడుగుదురు. దీనికి వివక్ష లేదు. కాని యొకటి యున్నది. ఆరోగ్యము కలవాడు, ఆరోగ్యహీనుడు-ఈ భేదము కన్పించును. కొందరకు తల నరయదు. మొగముమీద ముడుతలు పడవు. అది యెందుకో తెలియదు. వారి వయస్సు తెలియదు. అట్టివారు బక్కపలుచగానుందురు. పొట్టివారుగా నుందురు. మంచి శరీరచ్ఛాయ కలవారై యుందురు.

శాకయ్య పొట్టివాడు కాదు. అజానుబాహువు. ఎఱ్ఱనివాడు. ఒడ్డు పొడుగు కలవాడు. ఒడ్డు పొడుగు కల శరీరములలో తగినంత యాహారపుష్టి యున్నగాని బలిసియుండరు. లేనిచో చిక్కిపోదురు. లోకమునందు భోజనప్రమాణ మేవిధముగా నుండును? కొన్ని నక్షత్రములయందు పుట్టినవారు బహుభుక్కులు; కొన్ని నక్షత్రముల యందు పుట్టినవారు స్వల్పభోజనముచేయుదురు. బక్కపలుచగా శివటగా మిక్కిలి పొట్టిగా నుండునతడు కూర్చున్నవాడు కూర్చున్నట్లు రెండువిస్తళ్లు చెల్లించును. అతని కడుపులోనంత తిండి యెట్లు పట్టునో తెలియదు. మరియొక డొడ్డుపొడుగుండును. అతడు పిట్టతిండి తినును. ఇది వ్యక్తులమధ్యనేకాదు; కొన్ని కుటుంబములే యల్పాహారము గల కుటుంబము లుండును.

ఒకప్పు డొక కవి నొక నగరములో నుపన్యాసమునకు పిలిచిరి. ఆ కవిపేరు రామన్న యందము. రామన్న అజానుబాహువైన మనిషి. ఆహారపుష్టి గల మనిషి. అతడు కవి గనుక దరిద్రుడని వేరచెప్ప నక్కరలేదు. అతని కవిత్వము కొందరికి మిక్కిలి యిష్టము. ఆ యూరిలో నొక ధనవంతుడు. తా నొక గొప్ప కవిపేర ప్రతి సంవత్సర మొకసారి యెవరినో సారస్వతవేత్తలను పిలిచి వీరిచేత తన యభిమానకవినిగూర్చి యుపన్యాసము లిప్పించి తృణమో పణమో యిచ్చి పంపించు చుండును. ఒక యేడాది యీ రామన్నను పిలిచిరి. రామన్నను పిలుచుటకుకూడ నితడు గొప్ప కవియని యభిమానించెడు కొందరి ప్రోత్సాహమే కారణము. ఆ కొందరిలో నొక కుటుంబము కొంచె మన్నోదకములకు లోపములేనివారు. వారీ రామన్నను తమ యూరువచ్చినప్పుడు తమయింట నతిథిగా నుండవలెనని కోరిరి. అతడును వచ్చెను. ఈ యుపన్యాస మాదివారమునాడు పడి

నది. రామన్న శనివారము రాత్రి వచ్చెను. అతడు శనివారపు రాత్రి పూట భోజనము చేయడు. దీని వారడి మరునాటి భోజనములో తీర్చును. తెల్లవారి ఆ స్నేహితుడైన గేస్తు ప్రొద్దుననే లేచి యిప్పుడే వత్తునని పనిమీద వెళ్లెను. అతడు వచ్చిన వేళకు సూర్యుడు నడి మింట నిలచెను. ఈ రామన్నస్థితి ఏమని చెప్పవలెను? వాని ప్రాణ ములు కడబట్టుచున్నవి. ఎక్కడకైన బోయి యేదైన కొంచెం తిన వలె నన్నచో వాడు ద్రవ్యహీనుడు. ఈ నన్యాసము జరిగిన తరు వాత తనవద్ద కొంత ధనముండునుకదా యని వచ్చినవాడు. ఎట్లైన నేమి? గృహపతి వచ్చెను. భోజనమునకు లెమ్మనిరి. రామన్నయు, గృహస్థు, ఆతని బంధువు లిద్దరు-పురుషులు విస్తర్లముందు కూర్చుం డిరి. ఆ యిల్లాలు నలుగురకు నాల్గు గుప్పెళ్ల యన్నము వడ్డించి పోయినది. ఆ ముగ్గురు పురుషులు సందులోనే కొంత పప్పు, కొంత కూర, కొంత పులుసుతో భోజనము చేసిరి. మజ్జిగలోనికి కామె వేర యన్నము తెచ్చెను. నలువురకు మొదట వడ్డించినదానిలో నగము నగము వడ్డించిపోయెను ఈ రామన్న కామొదట వడ్డించిన కబళ మేమూల! అతడు పతీక్ష చేయుచుండెను. ఇల్లాలు చూచుచునే యుండెను. ఇతడు తమ ప్రమాణమువాడు కాడని తెలిసికొన్నది. అతిథికదా, అతనికి తగినంత వడ్డించవలెనన్న యూహ యామెకు రాలేదో, యా యూహ వచ్చియు, వడ్డించినచో తన కింక మిగులదని యూరకున్నదో! తనకు మిగులక పోవుటయే కాదు, తక్కినవారికి మజ్జిగలోనికికూడ నన్న ముండదు. పరగృహభోజనము చేయకూడ దంపురు. అందులో నిది యొక కారణము.

ఆ రామన్న అట్లే యుపన్యాసము చేసినాడు. ఉపన్యాసానంత రము వానికి కొంత ధనము వచ్చినది. తరువాత ఆతని బాధ అతడు పడినాడు.

చెప్పవచ్చిన దేమనగా, నల్పభోజనము నెపడో యొకడు చేయునని కాదు. కొన్ని కుటుంబములయందే యది యలవాటు. చీనాదేశములో పూర్వము పుట్టినంతనే యాడపిల్లల పాదముల కినప చెప్పులు తొడుగుదురట. ఆ పాదములు పెరుగవు. చచ్చెడివరకు నా పాదముల ప్రమాణము తక్కువగనే యుండును. ఆ రీతిగా నేమైన వారి

కుటుంబములో పిల్లలు పుట్టినప్పటినుండి కుత్ప్రమాణమున కినుప తొడుగులు తొడుగుదురేమో! ఈ సందర్భ మాధునికముగా కన్పించును. కాని యిది సార్వజనీనము. సార్వకాలికము.

అందుచేత నీకథ యేకథయందైనను, ఏకాలమునందైనను సరిపోవును. ఒక కథలో దీని కనౌచిత్యముండదు. శాకయ్యకథ యింతకంటె విలక్షణమైనది. అదియు సృష్టిలోనున్నదే. అదియు భోజన విషయమే. కాని సక్రత్తుగా నుండును. ఒంటెనుగూర్చి చెప్పుదురు. ఎంతవరకు నిజమో తెలియదు. దాని కడుపులో నీటితిత్తి యొకటి యుండునట. ఆ మృగము తగినన్ని నీళ్లు ఆ తిత్తిలో నింపి కొని నీళ్లు దొరకని చోట ఆ తిత్తిలోని నీళ్లు గొంతులోనికి తెచ్చికొని దప్పికతీర్చుకొని జీర్ణకోశములోనికి పంపునట.ఎడారులలో ప్రయాణము చేయువారికి మంచినీళ్ల యిబ్బంది కలిగినచో నొక యొంటెను చంపి దాని కడుపులోని తిత్తిలోనలి నీళ్లు తీసికొందురు. దానిమాంసమును భోజనము చేయుదురు. లొట్టిపిట్ట యనగా ప్రయాణము చేయుచున్న సత్రముసంటి దన్నమాట.

శాకయ్యకు భోజన మెప్పుడు కుదిరినచో నప్పుడు తినును.కుదురదు, తినడు. తినకపోయినచో నతనికి వచ్చిన సేగి లేదు. తక్కిన కుటుంబమునకు సేగి. ఇది మా కుటుంబము; ఈమె నా భార్య; వీరు నాపిల్లలు; ముందు వీరిని పోషించి తరువాత నేను భోజనము చేయవలెను; లేనిచో నా కన్నము సహించ దనుకొనెడి సామాన్య జంతువు కాదు శాకయ్య. అతడు సృష్టిలో నేదో మహాకార్యము చేయుటకు జన్మించినవాడని కార్తాంతికులు చెప్పనే చెప్పినారు కదా! మహాపురుషులకు సామాన్యుల లక్షణము లుండవు. వారు అతీతులు. ఒక మహాసేనాని యున్నాడు. ఒక మహామంత్రి యున్నాడు. గొప్ప రాజకీయవేత్త లున్నారు. వారికి జనులు చచ్చిపోదు రన్న భావముండదు. అయ్యో! మన మిపని చేసినచో నింతమందికి ప్రాణాపాయము కలుగును గదా యన్న యూహ పుట్టదు. వారు జ్ఞానములేని, మోక్షశక్తిలేని యోగులు. యోగులకు వారికి నొక్కటియే భేదము. యోగు లనుకొందురు కదా! ఏది యెట్లైననేమి, మన కేమియు నక్కరలేదు. ఈ మంత్రులు, రాజకీయ వేత్తలు, సేనానులు ననుకొందురుకదా! ఏది

యెట్లైన నేమి? ఎవరు చచ్చిన నేమి? మన మంత్రిపదవి మన కుండ వలయును. మన రాజపురుషత్వము మన కుండవలెను. మన సేనా పతిత్వము మన కుండవలెను. ఇవి యేదియు కాని శాకయ్యే కట్లెందు కుండవలెను? ఇతడు భవిష్యత్తులో నటువంటి దేమో యగునని చెప్పెను కదా! అందుచేత నట్లుండెనేమో! ఈ శాకయ్యే భార్యయు, పిల్లలు నక్కర లేనివాడు. భార్యతో నెందుకు సంసారము చేసెను? పిల్లల నెందుకు కనెను? అన్న ప్రశ్న బంధువుల కెవరకు విడిపోదు.

శాకయ్యే పరమశాంతుడు, యోగీశ్వరుని వంటివాడు, నిష్కామము దండుమా? అతడవి యేమియు కాదనుటకు పగిలిపోయిన వాని భార్యదంతము సాక్ష్యమిచ్చును. మొత్తముమీద శాకయ్యే వ్యర్థుని వలె కన్పించునుగాని కొన్నిచోట్ల శాకయ్యేను భగవంతునిగా పూజిం తురు. ఆ స్థలములు మిక్కిలి కొద్ది. అట్టి స్థలములను శాకయ్యే ఎట్లు కనుగొనెనో మనకు తెలియదు. మనము మహాటవిలో చరించు చుందుము. నీళ్లెక్కడనున్నవో మనకు తెలియదు. అడవిమృగములకు తెలియును. అవి సరిగా నచ్చటికి పోవును. నీళ్లు త్రావును. మరల వచ్చును. కాంతారములయందున్న యా జలప్రదేశములు ఆ అడవి మృగములకు తెలియును. వేటకాండ్రకు తెలియును. శాకయ్యే వేట గానివంటివాడు. అడవిమృగములు నీళ్లెచ్చట త్రాగునో తెలియును. ఇత డచ్చటికి బోయి వారికి ధర్మము, వేదాంతము, మోక్షము, బ్రహ్మము పరమార్థము, విజ్ఞానము మొదలైనవి సర్వమును చెప్పును. వారి కితడు గురువు. ఇంత తెలిసిన యితడు ఈమహారహస్యము లన్నియు పలుమందికి చెప్పవచ్చును గదా! మోక్షము మాట యెట్లున్నను కుటుంబమును పోషించుకొనవచ్చును గదా యన్నచో నతని సిద్ధాంత ములు చెప్పెడిచోట్లు, కాంతారమృగములు నీళ్ళు త్రాగెడిచోట్లు, మను ష్యుడు నీళ్లు త్రాగెడివి కావు. అతడు చెప్పినవన్నియు సామాన్యజనుల విశ్వాసములకు వ్యతిరేకములైనవి. అతడొక యవతారము. పొరపాటున ద్వాపరాంతమున పుట్టినాడు. నిజముగానైనచో కలి ముదిరినతరువాత పుట్టవలసినవాడు. ద్వాపరాంతమునందు కొంత కలి యున్నను సాక్షాత్తు భగవంతుడు సంపూర్ణావతారమునెత్తుటకు తగినంత పుణ్యము మేటపడియున్న కాలము.

ఆ శాకయ్య అరుగుమీద కూర్చుండెను. భార్య దగ్గరకు వచ్చెను. ఎందుకు వచ్చెననగా నామె అచ్చటచ్చట బిచ్చమడిగి కొంత పదార్థము తెచ్చి చివరి నలువురు పిల్లలు క్షుత్తుచేత మాడిపోవుచుండగా వారికైనను వండిపెట్టుదమని యా పదార్థములు సిద్ధముచేసి మంచి తీర్థము తీసికొని వచ్చుటకు సుంతదూరమున నున్న బావికిపోయెను. ఈలోపుగా శాకయ్య యింటికివచ్చి యామత్తలోని యన్నమును పెట్టికొని తినెను. అన్నము వండుటకు తెచ్చిన జలము కొంత మిగులగా వానిని త్రావెను. చక్కగా వాకిటిలో కూర్చుండెను.

భార్య: - గిన్నెలో నన్న మేమైనది?

శాకయ్య: — నాకు తెలియదు.

భార్య: — పిల్లి రాలేదు. కుక్క రాలేదు.

శాకయ్య:—నాకు తెలియదు.

భార్య:—మీరే తిన్నారు.

శాకయ్య:—నీవే తిన్నావేమో!

భార్య: — లజ్జ యుండవలయును; సిగ్గుండవలెను. నాల్గుదినములనుండి పిల్లలకు భోజనము లేదు. బిచ్చమెత్తి తెచ్చిన బియ్యము పసిపిల్లలకొరకు వండిన యన్నము నేమొగముపెట్టికొని తినినారు? నలువురు మొగమున నుమ్మివేయరా? ఈ బ్రతుకు బ్రతికెడికన్న పోయి కృష్ణలో పడిచావరాదా?

శాకయ్య: — ఒడలు దగ్గర పెట్టికొని మాటాడుము.

భార్య: — నా కొడలే లేదు. నే నొక దయ్యమును, భూతమును. పెద్ద బిడ్డకు పదియేండ్లున్నవి. వాడు చేతి కక్కరకు వచ్చువరకు భగవంతుడు నన్ను బ్రతికించిన చాలును. నీవు భర్తవు కావు, పీడవు. పూర్వము చేసికొన్న పాపకర్మమువు. నీవంటి భర్తను భర్తగా మన్నించవలెనని వ్రాయబడిన ధర్మశాస్త్రములు తగులబడిపోయినను నాకిష్టమే.

శాకయ్య:— ఇప్పుడు నీవు నా భార్యవు. ఇంక నా బాధ నీకు లేదు

శాకయ్య వెడలిపోయెను, ఎచటికో!

# 5

## నేపాళదేశములో

దక్షిణదేశము పల్లపుదేశము. మరియు దక్షిణమున మహారణ్యములు. కిరాతదేశమే నేపాళమున నధికముగా పంటలు పండు దేశము. మహారణ్యములు కల దేశము. ఆ యరణ్యములలో మరియు పల్లపుప్రదేశములయందు సింహము, చిరుత, తోడేలు, సివంగి, నల్లయెలుగుబంట్లు, అడవికుక్కలు, చెప్పరానన్ని యడవి జంతువులు నివసించుచుండును. మహాసర్పము లుండును. చెప్పరానంత భయంకరముగా నుండును.

శాకయ్య యొకనాడా మహారణ్యములలో తిరుగుచుండెను. అతడు తన గృహమును, దేశమును వదలి నాలుగైదేండ్లయినది. అతడెచ్చటెచ్చటికి పోవునో, యెందుకు బోవునో యెవ్వరికి తెలియదు. కొన్నాళ్లు మగధదేశములో తిరిగెను. అచ్చటినుండి హిమాలయ ప్రాంతములయందలి బహుదేశములలో సంచరించెను. ఇప్పటికి కాశ్మీరముచేరెను. అతడు సన్యాసులతో కలిసి పలుదేశములలో సంచరించుచు మందులు మ్రాకులు సంపాదించుటకు సర్వదా యత్నము చేయుచుండెను. ఏదోయొక యోషధి కాశ్మీరమునందు దొరకు నన్నచో నచ్చటికి బోవును. బ్రహ్మదేశమునందు లభించు నన్నచో నచ్చటికి బోవును.

ఈ నేపాళమున కిరాతదేశభాగమున నరణ్యములో నొక జంతు వుండుననియు, దాని పేరిదవిచిత్రమని తెలియదనియు, దాని వదనము మార్జాలమువలె నుండి శరీరము సర్పమువలె నుండుననియు, సర్పమైనను దీర్ఘపుచ్ఛమైనదికాక హ్రస్వపుచ్ఛమైనది. మరియు సరీసృపము కాదు. దానికి నాల్గు చరణము లుండును. చరణములు పొట్టివి. ఆ జంతువు చాల భయంకరమైనది. అది భూదారమువలె నేల తొలిచి యా సారంగములలో నివసించు ననియు, దాని నివాసస్థానమునం

చొక పదార్థము దొరకుననియు, నాపదార్థము సేవించినవానికి జిరాయుష్యము కలుగుననియు నందందు సన్యాసుల మాట లాతడు విని యాపదార్థము సంపాదించుటకు బయలుదేరెను. ఆ పదార్థ మొక రొట్టెవంటిది. ఇట్టిపదార్థము భల్లూకముల గుహలలో నుండు నని యొక ప్రతీతి.

భల్లూకములు తేనెపట్టు పట్టుగానే కబళించి తేనెతో, నీగలతో, మైనముతో సర్వమును కసకస నమలి దాని నొక యుండగా జేసి నోటిలో నొక యుప్పచ్చిగా నదిమి దానిని తమ గుహలలో వదలి పెట్టును. అది యెండును. ఇట్టి రొట్టెలు భల్లూకములు మూడు నాలుగింటిని చేసికొని తమగుహలలో నుంచుకొనును. మహావర్షకాలములయందు, మహాగ్రీష్మకాలములయందు భోజన మలభ్యమైనప్పుడు భల్లూకములు వానిని భుజించును. భల్లూకులు గర్భవతులై ప్రసవించి తిండికి బయటకు పోవుటకు వీలులేనప్పుడు సర్వదా సంతానమును రక్షించుకొనుచు నుండవలసినపుడు వానికిది యాహారము. వేటకాండ్రు వానిని వేటాడుచు వాని గుహలలోనికి బోయి యీ రొట్టెలు దొరకనచో తెచ్చికొందురు. అవి సామాన్యముగ దొరకవు. అవి వాజీకరణములట. ఎప్పుడో సకృత్తుగా దొరకును. వానిని కిరాతులును, శబరులును ప్రేమమెయి భుజింతురు.

అట్టి రొట్టెలు ఈ మార్జాలముఖ సచరణ సర్పదేహములైన మృగముల గుహలలో నుండునని సన్యాసులలో నొక ప్రతీతి. ఈ మృగమును "తిప్పిలా" యందురు. "తప్పిల" యనగా నొకజాతి పాము. ఈ జంతువు పాము కాదు. పాము కాకపోలేదు. అది వేటాడునపుడు చరణములమీద నడచును. దూరదేశము పోవలసినపుడు కూర్మము వలె పాదములను కుదించికొని సర్పమువలె నెంతదూరమైన పోగలదట. దాని ముఖమున కాలకూటవిష ముండును. దాని నోటివెంట నగ్నిజ్వాలలే యథార్థముగ వచ్చునట. దానికి కనుబడినవాడు బ్రతుకడు. దాని చూపు మందకొడి. అందుచేత పిల్లి నడక నడచును. దానికి కొంత దవ్వున నుండి యనుసరించవచ్చును.

శాకయ్యపాదము లెవరును పరీక్షించలేదుగాని వానిపాదములు పైకి మనుష్యుల పాదములవలె నుండినను వాని యరికాళ్లలో

చర్మము నన్ననన్న బొత్తులు పెట్టినట్లుండును. అతని పాదముల యందు శంఖచక్రము లున్నవని సాముద్రికులు చెప్పిరి. అతని తండ్రికి తెలియును. ఆతడు నడచుచుండగా చప్పుడేకాదు. సాముద్రికులును, జ్యోతిష్కులును చెప్పుటయే కాక తండ్రి యీ పిల్లవానియందీ సాముద్రికలక్షణములు చూచికూడ వాని జాతకము గొప్పదియని తెలిసియే తాను బ్రతికినన్ని దినములు వానిని చదువుకొనుమని బాధ పెట్టలేదు. సంపాదింపుమని యడుగలేదు. మరి యెట్టి యొత్తిడిని చేయలేదు. అతడు భార్యతో పదునేనేండ్లు సంసారము చేసెను. ఇతని యీ లక్షణ మామెకు తెలియును. ఒకప్పు డామె యీ సంగతి కనిపెట్టి విసిగికొనుచు నన్నదికదా—"ఇంత యలికిడిలేకుండ నడువగలరుకదా! దొంగతనము చేయవచ్చునుకదా! పెండ్లామును పిల్లలను పోషించుకొనుటకు?" ఇది కోపముతోననిన మాట. శాకయ్య యనుకొనెను. అతడేమాటయు సామాన్యముగా బైటికనడు. మాటాడినచో, తప్పని సరికి మాటాడును. అతడనుకొనెను. "దొంగతన మొకవిధముగా నుండునా? ఈ మూఢమైన లోకము సామాన్య సంసారములలో సామాన్యగృహములలో నొక వస్తువు నెత్తికొనిపోవుట మాత్రమే దొంగతన మనుకొందురు. పెద్దపెద్ద యంగడులలో వస్త్రములు, రత్నములు, ధనము తెచ్చుటయే దొంగతన మనుకొందురు. దానిని దొంగతనమని రాజులు శిక్షింతురు. రాజులు, మంత్రులు, సేనాపతులు, గొప్ప రాజకీయవేత్తలు నందరును దొంగలే. అదికాక కవులలో దొంగలుందురు. వాఙ్మలలో దొంగలుందురు. ఒకని భావమొకడు దొంగిలించును ఇదియుగాక మతకర్తలలో దొంగలుందురు. ఒక మతమున్నది. దానిలో పది సిద్ధాంతము లున్నవి. రెండు సిద్ధాంతములు దొంగిలించి మరి రెండు జోడించి తానొకమతము నేర్పాటు చేయవచ్చును ఇది మాత్రము దొంగతనము కాదా? కాని జనమునకు తెలియదు. సామాన్యముగా వస్తువులను దొంగిలించుట మాత్రము దొంగతనమని నిరాయుధులు, సిబ్బంది లేనివారు, సామాన్యులునైనవారిని రాజులు శిక్షింతురు. ఒక మతకర్తను శిక్షింతురా? వాడు దుర్జనుడు. వాని యూహలు వానివికావు. వాని సిద్ధాంతములు వానివికావు. నేనైనచో నటువంటి దొంగనగుదును కాని యీ దేశవాళీ దొంగను కాను" అని

శాకయ్య భార్య తనతో నిట్లు రెండుమూడుసార్లనినప్పుడెల్ల భావించెను. ఒకవిధముగా చూచినచో శాకయ్యకు గురువు అతని భార్య. శాకయ్య జాతకము కాలజ్ఞులు చెప్పినట్లు, సాముద్రికులు చెప్పినట్లుభవిష్యత్తులో వృద్ధిపొందవలయునన్నచో నతని కామెమాట ఉపశ్రుతి. దీనికి కొన్ని దోహదములుకూడ కలవు. అది యన్యవిషయము. శాకయ్యకు మనస్సులో నెన్నియో యూహలు కలవు. అతడు తన యిల్లువదలు నాటికి వాని కొక సంగతి తెలిసెను. ఆరుగురు సంతానమునుకన్న తన భార్య తిండిలేక ముసలిదైపోయెను. ఆ దినములలో నించుమించుగా తిండి తనకును లేదు. తాను ముసలివాడు కాలేదు. కాలేదు సరికదా! తనకు నేండ్లు పైబడుచున్నట్లు తాననుకోలేదు. చూచినవారి కితడు ముప్పదియేండ్ల వాడనుకొనుటకు వీలులేకుండెను. ఈ రెండు లక్షణములను శాకయ్య తన యందున్న వానినిగుర్తించి బయలుదేరెను. ఇప్పుడు తాను పల్లివలె నడుపగలడన్న విషయము - నింతకు ముందు పలుచోట్ల నిరూపింపబడినదానిని పురస్కరించుకొని ఈతిప్పలానామకమృగమును కనుగొనివెన్నాడి, దాని నివాసము తెలిసికొని యా రొట్టెను సంపాదింపవలయునని బయలుదేరెను. తొట్టతొలుత దానియునికి తెలియవలెనన్నచో, అది యెచ్చట తిరుగునో తెలిసికొనవలయునన్నచో నా ప్రాంతమునందలి నేపాళదేశపు టాటవికుల భాష తాను కొద్దిగా నేర్చుకొనవలయును. అచ్చటి జనము భోటియాలు. అదియొక యాటవికజాతి వారిభాష భాషయేకాదు. ఆ భాషలో నెక్కువగానున్నచో వందశబ్దములుండును. శాకయ్య వారిలో తిరిగి,వారితో బ్రతికి,వారియాహారమునే భుజించుచు వారిభాషను రెండుమూడునెలలలో నేర్చికొనెను. వారి యాహారమనగా నిదియని చెప్పుటకు వీలులేదు. వారు కోతిమాంసమును తిందురు. నత్తలను, పీతలను తిందురు. సప్తకోసిలో దొరికెడి ఏ జల జంతువు నైన తిందురు. అందులో నొకవిశేషమున్నది. ఆ యాహారము నాగరికులైన మానవులకు మిక్కిలి యసహ్యించుకొనదగినది. కాని యా యాహారము తిను జంతువుల శరీరము పరమ లఘువుగా నుండును. వారికి నిద్రామాంద్యముండదు. వారి శరీరముల కలసటయుండదు. వారి యిష్టమువచ్చినప్పుడు వారు నిద్రపోవుదురు. వారు నీరుత్రాగుటకు వచ్చెడు లేడినో, కుందేలునో, మరియింకేజంతువునో యమ్ముతో కొట్టు

టకు పాదలను చాటుచేసికొని కూర్చుందురు. తెల్లవారలట్లే కూర్చుం దురు. కదలరు, మెదలరు. వారు శిలలనుకొని సర్పములు వానిని రాచికొని పోవుచుండును. ఈశక్తి వారి కియాహారమువలన లభించెనేమో తెలియదు. హింస్రమృగములైనను నడచుచున్న జంతువును వేసి కొనిపోవును. నిలుచున్న వాని నేమియు చేయవు. పెద్దపులి కనులలో నడపాపలుండు నందురు. అరడుగుల మనుష్యుడు దానికంటికి తాళ్ళ ప్రమాణమూర్తిగా కనిపించునట. అందుచేత నది భయపడి మీదికి రాదని యందురు. నీవు మొద్దువలె నట్లే నిలుచుందువను కొనుము. అది చూచిచూచి యిదింకేమో తాటి చెట్టు అనుకొని వెడలి పోవును. అట్లు నిలుచుండుటలో శాకయ్య మహాసామర్థ్యము సాధిం చెను. అతడు నడచుచునడచుచునే నుంతయులికిడి తగిలినను శిలాప్రతి మవలె నిలిచిపోవును. ఏజంతువు నేమియు చేయలేదు. అతని నే జంతువైన నేదైన చేయ వలయుననగా కదలుచు కదలుచు నాగి పోయిన లిప్తసహస్రాంశ కాలములో చేయవలయును. తిప్పిల కోన మాత దడవిలో తిరుగుచుండెను. ఆ భోటియాలు తిప్పిల పేరు విన్న వారే కాని దానిని చూచినవారు కారు. అది యచ్చట నుండును, ఇచ్చట నుండునని ప్రథమమాత్రము కలుగును. ఎచ్చటెచ్చట నుండునని శాకయ్యవినెనో యచ్చటచ్చటికి పోయి పదునేను దినములు ఇరువది దినములు తత్ప్రదేశములందు సంచరించుటయు పెద్దబొరియ కన్పిం చినచో దానికెదురుగా మొగముపెట్టి పండుకొని రెండు మూడునాళ్లట్లే యుండుటయు నతడు చేసెను. చివరకెవరైనను చూచి వాడే 'తిప్పిల' యనుకొనునట్లుగా తిరిగెను. నాలుగునెలలైదునెలలు గడచినతరువాత వానికి తిప్పిలయన్న మృగమే కన్పించలేదు. అడవిపిల్లులు కన్పించి నవి. అవి చెట్లకొమ్మలపై నుండి కిర్మీరవర్ణము కలిగిన నేత్రములతో వానివంక చూచుట కలిగెను. మరియొకడు గుండె బేజారై యూడని పాడవలయును. అతనికేమి భయము లేదు. అతనికున్న అమానుష శక్తులలో, అమానుష గుణములలో ప్రధానమైనది వాని నిశ్చయత్వము. పైనుండి క్రిందికి అతనిని కత్తితో చీల్చుచుండుము. అతనికి భయము లేదు. అతని మొగమునందలి యొక సన్నని నరమైనను కదలదు. బాధపడునో పడడో మనకు తెలియదు. కాని వాని శరీరమునుండి

తక్కిన మానవ శరీరములనుండి వలెనే రక్తము స్రవించుట, మాంస ఖండములు వెలికి వచ్చుట జరుగును. ఆ చెప్పిన బైరాగులు తిప్పిలా గుహాంతర్భాగమునందలి యా రొట్టె తినినవాడు కనీసము రెండువేల యేండ్లైనను బ్రతుకునని చెప్పిరి. ఆ రెండువేలయేండ్లు బ్రతుకవలయు నని శాకయ్య తలపు. దానికి పెద్ద కారణమున్నది. యోగులు యోగాభ్యాసముచేత చిరకాలము బ్రతుకుదురని యున్నది. లంబికాయోగముచేత యుగముల తరబడి బ్రతుకవచ్చునని యున్నది. కాని లంబికా యోగి బ్రదుకునుగాని మొద్దువలె కూర్చుండును. బ్రదుకవలయును, వ్యవహరించనువలెను; వట్టి మొద్దుగా కూర్చున్నచో ఫలమేమి? బ్రదికి ఏమి బ్రతుకకయేమి? అది బ్రతుకుట కానేకాదు. అందుచేత శాకయ్య 'తిప్పిలా' గుహాగతమైన రొట్టెకోసము బయలువేరెను. అసలు శాకయ్యయే యెన్ని సంవత్సరములు బ్రతుకునో యెవడును చెప్ప లేడు. ఈ తిప్పిలాన్వేషణ కాలమున కతనికి ముప్పదియేండ్లు. కాని యతనిని చూచిన వారందరు నతడిరువదియేండ్ల కుఱ్ఱవాడని భావింప జొచ్చిరి. అత డిరువదియేండ్లు వచ్చిన తరువాత పెరుగుట మానివేసె నేమో! ఆతడు మార్కండేయ మహర్షియొక్క యవతారమేమో! అతడు తాను నాటి లెక్క ప్రకారము కనీసము మూడువందలయేండ్లు బ్రతుకుదునని నిర్ణయించుకొనెను. ఏలయనగా నలుబదియేండ్లనాడు ఇరువదియేండ్లవాడుగా నుండెనుకదా! సామాన్యముగా నాకాలమున నూట ముప్పదియేండ్లు జనము బ్రతుకుచుండిరి కదా! సామాన్యులే నూట ముప్పదియేండ్లు బ్రతుకుచుండగా తాను నిస్సందేహముగా నూట యేబదియేండ్లు బ్రతుకును. నలుబదియేండ్లప్పు డిరువదియేండ్ల వాడుగా నుండెను. మూడువందలయేండ్లు వచ్చినవాడు నూటయేబది యేండ్లవాడుగా నుండును. ఇది యేమి లెక్కయనగా కాకిలెక్క. ఏమైననేమి? తిప్పిలా శృంగము కన్పించలేదు. అది కనిపించకపోయి నచో వాని నివాసము కన్పించునా? అయినను శాకయ్య మానలేదు. ఏబొరియ కన్పించినను సరే అది తిప్పిల నివసించెడి బొరియయేమో. త్రవ్వచూచుచునే యుండెను. చివరకు నిర్ణయించుకొనెను. బైరాగులు సన్యాసులు యోగులు తనవంటి తాత్కాలిక శిష్యులను ప్రతారించుట కట్టి మాటలు చెప్పుదురని. అందులో నిజమున్నది.

ఇది యిట్లుండగా శాకయ్యకు భోటియాలతో నివసించుచున్నప్పు డొక క్రొత్తపేరు వచ్చెను. వేటాడునప్పుడు శాకయ్య సింహమువలె మృగములమీదికి దూకుట జరుగుచుండెను. సులభముగా మృగములను వధించుచుండెను. అందుచేత శబరులందరు అతనికి సింహమని పేరు పెట్టిరి. ఇతడు మానవుడు కనుక సింహుడు అయ్యెను. తరువాత తరువాత క్షత్రియులు సింహమన్న శబ్దమును తమ నామములకు తగిలించుకొనుచు వచ్చిరి. సింహశబ్దము శ్రేష్ఠవాచకమై రాజసింహుడు అన్న శబ్దము పరిపాటియైనది. అసలు సింహశబ్దము నామమునకు చివర తగిలించుకొనుటకు భగవంతుడైన శ్రీమన్నారాయణుడు కారణము. అయన ప్రహ్లాదుని రక్షించుటకు, హిరణ్యకశిపుని వధించుటకు నరసింహుడయ్యెను. పురుషసింహుడయ్యెను. నరసింహు డనగా సగము నరుడు, సగము సింహము. సింహము సగముదాక లేదు. వట్టి తల మాత్రమే సింహము. నరసింహుడు వేరు. పురుషసింహుడు వేరు. కొంచెము పరాక్రమవంతుడైన పురుషుని పురుషసింహు డనవచ్చును. కాని నరసింహుడనగా భగవంతుడైన నారాయణుని యవతారములలో నొకటిమాత్రమే. ఆ యాటవికులలో కొందరు ఇతనిని శాకయ్య సింహుడని పిలువ నారంభించిరి. శాకయ్య తెలుగుమాట. వారి నోళ్ళు తిరుగక శాకయ్య శాక్యయయినది. అందుచేత నతడు శాక్యసింహుడైనాడు. తన పేరు హఠాత్తుగా శాక్యసింహుడగుట శాకయ్య కాశ్చర్యము కలిగెను. అతడు చాల సంతోషించెను. తన పేరిట్లు మారుట తాను నిస్సందేహముగా వేయియేండ్లు, అంతకు మించియో బ్రతుకుదునన్న యాశకు దోహదమైనది. తిప్పిల లభించలేదు. తన వారిని తాను పోవచ్చును. ఎక్కడికి పోవును? అన్నియు నిట్లుండగా శాకయ్యకొక మహాగుణమున్నది. అది కామప్రవృత్తి. తినుటకు తిండిలేని భార్యయుండగురు సంతానము కన్నచో వాడెంతటి కాముకుడో తెలిసికొన వచ్చును. ఇంత యసమర్థుడవు నీవు లేచిపోరాదాయని భార్యయనగా నతడు తన గ్రామమునుండి గృహమునుండి, లేచిపోవుటకు కారణము వా డా యూరిలో నివసించుటకు వీలులేకపోవుటయే. ఇతడు కొన్ని యిండ్లలో గురువు. మతప్రవక్త. పురుషులును స్త్రీలును అతనిని దైవముగా పూజించెడివారు. ఆ గృహముల సంఖ్య కొద్ది. ఆ యిండ్లలో

నున్న కొందరు స్త్రీలు వీనికలవాటుపడిరి. కొంద రెదురు తిరిగిరి. నీవు మతగురువ వనుకొంటిమి. యోగీశ్వరుడ వనుకొంటిమి. ఏకపత్నీవ్రతుడ వనుకొంటిమి. పరస్త్రీముఖము చూడవు కనుకనే కామతృప్తికొరకా బొమికెల ప్రోవునందు సంతానము కనుచుంటి వనుకొంటిమి యని. కథ పురుషులదాక వెళ్ళెను. ఆ పురుషులలో పెద్దలు గురువేమి చేసినను తప్పులేదనుకొనిరి. మానవసృష్టిలో కొందరిట్టివారుందురు. భార్యలకును గురువులకును సంబంధముండుట వారు మోక్షమునకు బోయెడి మెట్లలో నొకటియని. కొన్ని రాజ్యములలో కొందరు పెద్దపెద్ద యుద్యోగస్థులు తమ భార్యలను రాజులవద్దకు, పై యధికారులవద్దకు పంపింతురు. తమ సంతానము గొప్పవారగుదురని. ఆ కలిగెడి సంతానము తమ సంతానము కాదన్న జ్ఞానములేదు. కాని శాకయ్యా యీపని కొందరు పెద్దలంగీకరించినను యుపకు లంగీకరించలేదు. వారు శాకయ్యాను పట్టి శాకము చేయవలయునని భావించిరి. అందుచేత శాకయ్యా తన జన్మస్థలమునుండి పారిపోవక తప్పక వచ్చెను. అతని భార్యయు, నతని కుమారులును వానికి కోపమువచ్చి యభిమానము వేసి లేచిపోయినా డనుకొన్నారు. యథార్థమైన విషయము వారికి తెలియదు.

ఈ శాకయ్యా గడచిన యైదారేండ్లు పలువేషములు తిరిగెను కదా! ప్రధానముగా గిరివజపురమున రెండు మూడేండ్లుండెను. అది పెద్ద కథ. అచటినుండి పారిపోవలసి వచ్చెను. దానికి కారణము వాని కామప్రవృత్తి. ఈ కామప్రవృత్తిలేనిచో సాముద్రికులును కార్తాంతికులును చెప్పిన అతని యోగము చ్చటనే బయటపడెడిది. భోటియా లెంత సాధువులో యంత క్రూరులు. వారు నరమాంసభోక్తలు కారు. కాని శత్రువును జంపి కసికొద్ది వాని మాంసమును తినవలసి వచ్చినచో వెనుదీయరు. అందుచేత నా జాతిలోని స్త్రీని తాకుటకు శాకయ్యాకు గుండె నిలువలేదు. ఆ జాతికి కోపము వచ్చినచో వచ్చినట్లు తెలియదు. అదియొక బాధ. అత డొక స్త్రీ కొరకు ప్రయత్నించును. ఆమె మాటాడదు. అంగీకరించినదో, అంగీకరించలేదో తెలియదు. మరునాటి ప్రొద్దున వీని తలకును మొండెమునకును సంబంధము లేకుండుట తప్ప నడుమనంతయు శూన్యముగా

నుండును. ఈ యడవిలో నతడు తిన్నతిండి కామోద్రేకమును కలిగించునవి. ఆ యడవిలో వానరముల సంఖ్య యెక్కువ. వానరములకీ ప్రవృత్తి యెక్కువ. వానికీ ప్రవృత్తి యెక్కువయగుట కా కాంతారమధ్యమున కొన్ని ముండ్లపొదలున్నవి. ఆ పొదలు మినపగింజలంత కాయలు కాచును. కాయ యెంతయుండునో గింజ యంత యుండును. కాని పైని చర్మము దానినంటుకొని యెంత గుంజు ఉండునో యంతేగుంజు. వానరము లా కాయలను కసకస నములి మ్రింగును. ఇత డాకాయలను పొప్పరమాత్రమే తిని గింజలనుమియుచుండెను. అదియొక యాపదయైనది. ఆ పొప్పర కలిగించు కామోద్రేకమును గింజలు కొంత యణచును. దీని కామోద్రేకమునకు మితిలేకపోయెను. వట్టి కామోద్రేకమా? అట్లొకనెలనాళ్ళు బ్రతికినచో మరణము తప్ప నింకొకటిలేదు. అపుడు అతనికొక స్త్రీ కన్పించెను. ఆమె భోటియా జాతిస్త్రీకాదు. ఎక్కడనుండియో వచ్చెను. ఎందుకువచ్చెనో తెలియదు. శాకయ్యో సహజముగా సంపగొడనుటకు వీలులేదుగాని యంపవికారిమాత్రము కాదు. అజానుబాహువు. పెద్ద నేత్రములు మినమినలాడు శరీరము. తుమ్మెదరెక్కలవంటి మిసము, జుట్టు, గడ్డము. పెద్ద దుస్తులుకూడ లేవు. విశాలమైన వక్షస్థలము అతనినిచూచి యా స్త్రీ మోహ పడినదనుటలో దోషమేమియులేదు. వారు కలసిన సన్నివేశమే కొంత విలక్షణముగా నున్నది. ఆమె యితనిని చూడలేదు. ఇతడే యామెను చూచెను. ఆమె నేపాళదేశపు స్త్రీ. ఇతనికి పది భోటియా జాతిశబ్దములు వచ్చును కాని నేపాళ భాష రాదు.

ఆమె యొకరాయి నేల మీద పరుండి యొక పుట్టలోనికి జూచుచుండెను. ఇత డామెను దూరమునుండి చూచెను. ఆమె ధరించిన దుస్తులు తెలుపు నలుపు నెరుపు రంగుతో కలిసినవి. అది యొక్కటే వస్త్రము. కంఠమునుండి పాదములవరకు కప్పుకొనినట్లుండెను. ఇతడు దూరాననుండి చూడగా నతని కిన్నాళ్ళకు తిప్పల కనిపించె ననిపించెను. ఇది దవ్వునుండి చూచిన చూపు. పాము శరీరము, పొట్టి శరీరము. దీర్ఘపుచ్ఛకాదు. ఇతడు సమీపించినచో నది పారిపోవునో, మీదికి దూకునో తెలియదు. ఇంతకును దాని మొగమును చూడ

వలయును. అందుచేత దూరముగాపోయి చుట్టును తిరిగి యామె కభిముఖముగ కొంత దవ్వునుండి చూచెను. ఆమె నేపాళదేశపు స్త్రీ కదా! ఉదయించి కొంతమేర మింటిలో సాగిన సూర్యకిరణములు ఆమె మొగమున పడుచుండెను. అది నేపాళదేశము. పర్వతమయము. సూర్యోదయము చమత్కారముగా జరుగును. సూర్యుడు మింట కొంత దూరము పోయిన తర్వాతగాని కన్పించడు. సృష్టిలో నదియొక చిత్రము. సూర్యోదయ మెప్పుడగునో యప్పుడే యెఱ్ఱని కాంతులు కన్పించును. ఒక పర్వతపు టెత్తునకు సముద్రతీరమునకు ముప్పది నలుబది నాలుగువేల యడుగుల వారడి యుండును. అనగా నించు మించు యోజనము మేరలో నాల్గవవంతు కావచ్చును. సగము కావచ్చును. అర్ధయోజనము క్రిందనున్న జనులకు సూర్యోదయ మెఱ్ఱగా నుండును. అర్ధయోజనము పైనున్న జనులకును సూర్యోదయ మెఱ్ఱగానే యుండును. ఆ పర్వతాగ్ర నివాసులైన జనులకు సూర్యు డెఱ్ఱగా నున్నప్పుడు యోజనములో సగము భాగము క్రిందగానున్న జనులకు సూర్యుని యెఱ్ఱదనము విరిగి తెల్లగా నుండును. భూమండలము మీద సూర్యు డెప్పుడు కన్పించునో, యెక్కడ కన్పించునో అప్పుడే అక్కడ సూర్యోదయము. తత్కాలమున ప్రాగ్దిశయం దెఱ్ఱని యుపరాగము పుట్టక మానదు. ఆ యెఱ్ఱదనము సూర్యునిది కాదు. తత్రత్యులైన జనుల నేత్రదోషమేమో! ఆ యెఱ్ఱదనము మంచు దేశములలో మరికొంత విలక్షణముగా నుండును. ఆ యెఱ్ఱ కిరణము లామెపైబడి ముఖము పూర్ణాలము యొక్క వదనముగా నుండెను. ఇది నిస్సందేహముగా తిప్పిలు. ఇన్నాళ్లకు కన్పించినది. అది తాను నివసించు రంధ్రములోనికి చూచుచున్నది. ఎందుకు చూచుచున్నదో తెలియదు. లోన దాని పిల్లలున్నవేమో! ఇప్పు డేమి చేయవలెను? పోయి దానిని పట్టుకొనినచో నేమి లాభము? నవ్వడి చేసినచో నది పారిపోవునేమో! అది సాధు మృగమో, క్రూర మృగమో తెలియదు. ఆటవికులు చెప్పుట యంత సాధువుకాదు, అంత క్రూరమును గాదని చెప్పిరి. వారు చెప్పిరే కాని వారెవ్వరును చూడలేదు. ఆ మొగమును గూర్చి యదియొక పెద్ద కింవదంతి. ఇందులో నొక్క మార్గమున్నది. దానికి తెలియకుండ నవ్వడిచేయ

కుండ దానిసమీపమునకు బోయి అచ్చట నవ్వడిచేసినచో నది తొంద రలో తన బొరియలోనికి దూరిపోవును. అప్పుడు అది దాని బొరియ యని తెలియును. తరువాత నా బొరియను త్రవ్వి దానిలోపలనున్న రొట్టెను గ్రహించవచ్చును. ఇంత త్రవ్విన తరువాత రొట్టెలేనిచో నేమి చేయవలెను? అది యదృష్టము. ఇన్నాళ్లకు తిప్పల కన్పించినదికదా! ఇది భాగ్యవిశేషమే కదా! రొట్టెకూడ నిస్సందేహముగ కన్పించును. ఆ యోగ్యత తనకు లేనిచో తిప్పల యెందుకు కనులకు గన్పడును? ఇది పాము శరీరము కలది. దానికి కాళ్లున్నను ,నవసరమైనప్పుడు కాళ్లు లోనికి ముడుచుకొని పామువలె జఱ్ఱున జారిపోవును, కదా! అట్లే పామువలె లేచి తోకపైన నిలచునేమో! మనిషిపైబడి పీకునేమో! గ్రుడ్లు రక్కునేమో! అది విషజంతువో కాదో ఎవ్వరును చెప్పలేరు. బొరియలో దూరినను కాసలోబడి పరువెత్తినను నష్టములేదు కాని తోకపై లేచి కరచుటకు ప్రయత్నించినచో నేమి చేయవలయును? చేయి చాచినంత యెడమున నిలుచుండి హఠాత్తుగా సకస్మాత్తుగా నొక యొడుపుగా పరమవేగముగా పామును పడగ క్రింద సమర్చి పట్టు కొన్నట్లు దాని మెడగూడ పట్టుకొనవలయును. ఆ విద్య తనకు చేత నగును. భోటియాలు తనకు నేర్పిరి. మరియు వాని చేతిలో నొక గునపము కలదు. ఆ గునపముతో దానిమెడ గ్రొచ్చినను గ్రొచ్చ వచ్చును. కాని తాను తిప్పలను చంపుటకు రాలేదు. దానిని చంపినచో తనకేమి లాభము? అది తనమీదకు వచ్చినచో దానిని సంహరించు టయో, మెడవద్ద పట్టుకొని దాని యుద్వేగము తగ్గిన తరువాత నేలమీద వదలిపెట్టగా నది సహజముగా తన బొరియలోనికి దూరును. అట్టి దేదో జరుగవలయును. అందుచేత నతడంత చుట్టును పురల వెనుకకు తిరిగివచ్చి అది చూడకుండ దాని వద్దకు బోవుచుండెను. అతడు సూర్యున కెదురుగా బోవుచుండెను. అతని శరీరపు నీడ వానివెనుకనే యున్నది కాని ముందునకు పడుటలేదు. అదియొక యదృష్టము- ముందునకు పడినచో తన యలికిడి యా మృగమునకు కలిగెడిది. దగ్గరకు బోయినకొలది యది మృగముకాదేమో యన్న సందేహము కలుగ నారంభించెను. మృగముకాక ఏమగును? ఇది నిర్జనమైన యడవి. ఇచ్చటనున్న జనులు తాల్చెడు వసనము లిట్లుండవు. ఒక

యూహ వచ్చినచో నా యూహ యచ్చటి పరిస్థితుల ననుసరించి వచ్చును. పరిస్థితులకు సంబంధించని యూహరాదు. పట్టణములో మేడమిద, లేదా ఒక సందులో నర్ధరాత్రమున మండుచున్న నిప్పుల వలె కన్నులు కన్పించును. అది పిల్లి కావలెను, కుక్క కావలెను. సింహము కాదుగదా! పెద్ద పులి కాదుకదా! అడవిలో నట్టిది కన్పించి నచో నది పెద్ద పులి యేమో! సివంగి యేమో! అనిపించును. చివరకు సివంగి కాకపోవచ్చును. పులి కాకపోవచ్చును. కాని యూహ వచ్చెడి లక్షణమది. అందుకనియే మానవుడొక ప్రసంగమును విన్నప్పుడు ఒక గ్రంథమును చదువుచున్నప్పుడు కలిగెడు నర్థ విశేషము, లేదా ప్రతితి నందర్భమును బట్టి యుండును. హరియన్న శబ్దమునకు పదేపదే అర్థములు కలవు. విష్ణుమూర్తి, సింహము, కప్ప, పాము మొదలైనవి. కథా సందర్భమును బట్టి యా యర్థమగును. అట్లే అచట నా నిర్జన ప్రదేశమున నొడలు పలుపలు దాల్చెడి జనము తిరుగుట దుర్లభమైన స్థలము. అందట్టి వననములు తాల్చి యొక వ్యక్తి పండుకొనిన దనుకొనుటకు వీలులేదు. శాకయ్య తనకు తోచిన యా యూహను పరిహరించుచు నెమ్మదిగా నామెను నమీపించు చుండెను. అతని భ్రాంతి వృద్ధిబొందుటకో యన్నట్లు ఆమె చరణ ములు పచ్చి గడ్డిలో కప్పబడి యుండెను. తల పైకి కన్పించు చుండెను. శిరోజములు కానవచ్చెను. పిల్లికంత జుట్టుండదుకదా! ఈ పిల్లికుండునేమో! ఎదురుగా వెళ్ళి చూచెను కదా! దాని మొగము పిల్లి మొగము. ఆ పడుచున్న ఎట్టి ఎండలో తాను భ్రాంతి పడె నేమో! అది తప్పుల గావచ్చును. ఎరుగని జంతువుయొక్క లక్షణము లిట్లుండునని యనుకొనుట యెట్లు? దాని కే లక్షణము లుండునో యవియే లక్షణములుగా నూహించవలెను. అతడు క్రమక్రమముగా దగ్గరకు వచ్చినకొలది యవి మృగముకాదన్న విషయము నిర్ధారిత మగుచుండెను. కాని మనుష్యవ్యక్తియన్న యూహకుమాత్ర మాధార మేర్పడుట లేదు. అతడచ్చట నిలబడి యిట్లు యోజించెను. ఎరుగని ప్రళయమును దీని నమీపమునకు బోయి నెత్తిమిదికి తెచ్చుకొనుట యెట్లు? దూరమునుండియే యలికిడి చేసినచో నది వెనుతిరిగి చూచును. వ్యవహారము తేలిపోవునని యతడు దగ్గెను. ఆ

జంతువు హఠాత్తుగా లేచి నిలుచుండెను. ఇద్దరు నొకరినొకరు చూచు కొనిరి. ఆమె నిస్సంవేహముగా స్త్రీ!

ఇటువంటి స్త్రీ యిక్కడ నెట్లున్నది? ఈమె యాటవికురాలు కాదు. కొంత నాగరకురాలు. అమెతో తాను మాట్లాడెను. తా నాంధ్ర భాషలో మాటాడెను. ఆంధ్రభాష యనగా నిన్నివేలయేండ్ల క్రింద కృష్ణా గోదావరీ నదులమధ్య నప్పు డే భాష మాటాడెడివారో యా భాషయే యనుకొనవలయును. తనకు నేపాల భాష రాదు. ఆ నేపాల భాషకూడ బిన్న ప్రాంతములయందు భిన్నముగా నుండును. తన కే ప్రాంత భాషయు రానప్పుడు, అవిడ ఏ ప్రాంతమునకు చెందిననేమి? ఇత డేదో మాటాడును. ఆమె యేదో మాటాడును. ఒకరి మాట యొక రికి తెలియదు. కాని యామె స్త్రీ యని తెలిసినంతనే యితనిలో నొక మార్పు వచ్చెను. తిప్పలయు వేయి యేండ్లు బ్రతుకుటయు సర్వ మును పటుమాయమైనవి. ఇత డూరకే నవ్వును. ఆమెయు నవ్వు చుండెను. ఈ నవ్వు విద్వేషమును బదులు ప్రేమను కలిగించెనా? ప్రేమయని చెప్పుటకు వీలులేదు గాని, విద్వేషము మాత్రము లేదు. ఆమె యతని సౌందర్యమును చూచెను. అతనిని చూచినంతనే వెగటు కలుగుట లేదు. భయము కలుగుట లేదు. అతడు ఆటవికుడన్న యూహయు కలుగలేదు. ఆత డాటవికుడు కాక ఏమగును? వాని జుట్టు చీకిరిబీకిరిగా లేదా? లేదు.

పురుషులుగాని స్త్రీలుగాని తము యున్నచోట తమ శరీర సౌందర్యమునుగూర్చి శ్రద్ధతీసికొనెడి వారైనచో వారు మహారణ్యముల యందైనను నరె యెంతవరకు వీలైనచో నంతవరకు తీసికొనుచునే యుందురు. ఇంకొక గంటసేపటిలో నొక స్త్రీ చనిపోవునని యామెకు తెలియును. ఆమె వీలైనచో తల దువ్వుకొని బొట్టు పెట్టుకొని చీర ధరించి మృత్యువుకొర కెదురు చూచుచుండును. గడ్డము గంటసేపు పెరుగనీయనివాడు, వాడు యముడైన నేమి? తనను తన గంటసేపు పెరిగిన గడ్డముతో జూడనిచ్చునా? వాడు తప్పకుండ యముని యొక్క కొలువునకు బోవలయును. తన గడ్డము మానిపోయిన యముడు కోపించునేమో? తన యుద్యోగము పోవునేమో? "ప్రకృతి రపరిహార్యా"యందురు. అది యిదే. అందుచేత శాకయ్య తన

జుట్టును గడ్డమును మీసలును తైల సంస్కార విహీనముగా నా యడవిలోకూడ నుండనీయలేదు. అతని గోళ్లు దువ్వెనలవంటివి. అడవిలో నతడు శిరోజములకు యోగ్యమైన యొక వృక్షనిర్యాస మును గనిపెట్టెను. ప్రొద్దుననే లేచుటతో దానిని తలకు రాచికొనును. గోళ్లతో సంస్కరించికొనును. అతనికి శరీరమునందు వసనము లున్నచో నప్పుడైనను యోగివలె కన్పించును.

ఆమె యతని వదనమును జూచెను. అది యెంతటి ప్రసన్న మైన వదనము? అత డెంత నాగరీకుడు? ఈ మహారణ్య మధ్యమున నెందుకున్నాడు? అత డేదేశమువాడు? ఏ జాతివాడు? అతని భాష ఏమి? ఈ ప్రశ్న లుభయులకును సమానముగనే యుండెను. అతనిలోనున్న కామము ప్రతినిమేష పరివర్ధమాన మగుచుండెను. అతడు నెమ్మదిగా నామెవద్దకు బోయెను. వారి యిద్దరి కలయిక యు నచ్చమైన స్త్రీ పురుష సంయోగమని చెప్పవచ్చును. ఒక భాషా సామ్యములేదు. ఒకజాతి సామ్యములేదు. సామ్యమన్న శబ్దము వా రిరువురిమధ్యను బాహిరింపించ బడినది.

నాల్గు పాపములు సంపూర్ణముగ విరిగిపోయిన కలి పురుషుడు వారి సంయోగమున కెంత యానందించెనో తెలియదు. కలికాలము నధికరించియున్న దేవతలున్నచో వారద్దావాగ్భవులు కావలెను. వా రిరువురికిను నొక భేదమున్నది. ఆమె పదునేనేండ్ల బాలిక. పురుష సంయోగ మెరుగనిది. సంయోగ భావనావిరహిత కాదు. గొప్ప యూహశాలిని. పురుషసంపర్కభావనా నిత్యపులకిత శరీర. కొందరి కొందరి యూహలు చమత్కారముగానుండును. వారు స్త్రీ లైనచో గల్పిత పురుషులతో, పురుషులైనచో గల్పిత స్త్రీలతో సౌధాగ్ర భాగములయందు, పర్వత గుహాంతరాళముల యందు, నిశార్ధ భాగ ములయందు చిత్రవిచిత్రములైన సమాగమములు భావించుచు భోగించుచుందురు. ఆమె యట్టిదని చెప్పవలెను. ఏదో మనసులో నెప్పుడును చేయుచున్న విచిత్రములైన వికారములైన పురుష సమాగ మోహలలో నొకటి యామెకు యథార్థముగా నంఘటిల్లెను. ఆమె తన యొడలు దాను మరచిపోయెను. అతని నంస్పర్శచేత నామె మనస్సుకూడ పనిచేయుట మానివేసెను. ఏదో యాదృచ్ఛికముగా

నెప్పుడును సంభవించుటకు వీలులేని యూహ రూపు కట్టినట్లు ఆమె కొక మహా సుఖము తారసిల్లెను. ఆమెకే యాశ్చర్యముగా నుండెను. వాని కాశ్చర్యముగా నుండెను. ఇది వారిద్దరును మనుష్య జన్మ యెత్తినారు గనుక భగవంతు డా సుఖమును ప్రసాదించెనేమో! ఎంత కామోద్రేకము కలదియైనను పురుష వ్యాఘ్రము స్త్రీ వృకముతో సంగమించదు. పురుష సింహము ఆడ చిరుతపులితో సంగమించదు. ఇది యొక్క మనుష్య జాతియందే సిద్ధమైన విషయము. ఇది యిదే. ఇది సంఘటిల్లినది.

తరువాత నేమి? అడవి మృగములకును మనుష్య జాతికిని భేదమిందున్నది. ఆ యడవి మృగములట్లు సంఘటిల్లినచో తరువాత వాని దారి నవి లేచిపోవును. ఇక్కడ నట్లు జరుగదు! ఆమె నతడు వదలిపెట్టలేదు. అతని నామె వదలిపెట్టలేదు. తన సంగతి యతడామెకు చెప్పలేదు. ఆమె తన సంగతి యతనికి చెప్పలేదు. ఒకరి నొకరు వదలిపెట్టి యుండలేదు. అంతయు సైగలతో సాగుచుండెను. కొంతవేళ కామె తాను వెడలిపోదు నని సంజ్ఞ చేసెను. అతడంగీకరించ లేదు. మరల రేపు ప్రొద్దున వత్తునని సైగలచేత తెలియజేసెను.

అత డామెతో నాదినము దినమంతయు రాత్రిరాత్రియంతయు కడపినగాని యామెను వదలిపోనీయడు. ఆమెమాత్రమేమి చేయును? ఏది యెట్లైనను సరే అతని యొత్తిడినే భరించెను. భరించుట యనగా తానెచ్చటికో పోవలయును అచ్చట తనవారున్నారు. వారితో నర్ది చెప్పికొనవలెను. వా రొకవేళ తనను వెతకికొనుచు నడవిలోనికి వత్తురేమో, వచ్చినచో తాను కన్పించినచో నదియొక యాపద. అట్లు వచ్చెడివారు లేరని యామెకు ధైర్యముండితీరవలెను. తాను వెడలక పోయినచో నెవరో యాదుర్దాపడవచ్చును. ఆ యాదుర్దా పడెడివారు తనకోసము వెదకి కొనుచురారు. రాలేరు. మరియు వారికి తన సాహసము, తన స్వతంత్రత, తన బలము, తానెట్టి మృగమునైన సులభముగా వధించగలశక్తి తనకున్నదని వారు తెలిసియున్నవారై యుండుట యామెకు దెలిసియుండవలయును. మరియు ఆమెకు సుమారు పదునేనేండ్లుండును గనుక కఠినశరీర. పాముపలె పరుగెత్త గలదు. పులివలె దూకగలదు. భల్లూకమువలె మీదపడి పీకగలదు. శాకయ్య నేమియు చేయలేదు. అది యతని యదృష్టము.

# 6

మరునాడు ప్రొద్దున ప్రొద్దెక్కి యాపిల్ల శాకయ్యను వదలించికొని పోయెను. ఆ ప్రదేశము శాబరమండలము కాదు. అది కఠోర గహనము. దానికి ప్రాగ్దిశయందు శాబరమండలము కలదు. దక్షిణ దిశయందొక ప్రదేశమున్నది. అది చిట్టడవి. మొత్తముమీద పెద్ద వృక్షములు పదికంటె నెక్కువయుండవు. అవి పదిమైళ్ళ చదరము కల కొండప్రదేశము. పుట్టలెక్కువ. పొదలెక్కువ. ఎక్కువగా చిరుత పులులు నివసించు స్థలము. ఆ స్థలములో నెవరును నివసించరు. అచట సమృద్ధిగా వాగులులేవు. ఫలవృక్షములులేవు అది వ్యవసాయము నకు పనికిరాదు. వేటకు పనికిరాదు. ఎవరో యెందుకో ఆ స్థలమున పది గుడిసెలు వేసికొనియుండిరి. ఒకచోటనున్న గుడిసె పెద్దది. అందులో నొక ముసలిది నివసించుచుండెను. ఆ గుడిసె పరిశుభ్ర ముగా నుండెను. పట్టణ సమీపమునందున్న నివాసమువలె నుండెను. గాని అడవిలోని కుటీరమువలె లేదు. గిరా ఆ యింటికి పోయెను. లోపల నొక మంచములో నొక ముసలిది పండుకొనియుండెను. ఆమె యాటవిక స్త్రీవలె లేదు; నాగరికురాలివలె నుండెను. ఆ కుటీరము చాల విశాలమైనది. కుటీరములో నాహారపదార్థములు సమృద్ధిగా నున్నవి. కుటీరమును జూచినచో సంపన్నాంతముగ నున్నది. ఒక్క విశేషమేమన, నా గుడిసెలో నాయుధములు కలవు. బల్లెము, రెండు వంకరకత్తులు, మూడు బాకులు, కత్తులు ధరించుటకు చేతులకు తొడిగికొను నినుపకవచములు, ఒక యినుపశిరస్త్రాణము, బుజము లను రొమ్మును కత్తివాటులనుండి యద్దుకొనుటకు వలసిన యినుప కవచములు. ఆ కుటీరము పైకి కుటీరమువలె నున్నది. అనగా బైట

నుండి పోయినచో నడవియాకులు కప్పబడినట్లుండును. అంతయు నొక కాంతారతరుపత్ర సమాచ్ఛాదితమైన కుటీరము. ఆ యాకులు నేలమీదివరకు వ్రాలియుండును. లోపల గోడలున్నవి. అవి రాతి గోడలు. గోడలకెత్తులేదు. కాని యీ కుటీరమెత్తైన ప్రదేశమగుటచేత లోపల నివసించు భాగము లోతుగా చేయబడినది.అందుచేత లోనున్న యింటి యెత్తుతనము బయటకు కన్పించదు. ఇంటిలోనికి కొంత దిగి పోవలయును. మరల నింటిలో తగినంత వెలుతురున్నది. ఇంటి కప్పుమీదనున్న యాకులు జారిపోయినట్లొకచోట కన్పించును. అది జారిపోవుట కాదు. బుద్ధిపూర్వకముగా జేసి పనియే. పైకప్పులో నది పెద్దబొరియ. అందులోనుండి వెలుతురు వచ్చుటకేగాని మనుష్యుడు దిగుటకు వీలులేదు. ఆ భాగమునందు కత్తులమర్చబడియున్నవి. కత్తులేటవాలుగా నున్నవి. లోన వానపడుటకు వీలులేదు. ఆ పద్ధతిగా నమర్చబడినవి. ఆ ముసలిదానికి నూటపాతికయేండ్లకు తక్కువ యుండవు. మంచములో పడియున్నదనగా నామె మొగమునందలి ముడుతలు చూచిరేని, వృద్ధురాలు మంచములోనుండి లేవలేదని పించును. అంతలో త్రాచుపామువలె లేచి నిలుచుండెను. ఆమె మంచము క్రింద నెల్లప్పుడు నొక తీవ్రమైన కరవాలముండును. ఆమె కత్తి పుచ్చుకొని పండుకొనిన మంచమువద్దనుండి గుమ్మమువరకు లంఘించగలదు. ఆ కుటీరద్వారము దృఢమైనది. తేలికగా దానిని భేదించుటకు వీలులేదు. ఎప్పుడైన తెరచియున్నయెడల నొక చిరుత పులియో, మరియు నెవరైన చోరుడో ప్రవేశించినచో గడపవద్దనుండ గనే రెండు ఖండములగుదురు. ఆ ముసలిది యింత ప్రయత్నము చిరుతపులులకొరకు, నాటవికులకొరకు చేయలేదు. మరెవ్వరికొరకో చేసినది. ఆమెకు విరోధులు కలరు. వారికొరకు చేసినది.

గిలా ఆ కుటీరమునకు వెళ్లెను. తలుపు తెరవబడినంతనే ముసలిది తలయెత్తి చూచెను. కనిపించినది గిలా. ఆమె కొంచెము కోపమువచ్చిన దానివలె నొక్క నిముసము మాటాడలేదు. అంతలో నిట్లనెను: "నీవును నావలె చెడిపోదువు. రాత్రియంతయు నెచ్చట నున్నావు? ఓసి దౌర్భాగ్యురాల! నావలె చెడిపోకుము. నీకు నా పోలిక వచ్చినదని చెప్పుచున్నారు. రూపముచేతనే కాదు. గుణములచేత

కూడ నా పోలిక నంపాదించుకొనుచున్నావు. స్నానము చేసితివా? భోజన మాచరించితివా? రాత్రి యేమి తింటివి? ఎక్కడ నుంటివి?''

గిలా:— అడవిలో చాల దవ్వుపోయితిని. ఒకచోట ప్రొద్దుక్రుంకి నది. దారి తెలియలేదు. ఒక చెట్టుమీదనెక్కి నిద్రపోయితిని. అవ్వా! ఆ చెట్టుయొక్క రామణీయకత చెప్పుటకు వీలులేదు. పెద్ద యాకులు లేవు. ఎండపోలేదు. ఆకులు పరిమితముగా నున్నవి. ఏక దేశమునందున్నవి. అచటమాత్రము గుబురుగా నున్నవి. వానిలో పండుకొంటిని. అది సరేగాని తిప్పిల యన్నయొక మృగమును నీ వెరుగుదువా?

**ముసలిది:** .. తిప్పిల యన్నపేరే నేను వినలేదు 'తలిప్ప' అన్న యొక సర్పమున్నది. అది రెండు తలల శిఖండి యనుకొందును. ఔను! జ్ఞాపకము వచ్చుచున్నది. ఇట్టిపేరు నాకు నొకనాడు గంగాటు డన్నవాడు చెప్పెను. దాని శరీరము పామువలె నుండునని, కొండ చిలువవలె నుండునని, దాని మొగము బిడాలముఖమని, దానికి చరణములుకూడ నుండునని. ఇది వట్టి పుకారేకాని యట్టి జంతువు లేదు. గంగాటుడు దానికొరకు చాల ప్రయత్నించెనట. నేను వానిని పరిహసించుచుండెడు దానను. అతడింకెదోయెదో చెప్పెడువాడు. నేను మరచిపోతిని. కొందరు వృథా కొన్నియాశలు పెట్టుకొందురు. వారిని కొందరు మోసగింతురు. ఈ తిప్పిల అటువంటిది. దాని ప్రసక్తి యెందుకు వచ్చినది? ఎవడైన నాటవికుడు నిన్ను కలసికొని 'వానిని చూచితివా' అని యడిగెనా?

గిలా:— అట్లు నన్నడుగలేదు. అతడు నేనే తిప్పిల ననుకొ నెను. నిన్నటి ప్రొద్దుట నేనొక విచిత్రమైన జంతువును చూచితిని. వానిని పట్టుకొందమని వెన్నాడితిని. అది యొక చిన్న వల్మీకములో దూరెను. దానిరంధ్రము విశాలముగా నుండెను. నేను నేలపై పరుండి యా రంధ్రములోనికి చూచుచుంటిని. నన్ను దూరమునుండి యొక పురుషుడు చూచి నేను తిప్పిల ననుకొన్నాడట. నా మొగము బిడాల మొగముగునో కాదో చుట్టు తిరిగివచ్చి చూచెను. తొలియెండలు నా మొగముమీద పడుచున్నవి. దూరదృష్టికి అతనికి నా మొగము మార్జాల ముఖమువలె కన్పించినదట. అతడంతదూరము మరల

తిరిగివచ్చి వెనుకనుండి నన్ను పట్టుకొనవలెననుకొనెనో యేమో! నామీదికి లంఘించవలయు ననుకొన్నాడో యేమో! కాని యా తిప్పిల యను జంతువు స్వభావము నెరుగక వెనుకనుండి దగ్గినాడు. నేను తిప్పిలను కాను; గీలనైతిని.

మునలిది:—(నవ్వుచు) ఓసి దుర్జనురాలా! నీవెవరో యడవిలో తిరుగుచున్న పిల్లవు కావలెను. గీలా వెందుకైతివి? నీవు చెడిపోయితి వన్న నీ తండ్రి నన్ను బ్రతుకనిచ్చునా?

గీలా:—అవ్వా, అతడు మనదేశమువాడు కాడు. మనదేశము నందలి పురుషులందరు వామనులని చెప్పవలెను. అత డాజాను బాహుడు. నీ వంగీకరించినచో అతనిని దీసికొనివచ్చి నీకు చూపింతును. అతని వదన సౌందర్యమును, శిరోజ నీలిమమును, అతని దేహ నైగనిగ్యమును, అతని మందహాస పూర్ణిమా చంద్రికాచ్ఛటలను నీవు చూచినచో అతనిని నీవు నాకు దక్కనీయవని భయము.

మునలిది:—ఓసి! కుటిలురాలా! నేనింకెన్నాళ్లు బ్రతుకుదు ననుకొందువు? నాకిప్పుడు నూటయిరువదియైదేండ్లు. నా యాయుర్దాయము నాకు తెలియును. నేనింక రెండేండ్లకన్న బ్రతుకను. నేనినాడు త్రాచువలె పరుగెత్తగలననగా, చిరుతవలె దూకగలననగా, కత్తి వ్రేటుతో ఖండించగలననగా జీవితాంతము నవి యభ్యస్తములైన విషయములుగనుక చేయుగలను. ఓసీ! యారోగ్యమునకు నాయుర్దాయమునకు నంబంధములేదు. తాటియెత్తున పెరిగినచెట్టు తీవ్రవర్షమునకు పడిపోవచ్చును. దావాగ్నికి తగులబడి పోవచ్చును. కొండ నేలల క్రింద హఠాత్తుగా బీటిచ్చి చెట్టు క్రుంగిపోవచ్చును. ఓసీ యాలోచన లేనిదానా! నీవు వానితో సంపర్కమేల పెట్టుకొంటివి? గంగాటునివలన నేను చెడిపోతిని. నీవుకూడ నట్లే చెడిపోయెదవా? నిన్ను మీ తండ్రి నావద్దకు పంపించినప్పుడు కట్టుదిట్టము చేసి పంపించెను. నావద్ద పది వాగ్దానములు తీసికొని పంపెను. ఇంతకును నాతల్లి యాస్తి మన నీవారజాతి నివసించు ప్రాంతములో నున్నది. ఆయాస్తి నాకు వచ్చినది. నే నెవరికిచ్చివేయుదునో యని నీ తండ్రి భయము. రెండేండ్లక్రింద నిన్ను నాకడకు పంపినాడు. నా యాయు స్సింక రెండేండ్లే యున్నదని నీ తండ్రికి తెలియును. అతడు జ్యోతిష్కులను

కనుగొనినాడు. ఈ నాలుగేండ్లు నిన్ను నావద్దనుంచినచో నాయాస్తిని నీకు వశము చేయుదునని యతని యూహ. అత డొక పిచ్చివాడు. నాయాస్తిని నీకుగాక మరి యెవరికిత్తును? నీ తల్లి నాయప్పగారి కుమార్తె. నాకింకొక బంధువులులేరు. నాయాస్తియందలి మమకారముచేత నీతల్లియు,దండ్రియురెండుమూడేళ్ల కొకసారివచ్చి చూచి పోదురు. పుట్టినప్పటినుంచి నిన్ను నావద్దకు తీసికొని వచ్చుచుంటిని. వచ్చినప్పుడెల్ల నీయందుగల నా పోలికలను పునఃపునరుద్ఘాటనము చేయుచుందురు. అవి వారు చెప్పకుండనే కన్పించుచున్నవి.

ఓసి! నా యాస్తి నీకిచ్చినచో నీవు మనదేశములో నుండినచో నీ వనుభవింపగలవు. నీవుకూడ నావలెనే గంగాటుని వంటివానిని పట్టుకొనినచో నా యాస్తికి తొల్లింటి దుర్దశపోదు. గంగాటుడు నాపక్షమున పోవుటయు, నా బంధువులతో తగాదా పెట్టుకొనుటయు, పంటను సరిగా తెచ్చికొనలేకపోవుటయు, వారితో కత్తి యుద్ధములు, వీనిని రాజబంధువులు బంధించుట, కొన్నాళ్లకు వదలుట, ఆ నా బంధువులు బాధలు పడలేక నాపంట నాకిచ్చుట-నా బ్రతుకంతయు నిదియొక రగడమైనది. గంగాటుడు చనిపోయిన తర్వాత నా యాస్తి నీ తండ్రి చేతిలోనికి వచ్చినతరువాతకదా! నా పంట నాకు వచ్చుచున్నది, నేను సుఖముగా బ్రతుకుచున్నాను. "ఓ యత్తా! యిచ్చట నెందుకమ్మా! మన చోటికి పోవమురా! నిన్ను పువ్వులలో పెట్టి పూజ చేసెదను. నేను పూజించుట యెందుకు? నీకున్న యాస్తియే నీకు చాలును. ఈ యడవియెందులకు? ఈమృగములేమి? ఈ నిత్య శత్రుభయమేమి?" అని యెంతయో చెప్పెను. కాని నేను ఈ బ్రతుకున కలవాటు పడిపోతిని. ఇది గంగాటుని కుటీరము. దీనిని దుర్గమువలె భద్రపరచితిని. అతడు చనిపోయెను. నేను నీవారదేశమునకు వచ్చితిననగా నేను అతనిని మరచిపోవుదునన్న భయమున్నది. నేను అతనిని మరచిపోయి అతనియందు ద్రోహమేల చేయవలెను? అతడు నన్ను పెండ్లియాడలేదు. మే మిరువుర మడవిలో మృగములు కలసికొన్నట్లు కలసికొన్నాము. కాని కపోతములవలె, నొకరి నొకరము పరిత్యజించలేదు, అతడు నాకొరకు చనిపోయినాడు. నేను చేసిన పారపాటేమనగా నతనిని పెంపుడు పక్షివలె చూచినాను. అత డాటవికుడైనను

నేను అతనిని చిన్నతనములోనే చూచితిని. నీ కీ కథ పూర్వ మెప్పు డును చెప్పలేదు. అప్పటికి అతనికి పదునారేండ్లు మాత్రమే. నాకు ముప్పదియేండ్లు. అతనిని నేను ప్రేమించితిని. అతడు తనంత తాను కాంతారపు బ్రతుకు బ్రతికినచో నమస్తాటవికులవలె గడుసు తేలెడి వాడు. కత్తివిసరుట, మృగముల కొరకు పొంచియుండుట, తెల్లవారులు మేల్కొనియుండుట, పామువలె జారుట మొదలైన సర్వలక్షణముల యందు రాటుతేలెడువాడు. నేను అతనిని రక్షించుకొనగలను గదాయని అతనిని చెడగొట్టినాను. అతని నిల్లుకదల నీయలేదు. అతడొక్కడు నడవిలోనికి బోయినచో నాకు భయము. అతడు నా కనుచూపు మేర దాటిపోరాదు. అతడు నను నాకు భర్తగా నుండుట తప్ప మరియొక వ్యవహారముపొంత పోలేదు. పులి వానిమీద కురుక వచ్చినచో, దానిని చంపినది నేను అతని పొంత పాముకదలాడినచో దాని పడగను చమరి నది నేను. గాలికూగి చెట్టుకొమ్మ అతనిమీద పడబోవుచున్నచో మే నొడ్డినది నేను. అతనిని నా పొలముమీది పంటను తీసికొని వచ్చుటకు నీవారదేశమునకు బంపితిననగా నచట నీయడవులలోని యెగ్గులు లేవుకదా యని పంపితిని. అప్పటి యెగ్గు లిప్పటి నున్నవి. నేను చిన నాటినుండి యడవిలో నుండుటచేత నాకడవిలోని కీడులే తెలియును గాని జనము నివసించు చోటి గోడులు నాకుతెలియవు. గంగాటు డెంత యాటవికజీవనమునందు సమర్థుడు కాక పోయినను వానిలో నాటవికుల లక్షణములు లేకపోలేదు. అతడు చివరికేమైనాడు? ఇటు నడవులకు పనికి రాకపోయెను; అటు జనపదములకు పనికి రాక పోయెను. అతనికి నా చుట్టాలు నా పంట నిచ్చుటకుగూడ నంగీక రించలేదు అవి కలహములు. అతడు నా ధైర్యమును చూచికొని వారలతో వివాదపడుట. వా రితనిని పట్టియిచ్చుట. నేను జనపదములకు బోయి వాని పక్షమున వాదించుట. నా బంధువులు నేనన్నచో జడిసి చివరకు తప్పనిసరియై నా పంట నాకు చెల్లగట్టుట. నా యక్కగారి కూతును మీ నాయన చేసికొనినాడు. అప్పటినుండి కదా నేను సుఖపడుచున్నాను! నీవారజాతిలో నెక్కువమంది వృత్తులు చేసికొని బ్రతికెడివారు! కత్తులు కటార్లుపట్టుకొని జీవించెడి వారుకారు. మీ నాయన యట్టివాడు కాదు. అతని పూర్వులు కాశ్మీర

దేశాధిపతులసేనలో పనిజేసినవారు. అతడు సాము గరిడీలు నేర్చిన వాడు. తన పెద్దముత్తగారొకర్తె యిట్టిదున్నదని తెలిసి యతడు నన్ను చూడవలెనని యుబలాటపడినాడు. మీయమ్మ పెండ్లినాటినుండి నా నడుమ, నీ తండ్రి నడుమ నొక సౌహార్దమేర్పడినది. అతడు నన్ను గౌరవించ నారంభించెను అతనికి కొంత పొలమున్నది. నీ తల్లికి కొంత పొలమున్నది. నా పొల మతని కప్పగించితిని. నా పంటలో సగమతనినే తీసికొమ్మనుచుంటిని. ఆ నాటితో నా బంధువుల బాధ నాకు వదలినది. నీ తండ్రి కటారికాడు. ఇటు వ్యవసాయము చేయును. వలసినచో రాజసేనలో పడి యుద్ధములు చేయును. అందుచేత నా యందు గౌరవము కలవాడయ్యెను. ఇంకొకర్తెయైనచో నన్ను తేలికగా పరిహరించెడివాడు. నాకు నా తల్లినుండి సంక్రమించిన యాస్తి నేను కులమునుండి బాహిరింపబడితినని నా బంధువులు గ్రహింపవలచిరి. నిజానికి నేను చెడిపోయినదానను. కులమునుండి బహిష్కరింపబడినదానను. అట్టివారికి తమ యాస్తులమీద నధికారముండదు కాని నా కొక యధికారి యుండెను. అతడొక శబర స్త్రీని పెండ్లియాడెను. తక్కువ కులపు స్త్రీని ఎక్కువ కులమువాడు పెండ్లియాడినచో స్మృతులు బాధించవు. వారి మర్యాదలు పోవు. తక్కువకులపు పురుషుడు ఎక్కువ కులమునందలి స్త్రీని పెండ్లియాడి నచో నధికారము పోవును. ఆస్తులు దక్కవు. ఇందెంత న్యాయమున్న దనుకొందును. పురుషులకు ప్రాధాన్య ముండతీరవలెను. స్త్రీలును, పురుషులును సమానమైన స్థితియందే యున్నారనుటలో నేను స్వార్థ పరురాలను కానిచో తెరవియే చెప్పవలెను. పురుషుని యొక్క యాధిక్య మంగీకరింపబడి తీరవలెను. ఓసి! గీసి! కానిచో నేను గంగాటుని వెంటబడి యడవులకు వచ్చుటయేమి? స్త్రీలు పోయి భర్తతో నివసించుచుండిరి కాని భర్తలు వచ్చి స్త్రీలతో నివసించుట లేదు. ఇదియంతయు పురుషులు చేసిన ధార్ష్ట్యమని నేనును నా యాస్తిని నిలబెట్టుకొనువేళ నా వంట నాకు దక్కవలయునన్న పట్టుదలకల యప్పుడు వాదించితిని కాని యది యథార్థము గాదు.

నీకిదియంతయు నెందుకు చెప్పుచుంటిననగా నా చెప్పిన సంగతులలో కొన్ని నీకు తెలియును. నీవు అతనికెవనికో పట్టి యువతివి కాకుండ

గీలా నైతెనని చెప్పుచుంటివి. ఈ సంగతిని నేను మన్నించఁజాలను. స్త్రీకి ఒక సందర్భమును బట్టి, యొక సహజత్వమును బట్టి యొక పురుషునకు వశయగుట సంభవింపవచ్చును. నన్నడిగినచో నది దైవము చేసెనందును. నీ వెకవేళ నా పురుషునకు నిష్కర్షించు కొన్నచో, కాక అతడే నిన్ను బలవంతముగ తన దానినిగా చేసికొన్నచో నట్లు సంభవించుట కెన్ని కారణములున్నవి? నీవు నా చెల్లెలి మనుమ రాలివగుట, నా బతుకు కిట్టి దగుట, నాకు ఆస్తి కొంతయుండుట, నీ తండ్రి స్వభావమిట్టిదగుట, నీ తల్లిగూడ దీని కంగీకరించుట, నీయందు నాకు ప్రేమ కలుగుట, నా యాస్తి నీకు కావలయు నని నీ తండ్రి కోరుట, నాలుగేండ్లు నా వద్ద నుంచుట, నేను నిన్న డవులందు తిరుగనిచ్చుట, అడవులందు నీవు తిరుగుటకు, నీవు నిర్భయముగా నుండుటకు నేను నీకు యుద్ధ విద్యయంతయు నేర్పుట, నిన్నెవరును నీ యిష్టము లేకుండ ప్రతారించుటకుగాని వశ పరచుకొనుటకుగాని సాధ్యము కాకపోవుట-యిన్ని కారణ పరంపరల చేత నిట్లు జరిగినదనుకొందము. ఈ కారణములన్నియు వాని యంతట నవి జరిగినవి. అట్లేయున్నవి ఈ కారణములను నీవు సంఘటించలేదు; నేను సంఘటిల్లజేయలేదు. దీని పేరు దైవీ యము. దీనినే కర్మయందురు. కాని నే నొకటి చెప్పెదను. అత డెవడో నాకు తెలియదు. ఇది నిజమేనా? జరిగినదా? జరిగినచో అతనిని తీసికొనివచ్చి నాకు చూపింపుము నిన్ను జూచినంతనే నాకు తెలిసినది. ఓసీ! స్త్రీయొక్క పట్టి శారీరకమైన బడలికవేరు; పురుష సంపర్కముచేత కలిగిన బడలికవేఱు. దీనిని విడివిడిగా చూచుట కొక విలక్షణమైన యనుభవదృష్టి కావలయును. నాకది యున్నది. ఒక యనుభవదృష్టి కలుగు ననగా ప్రాణములతో బ్రతుక వలయును. తీవ్రమైన యాలోచనలు, గాఢమైన పరిశీలనయు, విషయ ములయందు చొచ్చుకూడగల శక్తికి పదును పెట్టుకొనుటయు కావల యును. ఎక్కువమంది జనులు పట్టి పశువుల బ్రతుకులు బ్రతుకు దురు. విచారణవేయగా హృదయములతో బ్రతుకరు. వారి జీవిత ములు వ్యర్థ జీవితములు. ఒక సుఖమునుగాని దుఃఖమునుగాని లోతుగా ననుభవించ లేరు. లోతుగా లేనప్పుడు బ్రతికి యేమి? బ్రతు

కథయేమి? అందుచేత చెప్పుచున్నాను. నీ మొగమును జూచినంతనే నేను గ్రహించితిని. నీ పీపని మన జాతిలోనున్నప్పుడు చేసితి వను కొనుము. అదియొక రహస్యమైన సంఘటనము. ఎవరును నీ మొగము జూచి గ్రహించలేరు. అచ్చటి జనుల కా లోతుపాతులు తెలియవు. నీ తండ్రి వివేకి; అతడు గ్రహింప గలుగునని నే ననుకొందును. కాని నీ విట్లవని నే యనామకుని, నాటవికుని, నవిదితకుల గోత్రుని పొంది నచో నతడు నిన్ను మన్నించెడివాడు కాడు. నేను మన్నించుచుంటి ననగా నాయందు రెండు దోషములు సన్నిహితములై యున్నవి. ఒకటి నీయందు నా పోలిక సంపూర్ణముగా నున్నదన్న యొక తృప్తి. ఈ తృప్తి కొంత యహంకారము, కొంత యజ్ఞానము. రెండవది - నీవు నిజముగా నొక యెవడో పురుషునితో సంబంధము కలిగించుకొనినచో దాని వలన నాకు కలిగెడి యాపత్తిలేదు. వంచనలేదు. సంఘము నంపలి యనుర్యాదలేదు. ఇవి యన్నియు నీ తల్లి దండ్రులకుండును. నీవు వానిని పాటించవలెను కూతుండ్రు కొడుకులు తమ కుటుంబ ములయొక్క, తమ తల్లి దండ్రులయొక్క మర్యాదలు నిష్టములు పాటించనిచో కూతురై యెందుకు పుట్టవలెను? కొడుకై యెందుకు సంభవించవలెను? అది యంతయు నిష్ప్రయోజనములకు? నీవు నావద్ద నుండుటచేత చెడిపోయితి వనవలయును. వట్టి యింద్రియ వశమున బ్రతుకుట చెట్ట బతుకు. సంఘములేదు. మర్యాదలేదు. తల్లియు దండ్రియు మొదలైన వారి ప్రేమలేదు. ఇదియంతయు నైహికము. ఆముష్మిక మెట్టిదో మనకు తెలియదు. ఇంత కథను తీసికొనిపోయి యొక్క పురుషునితోడి శరీర తృప్తితో తులదూచెదవా? అంతకంటె దోషముండునా? వ్యామోహమనగా దీనికంటె నింకొకటుండదు. బోలెడంత పాలమున్నవి. అంతయు ననుభవింపవచ్చును. అది యంతయు నాకక్కరలేదని యొక పదిగజాల మేర తిష్ఠవేసి కూర్చుం డెడువాడు కృషీవలుడా? సంసారమును పోషించవలయునన్న బాధ్యత తెలిసినవాడా? వాడొక సన్యాసి. తన పొట్ట తాను చూచుకొనెడి వాడు. ఇదియొక సన్యాసము. యోగి తన యాత్మయు తన మనస్సును పరిపక్వమై సర్వజగమ్ము మిథ్యయని గ్రహించి తనలో తాను గూడు కట్టుకొని యా కట్టుకొనిన గూడునందు నాత్మజ్యోతి యున్నది.

ఇంద్రియ జయమున్నది. సర్వజ్ఞత్వమున్నది. ఓసి! యవివేకురాలా! కులమును సంఘమును జాతిని మతమును పరిత్యజించి యన్నింటి నుండి బహిష్కరింపబడిన యొకనితో సంసారము చేయుచున్నచో నా గూటిలో నేమున్నది? అజ్ఞానమున్నది. కామాంధకారమున్నది. అప్రతిష్ఠ యున్నది. పట్టి కామాంధకారమును దీసికొనిపోయి దానికి పట్టాభిషేకము జేసెదవా? ఈ కామము వయస్సంబంధి. వయస్సు శాశ్వతము కాదు. నీకిపుడు పదునేను సంవత్సరములు. నీకేబది యేండ్లు వచ్చువరకు-కావా మరియొక యైదేండ్లు వేసికొనుము. తరువాత నీ కామము లేదు. పురుషులకు వందయేండ్లవర కుండవచ్చు. స్త్రీకి ఏబదియైదేండ్లు దాటుసప్పటికి కామముండదు. మరియు నల్పాయుష్కులు నల్పశరీర దార్ఢ్యము కలవారు నాయుః ప్రమాణ మరువదియేండ్లు దాటనివారు వారి యౌవనములు వారి కామములు మనలో సగముండవు. వారి కామతృప్తి పాతకయేండ్లున్నను మెచ్చుకో దగినవే! ఇట్టి యీ కామతృప్తి దానికవే తక్కిన యైహికాముష్మికములు లేవు. ఇట్టి యల్పీయమైన దానికొఱకెవరైన తలకు మాసిన నావంటి వారు నన్ను బోలిన నీవంటివారు తప్పు చెడిపోరు. ఆ పురుషుని తెచ్చి నాకు చూపింపుము. ఒక పురుషు డొక స్త్రీనిగాని, యొక స్త్రీ యొక పురుషునిగాని చూచి మేలుపడి నేనితనిని, ఈమెను ప్రేమించుచున్నా నందును. ఆ ప్రేమయొక్క స్వరూపమేమి? వారి నవ్వు, వారి యొ ఘప్ప, వారి కామపు చూపు, వారి ముఖలక్షణము, వారి శరీరసౌష్ఠవము తాత్కాలికముగా వీరి నాకర్షించినదని యర్థము. అంతకు మించి యేమియును లేవు. ఈ యల్పిష్ఠమైన కామభావమునకు ప్రేమ యన్నది పెద్ద పేరు. అట్లు సమకూడిన సంపర్కములో నొకప్పుడు నెలలు చా..., లేనిచో కొలది సంవత్సరములు పట్టును. వారివారి ప్రవృత్తులు తెలియును. వారి దుర్గుణములు తెలియును వారి యహంకారములు తెలియును. క్రమక్రమముగా విరక్తి యేర్పడును. ఆ విరక్తితోడనే కొందరు జీవితాంతము బ్రతుకుదురు. మరికొందరి విరక్తి ద్వేషముగా పరిణమించును. వారు, వీరు విడిపోదురు. విడిపోనిచో లోనలోన బ్రతికినన్నాళ్లు కుళ్లిపోదురు. ఇట్టిది కులములో జరిగెడి పెండ్లిలోమాత్ర ముండరాదా? అన్నచో నుండవచ్చును

అక్కడ నాముష్మికము చెడిపోలేదు, సంఘము చెడిపోలేదు. ఒక్క కామభావమే చెడిపోయినది. ఇక్కడ నే కామమును ప్రధానముగా పెట్టికొని వాని నన్నిటిని తొట్టతొలుతనే చెడగొట్టుకొంటివో యది కూడ చెడిపోయినది. ఇంతకును నాయం దొక దోషమున్నది. నీవు యౌవన ప్రథమ సోపానగత దీపకలికవు. తల్లిదండ్రుల యదుపులో నుండ వలసిన దానవు. వారియదుపులో పెరుగవలసిన దానవు. అయ్యో యీ లోకమునందు తల్లిదండ్రులు తమ కూతుండ్రు సంఘగత మర్యాదా స్వరూప లనుకొందురు. యౌవన సహజమైన వ్యామోహమును పొందెడి వయస్సులో తమబిడ్డ లున్నారని యెరుగలేక ప్రవర్తింతురు. మీరు చెడిపోదురు. నేను నీతో చెప్పవలసినది, నీ మనస్సును భద్ర పరుపవలసినది ఓసి పిల్లా! జాగ్రత్త సుమి! ఎవడో ఎప్పుడో హఠాత్తుగా కలసికొని నీ యౌవనమును దొంగిలించును. వ్యామోహపడి తత్కాలా వేశము పొంది దానికి లోబడకు సుమా! యని చెప్పియుండవలసినది. ఓసి! లోకము అహంకారము మీద నాధారపడి యున్నది. ధనాహంకా రము, విద్యాహంకారము, శౌర్యాహంకారము, గొప్ప కులమునందు పుట్టితి మన్న యహంకారము. తన కుల మర్యాద ననుసరించి తన మర్యాదానుకూలమైన యొక యహంకారమును కలిగియుండుట సంఘ మర్యాదకు శ్రేయమైనది. వ్యామోహ మెట్టిదనగా నీ యహం కారములను నశింపజేయును. కులీనతాహంకారములేని వ్యక్తులు సంఘమునకు చేటు. నేను చెడిపోతిని. నీవును చెడిపోతివి. అత డెవడు? అతడు స్వదేశీయుడు కాదనుచున్నావు. అంతకంటె నాటికు డైన మేలే. అతని బాషయేమి? నీవు వానితో నెట్లు మాటాడితివి! అత నికి మనభాష తెలియునా?''

ఆ ముసలి దీరీతిగా నీతి, సంఘము, మర్యాద, కామము, వ్యామోహము, నైహికాముష్మికములు మొదలైన వానినిగూర్చి గీలాతో వందప్రశ్నలతో కలిపి యుపన్యాసము చేయగా గీలా నిలువున నీరై పోయెను. గీలా తెలివిగల పిల్ల. తెలివిలేనివారైనచో నింత యుపన్యా సమును తుడిచివేయుదురు. నా హృదయములో మేల్కొనిన మహా ప్రేమ యీ వృద్ధురాలి కేమి తెలియుననుకొందురు. అది యజ్ఞానము నకు పరమావధి. గీలా యట్టిదికాదు. ఆమె చదివినది కొద్దియైనను

వివేకియైన తండ్రి పెంపకములో మర్యాదా సాంద్రతకల ఇంటిలో పెరుగుటచేత విషయములు చక్కగా గ్రహింపగల పిల్ల. అందులో కొంత యౌవనోద్రేక లక్షణము, కొంత స్వాతంత్ర్యము, కొంత యహంకారమును కలిగినను సహజముగా నాలోచన చేయగలిగిన లక్షణము గిలా ప్రకృతిలో నుండుటచేత నామె తన యవ్వ చేసిన యుపన్యాసమువలన గంపించిపోయినది. అయ్యో! తానుకూడ నింత తెలివి తక్కువలో పడెనేమి? గిలా యేతత్పూర్వము తాను వివేకవంతురాలననియు, నప్రధృష్యురాలననియు, తన్నెవ్వరు ప్రతారించలేదనియు ననుకొనుచుండెను. అట్టి తాను అతనిచే లోబడి పోయెనేమో! అతడెటువంటివాడు? అతని పేరేమి? యూరేమి? అతనిదేదేశము? అతని వయస్సెంత? అతడెచ్చటి నుండివచ్చెను? ఈ తిప్పిలా యన్న యొక మృగముకొరకు అత డన్వేషించుచుండెనా? తిప్పిలా యన్న పేరుగల యొక సర్పమున్నదా? తిప్పిల యన్నది లేనేలేదా? అతడట్టివానికై తిరుగుచున్నచో అతనినెవ్వరైన గికురించిరా? అతడు తనను గికురించుట కిది కల్పించి చెప్పెనా? అలోచించెను.

చివరకవ్వతో నిట్లనెను: "అవ్వా! నీవనిన మాటలను బట్టి నేను మోసపోయితి ననిపించుచున్నది అతడెవ్వడో నేనెరుగను. అకాలమునందు నన్నతడు వంచించెను. దోసమతనిమీన నారోపించుట యెందులకు? అతడు నన్ను వంచించుటకు నా యందు నేనే తత్కాలమునందొక యానుకూల్యమునో సాత్రత్వమునో వేళావశమువేత నొక యంధకారమునో పూనియున్నానని చెప్పవలయును అతనికి మన భాష రాదు. నిన్న సాయంతనముననే వానినివచ్చి యింటికి పత్తమును కొంటిని. అతడు రానియలేదు. అతని చుంబనములు అతని పరిష్వంగములు అతని నవ్వులు వాడు నా కొంగును పట్టుకొని లాగుటలు అతడు నేను నడచుచుండగా తన కాలడ్డము పెట్టి నేను ముందుగా పడిపోవుచుండగా పడిపోయెడి దానిని క్రిందపడకుండ మింటిలోనికెత్తి మిన్నున మిన్నునందే క్రీడాకందుకమువలె నాచరించుటలును నన్ను సంపూర్ణముగా నాత్మేంద్రియ సౌఖ్యమునందు ముంచివేసినవి. బామ్మా! అయ్యో! నేను చెడిపోయినను నాకు తెలియదు. నీయంత

పర్వారోగ్యురాలుగా నున్నను. నీ కథయు నీ జీవితము నా మనస్సు నాక్రమించినవి. నన్నులముకొన్నవి. నేను నీ యొక్క విచిత్రమైన ప్రేమ కథాసాగర తరంగడోలా నిత్యమనన భావముచేత చెడిపోయితి వనుము. నన్నుకూడ నీవలె నెవడైన నొక సుందరుడు హఠాత్తుగా ప్రేమించుట జరుగునా? వానితో నైహికస్వర్గ మనుభవింపగలనా? అట్టి ప్రేమయే సమకూడినచో తల్లిదండ్రు లెందులకు? సంఘ మర్యాద యెందులకు? అన్నటువంటి యూహలు నాలో చెలరేగు చుండెను. నీవు విపిచ్ఛమానముగా నాకు తేల్చి చెప్పెడివరకు, దాని లోని దోషమును నిరూపించి చెప్పెడివరకు నా కా సంగతి తెలియలేదు. నేను అతనిని వదలి నీ వద్దకు వచ్చుచున్నంతసేపు నాకు భయము గానే యుండెను. నీ వేమందువో యని. నీ జన్మకథ తెలిసినదానగుట చేత నగము ధైర్యముతో వచ్చితిని. నా ధైర్యమన్న చిన్నగుబ్బను నీ విజ్ఞానమన్న గొడ్డలితో పగులగొట్టితివి. ఇంటికి వచ్చుచున్నంతసేపు నాలో నేనే యాశ్చర్యపోవుచుంటి 'నిదియేమి? పశులక్షణముగా నున్నదే! అవి వట్టి ఋతువేళ కధీనములు, ఆలోచనలేనివి, సంఘములేనివి, యొక భాషలేనివి. నా సంయోగమట్లున్నది. మనుజుల జీవితము లిట్లైనచో మనుజులై పుట్టుట యెందులకు? పశువులై యెందుకు పుట్టరా'దనుకొనుచునే వచ్చితిని. అతనికి మనభాష రాదు. ఎంతదూరము పోవలెనో యంతదూరము పోతిని. అతనిని తీసికొని వత్తును. నీవు చూడుము. అపాత్రన్యస్తమో, పాత్రన్యస్తమో నీవు విచారించి పెట్టుము. నా జీవితములో నేను నిప్పులు పోసికొంటినో, తేనియలు క్రుమ్మరించికొంటినో నీవు నాకు చెప్పుము. చేయికాలిన తరువాత నాకుల కొరకు వెదకుటవంటిదే యైనను కాలినచేయి యెట్లును కాలినది, యాకులైనను దొరకించుకొన వలెనుగదా! నన్ను చూచినంత మాత్రమున సర్వము నాకళించుకొంటివే! ఓసియువ్వా! నీ దృష్టి వేగకుండదు. నీవన్నట్లు నేను మన జాతిలోనే యున్నచో నీ పని చేసినచో నెవరికిని తెలిసెడిదికాదు. నా రహస్యము నావద్దనే యుండెడిది. నీవింతలో పసికట్టితివి. నేను అతనిని తీసికొనివత్తును. అతడెట్టివాడో! గ్రహించి నాకు చెప్పుము. నేను అతనినేమి చేసికొన వలెనో! యది చేసికొందును."

ఈరీతిగా కృతనిశ్చయురాలైన గీలా నాటి సాయంకాలమున శాకయ్య యున్నచోటికి పోయెను. అతడు సంతోషించెను. గీలా యతనికి నాడే తన భాషను నేర్పుటకు మొదలు పెట్టెను. తెల్లవారు వరకు రా, వెళ్ళు, నిలుచుండుము, నవ్వుట, ఏడ్చుట, తినుట, నడచుట, కూర్చుండుట, శిరస్సు, కాళ్లు, చేతులు, పొట్ట, కన్ను— ఇట్టి మాటలు పదిపదిసార్లు చెప్పి వానిచేత హేలగా ననిపించి, ఒక్కొక్కదానిని పదిసార్లనిపించి, ప్రయోగమునందు వానినునుసట్లు చేసి మరునాటి సాయంకాలమునకు వానిని కతిపయశబ్ద జ్ఞానమునందు పారంగతునిచేసి తన యుద్యమగూర్చి కొంతకొంతగా వానికి నగము నగము తెలియునట్లు చెప్పి భయములేదని ధైర్యము చెప్పి శాకయ్యను తన బామ్మ గృహమునకు తెచ్చెను. నాల్గుదినము లతడచ్చటనే యుండెను. అవ్వ వానిని బెదరగొట్టలేదు. అతడు తన స్థితి యచ్చట భద్రముగా నున్నదని భావింప నారంభించెను. అతడు తనను గురించి వానితో నేమియు చెప్పలేదు. తనది యాంధ్రదేశమని తన పేరు శాకయ్యయని తనకు చుట్టాలెవ్వరులేరని తన వయస్సు పాతికయని మాత్రమే చెప్పెను. గీలా అతడు తనకు దొరకుట యొక యదృష్ట మనుకొనెను. అతడాటవికుడు కాడు. నీవాపజాతి బ్రాహ్మణుడు కాడు. ఇతడు బ్రాహ్మణుడు. నాగరకుడు. దైవవశమున తన దేశమును వదలి వచ్చినవాడు

అతడచ్చట మూడు నెలలుండెను. ఆ మూడు నెలలలో నతడు గీలావలన, నవ్వవలన వారి భాషను సంపూర్ణముగా నేర్చుకొన్నాడనియే చెప్పవలయును. వారితో నిరాఘాటముగా వారి భాషలో మాటాడ జొచ్చెను.

ఒకనాడు శాకయ్య లేనప్పుడు గీలా అవ్వను గుచ్చి గుచ్చి వాని స్వభావమెట్టిదని, వాడు తనతోనుండి పోవునాయని చెప్పుమని యడిగెను. అవ్వ చివరకు చెప్పెను.

"ఓసీ! పొరబడితివి. వాడెప్పుడో నిన్ను తప్పించికొని పోవును. అతడు తన సంగతి మనతో నేమియు చెప్పలేదు. నేను నీకొక్కటియే హితము చెప్పెదను. అతడు లేచిపోయిన తరువాత నీవు వానిని మరచిపొమ్ము. వానితో కలియనే లేదనుకొనుము. అట్లనుకొనుట మేలు" గీలా నివ్వెరపోయెను.

# 7

శౌకయ్య స్వగ్రామమునుండి వెడలి పోయినప్పుడు ఆ నెచ్చటికి పోవలయునో యతనికి తెలియదు. గ్రామములోని యొత్తిడివలన భార్య వెడలి పొమ్మన్నదన్న సాకు పెట్టికొని గ్రామమును పరిత్యజించెను. ఒత్తిడి యనగా సామాన్యపు టొత్తిడికాదు. ఆ యూరిలో నింకయున్నచో తన ప్రాణములు తనకు దక్కవని యతడు తెలిసికొనెను. అతని యాశయములకు, అతని యాశలకు నట్టిచావు నతడు వాంఛించలేడు. అతని భవిష్య జ్జాతకమును గూర్చి యతని తండ్రికెంత విశ్వాసముండెడిదో యతనికి నంత విశ్వాస ముండెడిది. ఒకని జీవితమునం దొకటి సంభవించునని కొంత నిర్ధారణగా తెలిసినప్పుడా సంభవించునది ఎట్లు సంభవించు, నెప్పుడు సంభవించు నన్న జిజ్ఞాసయు, ప్రతీక్షయు సర్వమానవులకు సహజముకావా! సామాన్యులైనచో తమకు తిండియెట్లు సమకూరునని భయపడుదురు అతని కా భయము లేదుకదా! పది పదేను దినములు నిరాహారిగా నుండగలడు. పదునేను దినములలో నొక్కనాడైన, నొక్కచోటైన నాహారము లభింపక, లభించినచో మరల పదునేను దినములవర కక్కరలేదు. అతడు తన యూరుదాటి రెండు క్రోశములు పోయినంతనే మహారణ్యము. పూర్వకాలమున భారతదేశముయొక్క ధాత్రిస్వభావము పట్టణాదుల లక్షణము నేటికంటె భిన్నముగా నుండెడిది. ఇప్పటివలె సర్వత్ర నగరములు సర్వత్ర పట్టణములుగా నుండెడిది కాదు. దేశమంతయు ప్రధానముగా నరణ్యము. పెద్దకాంతారము. నడుమ నడుమ పల్లెలు, పట్టణములు. ఎక్కడికక్కడికి పల్లెనగరముల చుట్టును

కొంత దున్ని పండించుకొనెడి నేలయు తక్కిన దరణ్యముగా నుండె డిది. అరణ్యబాహుళ్యముచేత వర్షములు సమృద్ధిగా నుండుటయు ధాత్రి సారవంతముగ నుండుటయు. నేడు పదికుంచములు పండెడు చోట నాడు నలుబది కుంచములు పండెడిదిగా నుండెడిది. అడవిలో తగినన్ని ఫలవృక్షములు, దుంపలు, సమృద్ధిగా కుందేళ్లు, లేళ్లు, దుప్పులు. ధాన్యమునకుగాని, మాంసమునకుగాని కరవుండెడిదికాదు. ఆనాటి మనుష్యులు కూడ నేటివారివలె తిండిపోతులుకారు. రెండే భోజనములు. అందుచేత వారు దీర్ఘాయుష్కులు. నూటముప్పది యేండ్లు బ్రతికిరనగా శరీరమునకు కావలసినంత యన్నమే తినెడివా రని యర్థము. ఎక్కువ తినుటవలన నజీర్ణవ్యాధి యుత్పన్నమగును. అజీర్ణము సర్వవ్యాధులకు మూలము. ఇధునికులు పరిశ్రమలేక దొంగయాకలిని కల్పించుకొని బ్రమపడి సర్వదా పొట్టనింపికొనుచుం దురు. ఈ లక్షణము భారతీయులకు మహమ్మదీయులవలన, పాశ్చాత్యులవలన బ్రబలినది. పూర్వము పాశ్చాత్యులు మనదేశము నకు వచ్చినప్పుడు వారి తిండిచూచి మనదేశీయులాశ్చర్యపడి పోయెడి వారట. ప్రొద్దుననే తిండి — మధ్యాహ్నమున తిండి. ప్రొద్దువాలి తిండి. రాత్రికి తిండి. నడుమ నడుమ ఫలాహారములు. ఆ తిండి యెటువంటి తిండి! గొడ్డుమాంసము. ఇట్టి యాహార పదార్థ భోజనముచేత మానవులకు కుత్సితములైన యూహలు పుట్టును. కష్టపడి భోజనము చేయ వలయునన్న యూహనశించును. దోచికొని తిందమన్న యూహయే కలుగును. ఈ సూక్ష్మమైన విషయము స్థూలదృష్టి కందునదికాదు.

సర్వత్రయడవి యగుటచేత వర్షములు సమృద్ధిగా నుండెడివి. అన్ని చెట్లును నరకికొన్నచో వానకురిసెడి మేఘముల నాకర్షించెడి దెవరు? వానలేక పొలము పండదు. వాన కురియవలయునన్నచో వృక్షములు సమృద్ధిగా నుండవలయును. నీవు వృక్షములను నరకి వానలను కురియుమన్నచో నది మేము కురవము పొమ్మనును. కొద్ది పొలములో నెక్కువ పండించుట నేర్పుకాని యెక్కువ పొలములో తక్కువ పండించుకొనుట నేర్పుకాదు. అది పండలేదన్న యేడ్పు. కాంతారములలో సామాన్యముగా హింస్రమృగములుండును గనుక తోడులేకుండ ప్రయాణము చేయరు. శాకయ్యకొకతోడు దొరకెను.

ఒక దూరపు టూరిలో నొక సంసారము - భార్యయు భర్తయు నిద్దరు పిల్లలు నొక సేవకుడు నితని స్వగ్రామమునకు పైనుండి చాల దవ్వు పోవుచుండిరి. సేవకుడు వీరి సంభారములను మోసి తెచ్చుచుండెను. ఆ పురుషుడును సేవకుడును కత్తులు కటారులు కలవారు. ఆ నాళ్ళలో చోర బాధలేదు గాని మృగబాధ యుండెడిది. శాకయ్యా వారితో కలిసెను. వారు కొన్ని యాహారములు తమ వెంట తెచ్చుకొనిరి. వలసినచో నడవిలోని చిన్నచిన్న జంతువులను జంపి మాంసమును వండికొని తినుచుండిరి. దారిపొడుగునను వారు శాకయ్యా కాహారము సమర్పింప నెంచుటయు నతడు నిరాకరించుటయు జరుగుచునే యుండెను. పదునేను దినము లిట్లు జరుగగా వారు శాకయ్యాను యోగి యనుకొనిరి. క్రమ క్రమముగా నితని మీద గౌరవము బలిసెను. వారి గమ్య స్థానము వారు చేరిన తరువాత శాకయ్యా వెళ్ళిపోదు ననగా పాదములను పట్టుకొని బ్రతిమాలి వారియింట కొన్నాళ్లుంచుకొనిరి. తమ ప్రసాదము కొంత యతని కడుపులో పడినచో తమకు భవిష్యత్తున నుత్తమ లోకములున్నవని వారు ప్రాధేయపడగా నతడు దయతో స్వీకరించినట్లు నటించి వారు నెలనాళ్లు తినెడి యాహారమును పదిదినములలో నెక్కించి వారలచేగూడ యోగశక్తి యనుకొనగా సుఖముగా నుండెను. కాని, యతని భార్య కొంచెము యయ్యారి. చూపరి. శాకయ్యా ఆమె కొరకు కొంత ప్రయత్నించగా, పురుషున కీ యనుమానము తగిలిన వెంటనే స్వాములకు సెలవిప్పించెను. అతని ప్రయాణము లీ రీతిగా సాగెను.

అతని కొక్కటి తోచెను. తన భాష తెలిసిన దేశములోని కంటె భాష తెలియని దేశములో దన యాచారములకంటె భిన్నమైన యాచారములు గల దేశములో తనమాట యెక్కువ సాగవచ్చునని యెరిగెను. పరులకితనియాహార నియమము మాత్రమే తెలియును. అతనిమాటలు తెలియవు. స్త్రీలవంక వెఱ్ఱిచూపులు చూచినచో వారితో మాటాడినచో తొందరలో పట్టుబడి పోవును. ఇతడు పరదేశములందలి స్త్రీలను పలుకరించలేదు కదా! అది పట్టి సంజ్ఞలతో సాగెడి వ్యవహారము - శరీర స్పర్శచేత తత్స్పర్శ జనిత సుఖముచేత కలిగెడి భాషయే కాని వాగ్రూపమైన భాషకాదు. వాగ్రూపమైన భాష పరులకు విదితమగును. స్పర్శాది

జనితమైన భాషకు శబ్దమయత్వము లేదు గనుక పరులచేత నగ్రాహ్య మాణముగుచుండును. భక్తిచేత స్త్రీలు పాదస్పర్శ చేయుదురు. ఈతడు వారిని మూర్ధములందు నంసములందు భుజములయందు స్పృశించును. ఆస్పృశించుటలో నితనిభావము వారికి తెలియునట్లు స్పృశించవచ్చును. చూచెడివారికి వట్టి వట్టితాకుటగు కన్పించ వచ్చును. అన్నిటికన్న నొక గొప్పయూహ యతనిలో నుండెను.

అతడు పుట్టకముందే యాంధ్రదేశములో నొక మహావిషయము జరిగెను. అది జనప్రవాదరూపమై దేశమునందల్లుకొనెను. కృష్ణానది కాతల విదర్భదేశమున్నది. దానికి కుండినపురము రాజధాని. ఆ కుండిననగరము గిరిదుర్గము. అట్టి దుర్గము యావద్భారతదేశములో మరియొకచోట లేదు. అది యభేద్యమైన దుర్గము. పేరు విదర్భమైనను నిజముగకది యాంధ్రదేశము. ఆంధ్రదేశములోని భాగము. ఆ రాజు కూతురు రుక్మిణీదేవి. ఆమె శ్రీకృష్ణుని ప్రేమించినదట. కుండిన నగర మునకు కొంతదూరములో నున్న దుర్గాలయములో నా వంశము యొక్క యలవాటుకొలది రుక్మిణిపోయి దుర్గాపూజ చేయుచుండగా శ్రీకృష్ణుడు వచ్చి యామెను రథముమీద నెక్కించుకొని పారిపోయె నట. ఆ కృష్ణుడు భగవంతుడన్న యొక ప్రథ వ్యాపించియుండెను. ఈ కథ శాకయ్య పుట్టక పూర్వము కొలది సంవత్సరముల క్రిందనే జరిగెను. మిక్కిలిగా గడచినచో పదేండ్లు కావచ్చును. దాని ప్రత్య గ్రత యాంధ్రదేశమున మాయలేదు. కొన్నికొన్నిచోట్ల నాంధ్రులకది గర్వకారణముగా నుండెను. ఆంధ్రదేశపు టాడబడుచు భగవంతునకు భార్యయయ్యెనని పలుచోట్ల పలువురది రొమ్ము విరుచుకొని చెప్పు చుండెడివారు.

ఆనాటి నాగరకత యదియొక విలక్షణమైన నాగరకత. వార్త లొకచోటినుండి యొకచోటికి కాంతారతరుశిఖరముల మీదినుండి మలయవాయు తరంగములవలె ప్రయాణము చేయుచుండెడివి. శాకయ్యకుమాత్ర మీవైదర్భియొక్క కృష్ణాపహరణము రుచించలేదు. అతడు భగవంతుడేమిటి? అతనికింత దురహంకార మెందుకు? అతనిది ద్వారకానగరము. అతడు వచ్చి నా [illegible] బాలిక నెందుకు దొంగిలించుకొని పోవలెను? [illegible] భగవంతునితన [illegible]

అతడు భగవంతుడైనచో శత్రురాజులను వధించునా? చంపుట తప్పు కదా! ఆతని కథలు వినినప్పటినుండి శాకయ్యకు మనస్సులో నొక కోపము. అతడు పలుమంది రాక్షసులను వధించెనట. వధయన్నచో చంపుటయన్నచో హింసయన్నచో శాకయ్యకుమిక్కిలికోపము వచ్చును. అందరును సుఖముగా బ్రతుకవలయును. ఒకరిమీద నొకరు దయ చూపించవలెను. ఇది యతని ప్రధానమైన సిద్ధాంతము. ఈ సిద్ధాంత మతని హృదయములో నెందు కావిర్భవించెనో తెలియదు. అతడు నిర్వ్యాపారత్వముతో నుండును గనుక అందిపోనకదు కనుక దయ యావిష్కృవించెనా! ఇంతటి యల్పకారణమునుండి యంతటి మహా గుణము దయించునా యని ప్రశ్న.

కారణాల్పత్వము కార్యాధిక్యము లోకమునందున్నదే కదా! చిన్న యగ్నికణముపడి యొక్కొకప్పుడు గామములు గ్రామములు తగులబడి పోవును. తొలుతటి యగ్ని కణమునందు పవిత్రత్వము కూడ నక్కరలేదు. అది పెంట కుప్పలో నుద్భవించిన యగ్నియైనను కావచ్చును. శ్రీకృష్ణుడు భగవంతుడు. రాక్షసాంతకుడు. రాక్షసులను చంపుటయందు వ్రతము పూనినవాడు. అందుచేత నతడు తనకు విరోధి. తనది యహింసా సిద్ధాంతము. ఒకరినొకరు చంపకూడదు. నిజమే. ఆనాటికే బ్రాహ్మణులు చాల భాగము మాంసమును భుజించుట మానివేసిరి. కలి విజృంభించిన కొలది బ్రాహ్మణులు మాంసాహారమును మానివేసిరి. ఆహారమునందలి దుర్గుణములను తపస్సు చేత నియమింపదగిన శక్తికలిగినప్పుడు దుష్టాహారమును భుజించవచ్చును. తపశ్శక్తులు సన్నగిలగా మాంసాహారమును మాని వేయుట మంచిది.

మానవులయొక్క గుణములలో నగానికి నగము వారు భుజించెడి యాహారమునుండి నయుత్పన్నమగును. మానవుల గుణములకు బహు కారణము లుండును. మొదటిది పూర్వజన్మ కృత కర్మ. రెండవది పుట్టి పెరిగిన స్థలము, పెంపకము. మూడవది తినెడి యాహారము నాల్గవది యాహార విహారములు. అయిదవది తల్లిదండ్రుల రక్తము. ఇట్లు బహుకారణములచేత మానవుల గుణము లేర్పడును.

ఒకయోగి నిత్యాభ్యాసము చేయువాడు. మంచి యారోగ్య వంతుడు. బలిసిన రొమ్ముకలవాడు. అతడు పుడిసిలిపట్టి దానినిండ పాలుపోసి యారకీరమును శివునకు నైవేద్యముచేసి యాక్షీరమును త్రాగునట. "అదియే యతని యాహారము. తచ్చుళుక ప్రమాణక్షీరము వాని శరీరపోషణకు చాలునట. నిజముగా దినదినము మానవులు తిను తిండి మిక్కిలి వ్యర్థము. శరీరపోషణమున కంత యాహార మనవ సరము. మానవులు తినెడి యాహారములో బొగ్గుపాళ్లెక్కువ. శరీర పోషకపదార్థములు మిక్కిలి తక్కువ. ఈ తిండి కడుపునరము లుబ్బించుటకు పనికి వచ్చును. అజీర్ణవ్యాధికిది మూలకందము. ఇట్లు మానవులు దురభ్యాసములు పెంచికొని ప్రాణాయామాదులు పరిహరించికొని తపశ్శక్తులు తగ్గించికొని కామక్రోధాదులు పెంపొం దించికొని పశుప్రాయులై జిహ్వాదాసులై దురభ్యాసదాసేరులై మను గడలు విడుగడలగుటకు ప్రత్యేక శ్రద్ధవహించి క్రమక్రమముగా నల్పాయుష్కులు కాజొచ్చిరి.

ఇదియొక క్రొత్త విత్తనము. ఇంత యహింసావాదియైన శాకయ్యా మాంసాహారి కాకూడదు. ఏమైననేమి? అతనికి మనస్సులో శ్రీకృష్ణుడు విరోధి. విరోధికాదు. కృష్ణునివలె తానుకూడ భగవంతుడని పనిపించు కొనవలెనని యతని యభిలాష. ఒకడు భగవంతుడగుట కతడు నిజముగా భగవంతుడగునో కాదో-లక్షహేతువు లుండును. అందులో నొక్క హేతువుకూడ తనయందు లేదు. కృష్ణుడు భగవంతుడగుటకు ద్రేపల్లె మొదటి కారణము. అప్పటి జనమితనిని గూర్చి మిక్కిలి ప్రచారము చేసిరి. కంసుడు రెండవకారణము కృష్ణుడు వానిని చంపెను. కృష్ణుడు రాజు. దానితో కృష్ణునకు పెద్ద పేరు వచ్చెను. తరువాత తరువాత కృష్ణరాయబారము వ్యాసుడు భారతము వ్రాయుట భాగవతము వ్రాయుట ఇవియన్నియు కృష్ణుడు భగవంతుడనిపించుటకు హేతువులైనవి. ఆ కృష్ణుడే భగవద్గీత చెప్పెను. శాకయ్యా నాడికిృష్ణుని గూర్చిన సాహిత్యమింత ప్రచారముకాలేదు. అప్పటికి వ్యాసుడు భారత భాగవతములను వ్రాయనే లేదేమో! కాని జనులు కృష్ణుడు భగవంతు డని చెప్పికొన సాగిరి. ద్రేపల్లెలో కృష్ణుడు కొన్ని యద్భుత కార్య ములు చేసెనట. తానును చేయగలడు. ఇతని దురదృష్టమున కది

మొదటనే వికటించెను. అతడు గోపికా వస్త్రాపహరణము చేయగా నది పెద్ద లీలయయ్యెను. ఇతడు గురువుగా ప్రవేశించిన రెండు మూడేళ్లలో నిద్దరు ముగ్గురు బాలికలతోడి సంబంధ మేర్పరచుకొని నంతనే వారు ఇతనిని వధించుటకు సిద్ధపడిరి. భగవంతు డగుటకో మరియొకటి యగుటకో కలిసిరావలెను. ఒకొక్కనికి కలిసివచ్చును. అతడు భగవంతుడగును. మహా వీరుడగును. మహా కవియగును. ఇద్దరు పెద్దయుద్ధము చేయుచున్నారు. అధికుడైన వానికి కాలు జారెను. క్రిందపడెను అప్పటి కస్త్రము స్ఫురించలేదు. ఆసమయములో నతని కంటివద్ద నున్న భార్య జ్ఞాపకము వచ్చెను. ఎదుటివాడు గెలిచెను. అతడు మహావీరుడయ్యెను. అతడు మహావీరుడని పది మంది చెప్పుకొనుటచేత అతని శత్రువునకు లోపల నధైర్యముగా నుండెను. ఇతని గెలుపునకదియు గూడ హేతువు. ప్రేక్షకులు వీనిని ప్రోత్సహింతురు. వానికి కోపమువచ్చును. ఆ కోపములో తప్పటడుగు వేయును. లక్ష కారణములుండును.

శాకయ్య తెలుగుదేశమును వదలిపోయెను. ఆ కాలమున భరత దేశము సేతు శీతాచల పర్యంతము పండితులైన వారలెల్ల నెరిగిన దియు విద్యావంతు లనిపించుకొనుటకు నేర్వవలసినదియు నేర్చినను నేర్వకపోయినను పట్టి విడిచిడిచేత పరంపరగా మాటాడుట యలవాటైనదియునగు భాష సంస్కృతము. ఆ భాష చదువుకొనకుండగనే తప్పులో యొప్పులో ఏదో విధముగా పలుకుచు మాటాడెడివా రుండెడి వారు. సర్వరాజ్యముల రాజ్యాంగ వ్యవహారము లన్నియు సంస్కృత భాషలోననే జరుగుచుండెడివి. అందుచేత నా సేతుశీతాచలము సంస్కృతభాష యెట్లు మాటాడినను పరస్పరాభిప్రాయజ్ఞానమునకు పెద్ద భంగముండెడిది కాదు. ప్రాంతీయములైన భాషలు సామాన్యులు మాటాడు చుండెడివారు. వ్యవహారమంతయు సంస్కృత భాష లోననే. శాకయ్యకు సంస్కృత భాష రాదు. చదువుకొనలేదు. కాని యతడు సంస్కృతములో మాటాడగలడు. సామాన్యముగా నర్థము చేసికొనగలడు. ఆ దినములలో సంస్కృత భాష మాటాడెడు వానికి గౌరవము హెచ్చు. ఆ భాష యతని కెంతవచ్చునన్న ప్రశ్న లేదు. ఏదో మాటాడుచుండగా నతడు పండితుడనియే యనుకొనెడి వారు.

ఒక భాష మాటాడుటలో నొక యొడుపున్నది. నేను మాటాడలేనేమో యని, నాకు రాదని కూర్చున్నవానికి దానియందు ప్రాగల్భ్యము కుదు రదు. తప్పో యొప్పో యూరకే మాటాడుచుండిన నది మాటాడుట యలవాటై పోవును. అతడు కొంత వివేకియైనచో నా దోషములు క్రమ ముగా నర్దుకొనును.

ఆ రీతిగా శాకయ్య తన స్వగ్రామము వదలిపెట్టి వెళ్ళిన తర్వాత సంస్కృతములో మాటాడగలడు. ఇతరులు మాటాడు చుండగా నర్థము చేసికొనగలడు. ఇతడు పండితుడన్న పేరు వచ్చును. సామాన్యముగా నే భాషయైనను పండితులు మాటాడెడు లక్షణము వేరు; ఇతరులు మాటాడెడు లక్షణము వేరు. కొన్ని శబ్దము లందరకు సులభముగా వచ్చును. అవి నిత్య వ్యవహారములో నుండును. దానిని సులభ సంస్కృతమందురు. ఇందులో మరియొక రహస్య మున్నది. ఇతడు పండితుడు గాడని పండితులు సులభముగా తెలిసికొందురు. వా రతనిని గౌరవించరు. ఇతడు పండితుడుగా గౌరవింపబడవలె నన్నచో తక్కువ కులాలవారి కడకు బోవలెను. ఏ దేశమునందైనను సంఘము పైనుండి క్రింది కొక్కటియేవిధముగా నుండదు. తర గతులు తరగతులుగా నుండును. ఈ తరగతులు వృత్తులనుబట్టి భేదించును. వడ్రంగము చేయువాడు రాజసభలలోనికి బోడు. మాంస మమ్ముకొని జీవించెడివాడు విద్వత్పరిషత్తులందు పాల్గొనడు. ఇది సంఘ వ్యవస్థాలక్షణము. మాంస విక్రేతకూడ తన విశ్రాంతికాలము నందు మంచి మాటలు వినుట కిష్టపడును. ఇట్లు సంఘమునందు వృత్తి గుణాదులచేత భిన్నముగా వ్యవస్థితములైన స్థలములయందు తక్కిన తరగతిలోనున్న మానవ సమాజమునందు కొంద రల్పవిద్వాం సులు గురువులుగా నేర్పడుదురు. గురువులు వత్తురు, బోధలు చేయుదురు, గౌరవములను పొందుచుందురు. అట్టివారిలో గూడ కొందరు విద్య తక్కువయైకూడ,వాగ్మితచేత తీవ్రతచేత, నహంకారము చేత పలుకుబడియు ధనమును సంపాదించి యుత్తమ పండితులను నిరాకరించుట జరుగును. వేదవేదాంగ పారంగతుడైన పండితుడు వేరు; అక్కడిమాట యిక్కడిమాట విని పండితునివలె చలామణి

యయ్యేదువాడు వేరు. స్థూలదృష్టికి, సామాన్యదృష్టికి, విచారణ లేని దృష్టికి నిద్దరు నొక్కటియే.

ధనము, విజ్ఞానము రెండు విషయములు. ధనము ప్రత్యక్షము. విజ్ఞాన మప్రత్యక్షము ఒకనివద్ద సహస్రదీనారము లున్నవి. మరి యొకనివద్ద వందయే యున్నవి. ఈ భేదము ప్రత్యక్షము. ఈ వంద దీనారములవాడు వేయి దీనారముల వానివలె ప్రవర్తించినచో వెంటనే పరాభవమును పొందును. ఎందుకనగా ధనవిషయికమైన యీ భేదము నెరుగని వాడుండడు. గాలి ప్రోగుచేసి పండితుడైన వానికి, గురుశుశ్రూషచేసి పండితుడైనవానికి కల భేదము పండితులకే తెలియును. వారి సంఖ్య యెప్పుడును తక్కువ. ఇది వానికి లాభము. పంఘుశక్తులు జీర్ణించినచో నల్పులైన యట్టి పండితు లధికులుగా పరిగణింపబడుచుందురు. పామరుల సంఖ్య యెక్కువ. ఇతడు పామరులలో పెద్ద పండితుడు. ఇది వాని బలము. శాకయ్యా తిరిగెడి తక్కువ జాతులలో నట్టి యల్పపండితుల యుపన్యాసములు విను టయు, స్థూలవిషయములను మిక్కిలిగా సేకరించుటయు, నితడు కూడ పండితు డనిపించుకొనుటయు జరిగెను.

అహింస యున్నది ఇంతకంటె నుత్తమ గుణము లేదు. ఒక్క యహింసా మార్గమున మోక్షమును పొందవచ్చును. ఈ సిద్ధాంతమును శాకయ్యా ప్రతిపాదించె ననుకొందము. నిత్యము హింసచేసెడివాడు కూడ దీనినిగూర్చి గొప్పగా చెప్పును. వాడు హింస మానివేయనెంచి కాడు. ఈ సిద్ధాంతము వలన తనకెదో మోక్షము సులభముగా వచ్చు నన్న యభిప్రాయము మోక్షము సులభ సాధ్యముగనే కన్పించు చున్నది. తాను దానిని పొందుట దుర్ఘటము కాదు. అందుచేత వానికి సిద్ధాంతము ప్రియతమ మగుచున్నది. ఒక విచారణ దక్షుడు దీనిని కాదనును. అబ్బాయీ! హింస యనగా నేమి? ఒక జంతువుయొక్క ప్రాణము తీయుటమాత్రమే హింస కాదు. ఇతరుని మనస్సును కష్ట పెట్టుటయు హింసయే. లోకములో నెవడో మరొకని నెక్కువగా మాటాడి ప్రాణమును విసిగించినచో ననమందురు కదా! 'అబ్బా! వాడు నన్ను చాల హింసపెట్టినాడు' అని. కనుక నెదుటివాని మనస్సును కష్ట పెట్టుట కూడ హింసయే వాని ప్రకార మీయహింసా సిద్ధాంత మెంత

మేరకు పోవుచున్నది? ఇతడు యోగికావలెను. నిర్మముడు కావలెను. దురాశాపరుడు కాకూడదు. నిస్సంగుడు కావలెను. సామాన్యజనులు దీని నొప్పుకొందురా! అహింస అహింసయని తందనాలాడుటయే కాని. ఒకవేళ నొప్పుకొన్నను నహింస మోక్షము కాదు. అది వేరేవాదన. ఇక్కడికే దిక్కులేదు. ఉట్టికెక్కలేనమ్మ స్వర్గాని కెక్కునాయని! అహింసకిమాత్రపు టర్థము సు చెప్పినచో వాని కర్థమగుట లేదే! పైన నింకను వ్యాఖ్యలు, భాష్యములు మాటాడినచో నేమగుచున్నది? ఈ గొడ్డుమాట గొడ్డుగా చెప్పినవాడు పండితుడు. వానికి పలుకుబడి హెచ్చు. వాని నేను గెక్కించిపించి యూరేగింతురు. అతడు మహాను భావుడు. ప్రజాహితకారి. విశేషములు చెప్పినవాడు అహంకారి. పరుల మేలుజూచి యోర్వలేనివాడు. ఏదో మాటాడును. అది యెవ్వరికి నర్థముకాదు. ఈ రీతిమైన లోకమునందు శాకయ్య చక్కగా పైకి వచ్చెను.

అతడు దాక్షిణాత్య దేశమును వదలిపెట్టి యుత్తరదేశములకు బోయెను. అచ్చట నీ యధోవర్ణముల వారి గృహములలో నివసించుచు కొన్నిచోట్ల గురుస్థాన మాక్రమింప నారంభించెను. పెరిగిన శిరోజ ములు, మీసములు, గడ్డములు, కావిగుడ్డలు, నిరాహార వ్రతము, కోపముతేనితన మొకటి యత దలవాటు చేసికొనుట, అన్నిటికిని నవ్వుట మొదలైన లక్షణములచేత నతడు సులభముగా గురు వయ్యెను. అత డెవ్వ రేది చెప్పినను వినును. ఒకచోట నొక పండితు డుపన్యాసము లిచ్చుచుండెను. అచ్చటి కతనిని పెద్దలు తీసికొని పోయిరి ఆ యుపన్యాసము లిచ్చెడి యాయన కొంత చదువుకున్న వాడు. విషయములు తెలిసినవాడు. సంప్రదాయసిద్ధమైన మార్గమున బోవువాడు. ఈ శాకయ్య సన్యాసికాడు, సంసారికాడు. కావిగుడ్డలు మాత్రమే ధరించును. అతనిమెడలో యజ్ఞోపవీతమున్నది. ఆ దినము లలో కొన్ని రాజ్యములలో నిట్లుండుటకు వీలులేదు. ఏదియో యొక యాశ్రమమునకు చెందియుండవలెను. ఇట్టివాడు రెండావుల దూడ. కావిగుడ్డల బలముచేత సన్యాసి జనుల గౌరవమున కర్హుడు. యజ్ఞోప వీతముచేత సంసారి. అనగా నతనికి భార్య యుండవచ్చును. గృహ ముండవచ్చును. ధనము సేకరింపవచ్చును. అయినను కొన్నిచోట్ల

నిట్టిలక్షణములు తిరస్కరింపబడుటలేదు. హస్తినాపురము, ద్వారక, అయోధ్య, గాంధారదేశము మొదలైనచోట్ల నిట్టివారిని శిక్షింతురు. మగధములయం దిట్టివారినిగూర్చి పట్టించుకోరు. మొత్తముమీద శ్రీకృష్ణదేవుని ధర్మముల నెవరనుసరించుచుందురో యట్టిరాజుల రాజ్యములందు చాతుర్వర్ణ్యము పాలింపబడుచుండెను. తక్కినచోట్ల చూచి చూడకుండ బోదురు. ఆ పండితు డుపన్యసించు చుండగా శాకయ్య వినుచుండెను. ఆ యుపన్యాసము లర్ధరాత్రము నందు జరుగును. దివాసమయములయం దెవరివృత్తులు వారు చూచు కొందురు. కృషీవలులు పొలముల మీదికి పోదురు. బట్టలు నేయువారు తమ నేతలో తాము నిమగ్నులై యుందురు. వ్రడంగులు, కమ్మరులు పగలెల్ల వారివృత్తులు వారు చేసికొందురు. వారి పిల్లలు కూడ వారి వృత్తులనే చేసికొందురు. చిన్నప్పటినుండి వారి నంతా నము వారి కులవృత్తులయందు నిమగ్నమైయుం గా వారికి వయసు వచ్చునప్పటికి తమ కులవృత్తియందు సామర్థ్యము కలుగును. అభి లాషయుండును. వారి కుటుంబములకు పరంపరగా నన్నోదకము లకు లోపము లెకుండును. మేము రాజ్యములేలుటకు పనికిరాము, మమ్ము పై వారఫఃపాతాళమున కణగద్రొక్కిరి మొదలైన యూహలు వారి బుద్ధులయందు ప్రవేశింపవు. నాటికి ప్రవేశింపలేదు. అందుచేత నా యుపన్యాసములు, పురాణములు రాత్రులందే జరుగుచుండును.

అప్పటికి శాకయ్య పోవుచుండును. ఎవరో శిష్యులయిండ్లలో నివ సించును. ఇతడు కులముచేత బ్రాహ్మణుడు. ఇత డేయింటబడిన నాయింటనే యాతగించును. ఆ విషయము కొంత రహస్యముగా నుంచబడును. ఏలయనగా నతడు బహు దినములు భోజనము లేకుండ నుండగలడు కదా! అతడెప్పుడును భోజనమే చేయడని ప్రచారము. అది యేమి లక్షణమో! కొందరు తక్కువ కులముల వారి కెక్కువ కులమువారు తమ యిండ్లలో భోజనము చేసినచో వారి కదొక తృప్తి. వీరిని వారు గౌరవింతురు. మనుష్యప్రవృత్తియు, ప్రకృతియు పలువిధములుగా నుండును. ఇంతకు నెలనాళ్లు శాకయ్య యా పురాణము వినుటవలన నతనికి కొన్ని భావములు స్థిరములయ్యెను. దశావతారములలో బుద్ధుడొకడు. అతడును విష్ణు

మూర్తియే-శ్రీమన్నారాయణుడే బుద్ధుడుగా నవతరించును. ఈ యవ తారముల కొక యనుక్రమణిక లేదు. ఈ కాల మనంతము. నాల్గు యుగములు జరుగును. ఈ నాల్గు యుగములు జరిగి యదియొక మహాయుగమగును. ఇట్టి మహాయుగములు తిరిగి తిరిగి వచ్చుచునే యుండును. ఇట్టి కొన్ని యుగములు జరిగినచో మన్వంతరమగును. అట్టి మన్వంతరములు కొన్ని జరుగగా దానిని కల్పమందురు. దీనిని గూర్చి యెవడు చెప్పగలడు? ఎవడు చూచినాడు? కాని యీ యవ తారములు మాటిమాటికి వచ్చుచుండును. శ్రీమన్నారాయణుడు ఒక్కసారి తా నా యవతారములనెత్తి మానివేయడు. మరల మరల, నాయా యుగములలో వాని నెత్తుచుండును. ఈ యవతారము తరు వాత నీ యవతారము రావలయునన్న నియమములేదు. కృతయుగ ములో భగవంతుడు బుద్ధావతారమెత్తెను. కలియుగము చివర నెత్త వలసిన యవతారము కదా యని యూరకుండలేదు. ఆలోచించినచో బుద్ధావతార మొక విలక్షణముగా నున్నది. పరమేశ్వరుడైన శివుడు త్రిపురాసురులను సంహరించెను. వారి భార్యల పాతివ్రత్యము చేత వారిని జయించుట కష్టముగానుండగా శ్రీమన్నారాయణుడు తాను బుద్ధావతారమెత్తి త్రిపురములకు బోయి తానొక సన్యాసివలె నుండి వారి భార్యలను ప్రోగుచేసి వారికి తన సూత్రములను చెప్పెను. శీలము, పాతివ్రత్యము, వర్ణవిభేదము మొదలైన వానిని గూర్చి వైదికమతమునకు వ్యతిరేకముగా వారికి బోధించెను. వారు తమ పాతివ్రత్యములకు చెడిరి. అపుడు వారి భర్తలను జయించుటకు శివునకు వీలయ్యెను. సృష్టిలో నొకని యాధిక్యము దేనికికలుగునో చెప్ప జాలము. వాని భార్య పతివ్రత. ఆ పాతివ్రత్యము వీనిని రక్షించు చుండును. భార్య పాతివ్రత్యము భర్త నెట్లు రక్షించుచుండును? అది యొక గ్రామమైనచో నామె శీలము నందరెరుగుదురు కనుక ఇత డామె భర్తయని పదిమందియు నతని దుశ్చేష్టలను చూచియు చూడకుండ పోవచ్చును. ఒక గొప్పవాని కుమారుడు కొంచెము చెడుత్రోవ బోవు చున్నచో వాని కుమారుడని మన్నించినట్లు. ఇతడు అతని కుమారుడని తెలియనిచోట నితని భార్య పతివ్రతయని తెలియనిచోట నతనిశీలము వీనినెట్లు రక్షించును? ఇది లోకానుభవవిరుద్ధము. ఆ సంగతి

యిచ్చుట తెలియదు. తెలియని దానికి ఫలములేదు. ఇది లోకమునకు సంబంధించినంతవరకు నిజమే. ప్రతి విషయము లోకమునకు సంబంధించినది కొంత, దైవమునకు సంబంధించినది కొంతగా నుండును ఒక స్త్రీ పతివ్రత. ఆమె పతివ్రతయగుట యామె భర్తకు ప్రియమగును. ఆ భావముచేత నత డెక్కువ సుఖ మందవచ్చును. పదిమందియు నామె పతివ్రతయని యెందుకు గౌరవింపవలెను ? పాతివ్రత్యమన్నది యొక మహాగుణమని పరంపరగా చెప్పుకొనుచు వచ్చుటచేత జనులు దానియందు బద్ధ విశ్వాసులై యా గుణముగల స్త్రీని గౌరవింతురు. అప్పుడేమగుచున్నది? అదియొక స్త్రీ యందు నిహితమైన సద్గుణము కాక పదిమంది దానిని విశ్వసించుటచేత నది సద్గుణముగా పరిగణింపబడుచున్నది. కనుక దోషమంతయు నది సద్గుణమని ప్రచారముచేసిన శాస్త్రములయందో పురుషులయందో సన్ని హిత మగుచున్నది. పాతివ్రత్యము దానియంతట నది సద్గుణమగునా కాదా? శాస్త్రములు చెప్పుటచేత, నా శాస్త్రములు విశ్వసించువారి సంఖ్య బహుళమగుటచేత నది సద్గుణమైనదా యన్నది ప్రశ్న. ఇట్టినచో నొక పాతివ్రత్యమేమి? ఏ సద్గుణమైన నిట్లే. ఒక సంఘవ్యవస్థ యున్నది. ఒకని ధనము నింకొకడు దొంగిలించరాదు. అబద్ధము చెప్ప రాదు. పెద్దలను తృణీకరించరాదు. పరునిభార్యను గమించరాదు. ఇవియన్నియునట్లే యగును. వీనిని శాస్త్రములు చెప్పినవి. వానిని పలుమంది విశ్వసించుచుండిరి. అందుచేతనివి సద్గుణములుగా పరిగ ణింపబడుచున్నవి. వాని ఫలితము తావన్మాత్రమే. ఆ పురుషుల నెరిగియున్నచోట మాత్రమే అతనికి గౌరవము, ఎరుగనిచోట లేదు. ఇది పట్టి లౌకికమైన దృష్టి. అలౌకికమైన దృష్టి మరియొకటి యున్నది. ఈ గుణముచేత మానవదృష్టి కగోచరమైన యొక మహిమ వర్ధిల్లును. ఎట్లు వర్ధిల్లును? అది కనిపించదు కదా! అది యున్నదని నమ్ముట యెట్లు? మొదలైన ప్రశ్నలు సముత్పన్నములు కాగా వానికొక సమా ధానము కలదనియే చెప్పవలెను. అత డబద్ధములు చెప్పడు. అందు చేత అతనిని గౌరవింతుము. ఆమె పరపురుష గమనము చేయదు. ఈ రెండింటికిని భేదము కలదు. అబద్ధములు చెప్పడు. అందుచేత నెవరికిని నష్టము లేదన్న లౌకికమైన ఫలముదయించినచో నామె

పతపురుష గమనము చేయదనుటలో లౌకికమైన ఫలితమేమున్నది? ప్రతిపక్షియున్నదనుము. బహు పురుషాసక్తయగుటచేత నామెయందు పలువురకు సమానానురాగ ముండును. అది యీర్ష్యాహేతువగును. ఈర్ష్యనుండి కోపముపుట్టును. కోపమునుండి దుష్కర్మ యుద యించును. అందుచేత నేకపురుషలగ్న చిత్తవృత్తియైన స్త్రీ యొక్క సౌశీల్యమునకు ప్రత్యక్షసౌశీల్యము కన్పించుచున్నదన్నచో ఈర్ష్యా కోపముల కామె బహుజనాసక్తయే కానక్కరలేదు. ఆమె యొకని భార్య. ఆమె సౌందర్యవతి. ఆ సౌందర్యవతి నాకు భార్య యేల కారాదు? వానికేల భార్య కావలెను? అందుచేత నీర్ష్యయుదయించ వచ్చును. ఈ యీర్ష్య యుదయించుటకు సద్గుణము లడ్డుపెట్టవు. సద్గుణములవలన లోకమునం దెంత మంచితన ముదయించునో చెడ్డ దనముకూడ నంత యుదయించుటకు వీలున్నది. సంఘమునందలి వాని యుపయోగముచేత వాని పాతమార్థ్యము సమకూడినదనుటకు వీలుండదు. వట్టి లోకమునందేకాక మానవుని కంటికందనిది, బుద్ధి చేత మాత్రమే గ్రాహ్యమగునది యొక సుకృతముండును. అ సుకృత ముదయించును. దానికొక శక్తియుండును-అన్నది యంగీకరింపబడ వలెను. అడవిలో నొకచోట నొక పెద్దపులి యున్నది. మార్గములో నొక సర్పమున్నది. మరి యింకొకచోట కటారికాడున్నాడు. ఆ పులి ముందర పోవువానిని వదలిపెట్టి వెనుకబోవు వానిని సంహరించును. నల్గురు పోవుచుండగా నా పాము తక్కిన ముప్పురిని వదలిపెట్టి అందులో నొకనినే కరచును. కటారికాడొకనిని వధించుట కచట నియోగింపబడెను. వా డనలు మనుష్యుని వదలిపెట్టి మరియొకనిని వధించును. వాడు వాడుకాదనుకొనును. వీడు వాడనుకొనును. ఇట్టి విపరీతములేల జరుగుచున్నవి? పొరపాటందుమా? కర్త పొరపాటు పడెను. కర్మ యనుభవించెను. ఇంత యనుభవము నిష్కారణమా? వెనుకనుండి యేదైన శక్తి యీ పొరపాటును కలిగించుచున్నదా? పులి కూర్చున్నది. దాని కాకలియగుచున్నది. అది యెవరినో చంపితీన వలయును. దాని యాహారమునకు వెనుకటివాడెట్టివాడో ముందరి వాడు నట్టివాడే. వాడేల తప్పించికొని పోయెను? పులి అతనిని వదలి పెట్టుటకు తన్నిమేషమున దానికేదో యడ్డంకికలిగినది. ఇట్టి పరిస్థితుల

యందు ఆస్తికునకు నాస్తికునకు ప్రధానమైన భేదము. ఆస్తికుడు వాని సుకృతమును చెప్పును. వాని పూర్వకర్మను వాదించును. వాని పుణ్యమును ప్రసంగించును. నాస్తికుడు వానినన్నిటిని నిరాదరించును. ఆతడు పుణ్య మున్నదనును. దాని ఫలితమిదియనును. ఇతడు పుణ్యము లేదనును. ఫలితమునకు కారణము చెప్పడు. అది యెట్లు జరిగెను? అది యెందులకు జరిగినదన్నది ప్రశ్న. ఆ ప్రశ్నకు నాస్తికునియందు సమాధానము లేదు. సమాధానము లేకపోవుటకంటె సమాధానముండుట యుక్తమము. మానవుని మానవత్వము మానవుడు తర్కబుద్ధి. సమిచీనతాపర్యాప్తమైన ధీవైశద్యము మానవునియందు కలదు. ఆ రీతిగా త్రిపురాసుర స్త్రీల యాలువును పరమేశ్వరుడు హరించుటచేత వారి భర్తలు శివుని యాగ్రహము చేత దహింపబడిరి. తాత్పర్య మేమగుచున్నదనగా బుద్ధుడుగా నారాయణు డవతారమెత్తి, యహింసాదులను బోధించి ప్రత్యక్షమైనదాని యందు ప్రమాణబుద్ధియు, నప్రత్యక్షమైన దానియం దప్రమాణ బుద్ధియు గలిగించెనని యేర్పడుచున్నది. అందుచేత నదియును భగవదుద్దేశ్యమే. కాదని యెవ్వరు ననలేరు. త్రిపురాసురులు చావవలయును. భగవంతు డదిచేసెను. అహింసను బోధించెను. హింసను సాధించెను. భగవంతుని మార్గము లనను మేయములు. కాని మానవులు మంచి చెడలను వారే నిరూపించుకొనవలసిన స్థితియం దున్నారు. అందరి బుద్ధియు నొక విధముగనే యుండదు.

ఇది బుద్ధుడు బుద్ధుడుగా నవతరించిన మొదటిసారి; యది తరువాత నెన్నిసార్లో యతడుదయించుచునే యుండెను. తన యహింసా సిద్ధాంతమును బోధించుచునే యుండెను. ఆ సిద్ధాంత ప్రచారమువలన భగవంతున కెప్పుడే ప్రయోజనము సమకూడునో మనకు తెలియదు. ఆ పండితుడు బుద్ధుడెత్తిన యవతారముల నెన్నిటినో బోధించెను. ఎన్నిటినో చెప్పెను. అతడు మరొకటి చెప్పెను. కలికాలము ప్రవేశించిన తరువాత సుమారు రెండువేల సంవత్సరములకు బుద్ధావతారములలో నొక ప్రధానమైన యవతారము కలుగునని చెప్పెను. ఉత్తరభారతములో నొక రాజ్యము, నొక రాజవంశముండును. ఆ వంశము పేరు శాక్యవంశము. అందులో బుద్ధుడుదయించును. అతని మతము

ప్రబలును. కొన్నివందల సంవత్సరములు ప్రపంచకమున హింస తగ్గును అని యా బ్రాహ్మణుడు భవిష్యచ్చరిత్రమును తెలిసినవారి వలన విని యుపన్యసించెను. శాకయ్య కావిషయము చక్కగా మనస్సునకు పట్టెను. శాకయ్య, శాక్యశబ్దములు దగ్గరగా నున్నవి. తానే యీ రెండువేల సంవత్సరములు బ్రతికినచో శాక్యముని కావచ్చును. ఆ యవతారము తానే కావచ్చును. ఇది యతని యాశ.



అంతకు కొలదిదినముల క్రిందటనే కృష్ణార్జునభీములు వచ్చుటయు, భీముడు మల్లయుద్ధమున జరాసంధుని చీల్చుటయు, జరాసంధునిచేత కారాగార నిబద్ధులైన రాజులందరు వదలింపబడుటయు, వారిచేత చెరలం దుంచబడిన రాజకన్యలు శ్రీకృష్ణుని భర్తగా వరించుటయు, గిరివ్రజపురము గిరివ్రజపురమంతయు నట్టుడికిన ట్లుడికి పోవుటయు, మహానగర మంతయు తలక్రిందులైన ట్లస్తవ్యస్త మగుటయు, రాజ్యవ్యవస్థ చెడిపోయినట్టు కనిపించుటయు జరిగెను. జరాసంధుని కుమారుడైన సహదేవుడు చిన్నవాడు. శ్రీకృష్ణు డతనికి పట్టాభిషేకము చేసెను. సహదేవుడు పదిసంవత్సరాలేండ్ల బాలుడు. కాని కోపమెరుగని బాలుడు కాడు. ఊహ యెరుగని బాలుడు కాడు. సామంతులు సేనాపతులు సర్వాధికారులు నీతికి కట్టుబడి యుండిపోయిరి. ఎదురుతిరిగి యా కృతఘ్నబ్రాహ్మణ త్రయమును నిబంధించుటకు ప్రయత్నము చేసినచో నేమయ్యెడిదో! శ్రీకృష్ణుడు తన విశ్వరూపమును నెరపెడివాడో, సుదర్శనమును పిలిచెడివాడో! భీముడు సమీపస్థ తరువులను పెకలించి సైన్యమును చెండాడెడివాడో! అర్జును

దేధానుష్కుని చేతిలోని విల్లు లాగి కొని విజృంభించెడివాడో తెలియదు. కాని గిరివ్రజమునందలి సేనయంతయు నీతికి కట్టుబడియుండెడిది. వారు బ్రాహ్మణులై వచ్చిరి. యుద్ధభిక్ష కోరిరి. జరానందు డిచ్చెను. అంతయు నొక పథకము మీద జరిగెను

మానవుల లక్షణము, వారి స్వభావము, వారి మనస్సులు నడచెడి తీరు నియమబద్ధముగా నుండును. తమ కనిష్టమైన యొక కార్యము జరుగును. అది ధర్మము. పదిమంది శక్తిమంతుల కది యిష్టము లేదు. కాని యిది ధర్మానుబద్ధము. పదిమంది శూరులును ధర్మము చేత బద్ధులగుదురు. కాని తమ శౌర్యమును పొంగి పొరలనీయరు. భగవంతుడు మానవసృష్టి చేసినప్పుడే మానవస్వభావములో నీలక్షణము పెట్టినాడు. లేనిచో మానవలోకము పశువుల దొడ్డి యయ్యెడిది. గాడిదగత్తర యయ్యెడిది. ఇట్టి నియమమున కంగీకరించని దూర్త ప్రకృతు లందందు లేకపోలేదు. ఆపదిమంది శూరులలో నొకడు ధర్మ వ్యతిరేకముగా నడచినచో తక్కిన తొమ్మండుగురు వాదింతురు. ఐక్యము కలుగజేసికొనరు. అనగా సృష్టిలో నెక్కువ భాగము నియమబద్ధమై యుండు నన్నమాట. ఈ నియమబద్ధతాలక్షణము సృష్టియందు లేనిచో రాజులు రాజ్యము చేయలేరు. పెద్దల పెద్దతనము లేదు. తల్లిదండ్రులు మొదలైనవారి యాధిక్యము లేదు. మానవ సృష్టిలో నిది మూలభూతమైన విషయము. భగవంతునిచేత నిర్మింపబడిన ధర్మము దీనిమీద స్థాపింపబడినది. అయినను మనస్సులో నుండెడు కోపము కోపమె. ఒకని కనిష్టముగా ననగా తనకు లౌకికమైన యానుకూల్యము లేకుండ నొకపని జరిగినది. అది ధర్మబద్ధము. ఇతడు ధర్మమునకు కట్టుబడి యుండును. కాని కోపము కోపమే. అనిష్టము అనిష్టమే. ఈ కోపమేమి చేయు ననగా భవిష్యత్తులో తనకు వ్యతిరేకముగా జరిగిన దానికి మార్గాంతరమున ప్రతిక్రియ చేయుటకు వాంఛించుచుండును. ధర్మమునకు కట్టుబడిపోవుట మాత్రమేకాని ధర్మమునకు వశమగుట కాదు. ధర్మమునకు వశమైనచో తన మనస్సులోని యనిష్టమును. కోపమును పరిత్యజించవలెను. అట్లు చేసెడివాడు సత్పురుషుడు. దానికి వాని మనస్సు శిక్షితమై యుండవలెను. అందులో నొక పది

పం[డెండేండ్ల బాలు డున్నా డనుకొందము. వాని తం[డి నెవరో చంపిరి. వానికి వయసు రాలేదు. [పతి[కియ చేయలేడు; వానికి దైవ మననుకూలముగ నున్నది. కాని వానికి మనస్సులో తం[డిపోయె నన్న దుఃఖము, తం[డిని వాడెవడో వధించెనన్న కోపము నిస్సం దేహముగా నుండును. అది [కమ[కమముగా వృద్ధియగును. వాడు పెద్దవాడైన తర్వాత నీ పగను తీర్చుటకు సమర్థుడైనచో నిస్సంశయ ముగా తీర్చును. సహదేవుడు చిన్నవాడైనను పరిస్థితు లెరుగనివాడు కాడు. మగధదేశము నాటి భారతదేశమున తలకట్టయిన దేశము. అటు కాశ్మీరము, ఇటు [బహ్మదేశము, మరి యు నటు కేరళ [దావిడదేశములు తన యదుపులో కల దేశములు. భారతదేశములో సగానికి సగము మాగధులన్నచో వెరచుచుండెడిది. అట్టి పరిస్థితి తన తం[డి చావుతో నేమైనది? మగధము లెందుకు పనికిరాకపోయినవి? తన తం[డి పరా[కమమునకు వెరచి దాసాను దాసులుగా [పవర్తించిన రాజులందరు తాము స్వతం[తులవలె వ్యవహరింతురు. వీరు మా తం[డికి దాసులు, మాకు సామంతుల వంటివారు. మా తం[డి నెట్లు కొలిచిరో నన్నట్లు కొలువుడని సహ దేవు డన్నచో 'సోరి! బొడూడనివాడా! నీ తం[డి పరా[కమమునకు వశులమైతిమి. నీకు కాదని చెప్పుదురు. అనాడు మగధరాజ్య మి స్థితిలో నుండెను. సహదేవుడు సింహాసనమునందు [పతిష్ఠితు డయ్యెను. మం[తులు, సేనాపతులు రాజ్యమును పాలించుచుండిరి. రాజమాత యంగీకారముతో వారు పాలించుచున్నను తలయైనవాడు పసిబాలుడైనప్పుడు మం[తులకు కొంత స్వాతం[త్యము లేదని చెప్పు టకు లేదు. జరాసంధుడు [బతికియుండగా మం[తులు నామమా[తు లుగా నుండిరి; సేనాపతులు వట్టి సాధనములుగా నుండిరి. కాని గిరి[వజపురమున నొక్కటిమా[తము విస్పష్టముగా భాసించుచుం డెను. మం[తులు, సేనాపతులు, [పజలు, జరాసంధునం దభిమా నము కలవారు. అతని పరా[కమమునందు గర్వము వహించినవారు. తమ రాజ్యముయొక్క యాధిక్యమును మనసా మన్నించెడివారు.

ఒక రాజు పోయి పరరాజ్యములను గెలిచి ధనము దోచి కొని వచ్చినచో [పజ లధిక ధనవంతు లగుదురు; అధిక

సుఖవంతు లగుదురు. అట్లు సుఖపడిన గిరివ్రజపౌరులకు జరా నంధుని యందు గౌరవ మేల యుండదు? అతడు పోయినచో తొలి నాటి సుఖములు పోయినట్లే కదా! వాడు గిరివ్రజపుర నివాసి యన్న పరదేశములలోని తొలినాటి గౌరవము నే డుండదే! అందుచేత నత్య ప్రజలు తమ యీ సౌభాగ్య హర్తయైన శ్రీకృష్ణునియందు కోపము కలిగియుండిరి. అర్జునుడును భీముడు నెంతటివారు? శ్రీకృష్ణుడు చెప్పినట్లు చేసెడివారు. అందుచేత వారి ప్రధానమైన కోపము శ్రీకృష్ణునియందే లగ్నమైయుండెను. ప్రజలయందే కాదు సర్వాధి కారులయందు, సేనలయందు, మంత్రులయందు నీ కోపభావము రూఢమైయుండెను. సహదేవుడు పెద్దవాడు కావలెను. ఏదో వ్యాజము కుదరవలెను. అప్పుడు కాని వీనికి ప్రతిక్రియ చేయుటకు వీలులేదు. జరాసంధుడు ద్వారకమీది కెన్నిసార్లు దండెత్తివెళ్లెను? ఎన్నిసార్లు ద్వారకను తగులబెట్టెను? ఎన్నిసార్లు యాదవసేనా సమూహమును పీనుగుపెంటలు జేసెను? మధురానగరము గిరివ్రజపురమునకు నమీపము. ఆ కృష్ణుడు జరానంధుని ధాకిడులు తట్టుకొనలేక పారి పోయెను. పశ్చిమ సముద్రమునం దిల్లు కట్టుకొనెను. అపుడు మాత్రము జరాసంధు డతనినివదలిపెట్టెనా? ద్వారక నెన్నిసార్లు ముట్ట డించెను? కృష్ణు డుగ్రసేనుని పేరుతో మధురను పాలించుచుండెను. జరాసంధునిమిత్రమైన కంసుని వధించెను. నాటినుండి కృష్ణ జరా సంధులకు బద్ధవిరోధము. ఈ విరోధము వట్టి రాజ్యసంబంధమైనది కాదు. అంతకంటె నధిక కారణములు కలవు. జరానంధుడు శాక్తే యుడు. శ్రీకృష్ణుడు కాడు. శ్రీకృష్ణుడు శాక్తేయమతమునకు వ్యతి రేకి. అతడు వైష్ణవమతావలంబి. అది మరల వైష్ణవమతము కాదు. అది యేదో చిత్రమైన మతము. వైష్ణవము కాదు; శైవము కాదు; గాణాపత్యము కాదు; పాశుపతము కాదు; శాక్తేయము కాదు. అది యొక ముక్కుమొగములేని మతము. వేదశాస్త్రములు ప్రమాణములే. చాతుర్వర్ణ్యము ప్రధానమే. తపస్సు కావలసినదే. క్రతువులును కావలసినవే. మరియు నిందులో దేనికిని ప్రాధాన్యములేదు. భక్తి ప్రధానమా? అట్లని చెప్పుటకును వీలులేదు. ఇట్టి మతము నొకదానిని —జరానంధు డెరుగనివానిని— ప్రజలకు సుపరిచితము కాని దానిని

కృష్ణుడు వ్యాపింపజేయుచుండెను. దానిమూలమున నేమగుచుండె ననగా బహు రాజ్యము లొక సిద్ధాంతముమీద స్థాపింపబడిన వానికి ప్రజావిశ్వాసములయందు కదలిక కలుగగా సంఘవ్యవస్థ తొలి నాటి మూలస్థితినుండి చెదరిపోవుచుండెను. ఇది యనాదిస్థితి యని వార్ష్ణేయులు చెప్పుదురు. శాక్తేయమునకు దెబ్బ తగులుచున్నది. అనాది మతము శాక్తేయము కాని కృష్ణునిమతము కాదు. ఎప్పుడు కృష్ణునకు వ్యతిరేకత గిరివ్రజము వహించెనో, జరాసంధుని మృతితో నెప్పుడు గిరివ్రజపురమునందు శాక్తేయమతము నడలెనో యప్పుడు తత్ప్రజల మత మేమైనది? ఏమతమైన నేమి ? కృష్ణుని సాధించుట పనియైనది. అది యే మతమైనను సరే! మానవస్వభావ మిట్లుండును. వానికి సాధ్యము శత్రునిరాసము. మోక్షముకాదు. ముక్తికాదు. కర్మలను గెలుచుటకాదు. ఇంద్రియములమీద జయము సాధించుటకాదు. శత్రువులను సాధించుట. గిరివ్రజపురమున నిట్టి భావము సహజము గనే కలిగెను. ఏ మంత్రియైనను ఏ సేనాపతియైనను ఏ యధికారి యైనను చివరకు సామాన్యపౌరుడు కూడ కృష్ణ విరోధభావమును పాటించుచుండెను. వారి కదియే పరమార్థము.

ఇట్టి స్థితిలో శాకయ్య గిరివ్రజపురము ప్రవేశించెను. వచ్చిన శాకయ్య తన మతమునందు, తన విశ్వాసమునందు కొంతదార్ఢ్యమేర్ప రచుకొన్నవాడు. వాగ్మిత సంపాదించుకొన్నవాడు. కొంత యభ్యాసము చేసికొన్నవాడు. కొన్ని లక్షణము లలవరచుకొన్నవాడు. అతడు తన గృహమును వదలిపెట్టి యెదేండ్లైనది. అతని ప్రథమసూత్రము - కోప మును ప్రదర్శించరాదు. రెండవసూత్రము పరోపకారము చేయ వలెను. ఈ పరోపకారము బుద్ధియందు నిష్ఠమై యుండనక్కరలేదు. లోకసంగ్రహణముకొరకు చేయవలెను. మనము పరోపకారముచేసినచో జనులు మనకు వశమగుదురు. వారు మనము చెప్పినట్లు విందురు. మనలను గురువులుగా పూజింతురు. అందుచేత శాకయ్య తా నెట్టి సాహసమునైన జేసి పరోపకారము జేయుటకు సిద్ధపడును. దీనికి తో డతనికి తన జాతకమునందు దృఢమైన విశ్వాసమేర్పడెను. తాను గొప్పవాడై తీరవలెను. అందుచేత తన కకాలమృత్యువు లేదు. మరియు నింతకు పూర్వ మెప్పుడును శాకయ్య తన వయస్సు చెదర

కుండ నున్నదనిమాత్రమే తెలిసికొనెనుగాని తనకున్న శరీరబల మెంతయో యత డూహించలేదు. అతడు వచ్చెడి దారిలో నొక పెద్ద నది వరదలమీద నుండెను. దానిని దాటుటెట్లు? దాటకుండ నుండుటెట్లు? తనను తన శత్రువులు తరుముకొని వచ్చుచుండిరి. అతడు అచ్చట తన కాశ్రయమిచ్చి పోషించినవారి యింటిలో నొక యవివాహితయైన బాలికను చెరచెను. బలవంతముగా నామెను గల సెను. ఆమె తలిదండ్రులతో చెప్పెను. అది పెద్ద రభసయయ్యెను. ఇతనిని వధించుటకు వారు నిశ్చయించిరి. ఇతడు పలాయన సూత్ర మును పఠించెను. వా రితని జాడ కనుగొని తరుము చుండిరి. దొరకెనా, కత్తికి కండగా కోయుదురు.

నడుమ పెద్ద నదియున్నది. ఈ నది దాటినచో మగధరాజ్యము వచ్చును. శత్రువులు తన నచటకు వెన్నాడలేదు. నది వరదలమీద నున్నది. ప్రవాహము సుళ్లు దిరుగుచున్నది. సుడులు గిరగిర తిరు గుచు గుతగుత లాడుచున్నవి. ప్రవాహము సూటిగా పోవుటలేదు. ఒకచోట మలుపుతిరుగును. అనేకవస్తువులు కొట్టుకొని వచ్చుచుండెను. పెద్దపెద్ద దూలములను ప్రవాహము కదలించి తెచ్చుచుండెను. పశు గ్రాసపుమేట్లుమేట్లుగావచ్చుచుండెను.ఒక గృహములో నున్న మనుష్యు లతో నహా నదిచేత తరలింప బడుచుండెను. మేట్లుగా నదిచేత తర లింప బడుచుండెను. ఆలోపల జన మాహాకారము చేయుచుండిరి. ఆ ప్రవాహ మహావేగమునకు పెద్దపెద్ద భుజంగములు కొట్టుకొని వచ్చుచు నొడ్డునకు ఈదలేక పోవుచుండెను. మెలికలు మెలికలై గిల కలు గిలకలై మలకలు మలకలై పొరలివచ్చు నా ప్రవాహము చూచుటకే భయంకరముగా నుండెను. అందెవడు దూకుటకు సాహసించును! దూకినచో నెవడాతలియొడ్డునకు చేరును? మరియు నా ప్రవాహము తటప్రాంతములందు లోతుతక్కువయైనట్లు లేదు. తట ప్రదేశమందే యగాధముగా నుండెను. శాకయ్యా వారి చేతులలోబడి కత్తుల కెరయగుటయా? ప్రవాహములోదూకి "నదీనాం సాగరో గతిః" యన్నట్లగుటయా? వారి కత్తుల కెరయగుట నిశ్చయము. ప్రవాహములో బడిపోయినచో చచ్చునో చావడో! ఎట్లు బ్రతుకునో! ఎవడు బ్రతికించునో! ఆయుర్దాయమున్నది కదా! ప్రవాహము

మెడనుకోయదు. శరీరమును ఖండించదు. గత్యంతరములేక యితడు ప్రవాహములో దూకెను.

అతడు తమ గ్రామతటాకమునం దీదుట నేర్చికొనెను. కృష్ణానదిలో నాలుగైదుసార్లు, కారణాంతరములచేత, నీదుట కలిగెను. జలములందీదుట మాత్ర మతనికి క్రొత్తకాదు. కాని యీ ప్రవాహమం దీదుట సులభమా! మహానర్తములు కొట్టుకొని పోవుచున్నవి. బలిష్ఠములైన దున్నలు నిలుచుటలేదు. కానిమ్ము; దూకెను. ఈదుచుండెను. ప్రవాహము తోయుచుండెను. తాను కొంత ప్రవాహమున బడిపోవుచుండెను. కొంత యడ్డ మీదుచుండెను. ఒక సుడిని తప్పించుకోగా కొంత మేర సుడులు తిరుగని జలము. అచట వట్టి పవాహము. ఒక సుడిలో మునిగి యడుగునకు పోగా నచ్చటనే నేలను పట్టుకొని ఖురదలో కాళ్ళుగ్రుక్కించి సుడియొక్క త్వర సడలిన తరువాత తత్ప్రదేశములను తొలగి పైకివచ్చుట. ఆయుర్దాయము భద్రముగా నుండవలయును గాని మృత్యు కరాళవదనగహ్వరమునుండి కూడ వెలికి రావచ్చును. ఆ మృత్యువున కావేళకు ఓకరము కలుగును. ఆ యోకిరింతలో నది వీనిని క్రిందనుమియును. ఇతనిని వెన్నాడెడి వారు నదీతటమునకు వచ్చిరి. సంతోషించిరి. వాడు నిస్సంశయముగా ప్రవాహములో నశించునని నిశ్చయించుకొనిరి. కొంత సేపటి కతడు కనిపించలేదు. వారి దారిని వారు వెడలిపోయిరి.

శాకయ్య చచ్చిచెడి చేయంగల విన్నపములై తలతిరిగి ముద్ద నోటిలోనికి వచ్చి స్మృతిమాలిన స్థితిలో కొట్టికొనివచ్చు నొక పెద్ద మట్టి పెళ్లమీద బడెను. మట్టి పెళ్లయనగా నది మట్టి పెళ్లగాదు; నుమారు ఇరువది గజముల చతురస్రమైన యొక పెద్ద తుంగనేల. పెద్ద పెద్ద దుబ్బులతో నున్నది. అది సులభముగా కరగి పోయెడిదికాదు. ఏ కొండకైన కొట్టికొని నగము చిదిసినచో చిదియవచ్చును. ఆ పెళ్ల యట్లు మూడు జాములు ప్రయాణము చేసెను. కొట్టుకొని పోవుచుండును. ఒక యడ్డంకిని పట్టుకొనును. మరలతొలగును. కాని దీనిని పట్టికొని ముంచెడు శక్తిగల యావర్తమంతటి ప్రవాహములో లేక పోయెను. అతనికి చిట్టచివరకు స్మృతి వచ్చెను. తన స్థితి తెలిసి వచ్చెను.

తనస్థితి తెలిసివచ్చిన తర్వాత తన స్థితిలో కొంత భద్రతయున్న దని యతడు గ్రహించెను. కాని సముద్రాభిగామిత్వము తప్పదు. ఏమిచేయవలయును? చాల సేపటికి వానికి కొట్టికొని వచ్చుచున్న కొన్ని కాష్ఠములు కన్పించెను. కష్టపడి యొక దానిని తాను సంపాదించెను. అతనికి పడవనడపుట చేతకాదు. చుక్కాని పట్టుట చేత కాదు. ఆ పెద్ద కఱ్ఱతో నీ తుప్పమెట్టను తాను నడిపించగలడా? తన యిచ్ఛవచ్చిన దెసకు మరలించగలడా? దాని స్వరూప మెట్టిది? చాల ప్రయత్నము చేసెను. పెద్దసేపటికి వానికి గొంచెము తెలిసి నట్లుండెను. ఒక పద్ధతిలో నా తుప్పను కొంచెము తన యిచ్ఛవచ్చిన వైపునకు మరలించ గలిగెను.

ధాత్రిమీద నూకలున్నచో దానియంతటనదే యొక మార్గము కనిపించును. ఈ తుప్ప యొక చిన్నకొండకు దగ్గరగా బోవుచుండెను. ప్రవాహము దీనిని కొండకు తగులకుండ లాగుచుండెను. ఇతడు కొండను పరిశీలించెను. అది ప్రవాహములో మునిగి శిఖరము మాత్రము కన్పించుచు చిన్న గుట్టవలె తోచుచున్నది కాని కొంత పెద్ద పర్వతమే యైయుండవలెను. అనగా దాని పరిసరమున ప్రవాహములో కొండయొక్క కొంత భాగము వ్యాపించియుండవలెను. ఈ తుప్పను కొండదగ్గరగా తీసికొనిపోయినచో నచట లోతు తక్కువగా నుండును. సుడులుండవు. వట్టి నీళ్ళుండును. ప్రవాహవేగము తగ్గి యుండును. ఆతడు తనచేతిలోనున్న గడతో పర్వతము క్రిందిభాగము తగులునేమో యని గడతో స్పృశించెను. ఒకచోట గడకేదియో తగి లెను. అది కొండయైనచో తాను బ్రతికినట్లే! మరల గడవేసినొక్కెను. గడపెకలించుటకు రాలేదు. ఇప్పుడొక్కటియే మిగిలినది. తుప్ప నా పుటకీమాత్రము చాలదు. ఇంతసేపు తుప్ప పెద్దదగుట తనకు మహోపకారమయ్యెను. ఇప్పుడు తుప్పపెద్దదగుట తనకు మహాపకారమయ్యెను. తాను గడను వదలిపెట్టి పోవలెను. గడను వదలిపెట్టినచో ప్రాణములను వదలినట్లే. కాని తుప్ప గిరగిర తిరుగుచున్నది కాని సాగిపోవుటలేదు. తుప్ప చిన్నదియైనచో బాగుగా నుండును. తుప్ప రెండు మూడు గజముల చదరము గలిగినదైనచో తన పనికుపయోగించును. దానిలో నొక ముక్కను నరకుటకు తనవద్ద పలుగులేదు.

కొండపై భాగమున నెచ్చటనో యిరుకుకున్న గడను తాను వదలి పెట్టుటకు వీలులేదు. తుప్పనడిమి భాగమున్నంతభద్రముగా చివళ్లు లేవు. అవి మిక్కిలిగా తడిసియున్నవి. తాను చివరకు వచ్చి తన పాదములతో కొంతమేరను తన్నివిడగొట్ట ప్రయత్నించెను; ఒందు రెండు నిమిషములలో నతని ప్రయత్నము సఫలమయ్యెను. తుప్పలోని పెద్ద ముక్క ప్రవాహములో బడి పోవుచుండెను. తనకు మిగిలిన ముక్క చాల చిన్నది. అది తనకు తాత్కాలికముగా నాశ్రయమిచ్చునే కాని పట్టు మని యరగడియు కాలమైన నీయలేదు. అతడు గడను కనపడుచున్న కొండ కొమ్మువైపు త్రోసి తిప్పనువదలి తిప్పయున్నచోటికి రెండు బారలు దూరముగా కొండకు దగ్గరనగా నీటిలోనికి దూకెను గడ వెంట ప్రాలి, గడను చేతులతో పట్టికొని పాదము లింకను కొండ కొమ్ము దగ్గరకు పోగా నచటికిదూకి గడను వదలిపెట్టి ప్రయత్నముతో కొండ కొమ్మున కభిముఖముగా పోయి యచటి జలముల వేగమునకు నహింపగలిగినట్లుండుటచేత కొమ్ముకడ కీదికొని పోయెను. ముల్లు పుచ్చి కొట్టుడచికొన్నట్లున్నది. ఆ కొమ్ముమిద నొక మహాసర్పము కన్పించెను. అదియు తనవలెనె యచట నాశ్రయ మేర్పరచి కొనెను. ఇతడు భయపడెను. ఆ సర్పము తన నెమియు చేయునట్లు లేదు. అదికూడ ప్రాణభయముచేత తలదాచుకొన్నట్లుండెను. మహాపన్నగ్నులైన జను లొకరి నొకరు హింసించుకొనరు. ఒకరి నొకరు మేలు చేయుదురు. విరోధ మేకార్థసమవేతులయం దుండును; నమానా పన్నగ్నులయందుండదు. ఏకార్థసమవేతులలో తక్కిన వారిని తొల గించి తాను దానిని పొందుట యెట్లా యను ప్రశ్నయుండును. నమానాపన్నగ్నులలో 'సందరము కలసి యీ యాపద నెట్లు తొల గించుకొందమా' యన్న ప్రశ్న సామ్యముండును. ఈ సామ్యమైనను జాతియొక్క సామ్యధర్మము నాశ్రయించియుండును. ఇది తాత్కాలి కము. ఆపద యెంతవరకుండునో యంతవరకే. ఇది సామ్యధర్మము. అందుచేత భయము భయమే. మరియును తానున్న యాపదస్థితిలో తనకు పాము తోడుపడెడిదికాదు. తానాదమరచి నిదురపోరాదు. ఆ సర్పము చలిచేత ముడుచుకొని పోయెను. ఈ పాడినేల సూర్యకిరణ ములు తగులుచుండగా దానికిని కొన్ని నిముసములకు జాగ్రత్త

కలుగవచ్చును. దాని నేమిచేయవలయును? దానిని నదిలోనికి యెట్లు త్రోయుట. ఆ ప్రయత్నములో నది తన ప్రాణములను రక్షించుకొనుటకు ప్రయత్నించును. ఏ కాష్ఠము ఏ గడ తా నీ భద్రమైన స్థలమునకు వచ్చుటకు సాయపడెనో యది యిప్పు డిచ్చుటకు వీలు లేకపోయెను. తానేమి చేయగలడు? తాను చాల డస్సియున్నాడు. అతడు విచారించగా తా నీ నదిలో నెంతకాలమున్నాడు? నిన్న ప్రొద్దు వాటారినవేళ వారు తనను తరుముకొనివచ్చిరి. ఇపుడు జాము ప్రొద్దెక్కినది. అనగా తాను నీటిలోగాని, తుప్పమీదగాని యొక రాత్రియు నొక పగటిలో సగము నున్నా డన్నమాట. తాను బలవంతు డన్నమాట. ఎంతటి సెగికైనను తన శరీరమోర్చికొనగలదన్నమాట. కష్టపడగలడు. అనగా తానెప్పుడును ప్రయత్నించి చూచికొనలేదు. గాని తన శ్రమ తీరినచో తా నీ సర్పమును పడగయందు పట్టికొని దాని ప్రాణములు తీయగలడు. తన శ్రమ తీరునప్పటికి దాని చలి తీరునేమో. తాను బ్రతికినన్నాళ్లు నెపరిశ్రమయులేకుండ, నేవిద్యయు నేర్వకుండ, చివరకు పాములవాళ్లను బట్టికొని పాములను ఒడిసి పట్టుకొను విద్యనైన నేర్వలేదు. అత డూహించెను, మానవ దేహములలో నుష్ణత్వము చేకూరినంతతొందరగా సర్పదేహములలో చేకూరునా? మానవదేహములో రక్తమున్నది. రక్తములో సహజముగా నుష్ణతను పెంపొందించు లక్షణమున్నది. సర్పదేహములో రక్తముండదు. అది చీమో! ఏదో పసరువంటిది. దానియం దుష్ణత తొందరగా కలుగక పోవచ్చును. కాని సర్పము చురుకైన జంతువు. జంతువునందు చురుకుదనము, లోనున్న రక్తము నాశ్రయించి యుండును.

అంతియేనా, లేనిచో సర్పముల శరీరములందున్న యొక యాభాసమైన రక్తమునం దధికమైన చురుకుదనమున్నదా? పెద్దపెద్ద సర్పములును మహావ్యాఘ్రములును పోరాడుకొనుకథ లతడు వినాడు. ఓడిపోవునదివ్యాఘ్రము. చనిపోవునది వ్యాఘ్రము. ఆకయ్యములో పాము వ్యాఘ్రమునకు తన మెడయందకుండ మలుపులు తిరుగుచుండును. పులి పాము నంపందు కరచుచుండును. పాము తన పెద్దతోకను పులి నడుమునకు పెనవేసి బిగించును. చుట్టలు చుట్టును. బిగించుచుండును. పులికూపిరాడదు. దీని శక్తి యుడిగిపోవును.

పాము పులిని కరచుచుండును. దీని వినముకూడ పులియందు పని చేయునేమో తెలియదు. పులి యొడుపుగా పాముయొక్క పడగకు బె త్తెడెడముగ పట్టుకొని కొరికి చంపినచో పాము చచ్చును. కానియట్లు జరుగుటెట్లు? పాముయొక్క లాఘవము మెలిక తిరుగుట - కాటును తప్పించికొనుట. ఇది పులియొక్క లాఘవమును మీరిన విషయములు. పామును మెడయందు బట్టికొని చంపవలయుననగా నీలోపుగా దాని తోకతో నదిచేసెడి యాగడమును సైరించుకొనవలెను. అది ఫడేలు ఫడేలుమని తోకతో నాడించుచుండును. దానికి కోరలయందు విష మును, బలము తోకయందును నుండును. అనగా పాము మెడను బిగించి పట్టుకొన్న కుడిచేతి యందుకంటె దానిపుచ్ఛమును తమా యించుకోగల శక్తి యెడమచేతి యందుండవలెను.

ఇది చిన్నిగుట్ట. క్రింద నెంత కొండయున్నదో తెలియదు. ఒకవేళ పాము నితడు పోరాడవలసి వచ్చినచో గుట్టకొపిరెమీద నెడములేదు. ఇద్దరును కలసి మరల ప్రవాహమున బడవచ్చును.-ఈసారి యతడు ప్రవాహమునబడినచో దట్టుకొనుట కష్టమే. తాను తొందరపడుట యెందులకు? పామునకు జాగ్రదవస్థ వచ్చినతరువాత విచారించ వచ్చును. అప్పుడు విచారించెడివేమి? విచారించినచో నిప్పుడే విచా రించవలెనేమో! ఈ గుంజాటనతో నతని కేమియు పాలుపోలేదు. ఇంతటితో నరిపోలేదు. మరియు జాగ్రత్తగా చూచినచో నేరింకను పొంగుచుండెను. కొండకొపిరెమీదనున్న భాగము మూసికొనిపోవు చుండెను. కొండలోని పొడిభాగము తక్కువ యగుచుండెను. అప్పు డతని యదృష్ట మొక్కటియే. అది పగలు జాము ప్రొద్దెక్కుట. ఇంకను మూడుజాములు పగలున్నది. ఆ నది యెంత పొంగునో యేమో! తెలియదు. నడిమింటికి సూర్యుడురాగా పామునకు మాంద్యము వదల వచ్చును. అప్పటి కిద్దరును కొండమీద నిలుచుండుటకు తావులేక పోవచ్చును. లేదా ఒక పరిమితమైన స్థలము నిద్దరాక్రమించుటకు ప్రయత్నించవచ్చును. అప్పు డెవరు గెలుతురో వారి దా పొడినేల కా వచ్చును.

దైవవశమున నతడున్నచోటి కొక పెద్ద కఱ్ఱవచ్చెను. కొంచెము దూరముగా నది ప్రవాహములో నుండెను. తానున్నచోటికి వచ్చు

చుండెను; పోవుచుండెను. దానియంతట నది తనదగ్గఱకు వచ్చునట్లు లేదు. తానే నీళ్ళలోదిగి యాది వానిని తెచ్చికొనవలయును. ఇది భగవంతుడు తాను సర్పమును సాధించుటకు పంపిన యాయుధమన వచ్చును. చివరి కా కొండకొమ్ముమీద నొక్కరే నిలుచుండుటకు తగిన స్థలముండుచో బామును తొలగించక తప్పదు కదా! అతడు నెమ్మదిగా నీటిలోనికి జొచ్చెను. అతనికొక్కటియే యాధారము. అతడు నిన్న సాయంకాలము నదిలో దూకినప్పుడు తాను కట్టినదోవతిపై నున్న యుత్తరీయము సుదృఢముగా తనశరీరమునకు బంధించుకొనెను. అతడా రెండు వస్త్రములను తన దేహమున బంధించిన లక్షణము చూచినచో వాని దేహము నీళ్లలో కుళ్లిపోయినను వాడు వేసిన ముళ్ళూడవు. కొండ కొపిరె చేరినప్పటినుండియు నెమ్మదిగా నా ముడు లూడదీయ నారంభించెను. ఇప్పటికు త్తరీయము సడలెను. ఆ యుత్తరీయమును పది పీలికలుగా చించెను. త్రాళ్లుగాపేనెను. ఒకదానికొకటి గట్టిగా ముడివేసెను. కొండకొమ్మునం దొక కొనకు చివర బిగించి యొక చివర తన నడుమునకు కట్టికొని జలములోనికి జొచ్చెను. ఎట్టెననేమి యాకఱ్ఱను సాధించెను. కొండకొపిరెమీదికి తెచ్చెను. ఇప్పు డతనివగ్గర నున్నవి రెండు సాధనములు. ఒకటి త్రాడు; రెండవది కఱ్ఱ. ఇంతలో నది మరియొక యంగుళము పెరిగినట్లున్నది. భగవంతుడు రక్షించి యింక కొంత సేపటిలో నది తీయుట కారంభించనిచో కొంతసేపటి కీ కొండ కొపిరె యుండదు. అప్పటిమాట యేమగునో. ఈ లోపుగా నీ సర్పమునకు జాగ్రత్త రాకుండ నిది యేటిలోబడి కొట్టికొనిపోవునా, లేక పరిశిష్టమైన యల్పప్రదేశమున తనతో వివదించునా? ఆ నిదుర పోవుచున్న పాము—మరియు నొకయూహ. అది యావరకే చచ్చి పోయినదా—కాష్ఠముతో ప్రవాహములోనికి త్రోయుటకు యత్నించినచో నేదియో యిప్పుడే తేలిపోవును.

అది చుట్టచుట్టుకొని పండుకొనెను. దాని మెడమీద కఱ్ఱతో కొట్టుటకు వీలులేదు. దాని మెడ విడిగా రాతిమీద నుండినచో మెడ మీద కఱ్ఱదెబ్బ తగులునుగాని దాని మెత్తని యొడలిమీదనున్న మెడ మీద కఱ్ఱతో కొట్టినచో దానికి దెబ్బతగలదు. అతనికి మరియొక యూహవచ్చినది. ఈ త్రాడొకటి తనవద్దనున్నది. దీని కేనుగ మెలికె

వేసి సులభముగా దాని మెడ నందులోనికి దూర్చి ప్రాణోత్క్రమణము జరుగువరకు బిగించినచో నేమగునో ! అప్పు డది ముడుతలు విప్పికొనుచు. మెడయందున్న ముడిని తప్పించుకొనుటకు ప్రయత్నించును. తాను త్రాటిని మిక్కిలిగా బిగించును. ఆ సమయములో దాని మెడ దాని మేని చుట్టుమీద నుండదు. రాతిమీద నుండును. కత్తితోకొట్టి చంపవచ్చును అతడట్లే చేయుటకు నిశ్చయించికొనెను. త్రాటికేనుగు మెలికవేసి దాని తలనందులోనికి దూర్చుటకు యత్నించెను. ఆ యత్నము సఫలమయ్యెను. త్రాడు బిగించినకొలదియు పాము కొట్టుకొన నారంభించెను. అది చుట్టుకొన్న చుట్టలు విడిపోనారంభించెను. చుట్టలు విడిపోయినచో దాని చంక్రమణమునకు కొండపైనున్న స్థలము చాలెడునట్లులేదు. అతడు కత్తితో దానిని మెడయందు వధించెను. దానికి ప్రాణముపోయినది. కాని తోక తెగమెలికలు తిరుగచున్నది. ప్రయత్నముచేసి కాష్ఠముతో దానిని ప్రవాహములోనికి త్రోసి వేసెను.

అది మరల కొండమీదికి రావలయునన్న ప్రయత్నము చేయుటకు పామే లేదుకదా ! దాని పుచ్ఛమంతయు నదిలోపడి కొట్టికొనుచు కొట్టికొనిపోయెను. ఇప్పటి కొక్కటి స్థిరమైనది. ఇప్పుడచ్చముగా నా కొండకొమ్ము తనదే. తానే సర్వాధికారి. కాని పామును మడియించెను గాని యంగుళ మంగుళము పెరిగి వచ్చుచున్న నది నెట్టు లదుపులో పెట్టును? అత డొక్కటి నిర్ణయించెను. తానున్నచోటికి నది యెంత పెరిగివచ్చినను పెద్ద ప్రవాహముకాదు. ప్రవాహవేగమచ్చట నుండదు. వట్టిజలమువచ్చును. అందుచేత తాను నాల్గు రాళ్లనడుమ కూర్చున్నచో, లేదా కత్తిను రెండు రాళ్లనడుమ నిరికించి దానిని గట్టిగాపట్టికొన్నచో, త్రాటితో తనను దాను గాఢమైన యచటనున్న శిలాశకలమునకు బిగించికొన్నచో, లేచి నిలుచుండినచో తాను కొట్టుకొనిపోడు. ఒకవేళ నది పెరిగినను కొండకొమ్మునుమించి నిలచిన తలయెత్తు పెరుగదు. అంతయెత్తు పెరిగినచో నది జలప్రళయమే యగును. ఇత డా ప్రయత్నముచేసెను తానచట భద్రముగా నిలుచుండెను. రాత్రి రెండుజాములకు నది పెరిగి పెరిగి నిలుచున్న తన నడుమువరకు వచ్చెను. అప్పటి కతనికి తత్పూర్వమందున్న

ధైర్యము పోయెను. ఇంత పెరిగిన నది మరి యింత పెరుగదని లేదుకదా! గాఢాంధకారము — చుట్టుపట్ల నంతయు జలమయము. ఎంతమేర వినిపించినను తరంగముల నవ్వడి భయంకరముగా నుండెను. పగటియెండ ప్రాణములను తేర్చినది. కడచిన సగము రాత్రి చలి మరల ప్రాణములను మెలిపెట్టుచున్నది. అతడు నిస్సందేహముగా తెల్లవారువరకు గడ్డకట్టి పోవును. మునిగిపోవును. తాను బ్రతుకుట దుర్లభము. అప్పు డత డిట్లనుకొనెను. ఇచట కాకపోయిన మరియొకచోటికి ప్రవాహముతో గొట్టికొనిపోయిన నెదో మార్గమున బ్రతుకుటకు వీలయ్యేడివేమో! ఇప్పుడు తనకుదాను శిలకు బంధించికొనెను. బంధించినకట్లు తొలగించికొనుటకు తాను నీళ్లలో మునిగి, కొంతసేపుండవలెను. పట్టి లెక్కనైనచో పదునేను దినములు నిరాహారిగా నుండగలడు. ఇంతటి శ్రమలో పదునేనుదినముల ప్రమాణము క్రమముగా తగ్గిపోవుచున్నట్లు కన్పించెను. ఆకలియు నగుచున్నట్లనిపించుచుండెను. అప్పు డతనికి తెలియుట యన్నది మానివేసెను. నది పొంగుచున్నదా? నిలబడియున్నదా? తగ్గుచున్నదా? అతని బుద్ధికి యజ్ఞ మానెను. అతనికి తెలిసినదొకటే! ఆ తెలిసినది మరునాడు తెల్లవారి కొంత యెండ యెక్కి తన యొడలునందు చలి తగ్గిన తరువాత నది తీసనది. ఎంత తీసినదనగా నది యతని జంఘల దాక వచ్చినది.

మరి కొంత ప్రొద్దెక్కెను. నది సీలమండలలోకే వచ్చెను. పగలు రెండు జాములైనది. తన పాదముల క్రింద కూడ నీళ్లు లేవు. అమ్మయ్య! బ్రతికితిని! ఆనాడు సాయంకాలమునకు వెలుగు లింకను మాయకమునుపు దూరాన నొక దృశ్యము తోచెను. ఒక తెప్ప కొట్టికొని వచ్చుచుండెను. దానిమీద నొక స్త్రీయు, నొక కుఱ్ఱవాడు నుండిరి. వారేడ్చుచుండిరి. వారితనిని చూచి రక్షించుమని కేకలువేసిరి. ఇతని కొక్క యూన యుదయించెను. వారివద్ద నాహారమేమైన నుండునేమో! తన త్రాటితో, తన కఱ్ఱతో తాను ప్రయత్నముచేసి తన త్రాడు వారికి విసరివైచి వారిని దానిని పట్టుకొమ్మని నెమ్మదిగా నా తబకను తనవైపునకు లాగెను. ఆ తబక ప్రవాహమునుండి తొలగి నిలచిన నీటికి వచ్చెను. ఇప్పు డింకొక జెడద సంభవిల్లెను. తన చుట్టునున్న

జలము ప్రవాహములోనికి లాగుచుండెను. పూర్వమే బాగుగానుండెను. అత డెట్లో కష్టపడి వారిని తానున్న మెట్టకు చేర్చెను. వారివద్ద రొట్టెలుండెను. వారును బ్రతికితి మనుకొనిరి.

ఆమె భర్తృ విహీన. ఇత డామెకొడుకు. వారిది కొంత పేద సంసారము. ఊరివెలుపల నిల్లుకట్టుకొని నివసించుచుండిరి. నిద్రలో నా యూరు మునిగిపోవుటయు, వారియిల్లు కూలిపోవుటయు, వారు దైవ వశమున బ్రతికియుండుటయు, తప్పించికొందమని యొక గడ్డి మేటిలో పండుకొనుటయు, నా గడ్డిమేటి పురాణఘనముల గ్రంథి యైన మట్టిపెళ్లమీద నుండుటయు, వారు కొట్టికొని వచ్చుటయు జరిగినది. కడచిన రాత్రియే యిది సంభవించెను. ఆ తల్లి పేదరా లయ్యు కొడుకుకొరకు కెప్పుడును రొట్టెలుచేసి యుంచుకొనును. ఆ రొట్టె లున్నవి. ఆమె తానును, తన కొడుకును బ్రతికితి మనుకొనెను. బ్రతికించినవాడు పరమేశ్వరు డనుకొనెను. నది యింక పొంగదు. రెండు మూడు నాళ్లలో పూర్తిగా తీయును. ఈ రెండు మూడునాళ్లు నా రొట్టెలమీద బ్రతికినచో 'సందో రాజా భవిష్యతి.' పది రొట్టెలున్నవి. పెద్దపెద్ద రొట్టెలు. నాల్గుదినములకు తల్లికొడుకుల కిద్దరకు నాల్గురొట్టెలు చాలును. తక్కిన యారురొట్టెలు కలవు. పూర్తిగా నదితీసి, తాము సురక్షితముగా నెచ్చటికో చేరెడివరకు తా నింకొక రొట్టెకూడ తిననని యామెకు నచ్చజెప్పి యతడు మిగి లెడి యారు రొట్టెలను తినెను. ఆమె అవుననలేక పోయెను; కాదనలేక పోయెను. అతడు ప్రాణదాత కదా! క్రమక్రమముగా నీరు తగ్గు చుండెను. రెండు దినములలో కొండయంతయు గనిపించెను.

అది పెద్ద పర్వతము. ఆ పర్వతముమీద చెట్లు చేమలు కలవు. అది క్రమముగా తడిసిన కొండయైనను తత్రతత్ర పొడి యేర్పడు చుండెను. త్రాగుటకు జలముమాత్రము సమృద్ధిగా నుండెను. వారి యదృష్టము కొలది యిది నదియయ్యెను. సముద్రమైనచో నుప్పునీళ్లు కొట్టికొని పోవలసినదే! ఇంక రెండు మూడు దినములలో నది యథా స్థితికి వచ్చును. 'లంఘనములలో మనుగుడు' పని శాకయ్యు తాము సురక్షితముగా నుంటిమని తెలిసినంతనే యామెను వాంఛించెను. బల వంతము చేసెను. అతడు ప్రాణదాత. తన బ్రతు కెట్టైనను తన

కుమారుని బ్రతుకు అతనిమీద నాధారపడియుండెను. ఆమె లొంగి పోయెను. వారి రొట్టెలైపోయినతరువాత నది బాగుగా తీయుటచేత వారి కన్నము కొండమీద దుర్లభము కాలేదు. వారము దినములకు కొండ యొక్క కుడిభాగమునకు, ధాత్రికి సంబంధము కలిగెను. వారు బయలుదేరి దేశములోనికి బోవచ్చును. అది యే దేశము? తానెచ్చటి నుండి పారిపోయి వచ్చెనో యాదేశమా? ఆతనికి దిగ్భ్రాంతి చేకూరెను. సూర్యోదయమువలన తూర్పు దిక్కు తెలియుచున్నదేగాని తానెచట బయలుదేరెనో యేమియు గోచరించుటలేదు. ఇట్లుండగా తాను బుద్ధి పూర్వకముగా తన కామాధీన బుద్ధితత్త్వముచేత నొక సంసారమును మెడకు తగిలించికొనెను. ఈమె భార్య, వాడు కొడుకు. ఐదేండ్లక్రింద వారుగురు సంతానమును, భార్యను వదలిపెట్టి వచ్చినతరువాత నీ నడుమ కనీసము ఇద్దరు యౌవనవతులను తన భార్యలనుగా జేసికొను టకు ప్రయత్నించిన తాను నేడు పదియేండ్ల కొడుకుతోడి భార్యను హఠాత్తుగా సంపాదించెను. వీరి నెచ్చటనో దించిపోవలెను. దేశము లోనికి బోయిరి.

వరదలో కొట్టుకొని వచ్చిన సంసారమని యచ్చటి జను లాద రించిరి. పదిదినములలో నచటనున్న యొక పల్లియలో ప్రజల కతని మాహాత్మ్యము తెలిసెను. అతడొక సిద్ధుడు. పండితుడు. మహాప్రవక్త వారికచ్చట బ్రతుకు సుఖముగా గడచుచుండెను. అచట రెండు నెలలు గడచెను. కాని యతని యూహ వేరు. దైవము సంఘటించి నది వేరు. ఇది మగధదేశము కాదు. నదిని దాటినగాని మగధముల లోనికి బ్రవేశములేదు. అనగా తాను నదిలో ప్రవేశించకముందే స్థితిలో నుండెనో యా స్థితిలోనే యుండెనన్నమాట. నది దాటినతరువాత గిరి వ్రజమునకు పోవుటకు చాల యెగువకు పోవలెను. శాకయ్యకు నిజ ముగా తన యనుభవమును బట్టి జ్ఞానోదయము కావలెను. కొందరి కెప్పుడో యేదోయొక విలక్షణమైన జ్ఞానము కలుగును. వా రచ్చటనే పీటపెట్టుకొని కూర్చుందురు. తాను కృష్ణవిరోధి; గిరివ్రజమునందు కృష్ణ విరోధము సమృద్ధిగా కలదు. అత డీ క్రొత్త భార్యను,కొడుకును నొక యర్ధరాత్రమున విడచి, నదిదాటి వెడలిపోయెను.

# 9

ఇట్టి శాకయ్య గిరివ్రజపురము చేరెను. అచ్చట నది నర్ధరాత్రము నందు దాటెను. ఇప్పుడు అతనికి నదులను దాటుటయనగా పిలః పిలాయమానముగ నుండెను, చాల సులభమైపోయెను. ఎంత ప్రవాహ ము నైన నద్ది యీదగలడు. సుడిగుండము లున్నచో భయములేదు. ఆ క్రొత్త భార్యను, క్రొత్త కొడుకును నీలాచలమన్న గ్రామమున వదలి పెట్టెను. ఆ భార్యపేరు రత్నావళి. ఆ కొడుకు పేరు గోస్వామి. వారితో నితడు మూడునెలలు సుఖముగా కాపురము చేసెను. అచ్చటగూడ తన శక్తులచేత కొందరిని వశపరచుకొనెను. విశేషమేమనగా నీ నీలాచల గ్రామముయొక్క వెలుపలనెవరిదియుకాని ఒక స్థలమున్నది.అందులో నితనికి గ్రామస్థులు చిన్నపాక వేసిపెట్టిరి. అది వీరి స్వంతమైనది. ఇప్పుడు గోస్వామి వానికధికారి. వారి త్రిప్పలు వారు పడవలయును. ఇతడు లేచివచ్చెను. నది దాటినతరువాత గిరివ్రజము చాలదూరము. అతడారుదినములు కాలిమీద ప్రయాణము చేయవలసి వచ్చెను. అతని జీవితములోని రహస్యమొకటి యతనికి దెలిసెను; అతడు బ్రాహ్మణుల యిండ్లకు బోరాదు. విద్యావంతుల యిండ్లకు బోరాదు, సంపన్న గృహస్థుల యిండ్లకు బోరాదు. సంపదతో చదువుండును. చదువుతో తెలివియుండును. తెలివితో నాలోచనయుండును. విమర్శన యుండును. అట్టి వారెదో యొక దుర్వేళలో మోసపోవలయును గాని చటుక్కున మోసపోరు. అందుచేత నితడు ఆస్వాదకములకు లోపము లేని సామాన్యసంసారులను జూచి వారి యిండ్లకు బోవును. ఇతని యదృష్టముకొలది నావేళకు మగవాడింటిలో లేకపోయెనా ఆ గృహిణిని సులభముగా వశపరచుకొనును. అతని గెలుపు రెండు విధములుగా నుండును. గృహిణి యౌవనవతియై చూపరియై కొన్ని లక్షణములచేత

కామిని యన్న యభిప్రాయము కలిగించెదుననియైనచో సత డామెను సులభముగా నవ్వి మొగమునందు కొన్ని కొన్ని వికారములు తెచ్చి యొయ్యారముగా నిలుచుండి హేలగా మాట్లాడి యాకర్షించును. స్త్రీలలోని లక్షణములు బహువిధములుగా నుండును. కామము పురుషులలోవలెనే స్త్రీలయందు గూడ సర్వసాధారణమైనదే. కాని కొందరు పురుషులయందు స్త్రీలయందు శరీరగతములైన కొన్ని లక్షణములు బాతత్క్రమమును వెలికి కన్పింపజేయును. అట్టిది కాముకులైన వారికి పరస్పరము తెలియుచుండును. ఇది యతని మొదటి గెలుపు. రెండవ గెలుపుకొరకు స్త్రీలుగాని పురుషులుగాని కొంచె మమాయికులుగా కన్పించవలెను. కొందరి మొగములో తెలివి కొట్టవచ్చినట్లుండును. వారు సులభసాధ్యులు కారు. వారు ప్రతిదానికి వెక్కిరింతురు. తర్కమును పెంచుదురు. వారియందల్పశక్తులు పనిచేయవు. శాకయ్య యీ నాలుగైదేండ్లలో సన్న్యాసులను, బైరాగులను నాశ్రయించి రెండు మూడు విద్యలు నేర్చెను. వట్టిమేననుండి యింత విభూతితీయును. ఇదియొక క్షుద్రవిద్య. ఎవో కొన్ని బీజాక్షరము లుచ్చరించి యా భస్మమును తీసి వారిచేతులలో పెట్టును. వా రితడు మహాయోగి యనుకొందురు. ఇది రెండవగెలుపు. ఈ రెండు గెలుపులతో నత డీ యారుదినములలో సుఖముగా ప్రయాణము చేసెను. ఒకయూరిలో నచ్చట కొన్నినాళ్ళుండి పొగలిగినంత గెలుపుగెలిచెను. కాని తాను గిరివ్రజపురము పోవుట కప్పుడే మూడునెల లాలస్యమైనది. ఒక యెమ్మెలాడియైన సీమాటి యొక్క యాకర్షణము తెగత్రెంచుకొని గిరివ్రజపురమునకు వచ్చి వేసెను.

గిరివ్రజపురమనగా పెద్దకోట. భారత దేశమున వింధ్య పర్వతములకు దక్షిణమున కుండినపుర మెటువంటిదో యుత్తరమున గిరివ్రజపుర మట్టిది. కోటకు నాల్గువైపుల కొండలు. కోటయంతయు మహా పర్వతాగ్రమునందే యుండును. కుండినపురమునకు, గిరివ్రజపురమునకును కొంత భేదముకలదు. కుండినపురమున కోటయు, రాజవంశము, పెద్దరాజోద్యోగులు, ఏనుగులు, గుఱ్ఱాలు, సేనలు మాత్రమే విశాలమైన పర్వతోపరిభాగముననున్న కోటపైనుండును. పట్టణము క్రిందనే యుండును. గిరివ్రజపురమట్లుకాదు అంతయు పర్వతము

మీదనే. రాజవంశము మంత్రులు సేనలు మొదలైనవి యుండెడి ప్రధాన దుర్గము. ఆ కొండమీదనే మరియొక పెద్దకొండ. దానిని ప్రత్యేకముగా కోటయందురు. పట్టణమంతయు దుర్గమున కివతల నున్న మహా పర్వతముమీద నుండును. ఆ పర్వతము చుట్టుగూడ బురుజులుండును. అచ్చటికి పోవుటకూడ సాధ్యముకాదు. గిరివ్రజ పురములోనికి బోవలయునసగా పురములోనికి బోయి యేమి లాభము? కోటలోనికి పోవలయును. ఇతనికి కోటలోనికిబోవు సామర్థ్యములేదు. క్రింది పర్వతముమీదనున్న పట్టణములోనికిబోయి కొన్నిచోట్ల స్థావర మేర్పరచుకొని తన ప్రతిభ వ్యాపింపజేసి క్రమముగా దుర్గములోనికి బోవలెను. అత డెత్తినయెత్తు పెద్దది. జరాసంధుని కుమారుడైన సహ దేవుడు రాజు. అతని దర్శనము చేసి తనకు శ్రీ కృష్ణునియందుగల విరోధముతో నతని సానుభూతిని సంపాదించి కొంత చేయవలయును. శాకయ్యా కిప్పుడు మునుపుగల రెండాయుధములతో పాటు మూడవ యాయుధముగలదు. అది కృష్ణద్వేషము. గిరివ్రజపురమునందలి జనులందరు శ్రీకృష్ణుని ద్వేషింతురు కాని భగవంతుడనువాడు — వాడు మనుష్యునివలె నుండునో! వానికికూడ మానవులకువలెనే ముక్కు మొగము చెవి పాదము మొదలైనవి యుండునో! తెలియదు. వాడు పట్టి కామస్వరూపుడో! లేనిచో పరిస్థితులు చిత్రచిత్రముగా లోకమునందు బహుపురుషుల కేర్పడుచుండును. ఈ పరిస్థితులే వాడేమో! ఈ యన్ని విధముల వాడుండునో! వా డెప్పు డెందు కెవరి కేమిచేయునో తెలియదు. జరాసంధుడు వంద పందయేబది యేండ్లు భారత దేశమున మహా ప్రతిభతో విరాజిల్లెను. భారత దేశమునందలి సర్వ రాజ్యములలో వాని మాటకు తిరుగులేదు. వాని చెరసాలలో కొన్నివేలమంది రాజకుమారులు బంధితులై యుండిరనగా పదునారు వేలమంది రాచకుమార్తెలు బంధితలై యుండిరనగా వాని ప్రతిభయు, వాని పరాక్రమమును సామాన్యములై యుండునా? భగవంతుడు వాని యందు వికటించెను. ముగ్గురు బ్రాహ్మణులవలె వచ్చుటయేమి? వారు యుద్ధభిక్ష యడుగుటయేమి? ఛీ! పొమ్మన్నచో పోయెడు దానికి జరానంధుడిచ్చుటయేమి!ఇదిపరరాజు దండెత్తివచ్చి నదా? వాని సైన్యములు, వీని సైన్యములు తలపడి పోరాడినట్లా? అస్త్రశస్త్ర విద్యా

కుశలత్వ మేర్పరచుకొన్నట్లా? ఇది యేమి గెలుపు? అడిగినవాడు బ్రాహ్మణుడై యడిగెను. నిజానికి బ్రాహ్మణులు కాదాయెను. చేసిన దానమో, ఇచ్చిన భిక్షమో పుచ్చుకొన్నవాడు వేరు; కనిపించినవాడు వేరు. ధర్మమిట్లుండునా? ఇట్టివానికికూడ కట్టుబడియుండు మనస్సు కలిగియుండుట వీనిని సంహరించుటకు దైవమా మనోలక్షణ రూపముననుండుట. ఇది యొక యాశ్చర్యము. అదైవమిప్పుడు యోగించెనని రేపు యోగింపుననరాదు. ఎవనికో ఎందుకో యెప్పుడో యోగించును. ఒక్కొక్కప్పుడు గొప్పలో యోగించును; ఒక్కొక్కప్పుడు కొద్దిలో యోగించును. ఒకప్పుడు గొప్పవారికి యోగించును; ఒకప్పుడు కొద్దివారికి యోగించును. ఆశ్చర్యమేమనగా నా భగవంతు డొక్కొక్కప్పుడు కృత్రిములకు యోగించును. చోరులకు యోగించును. జారులకు యోగించును. గిరివ్రజపురమున శాకయ్యకు ప్రవేశించినంతనే చిత్రముగా యోగించెను.

సహదేవ మహారాజునకు గల పలుమంది మంత్రులలో ప్రతాపసేనుడను మంత్రి కలడు. ఆయన కిద్దరే సంతానము - ఒక కుమార్తె, ఒక కుమారుడు. కుమార్తె కిరువదియేండ్లు; కుమారునకు రెండేండ్లు. పురుషసంతానముకొరకు దిగులుపడి దిగులుపడి యతనికి చివరకు వార్ధక్యము సమీపించుచున్నదనగా నీ కుమారుడు కలిగెను. ఆ కుమారు డెట్లు కలిగెను? గిరివ్రజపురమున ప్రధాన దుర్గముకాని కొండమీదనున్న సర్వతోపరిభాగమునందున్న మహా పట్టణమునకు ప్రాగ్దిశయం దొక శివాలయముండెను. ఆస్వామిని ప్రతాపసేనుని భార్య కొలువగా కొలువగా నీ మగబిడ్డ పుట్టెను. ప్రతాపసేనుని భార్య వారమున కొకసారి కొడుకుతో శివాలయమునకు బోవును ప్రాతఃకాలమునందుబోయి సూర్యుడు నడిమింటికి వచ్చువరకు నందే యుండి రుద్రాభిషేకము చేయించి వచ్చుచుండును. ఆమె నాల్గు గుఱ్ఱములు కట్టిన రథముమీద శివాలయమునకు బోవుచుండును. ఆనాడు ప్రతాపసేనుడు రాచకార్యముమీద నేగుచు తన రథమును తనవెంట దీసికొని పోయెను. మంత్రి భార్య శివాలయమునకు బోవల యును. వారి కొక యేనుగు కలదు. ఆ గజ మున్మత్తమైనదని దాని నెవ రధిరోహించుట లేదు. మావటివాడు కడచిన నాలుగైదు

నెలలుగా దాని యున్మాదలక్షణములు కన్పించుట లేదని మంత్రితో పలుసారులు చెప్పెను. మంత్రికూతురు దానిమీదనెక్కి యెచ్చటికైన బోవలయునని తండ్రితో తనకోర్కి పదిసార్లు చెప్పినను ప్రతాపసేను డంగీకరించలేదు. ఆమెపేరు నాలాయని. నాలాయని కేనుగులెక్కుట యన్న మిక్కిలినరదా. తండ్రి యింటిలోలేడు. రథములేదు. అల్పపు రథములున్నవికాని వానిమీద పోవుట మంత్రి కుటుంబముయొక్క వికి తక్కువ. తల్లి రుద్రాభిషేకముకొరకు తొందరపడుచుండెను. ఎట్లోయొకట్లు నాలాయని తల్లి నంగీకరింపజేసి మావటివాని నేనుగును సిద్ధపరచి తీసికొనిరమ్మనెను. మావటివాని కా యేనుగుమీద తన యజమానుల కుటుంబమును దీసికొనిపోవుట కెంతో యుత్సాహముగా నుండెను. పట్టుపరపులు, రత్నాలకంబళులు, గంటలు మువ్వలు నర్వము తో వా డేనుగు నలంకరించెను. ఏనుగుమీద హౌదాకట్టుటకు పెద్దకాలము లేదు. ఒక చప్పరమువంటిది సామాన్యముగా నేనుగు మీద బిగింతురు. అతడు చప్పరముకాకుండ కుచ్చులు కలిగిన ముత్యాలు రత్నాలుకుట్టిన చిక్కని వన్నియగల పట్టుదుప్పటివంటి యాచ్ఛాదనము కూర్చున్నవారిపైన నెండతగులకుండ జేయునది యాస్తీర్ణము వెనుకభాగమున నొక వెండి బెత్తమును నిలబెట్టి యా బెత్తమునందుగల రంధ్రమునందు దూర్చిన పిడిగా ముందునకు చొచ్చెడు దానిని సిద్ధముచేసి యేనుగుమీద మంత్రి భార్యయు, నాలాయనియు మంత్రి కుమారుడు నధిరోహించగా దుర్గమునుండి క్రిందికి వచ్చు నేనుగులు రథములు చనెడుత్రోవ వెంట మహానగరమునకు వచ్చి శివాలయమునకు తీసికొనిపోయెను. అచ్చట వారు దిగిరి. భానుడు నడిమింటికి వచ్చెను. మంత్రిగారి సంసారము శివాలయములో నుండెను. ఏనుగు బయటనుండెను. ఎండ ముదిరినకొలది యేనుగు తట్టుకొనలేకుండెను. ఏనుగు, పులి, సింహము మొదలైన జంతువులు పై కెంత పరాక్రమవంతములుగా, బలశాలులుగా కనిపించునో లోపల నంత సుకుమారములు. వాని సౌకుమార్యము చెప్పుటకు వీలులేదు. అసూర్యంపశ్యలవలె ఎండనోర్వలేవు. తొలుతనే మావటివాడు మంత్రి భార్యతో చెప్పెను. 'అమ్మా, మీరు పెందలకడ రావలయును. ఏను గెండకు తట్టుకొనలే'దని. ఆమె నరే యన్నది కాని

రుద్రాభిషేక మాలన్యమే యయ్యేను. మావటివా డేనుగునందు శమన ప్రక్రియలు చేయుచుండెను. ఏనుగు మాటిమాటికి కొద్దిగా రెచ్చి పోవుటయు, మావటివాడు చేయు పరిచర్యలచేత దాని రెచ్చిపోత తగ్గుటయు జరుగుచుండెను. మావటివానికి వాని యేనుగనగా వాని బిడ్డ యన్నమాట. దాని యలవాట్లు, దాని కోపములు, తాపములు, దానికి రుచియైన వస్తువులు, దానికిష్టముకాని వస్తువులు, అది యెప్పుడు తొందరగా నడచునో, ఎప్పుడు నెమ్మదిగా నడచునో, ఎప్పుడు ఘీంకరించునో మొదలైనవేకాక అది తొండము సూటిగా నెత్తినచో, నెత్తిముడిచినచో, కుడిగా త్రిప్పినచో, నెడముగా త్రిప్పినచో దాని యూహలన్నియు వానికి తెలియును. ఏనుగు సామాన్యముగా తొండమును కుడివైపునకు త్రిప్పి చివర మడచును. ఎడమవైపునకు త్రిప్పి మడచినచో నేనుగునకు మనస్సు సరిగాలేదని యర్థము. ఆ ఏనుగున కొక వృక్షపల్లవములిష్టము. ప్రొద్దెక్కినకొలది దాని కొందలపాటును జూచి మావటివాడు తత్పరిసరములందా వృక్షమేమైన దొరకునేమో యని వెదకెను. అది పెద్ద వృక్షము కాదు. కొంచెము పొదపలె ఎదుగును. పొదకట్టదు. అదియొక నల్లకీజాతివృక్షము. మావటివాడు వెదకెను. ఒక వృక్షము కన్పించెను. వర్షఋతువు వెడలిపోయెను. అవి శరత్కాలపు నడిమిదినములు. ఆ వృక్ష మెందుచేతనో గుమ్ముగా రాలేదు. దానిరెమ్మలను మావటివాడు కోసి యొక రెండుగడియలపాటు తన యేనుగు నదుపులో పెట్టెను. మరియొక గడియ గడియన్నత యేన్గును తాను నంపాదించుకొనగల నన్ను ధైర్యము వానికి లేదు. అతనివద్ద నా మారుజాతి నల్లకిరెమ్మ కొద్దిగానే మిగిలెను. మంత్రిగారి కుటుంబ మేనుగు నధిరోహించిన తరువాత వాని నేనుగునకు బెట్టి కోటకు దీసికొని పోవువరకు గాలము కడుపవలెనని వాని యూహ. మంత్రికుటుంబ మప్పటికి బయటికి వచ్చెను. ఏనుగింకను వాని మాట వినుచునే యుండెను. మోకారించుమనెను. అది మోకారించెను. ఒకనిచ్చెనమీద తన యిద్దరు సంతానముతో మంత్రి భార్య యేనుగు నధిరోహించెను. ఏను గా చివుళ్ళకొరకు తొండము చాచెను. మావటివా డా చివుళ్ళలో సగమందిచ్చెను. అది మరల తొండమునెత్తెను. ఉన్నవన్నియు నిప్పుడే యిచ్చినచో దారి పొడుగునకు సరిపోవని యత డీయలేదు. ఏనుగు నడచుచుండెను.

కాని ఘీంకారములు, తప్పటడుగులు, తొండము నెడమవైపునకు మడచుటలు కలుగుచుండెను. అత డా మిగిలిన మారుజాతి నల్లకి పల్లవములనుగూడ నందించెను. తరువాత నైదారుసారులు గజేంద్రము తొండము పైకెత్తుటయు, నితడేమియు నందించకపోవుటయుజరిగెను అది క్రమముగా నదుపుమీరెను. వాని యంకుశము పనిజేయుటలేదు. దారి తప్పెను. జనము భయగ్రస్తులై యటునిటు పారిపోవుచుండెను. మంత్రి భార్య భయపడుచుండెను. ఏమగునో తెలియదు. తల్లికూతుండ్రిద్దరు పసివానికొరకు భయపడుచుండిరి. కొంత సేపటి కేనుగు మావటివానిని లెక్కచేయ లేదు. వాడేమియు చేయలేక పోవుచుండెను. ఆ యేనుగు మావటివానిని తన తొండముతో క్రిందికి లాగెను. అది తొండముతో తనను చంపునని యత డూహించెను. భాగ్యవశమున నా యేను గతనిని చంపలేదు. మనకు ప్రియమైన వ్యక్తియందు కోపము వచ్చినచో వాని నెట్లు త్రోసివేయుదుమో, కొట్టీ కొట్టనట్లు నెట్టుదుమో యేనుగు మ్మావటివాని నట్లు నంతదూరముగా విసరివైచి తాను పోవుచుండెను. మంత్రి భార్యకు పసివానిని పట్టుకొనుటయే కష్టమగుచుండెను. నాలాయని తన తమ్ముని గట్టిగా పట్టుకొని ఏనుగు వీపుమీదనున్న మంచమువంటి హౌదాయొక్క చెక్కలను వదలిపెట్టకుండ నుండెను. జన మెవరిదారిని వారు పారిపోవుచుండిరి.

ఒక గుంపులో శాకయ్య యుండెను. అతడు వర్తమానము నంతము తెలిసికొనెను. ఇది భగవంతుడు తన కోపము కల్పించిన సంవిధానము. పులులు కొట్టికొని పోవుచున్న ప్రవాహము తనను నెట్టలేక పోయెను. అడవిదున్నలను గిరగిరత్రిప్పి ముంచు సుడులు తనను ముంచలేక పోయెను. ఈ యేనుగు తన నేమి చేయగలదు? చేసినచో చచ్చును. చేయులేకపోయినచో తాను మంత్రియింటిలో నొక గౌరవస్థానమందును. అతని యండవలన మహారాజానుగ్రహము నంపాదించవచ్చును. ఇదికాక శాకయ్యవద్ద రెండు మూడు క్షుద్ర మంత్రములు కలవు. అందులో నొక మంత్రమున్నది. కాముకురాలి వలె కన్పించిన స్త్రీమీద నామంత్రమును ప్రయోగించును. ఆమె తనకు సులభముగా వశమగును. అట్టి స్త్రీ లున్మత్తలు. కనుక నా మంత్ర

మున్మాదులమీద పనిచేయునని యర్థము. అగునో కాదో! అది శాబర మంత్రము. ఆ మంత్రమును జపించుచు శాకయ్యా దంతావళమున కెదురుబోయెను. ఆ మంత్రమును బిగ్గరగా నుచ్చరించుచు దాని వద్దకు వెళ్లెను. ఆ యేనుగు ఘీంకరించుచు నతనిమీదకు వచ్చెను. శాకయ్యా తొణకలేదు. ఏనుగు అతనిని తన తొండముతో గ్రహించి విసరి వేయవలయు నన్నట్లుగావచ్చెను. శాకయ్యా దాని తొండమునుబట్టికొని దానిని మలచెను. ఏనుగు శాకయ్యాను మింటిలోని కెత్తెనుగాని ఏనుగునకు అతడు మలచిన మలపుచేత తన తొండమునకు బాధ కలిగినట్లుండెను. ఆ యేను గతనిని నేలమిదికి దించెను. ఇతడు దాని తొండమును వదలిపెట్టక మెలిపెట్టుచుండెను. రెండు నిముస ములలో నేనుగు శాంతపడెను. ఇంతలో మావటివాడు పరుగెత్తు కొనుచు వచ్చెను. శాకయ్యా మావటివానిని కుంభస్థలమున కెక్కించు కొనుమని ఏనుగుతో చెప్పెను. ఏనుగు మావటివానిని పైకెక్కించు కొనెను. జనమొత్తు విరిగిపోవుచుండెను. శాకయ్యా భగవంతుడు వచ్చి నట్లుండెను. మంత్రిభార్యయు, కుమార్తెయు మావటివానితో శాకయ్యాను గూడ నెక్కించుకొనుము. అతనిని కోటలోనికి దీసికొనిపొద మని చెప్పెను. శాకయ్యా యంగీకరించలేదు. ఇప్పుడేనుగు మావటివాని మాటలను వినుచుండెను. నాలాయనిని ఏనుగు క్రిందికి దింపెను. ఆమె శాకయ్యాను బతిమాలెను.

శాకయ్యా "మేము మీ నాయనగారు వార్త పెట్టినచో వత్తుము. లేనిచో రా"మనెను.

ఏనుగు మరల నాలాయనిని పైకెక్కించుకొనెను. వారు కోటలో నికి బోయిరి. ఊరూరెల్ల, పురము పురమెల్ల నీ వార్తతో ఘోషించి పోవుచుండెను. ఆనాడు సాయంకాలమున వందమంది రాజభటులు శాకయ్యాకొరకు గిరివ్రజపురమున వెదకుచుండిరి. ఎంతమంది ధన వంతులు తమ యిండ్లకు రమ్మని బలవంతము చేయుచుండినను శాకయ్యా యొక పేదవారింటికి బోయెను. దానితో పేదవారందరికి శాకయ్యామీద మహాభిమాన మేర్పడెను. శాకయ్యా మంత్రి యింటికి పోవుటకు నిరాకరించెను. తా నేయింట బసచేసెనో యా పేదవానికి నాలుగువందల బంగారు నాణెము లిచ్చినచో వత్తుననెను. మంత్రి

యాయింటివానికి నాల్గువందల బంగారునాణెము లిచ్చుటేకాదు, అచ్చట సుమారు రెండువందల పేదవారి యిండ్లుగలవు. ఇంటికి పదిబంగారు నాణెముల చొప్పున మంత్రి యిచ్చి శాకయ్యను హౌదాకట్టిన యా యేనుగుమీదనే దుర్గములోనికి తనయింటికి తీసికొనిపోయెను.

పేరు దుర్గముతప్ప మంత్రులు రాజవంశీయులను తీసివేసినచో నచ్చటను ప్రజలే. అందు పెద్ద చెరసాలయున్నది. గిరివ్రజపురము చెరసాలలకు ప్రసిద్ధమైనది. రాజకన్యలేమి? రాజపుత్రులేమి? ముప్పది నలుఇదివేలమంది ముప్పదినలుబదియేండ్లు జరాసంధునిచేత చెరసాలలయందుంచబడిరి. చెరసాలలలో చిన్నయుద్యోగస్తులు, కొంచెము పెద్ద యుద్యోగస్తులు, రాజగృహములయందు, మంత్రుల గృహముల యందు పరిచారకులు పదివేలమందికి తక్కువయుండరు. వీరిలో నగానికినగము గిరివ్రజపురములోని పేదసంసారములనుండి వచ్చిన వారే. అందులో నొకవేయిమంది ప్రతాపసేనుడు ధనము పంచిపెట్టిన పేటలోనివారు. అల్లంతనల్లంత నల్లుకొని శాకయ్య మంత్రి యింటికి చేరిన నాలుగైదుదినములలో గిరివ్రజదుర్గములో నొక మహా పురుషుడుగా ప్రతిభాసింపనారంభించెను. కొన్నివేలమంది ప్రజలు అతని దర్శనమునకు వత్తురు. అతనివలన విభూతి పెట్టించికొందురు. ఆ మహానగరములో నొక్కటియే పెద్ద ప్రశ్నయైనది. మదముచేత విడు వడిన యేనుగును శాకయ్య యెట్లు అదుపులోనికి తేగలిగెను? అది బాహుబలమా! మంత్రబలమా! బాహుబలమని కొందరు; మంత్రబల మని కొందరు. ఈ వార్త మహారాజైన సహదేవుని దాక పాయెను. కాని సహదేవుడు చిన్నవాడు. పదునేనేండ్లవాడు. తల్లియు, మంత్రుల యదు పులో నున్నవాడుకాని మరియొకడుకాడు. మంత్రయైన ప్రతాపసేనుని యింటిలో శాకయ్య యునికి యేర్పడెను. శాకయ్యకు మేడమీద నొక గదిలో నివాసమేర్పరుపబడెను. శాకయ్య తాను నిరాడంబరముగ నున్నచో నేమియు లాభములేదని గ్రహించెను. అతనికిద్దరు పరిచారి కలు, నిద్దరు పరిచారకులు నియమింపబడిరి. శాకయ్య యిదివరకే కావిగుడ్డలు ధరించెడివాడు, ఇప్పుడు తానేకాక వారిచేతకూడ కావి గుడ్డలను ధరింపజేయుచుండెను. ఒకపీఠము పెట్టవలెను. కొన్ని విగ్ర హములను సమకూర్పవలెను. అతని కేవిగ్రహములందును నమ్మకము

లేదు. బుద్ధుడెట్లుండునో తెలియదు. త్రిపురాసురుల పట్టణములలో విష్ణువు బుద్ధుడై వెడలెనన్నకథ కలదు. ఆ బుద్ధుని వేన మెట్లుండెడిది? అతనికి తెలియదు. వానిని విష్ణుమూర్తినిపలె తీర్చినచో నది పొసగదు. కృష్ణదేవు ననుసరించినట్లే యగును. ఏమియు తోచక తనగది పట్టి శూన్యగృహముగా నుంచెను. పులితోళ్లు, లేడిచర్మములు, కావిగుడ్డలు, దర్భాసనములు సమృద్ధిగానున్నవి. ప్రతాపసేను డతనిగదికిని, తన సౌధమునకు సంబంధములేకుండజేసెను. అతనిగది వేరే యున్నది. ప్రతాపసేనుడు ప్రతిదినము ప్రాతఃకాలమున నతనిగదికిపోయి దర్శనము చేసివచ్చును. సాయంకాలములయం దతని భార్యయు నాలాయనియు రెండేండ్లవాడైన కొడుకును బోదురు. దర్శనము చేయుదురు. నాలాయని తాను ప్రత్యక్షముగా శాక్యు పాదములు స్పృశించి తమ్మునిచే స్పృశింపజేయును. ఈ ప్రత్యక్ష పాదస్పర్శనము మంత్రి భార్య కిష్టములేదు. తొలుత కొన్నిదినము లూరకున్నదిగాని తరువాత కూతురుతో నది మంచిదికాదని చెప్పెను. నాలాయని యంగీకరించ లేదు. "అతడు యోగీశ్వరుడు. మనకు పరమోపకారి. మనకులమును నిలబెట్టువాడు మనతమ్ముడు. అతని నతడు రక్షించెను. అయినను పట్టి పాదస్పర్శవలన వచ్చిన నష్టమేమియని. తల్లి యూరకుండెను.

నాలాయని క్షత్రియస్త్రీ. నడివయసులోనున్న పిల్ల. ఒక్కొక్క వర్ణమునందలి స్త్రీల కొక్కొక్క ప్రత్యేకమైన సౌందర్యముండును. బ్రాహ్మణస్త్రీల సౌందర్యము వేరు. ఆ స్త్రీలలోకూడ శాఖాభేదములను బట్టి సౌందర్యములు భేదించుచుండును. క్షత్రియ స్త్రీ సౌందర్యము వేరు. వైశ్యస్త్రీల సౌందర్యమువేరు. చతుర్థవర్ణమునందుగూడ సంపన్న గృహస్థులైన కొన్నికొన్నికులములలోనున్న స్త్రీల సౌందర్యము తత్తద్వర్ణములను చాటిచెప్పుచుండును. పరిచయముకలిగినచో, పలుసార్లు చూచుచుండినచో నా స్త్రీ ఆ కులమునకు చెందినదని చెప్పవచ్చును. పురుషులనుగూర్చికూడ నట్లే చెప్పవచ్చును. మొగములనుజూచి గుణములెట్లు చెప్పవచ్చునో! కులములట్లు చెప్పవచ్చును. క్షత్రియ స్త్రీలయందు నేత్రములు పెద్దవిగానుండును. శరీరములు కఠినములై యుండును. మొగములలో నేదోయొక ఠీవి కన్పించుచుండును. వారు ధరించెడి యాభరణములు వేరుగానుండును. వారు ధరించెడి

దుస్తులు వేరుగానుండును. అందులో నుత్తమ క్షత్రియకుటుంబములలో మహారాజులు మహామంత్రులునైన క్షత్రియుల కుటుంబములలోనుండు స్త్రీలు ఇవమిత్థమని చెప్పబడకుండ నొక విలక్షణమైన సౌందర్యమును కలిగియుందురు.

సౌందర్యమునుగూర్చి నిజముగా వర్ణించుటయెట్లు? ఒకవాని సౌందర్యమునుగాని, యొకని ప్రతిభనుగురించిగాని వర్ణించుటయెట్లు? దానికనులు పద్మపత్రవిశాలములు. దేనివికావు? వేలకొలది స్త్రీలనేత్రములు పద్మపత్రవిశాలములు కావచ్చును. అతడు మహాప్రతిభావంతుడు. ఎవ్వడుకాడు? ఒకగొప్ప రాజనీతివేత్తయైన మంత్రినిగూర్చి యిట్లు చెప్పవచ్చును. ఒకగొప్ప కవినిగూర్చి యిట్లు చెప్పవచ్చును. ఒకగొప్ప వీరునిగూర్చి చెప్పవచ్చును. కనుక వర్ణనయనగా నొక సందర్భమున నొకవ్యక్తియొక్క సౌందర్యమో! ప్రతిభయో! యొక గుణమో! యధికముగానున్నదని చెప్పుటయే.

నాలాయని పొడుగైన పిల్ల. కత్తివంటి బాలిక. చక్కని యవయవములు కలిగిన యువతి. కన్నులు పెద్దవి. ఆమెకు మెడనంటి యున్న వెడల్పైన బంగరుపట్టెడ కలదు. ఆకాలమున స్త్రీలు వక్షస్థలమునందొక గుడ్డపేలిక నంటించి వెనుక ముడివేసికొనెడివారు. స్త్రీలు రెండు వస్త్రములను ధరించెడివారు. ఒక వస్త్రము ధోవతివలె ధరించుటయు, మఱియొక వస్త్రమును పైన నుత్తరీయమువలె వేసికొనుటయు. ఇట్లు ధరించుటలోకూడ భేదములున్నవి. ఉరముమీది వస్త్రము సంపదకొలది యుండును. దానికి ముత్యాలు మణులు కుట్టుదురు. ప్రౌఢలైన యువతుల వక్షస్సిచయము పయోధరముల యుత్సేధమునకు తగినట్లుగా కుట్టుట కలుగును. నాలాయనికి పయోధరోత్సేధ మధికముగా లేదు. ఒక దృష్టితో చూచినచో నామెయందు స్త్రీత్వముకంటె పురుషత్వ మధికముగా నుండెనేమో యనిపించును. అనేకులు క్షత్రియకుమారులు నాలాయని శరీరసౌందర్యమును మెచ్చుకొనరు. ఆమెకు వచ్చిన సంబంధములు తక్కువ. ఆమెను నిజముగా మోహించిన పురుషు లిద్దరే. ఒకడు శాకయ్యా. అతడు మోహించెననగా నది పట్టి మోహమేగాని మోహించుటలేదు.

రెండవవాడు కాలంజరుడన్న యొక క్షత్రియకుమారుడు. అతడు గిరివ్రజ రాజ్యమున ఒక గొప్ప సైనికోద్యోగి. అతని తండ్రి పూర్వము జరాసంధుడు పరరాజులమీది కెత్తిపోయిన యొక యుద్ధములో మడిసెను. అతని తల్లి సహగమనము చేసెను. కాలంజరున కన్నలు లేరు; తమ్ములు లేరు; నక్కలు లేరు; సెల్లెండ్రు లేరు. కొంత యాస్తి యున్నది. ఎక్కువ దగ్గరిచుట్టములుకూడ లేరు. ఒక మేనమామ యున్నాడు. ఒకవేలో రెండువేళ్ళో విడిచినవాడు. ఈ కాలంజరునకు నాలాయని భూలోకరంభ. అతని యుద్యోగమున నెప్పుడు తెరపి దొరకినను ప్రతాపసేనుని యింటికి వచ్చును. అతడు గొప్ప యుద్యోగి కనుక నింటిలో నతనిని గౌరవింతురు. ప్రతాపసేనునకు నాలాయని యన్నచో బహిఃప్రాణము. రెండేండ్ల క్రిందటివరకు నా మంత్రి కామె యొక్కటియే సంతానము. కొడుకైనను కూతురైన నామె యొక్కతెయే! తన పదవి గొప్పది. తనకున్న యాస్తి గొప్పది. మంత్రిత్వము మొదలైన యుద్యోగములకును, సైనికోద్యోగములకును చాల భేదమున్నది. సైనికోద్యోగములలో మాసవేతనమునకు మించిరాదు. యుద్ధములు తటస్థించినచో, సైనికుడు పరాక్రమమును ప్రదర్శించినచో రాజు బిరుద మిచ్చును. కానుక లిచ్చును. అంత యెక్కువగా ధనమీయడు. మంత్రిత్వము మొదలైన యుద్యోగములు వేరు. వారు ధనములతో తులాభారములు తూగుదురు.

ప్రతాపసేనునకు నాలాయనిని కాలంజరున కిచ్చుట కిష్టము లేదు. అతడు గొప్ప ధనవంతుడు కాడని యొకటి. రెండవది వానికి చుట్టపక్కము లెవ్వరులేరు. వానిని దెచ్చి యింటిలో బెట్టుకొనవలెను. కాలంజరునకు నాలాయని మీదనున్న ప్రేమ యింతయని చెప్పుటకు వీలులేదు. అనంత సృష్టిలో స్త్రీయంచు నొకర్తుకయున్నచో నామె నాలాయని యొక్కతెయే! తనను గూర్చి కాలంజరున కిట్టి యభిప్రాయ మున్నదని నాలాయనికి చక్కగా దెలియును. ఆ నాలాయని యొక్క స్త్రీత్వమే విలక్షణమైనది. అందు శృంగార రసమున్నదో లేవో తెలియదు. భావనామాధుర్యముండదు. ఒక లజ్జ, ఒక యొయ్యారము, ఒక హేల. మొదలైన లక్షణములు తక్కువ. స్త్రీ మాత్రమగును. అన్నిటికంటె నొక విశేషమున్నది. ఆమె కాలంజరునిచేత నీ పని

చేయించు, నీ పని చేయించదని లేదు. ఆ కొండకు కొమ్మున్నది కదా! ఆ కొమ్ముపైన నాకాశమున్నది కదా! ఆ యాకాశ మెంత యెత్తున్ననేమి? లఘువైన శరీరము కలిగిన పురుషుడు ఎగిరినచో నెంతయెత్తెగురగలడో అంత యెత్తున నాకాశములో మనకు కన్పించకుండ నొక రత్నము వ్రేలాడుచున్నది. చేయియెత్తి యెగిరినచో నది వానిచేతి కందును. ఉన్నమాట నిజము. అందెడు మాట అంతకంటె నిజము. కాని కన్పించదు. కనుపించదని ప్రయత్నము మానివేయరాదు. ఆ రత్నమును నాకు తెచ్చిపెట్టుమని నాలాయని యడిగినచో కాలంజరు డా పర్వతముమీదికి బోయి యింక వద్దులేయని నాలాయని చెప్పెడివరకు ప్రతిదినము గడియయో రెండు గడియలో ఎగురుచుండును. ఇది కాలంజరునిమీద నాలాయనికి గల యధికారము. ఇట్టి యధికారము తన మీద నాలాయని కున్నదని కాలంజరునకు తెలియును. ఆమె యితని ప్రేమను పరిగణించుచున్నదో లేదో యతనికి తెలియదు. ఇట్టి యెన్ని పనులైనను నాలాయని వానితో చెప్పును. వాడు సాధ్యమైనచో చేసికొని వచ్చును. లేనిచో బిక్కమొగముతో తిరిగి వచ్చును. కార్యము సాధించుకొని వచ్చినప్పుడు నాలాయని వానికి చేసెడి మర్యాద యేమనగా తన ప్రక్కన గూర్చుండ నిచ్చును. తన పాదరక్షలు తెచ్చిపెట్టుటయో, తన చేతిలోనుండి యేవస్తువైన జారిపడినచో నతడు దానిని తీసి యిచ్చుట కంగీకరించుటయో! ఎప్పుడైన నతడు బెదురుగా నామె హస్తమును తాకినచో నామె యూరకుండును. అతనియం దామె యనుగ్రహించుట కిది పరమావధి. ఈమె చెప్పిన పని నాతడు చేసికొని రాలేకపోయెను. కాలంజరుని యప్పటి స్థితి చూచి తీరవలయును. వాని నామె వెక్కిరించెడి వెక్కిరింపు; తిరస్కరించెడి తిరస్కారము! ప్రతాపసేనుడు తన యాస్తినంతను నిచ్చినను నే నీ పిల్లను జేసికొననురా బాబూ! యనవలెను. కాలంజరుడు నియమిత కాలములయందు సైన్యమునందే యుండును. అమావాస్యలు అష్టములు మరికొన్ని పర్వదినములు సర్వోద్యోగులకు విశ్రాంతి కాలములు. అని సైన్యములో నన్నిదినములు సైన్యమును వదలిపోవుటకు వీలు లేదు. ఆ ధర్మములను నిర్వర్తించుట వంతులు వంతులుగా నుండును. అట్టి విశ్రాంతి దినములలో కాలంజరుడు నాలాయని దర్శనార్థము

వచ్చును. నాలాయని తల్లి వానిని తమ యింటనే భోజనము చేయు మనును. ఈ యొక్క సేతప్ప నాలాయుని తల్లి యతనియందు నెరపు ఇంకొక శ్రద్ధ లేదు. కాలంజరున కది చాలును. తన కూతు నతని కిచ్చుట కంగీకారము లేనిచో దననువారింట భోజనము చేయుమని యామె యనుగునా? ఇది సామాన్యమైన గృహస్థ ధర్మమనియైన నతడూహింపడు. కాలంజరున కొక్కటే యనిష్టము. నాలాయని మరియొకనికి భార్య కాదు. కారాదు. అయినచో భర్త యెవ్వడగును? వాని కంఠము తన కత్తివాతబడును. నాలాయని తన నెట్లు జూచి నను నరే ప్రేమదృష్టులతో మరియొకనిని చూడకుండినచో నామె తనను ప్రేమించుచున్నట్లే!

ఇట్టి పరిస్థితులలో శాకయ్య వచ్చెను. కాలంజరునకు వరునగ నాలుగు విశ్రాంతి దినములు వచ్చెను. అతను ఆ నాలుగు దినములు నిచ్చటనే యుండిపోయెను. శాకయ్యను గూర్చిన వర్తమానము నంతయు నితడు తెలిసికొనెను. మొదటి దినమున నాలాయని తల్లితో, తమ్మునితో కాలంజరుడు గూడ యోగీశ్వరుని దర్శనమునకు బోయెను. నాలాయని శాకయ్య పాదస్పర్శనము సర్వాంకషముగా నాచరించెను. శాకయ్య తత్స్వర్గానందమును ననుభవించుచుండెనో, సమాధినిమిలితాక్షుడగుచుండెనో తెలియదు. నాలాయని శాకయ్య పాదములను స్పృశించుట కిష్టపడని వ్యక్తి యింతవర కామెతల్లియే. ఇప్పుడు కాలంజరుడు రెండవవాడు. రాత్రిపూట భోజనసమయమునందీ ప్రస్తావన వచ్చెను. ప్రతాపసేనుడు కూడ నున్నాడు. నాలాయని తప్పులేదని వాదించుచుండెను. తల్లి కసరుకొనుచుండెను. కాలంజరుడు శాకయ్యమిద కత్తులు నూరుచుండెను. ప్రతాపసేనుడు నవ్వుచుండెను. చివరకు నాలాయని కాలంజరునితో "నామీద నీకేమి యధికారమున్న"దనెను. అప్పుడు వైశ్వదేవమంత పని జరిగినది. అనగా కుండ భళ్లున పగిలినదన్నమాట. వైశ్వదేవమును చేసెడివారు కుండను భళ్లున పగులకొట్టుదురు. సామాన్యముగా వాడు కుండను భళ్ళున పగులగొట్టెననగా వైశ్వదేవమును చేసెనని వైదికులలోని పరిభాష. కాలంజరు డిట్లనెను:

"నే నారేండ్లనుండి నిన్ను పెండ్లిచేసికొనుటకు నీ చుట్టు తిరుగుచున్నాను. నీ తల్లిదండ్రులు నాకిచ్చుట కిచ్చగించుటలేదు. నేను తప్ప

నిన్నెవ్వరును చేసికొనరు. నీ సౌందర్యమునుచూచి నిన్ను పెండ్లాడు వా రెవ్వరు నుండరు. నీవు నన్ను పెండ్లిజేసికొననిచో నీకు పెండ్లికాదు. మీ నాయనగారి కీసంగతి తెలియదు. వారు పొరబడుచున్నారు. నీవు నా భార్యవు. నీ వింకొకని పాదములు పట్టుకొనుచున్నావు. వాడు క్షత్రియుడుకాడు. బ్రాహ్మణుడనని చెప్పుచున్నాడు. అది యెంత వరకు నిజమో తెలియదు. వాని పుట్టుపూర్వోత్తరములు మనకు తెలియవు. వాడొక సన్యాసి. వాడు నిన్ను పాడుచేయును. నీ తల్లి దండ్రులు నిన్ను పాడుచేయుచున్నారు. వారు నిన్ను వలలోవేసి కొనును. అట్లు జరిగినచో నీ తల్లిదండ్రుల కవమానము. నేను వాని ప్రాణములను నిస్సంశయముగా దీయుదును!'' ఇంతయుపన్యాసము చేసి కాలంజరుడు కోపముతో నా యింటినుండి తక్షణము వెళ్లి పోయినచో నది కొంత ఫలప్రదముగానుండెడిది. అతడట్లు చేయక యచ్చటనేయుండెను. తల్లిదండ్రులు పట్టించికొనలేదు.

కాలంజరుడు మరునాడు శాక్యునివద్దకుపోయి ఆయనను పది తిట్లుతిట్టి అతనిమీద తన కోపమును వెలిబుచ్చెను. అతడు తిరిగివచ్చిన తరువాత నాలాయని శాకయ్యవద్ద కేకాంతముగాబోయెను. శాక్యు యామె నోదార్చుచున్నట్లు, ఆదరముగ జూచుచున్నట్లు, తాను మహా యోగియన్నట్లు ఆమెను కాలంజరు డర్థము చేసికొలేనట్లు చిత్ర చిత్ర ముగా ప్రవర్తించి యామెను బుజ్జగించి తలనిమిరి కౌగలించి,మాటలలో వేదాంతము, చేతలలో కామముగా విచిత్రముగా నామెను పరామర్శిం చెను. ఆమెకు భయమువేసెను. ఆమె పారిపోయివచ్చెను. వచ్చెను గాని వీనిని గూర్చి తల్లితో చెప్పలేదు. కాలంజరుడు వారిరువుర నేదో జరిగెనని యూహించెను. కాలంజరుడు శాకయ్యవద్దకు బోయి వానిని చంపుదుననెను. కత్తిదూసెను. కాలంజరు డొక పెద్దయును చిన్నయుకాని సేనానియని శాకయ్యకు దెలియును. శాకయ్య యొక తెలివితక్కువ చేసెను; మంత్రి తానన్నచో గౌరవము కలవాడు. కోటలో పలుమంది తనయందు గౌరవముకలవారు. అతడు కాలంజరునితో నిట్లనెను: ''ఆమె నన్ను ప్రేమించుచున్నది. నేనామెను పెండ్లి యాడెదను.'' ఇట్లనుచుండగా ప్రతాపసేనుడు లోపలికివచ్చుచుండెను.

అంతలో శాకయ్య నోటినుండి యొక తప్పుకూతవచ్చెను. "అమెకును నాకు నిదివరకే సంబంధమున్నది.' ఈ మాట యతని నోటివెంట వచ్చినది. కంటికి ప్రతాపసేనుడు కన్పించినాడు. కాలంజరుడు శాకయ్యను నరకబోయినాడు. ప్రతాపసేను డడ్డముతగిలి 'వంటయింటి కుందేలు-నీడెచ్చటికి బోవు'నని కోపముతో నింటికిబోయెను. ఇంటిలో పెద్దరగడ. నాలాయని వానితో దనకేమియు సంబంధము లేదనిచెప్పను. అది దృఢముగా చెప్పినచో బాగుగానుండెడిది అంతకుముందు వాడు తనను బుజ్జగించినది, కౌగలించినది, చుంబించినది చెప్పెను. నేను వాని నంగీకరించలేదనెను. వాని నింటిలోనుండి తరిమివేయ వలయును. ఆమె మాటలు వారు నమ్మలేదు. రాత్రిపూట వానిని సంహరింపించవలయునన్న ప్రయత్నము సాగించుచుండగా నెవ రా కార్యమునందు నియోగింపబడిరో వారే శాకయ్యను గిరివ్రజమునుండి తరలించిరి. నీ విచ్చటనున్నచో వృథా గా నిన్ను చంపుదురు. పారి పొమ్మని చెప్పిరి. అతడు పారిపోయెను. అతడు మరల గిరివ్రజ పురము లో కన్పించలేదు.

తరువాత నైదేండ్లు జరిగెను. నాలాయని కాలంజరుని పెండ్లి యాడుటకు తిరస్కరించెను. కాలంజరునకు శాకయ్యమీద సందేహము బలిసెను. అత డుద్యోగముమానెను. దేశద్రిమ్మరి యయ్యెను.

# 10

శాకయ్య తన స్వగ్రామమును వదలిపెట్టి వెళ్ళి యప్పటికి పం ద్రెండు పదుమూడేండ్లైనది. అతడు తన గ్రామము వదలి పోవునప్పటికి అతని కారుగురు సంతానము. ముగ్గురు మగపిల్లలు; ముగ్గు రాడపిల్లలు. మొదటి యిద్దరు పిల్లలును మగవారు. తరువాత వరుసగా ముగ్గు

రాడపిల్లలు. చివరివాడు మరల మగవాడు. శాకయ్య వెళ్ళిపోయిన యేడాదిలోననే యందరికంటె చిన్న ఆడపిల్లయు,చిన్న మగపిల్లవాడును చనిపోయిరి. పుట్టుకలోననే జంతువులు కొంద రెక్కువ యన్నము తిందురు; కొందరు తక్కువ యన్నము తిందురు. తక్కువ యన్నము తినెడివారు బ్రతుకు నీడ్చుకొనుచు బోదురు. అధికభుక్కులు బ్రతుకు నీడ్వలేరు. ఒక్కపూట వారి కన్నములేనిచో వారి కన్నులు లోనికి తీసి కొనిపోవును. ఆ యిద్దరు పిల్లలు నట్టివారు. ఆ యాడపిల్ల తండ్రి లేచి పోవునాటికే యైదేండ్లపిల్ల. అది యెప్పుడును తనకేదైన పెట్టుమని తల్లి ప్రాణములు తీయుచుండెడిది.ఆ తల్లి 'యేమున్నదే నా శ్రాద్ధము, నీకు పెట్టుటకు' అనెడిది. చివరకా పిల్లకే శ్రాద్ధము పెట్టినంత పనియైనది. అది కృశించి చనిపోయినది. పిల్లవాడుకూడ తిండిలేకనే చనిపోయి నాడు. అందరికంటె పెద్దవాడు పదియేండ్లవాడు. రెండవవా డెనిమి దేండ్లవాడు. ఇప్పటికి పెద్దవానికి సుమారు పాతికయేండ్ల వయస్సు. రెండవవాని కిరువదిమూడేండ్ల వయస్సు. ఒక తండ్రికే పుట్టినను ప్రతి కుమారునకును తండ్రికున్న గుణములన్నియు రావు. సామాన్య ముగా తండ్రియొక్క యొక ప్రత్యేకమైన గుణమొక్కొక్కనియందు కొట్టవచ్చినట్లుండును. ఆ యిద్దరు కొడుకులయందు శాకయ్య యొక్క రెండు గుణములు విస్పష్టముగా కనిపించుచుండెను.

తండ్రియొక్క నిర్వ్యవసాయ లక్షణమును, భోజన మక్కరలేని తనమును పెద్దవానియందు సమృద్ధిగా నుండెను. 'ఎక్కడనుంటివే గొంగళియనగా వేసినచోటనే యున్నాను'-ఈ లక్షణము పెద్దవానియందు చక్కగా నున్నది. ఎప్పుడైన నేదోవిధముగా జొన్నలో నజ్జలో దొరకి నచో నిల్లందరకు వండిపెట్టుటకు సాధ్యమైనచో వానిభాగము వానికిగా పెద్దవానికిగూడ పెట్టును. అతడు దానిని తినును. ఎక్కువ పెట్టు మనడు. లేనప్పుడు పెట్టుమని బాధించడు. వాని యదృష్టముకొలది యొక పని జరిగినది. ప్రక్కనున్న మహాపట్టణమునుండి యొక పెద్ద గురువువంటి యతడు వచ్చెను. ఈ యూరిలో నాయన పది దినము లుండెను. అచ్చట నతనికి శిష్యులు పాదపూజలు జరుపుచుండిరి. బ్రాహ్మణులలో నుపనయనము కాని పిల్లలున్నచో వారి కాయన యొక్క దినములో నందరికి నుపనయనములు వారి, వ్యయములేకుండ,

చేయించెను. అట్లుపనయనములు చేయబడిన వారిలో శాకయ్య యిద్దరు కుమారులను గలరు. ఇవి పెద్ద కుమారునకు మిక్కిలి మేలు చేసినట్లాయెను. ఉండియుండి యెవని యింటిలోననో యాబ్దికము వచ్చును. ఈ పెద్దకొడుకు పేరు గిరిధరము. గిరిధరమునకు మంత్ర ణము జరుగును. ఆనాడు గిరిధరము సమృద్ధిగా భోజనము చేయును. గిరిధరము భోక్తగా వచ్చుచున్నాడనగా నా యింటివారు రెట్టింపు పదార్థములు చేయవలెను. సామాన్యముగా నాబ్దికములకు మాషచక్రము లుండును. పూర్వకాలమందు గారెలతోబాటు నువ్వులతో చక్రములు చేసెడివారట. నువ్వులను బెల్లమును పితృదేవతలకు మిక్కిలి యిష్టమందురు. పితృదేవతలకు తీపి యిష్టము. 'మధు' 'మధు' 'మధు' అని బెల్లము, నువ్వులు, మినుములు- గిరిధరమునకు మూడు నిష్టములే. పితృదేవతలకు, నితనికి భేదమేమనగా పితృదేవతలు చనిపోయినారు. ఇతడు బ్రతికియున్నాడు. నువ్వులలో బెల్లము కలిపి త్రొక్కి నూనెలో వేసి వండుదురు. దానిపేరు తిలపిణ్యాకము పూర్వకాలములో నువ్వులును, బెల్లము కలిపి త్రొక్కుట రెండు సందర్భములలోననే యుండెడివి. ఒకటి యాబ్దికములకొనను; రెండవది యాడపిల్లలు పెద్దమనుషులైనపుడును. ఇప్పుడు రెండవది మిగిలినవి; మొదటిది పోయినది.

మాషచక్రములకు కూడ ఆంధ్రదేశమునకు తొలినాటిప్రమాణము వేరు; నేటి ప్రమాణము వేరు. ఆంధ్ర దేశములోని తొలినాటి మాషచక్ర ప్రమాణము నేటికిని కొందరు చతుర్థకులజుల యింటిలో నున్నది. బ్రాహ్మణుల యిండ్లలో క్రమక్రమముగా దాని ప్రమాణము తగ్గినది. ఈ మాషచక్రములు, ఈ తిలపిణ్యాకము-వీనిని గిరిధరము వానినొక పాక, వీనినొక పాతిక పట్టించును. అతనికి తన పెద్ద చెల్లెలన్నచో మిక్కిలి యిష్టము. అతనికి భగవంతుడు చేసిన పెద్దయన్యాయ మేమనగా తిన్నది వెంటనే లోపలికిపోవుట. వాయనములు మొదలైన పక్షులు తిని యా పదార్థమును గొంతులోనట్టే పెట్టి తమ పిల్లలవగ్గరకుబోయి యా పదార్థమును మరల నోటిలోనికి దెచ్చికొని పిల్లలనోటిలోనికి బెట్టును. భగవంతు డట్టి శక్తిని గిరిధరమునకు బెట్టించో కనీనము సంవత్సరమునకు నాలుగైదు పర్యాయము

లైనను కొంపయంతయు కడుపునిండ తినెడివారు. ఈ విద్యలో గిరిధరము తండ్రికంటె గొప్పవాడు. తండ్రి పదునేను దినములకు మీరి భోజనములేకుండ నుండలేడు. అప్పు డేదో తిని తీరవలయును. ఇతనట్లు కాదు. సుమారు నెలనాళ్లుండగలడు. అతని యదృష్ట మింకొకటి. ఆ యూరిలో పెద్దయాసామికలడు. అతనికి చాల పంట యున్నది. జొన్నలు మొక్కజొన్నలు సజ్జలు దోసకాయలు వాని పొలములలో సమృద్ధిగా పండును. అతని కజీర్ణవ్యాధి ఆందుచేత నెవరైన సమృద్ధిగా తినెడివారున్నచో వారు తినుచుండగా నీతడు బ్రహ్మానందపడును. కాని తనయంతట తాను పిలిచిపెట్టడు. అది యొక లక్షణము. పొలాలు పంటమీద నున్నప్పుడు నిజానికది గిరి ధరముయొక్క పంట. అతనిచేతిలోపడి గిరిధరము చూచుచుండ వలయును. లేనిచో పాలికాపులు తరిమివేయుదురు. తేలికగా గిరి ధర మొక మణుగుమణుగున్నర దోసకాయలు తినివేయును. ఒక్కొక్కప్పుడు కొన్ని మూటగట్టికొనివచ్చును ఇంటిలో నలుగురును తిందురు. అట్టి సంసారమునెట్లు సాగుచున్నది ప్రశ్న. ఆ ప్రశ్న యీనాడు. పూర్వకాలమునందు కాదు. పోయి యడుగుట యాలస్య ముగా చేటలతో ధాన్యమును త్రవ్వియిచ్చెడివారు. మాటిమాటికి సంతర్పణలు జరుగుచుండెడివి. అక్కడికిపోయి యెట్టి దరిద్రుడైనను తినవచ్చును. శాకయ్యా భార్యాపిల్లలు కాయలు మురవేసి అన్నోదక ములకు లోపములేని యిండ్లకు వెళ్లినచో సంటికివచ్చువేళకు మూన్నాళ్లకు సరిపోయెడి గ్రాసము వచ్చినట్లుండెడిది. పంటలు పండెడి రోజులలో పొలములమీదికి జొన్నకుప్పలు కొట్టెడువేళకు వెళ్లినచో ధాన్యము దోసిళ్లతో పోసెడివారు. చిన్నచిన్న చేటలతోనిచ్చెడి వారు. అందుచేత పేదవారుకూడ బ్రతుకుచుండుటకు వీలుండెడిది. పంటదినములలో సంవము బ్రతుకుటకు వీలుండెడిది. తరువాత తరు వాత కష్టమయ్యెడిది. పంటదినములనగా సంవత్సరములో రెండు నెలలుండును. తక్కిన పదినెలలు కష్టమే. గిరిధరము తన పెద్దచెల్లెలి కెక్కడోయక్కడ బతిమాలి బామాలి యాచించి దొంగతన ములుకాని దొంగతనములుచేసి తెచ్చి పెట్టుచుండెడివాడు.

ఆ యింటిలో నందరికంటె దుర్యోగము తల్లిది. ఆమె ముందత

పిల్లలందరకు చూచిగాని తాను తినదు. ఆమెయొక యస్థిపంజరము. దొరకక దొరకక యామెకన్నము దొరికినచో కడుపునిండ తినుటకు వీలు లేదు. తినును. అజీర్ణవ్యాధిచేత వారము దినములు బాధపడును. ఆమె కనేకవిధములైన రోగములు. అందులో నొకటి మూర్ఛ. ఎప్పుడో మూర్ఛవచ్చి పడిపోవును. మరల నామెకు స్మృతి యెప్పుడు వచ్చునో తెలియదు. ఆమెకాదరువు పెద్దకూతురు. పెద్దన్నగారు చాటుగా మాటుగా తెచ్చెడి వస్తువులను కొన్ని తల్లికిచ్చును. కొన్ని తానారగించును. ఆమె రెండవ కూతురునకుగూడ పెట్టును. ఇక మిగిలినవాడు రెండవ కొడుకు. ఇతని పేరు హరికిశోరము. గిరిధరమునకు తండ్రి యొక్క యా లక్షణమురాగా వీనికి రెండవ లక్షణము వచ్చినది. అది కామవృత్తి. మరియొకటి- యింటిలో నితరులకున్నను సరే, లేక పోయినను సరే దొంగతనముగానైనను కడుపునించికొనుట. అతని నేమరిలుట తల్లికిక్షష్టము. అది నిష్ఫ్పురమైన కొంప. ఇంటిలో నేమియు నుండదు. అప్పుడప్పు డుండును. తల్లి నీళ్లకు పోవును. ఏదియైన నడిగికొని తెచ్చుటకు పొరుగిండ్లకు బోవును. ఒక్కొక్కప్పుడు జోలెకట్టి యూరిలోనికి బోవును. ఇతడు కుండలు బుట్టలు నన్నింటిని తిరుగ మరుగవేయును. అతని యాకలితీరుటయే ప్రధానము కాని యిది పచ్చిది, ఇది విచ్చిది; ఇది చేదు, ఇది తీపి అన్న వివక్షలేదు. కాని పెద్ద తిండిపోతు కాడు. రాత్రిపూట నేదియైన తినుటకు లేనిచో పెద్ద నష్టములేదుగాని పగలు తిని తీరవలయును. తన యాకలితీర్చుకొనుట కతని మార్గము లతని కున్నవి. అతనికి కొంత వయసు వచ్చు వరకు నతడు తన స్నేహితులమీద నాధారపడి యుండెడివాడు. అన్నోదకములకు లోపములేని సంసారులలోని పిల్లలతోనే చెలిమిచేసెడివాడు. ఆ పిల్లలు పోయి వారి తల్లులను బాధించి యేడ్చి యాగము చేసి మారాముచేసి రెట్టింపునకు రెట్టింపు తిను బండారములను దీసికొనివత్తురు. మన హరికిశోరము వారికిగూడ మిగల్చకుండ చక్కగా నారగించును.

హరికిశోరమునకు జబ్బపుష్టి కలదు. అతడు కొట్టునని తక్కిన వారికి భయము. చిన్నపిల్లల మధ్య పోరాటము వచ్చినచో ఐక్కవలు చనివారు వాని పక్షముందురు. వానికి పదునేను పదునెనిమిదేండ్లు

వచ్చువరకు వాని తండ్రి గుణములు వానిలో నెలవేసెను. ఊరిలో నున్న స్త్రీలను గురించి తనకంటె చిన్నవాండ్రయిన చెలిమికాండ్రతో నామె యట్టిది, యీమె యిట్టిది; ఆమె యట్లు చూచును, ఈమె యిట్లు చూచును; ఆమె వంకరగా నడచును, ఈమె యొయ్యారముగా నడచును; దానికిని వానికిని సంబంధము; అది నావంక చూచినది; నేనన్నచో దానికి ప్రేమ- ఇట్టి ప్రసంగములు చేయుచుండును. వాని చెలికాండ్రయిన యా వయసు రాని పిల్లలు చెవులు దోరవెట్టుకొని విందురు. వారిలో యౌవనము ప్రబుద్ధము కాదుగాని తత్సంబంధమైన యూహలు ప్రబుద్ధమై యుండెను. లేదా అగుచుండెను. ఈ హరికిశోరమును గూడ నాబ్దికముల కప్పుడప్పుడు నిమంత్రణము చేయుదురు. అతని కది యిష్టములేదు. తప్పనిసరికి తల్లి బలవంతముచేయగా, నన్నగారు కోపపడగా పోవుచుండును. ఆ యాబ్దికములలో భోజనము పెట్టి దక్షిణ యీయవలెను. దక్షిణకు డబ్బులేదు కావున నేదియో పదార్థమిత్తురు. ఒక సోలెడు సెనగలు, లేదా మినుములు, తమిదెలు, సజ్జలు, రాగులు వేనినైన నిత్తురు. అవి తెచ్చినచో నింటిలో నాడపిల్లలకు తల్లికి హనిహనిగా నొక్కపూటకు సరిపోవును. అతడు శ్రాద్ధభోక్తగా వెళ్లుటకు తన మర్యాద చెడిపోయినట్లు భావించును. వానికున్న మర్యాద యెట్టిది? తల్లి కడుపున బడినప్పటినుండియు దరిద్రుడే. ఆ యూరిలో వానికొక యిల్లు తప్ప మరి యేమియులేదు. ఊరుపెట్టిన తిండి తప్ప సొంత తిండలేదు. కట్టు గుడ్డలేదు. మాసిపోయి చినిగిపోయిన గుడ్డలు కలవారినుండి యడిగి కొని తెచ్చినవి వాని దుస్తులు. ఈ మర్యాద యెచ్చటనుండి వచ్చినది? అది భగవంతునకే తెలియవలయును.

మర్యాద, అహంకారము, పొగరుబోతు తనము మొదలైనవి జీవుడు పుట్టినంతనే వచ్చుననవలయును. అవి బయటి పరిస్థితులచేత వృద్ధిపొందు ననవలయును. కొందరు మూర్ఖులయందు వృద్ధిపొందెడి వెలిపరిస్థితులు లేకపోయినను నవియుపిగానే యుండును. హరికిశోరము మంచి తెలివిగలవాడు. సూక్ష్మగ్రాహి. చదువు చెప్పించెడి వాడు లేడు. చదువుకొనవలయునను బుద్ధి వానికి లేదు. ఈ రెంటిలో నేదియున్నను వాడు పైకి వచ్చెడివాడు. ఆ దినములలో ననేక గ్రామ

ములయందు గొప్ప పండితు లుండెడివారు. అచ్చటికిబోయి వార ములు చేసికొని జీవించి యా గురువువద్ద చదువుకొనవచ్చును. హరి కిశోరమున కాబుద్ధి యుదయించలేదు. అట్లు గిరిధరము చేసినను చేయవచ్చును. కాని గిరిధరము తాను లేచిపోయినచో సంసార మంతయు తనమీద నున్నది. వారిని వదలిపెట్టి వెళ్ళుట న్యాయము కాదని యాగెను. ఇది జీవుని విషయములో నెంత విచిత్రమో శరీర విషయమునందు నంతే విచిత్రము. తాను సంపాదించి వానిని పోషిం చుట లేదు. తనకు సంపాదించెడి శక్తిలేదు. వారును తానును కలిసి మాడుచున్నారు. తాను వెడలిపోయినచో వారేమగుదురన్న ప్రశ్న యేమి? ఇది జీవుని యొక్క ప్రధానమైన మోహము. లోకము మిథ్య యని తెలిసి పురుషుడు సన్యసించి పోవచ్చును. అతడు సంసారమును వదలిపెట్టి పోడు. తాను పోయినచో నా సంసార మేమగునన్నది వాని ప్రశ్న. ఇతడు సంపాదించి పెట్టుచున్నాడా? పెట్టుచున్నట్లు కని చించుచున్నది. పిల్లలకు ముక్కు పచ్చలారలేదు. రెక్కలు రాలేదు. తాను పోయినచో వా రేమగుదురన్నది. లోకములో చూచుచునే యున్నాడు. ఇవే పరిస్థితులలో చాలమంది పోయినారు. వారి రెక్కలు రానిపిల్లలు, వారి ముక్కుపచ్చలారని పిల్లలు నేమైరి? వాడు చనిపోయి నాడు. వారి దారిని వారు బ్రతుకుచున్నారు. తన పిల్లలు నట్లే బ్రతుకు దురు. అట్లు కాదు. తను చచ్చిపోయినచో చచ్చిపోవును గాని బ్రతికి యుండగా నయ్యో! తాను చనిపోవుచో వా రేమగుదురో యని. చచ్చి పోదురు. చావనక్కరలేదు. ఇల్లు వదలిపెట్టి పోరు. సంపాదించలేని గిరిధరమునకే యిట్లుండగా సంపాదింపగలిగినవారి కెట్లుండును? ఇంతకును చదువు వారి వంశములో లేదు. తాత చదివినవాడు కాడు. తండ్రి చదివినవాడు కాడు. అందుచేత హరికిశోరమునకు చదువుమీద బుద్ధి పోలేదు.

హరికిశోరము తెలివిగలవాడని, సూక్ష్మగ్రాహియని, మంచి బల శాలియని యూరిలో చెప్పికొందురు. అత డే దినమున కా దినము తన యాహారమును చక్కగా సంపాదించికొనును. ఇంటిలో తల్లి తన చెల్లెండ్రకోసము, తనకోసము నేదైన దాచుట తటస్థించిన దానిని చాటుగా తినివేయును. ప్రతిసారియు పులి వేటకోసము

బయలుదేరదు. నిలువయున్న మాంసమునే తినును. లేనిచో బయలుదేరును. ఆవేట పలువిధములుగా నుండును. ఒకప్పుడు పొంచి లేడిమీదకు దూకును. ఒకప్పుడు పరుగెత్తులేళ్ల సమూహమునుజూచి యొకదానిమీద దృష్టినిలిపి దానిని సమీపమునకు రానిచ్చి దానిమెడ పిసికిచంపును. మరొకప్పుడు వేరుమృగము చంపిన లేడిని ఆమృగమును పారద్రోలి తానారగించును. వేటయన్న దానికి నియమమేమున్నది? మరియొక చమత్కారము. ఎవడో పదిరొట్టెలు కట్టికొని ఆవులనో యెడ్లనో దున్నపోతులనో కొనుటకు పరగ్రామము పోవుచున్నాడు. హరికిశోరి వాని నాపును. మా యూరిలో గొడ్లమ్మక మున్నకున్నవని చెప్పును. తన యూరునకు వానిని తీసికొనివచ్చును. ఊరి చివర చెరువున్నది అతనినచ్చట కూర్చుండబెట్టి రొట్టెలు తిన్న తరువాత వెళ్లుదమనును. వాడొక యరరొట్టె తినగా వీడొక నిండు రొట్టె తినును. కొందరకు లాభముచేసిపెట్టుదునని వారిండ్లలో నారగించును. ఒక యావునకు బస్తా సజ్జలిత్తురు. అరబస్తా సజ్జల కొక యావు నిప్పింతుననును. వాని యింటిలో నారగించును. చివరకు ఆవునకు బస్తా సజ్జలిచ్చి తీరవలెను. ఇది యేమయ్యాయనగా 'నీ యావు తక్కిన యావులవంటిదికాదు. ఇది రెండు పూటలకు రెండు రెండు శేర్లు నాలుగుశేర్లు పితుకు'నని చెప్పును. అతడు ధరించెడి దుస్తులుకూడ మంచివే. ఊరిలో నాల్గు మగ్గములున్నవి. ఎప్పు డెవరి నెట్లు మోసముచేయునో తెలియదు. జొన్న లిప్పింతుననును. ఆవును తోలిపెట్టింతుననును. ఏదో చెప్పును. సంవత్సరమునకు రెండుజతల బట్టలను తాను సంపాదించును.

అతనివద్ద ఒక విశేషమున్నది. ఒక వ్యక్తి తన శరీరముతో నెన్ని చేయగలడో యన్నియు నతడు చేయగలడు. అతని బ్రతుకు సుఖముగా సాగుచుండెను. వానివద్ద నొకటియే దోషము. ఆహ్నికమునకు నిమంత్రితుడై వెళ్లుట యతని కభిమానముకదా! ఆ యభిమానమతనికి సర్వవిషయములందుకలదు. అతనికొకనిమీద కోపమువచ్చినచో వారి గడప త్రొక్కడు. అతనిని సాధించుటకు ప్రయత్నము చేయును. తన మూలముగా వాని కొక యపకారము జరిగెడివరకు వానికి నిద్ర పట్టదు. హరికిశోరము వారి గ్రామములో నొక ప్రధానమైన పురుషుడు

ములయందు గొప్ప పండితు లుండెడివారు. అచ్చటికిబోయి వారి ములు చేసికొని జీవించి యా గురువువద్ద చదువుకొనవచ్చును. హరి కిశోరమున కాబుద్ధి యుదయించలేదు. అట్లు గిరిధరము చేసినను చేయవచ్చును. కాని గిరిధరము తాను లేచిపోయినచో సంసార మంతయు తనమీద నున్నది. వారిని వదలిపెట్టి వెళ్ళుట న్యాయము కాదని యాగెను. ఇది జీవుని విషయములో నెంత విచిత్రమో శరీర విషయమునందు నంతే విచిత్రము. తాను సంపాదించి వానిని పోషిం చుట లేదు. తనకు సంపాదించెడి శక్తిలేదు. వారును తానును కలిసి మాడుచున్నారు. తాను వెడలిపోయినచో వారేమగుదురన్న ప్రశ్న యేమి? ఇది జీవునియొక్క ప్రధానమైన మోహము. లోకము మిథ్య యని తెలిసి పురుషుడు సన్యసించిపోవచ్చును. అతడు సంసారమును వదలిపెట్టి పోడు. తాను పోయినచో నా సంసార మేమగునన్నది వాని ప్రశ్న. ఇతడు సంపాదించి పెట్టుచున్నాడా? పెట్టుచున్నట్లు కని చించుచున్నది. పిల్లలకు ముక్కు పచ్చలారలేదు. రెక్కలు రాలేదు. తాను పోయినచో వా రేమగుదురన్నది. లోకములో చూచుచునే యున్నాడు. ఇవే పరిస్థితులలో చాలమంది పోయినారు. వారి రెక్కలు రానిపిల్లలు, వారి ముక్కుపచ్చలారని పిల్లలు నేమైరి? వాడు చనిపోయి నాడు. వారి దారిని వారు బ్రతుకుచున్నారు. తన పిల్లలు నట్లే బ్రతుకు దురు. అట్లు కాదు. తను చచ్చిపోయినచో చచ్చిపోవునుగాని బ్రతికి యుండగా నయ్యో తాను చనిపోవుచో వా రేమగుదురో యని. చచ్చి పోదురు. చావనక్కరలేదు. ఇల్లు వదలిపెట్టి పోరు. సంపాదించలేని గిరిధరమునకే యిట్లుండగా సంపాదింపగలిగినవారి కెట్లుండును? ఇంతకును చదువు వారి వంశములో లేదు. తాత చదివినవాడు కాడు. తండ్రి చదివినవాడు కాడు. అందుచేత హరికిశోరమునకు చదువుమీద బుద్ధి పోలేదు.

హరికిశోరము తెలివిగలవాడని, సూక్ష్మగ్రాహియని, మంచి బల శాలియని యూరిలో చెప్పికొందురు. అత డే దినమున కా దినము తన యాహారమును చక్కగా సంపాదించికొనును. ఇంటిలో తల్లి తన చెల్లెండ్రకొనము, తనకొనము నేదైన దాచుట తటస్థించిన దానిని చాటుగా తినివేయును. ప్రతిసారియు పులి వేటకొనము

బయలుదేరదు. నిలువయున్న మాంసమునే తినును. లేనిచో బయలుదేరును. అవేట పలువిధములుగా నుండును. ఒక ప్పుడు పొంచి లేడిమీదకు దూకును. ఒకప్పుడు పరుగెత్తులేళ్ల సమూహమునుజూచి యొకదానిమీద దృష్టినిలిపి దానిని సమీపమునకు రానిచ్చి దానిమెడ పిసికిచంపును. మరొకప్పుడు వేరుమృగము చంపిన లేడిని ఆ మృగమును పారద్రోలి తానారగించును. వేటయన్న దానికి నియమమేమున్నది? మరియొక చమత్కారము. ఎవడో పదిరొట్టెలు కట్టికొని అవ్వలనో యెడ్లనో దున్నపోతులనో కొనుటకు పరగ్రామము పోవుచున్నాడు. హరికిశోరి వాని నాపును. మా యూరిలో గొడ్లమ్మక మునకున్నదని చెప్పును. తన యూరునకు వానిని తీసికొనివచ్చును. ఊరి చివర చెరువున్నది ఆతనినచ్చట కూర్చుండబెట్టి రొట్టెలు తిన్న తరువాత వెళ్లుదమనును. వాడొక యరరొట్టె తినగా వీడొక నిండు రొట్టె తినును. కొందరను లాభముచేసిపెట్టుదునని వారిండ్లలో నారగించును. ఒక యావునకు బస్తా సజ్జలిత్తురు. అరబస్తా సజ్జల కొక యావునిప్పింతుననును. వాని యింటిలో నారగించుచు, చివరకు ఆవునకు బస్తా సజ్జలిచ్చి తీరవలెను. ఇది యేమయ్యాయనగా 'నీ యావు తక్కిన యావులవంటిదికాదు. ఇది రెండు పూటలకు రెండు రెండు శేర్లు నాలుగుశేర్లు పితుకు'నని చెప్పును. ఆతడు ధరించెడి దుస్తులుకూడ మంచివే. ఊరిలో నాల్గు మగ్గములున్నవి. ఎప్పు డెవరి నెట్లు మోనముచేయునో తెలియదు. జొన్న లిప్పింతుననును. ఆవును తోలిపెట్టింతుననును. ఏదో చెప్పును. సంవత్సరమునకు రెండుజతల బట్టలను తాను సంపాదించును.

ఆతనివద్ద ఒక విశేషమున్నది. ఒక వ్యక్తి తన శరీరముతో నెన్ని చేయగలడో యన్నియు నతడు చేయగలడు. అతని బ్రతుకు సుఖముగా సాగుచుండెను వానివద్ద నొకటియే దోషము. ఆబ్దికమునకు నిమంత్రితుడై వెళ్లుట యతని కభిమానముకదా! ఆ యభిమాన మతనికి సర్వవిషయములందుకలదు.అతనికొకనిమీద కోపమువచ్చినచో వారి గడప త్రొక్కడు. ఆతనిని సాధించుటకు ప్రయత్నము చేయును. తన మూలముగా వాని కొక యపకారము జరిగెడివరకు వానికి నిద్ర పట్టదు. హరికిశోరము వారి గ్రామములో నొక ప్రధానమైన పురుషుడు

గానున్నాడనక తప్పదు. వయస్సుచేత చిన్నవాడు. అతని కిరువది యిరువదిరెండేండ్లకన్న వయస్సు మించిలేదు. అతని వివేకముతో బాటు, అతని పరోపకార బుద్ధితోపాటు అతనివద్ద రెండుమూడు శక్తులున్నవి. ఆగ్రామమున కొకసారి, వాని చిన్నప్పుడు, పొట్టేళ్ల నాడిం చెడివారు వచ్చిరి. వారు పొట్టేళ్ల నాడింతురు. కత్తిసాములు, కఱ్ఱసాములు గూడ చేయుదురు. వారా గ్రామములో మూన్నాళ్లుండిరి. ఈ మూన్నాళ్లు హరికిశోరము వారివద్దనేయుండెను దోసెడు జొన్నలు పెట్టెడిచోట రెండు దోసిళ్లు పెట్టించెను. ఒక వస్త్రమిచ్చెడిచోట రెండు వస్త్రము లిప్పించెను. అందుచేత వారికి మిక్కిలి ప్రియుడయ్యెను. వారితనిని తమ వెంట రమ్మనిరి. ఇతడు వారివెంట వెళ్లి యారు నెలలు తిరిగి వచ్చెను. ఆ యారునెలలలో నితడు వారివద్ద కత్తి సాము, కఱ్ఱసాము నేర్చికొనెను. అతడు కఱ్ఱ పుచ్చికొని నిలుచుండగా పదిమంది అతనిచుట్టు మూగినను వానినేమియు చేయలేరు. కత్తి చేత బూచినచో వాని నెవ్వడును కటారికాడు పొడువలేడు. అతడు కఱ్ఱను ద్రిప్పుచుండగా పదిమంది అతనిమీద రాళ్లు విసరవచ్చును. ఒకరాయి కూడ అతనికి తగులదు. ఈ విద్యలు కాక అతడు పొట్టేలునకు తన దండ యిచ్చును. క్రుమ్మవచ్చు పొట్టేలు నడ్డగలడు. ఈ విద్యలతో హరికిశోర మాగ్రామములో చాల గౌరవమును సంపాదించెను.

ఇద్దరినడుమ వివాదము కలిగినచో తీర్పరి హరికిశోరము. అతడు మరియొక విద్యను సంపాదించెను. ఒక విద్య యనుటకంటె రెండు విద్యలనుట మంచిది. ఒక యారునెలలు కొందరు శాబరుల వెంట తిరిగి తన తండ్రి నేర్పిన వట్టి శరీరమునుండి భస్మమును పుట్టించుట యొకటి గుడ్డకొంగున విభూతియో పసుపోకుంకుమయో పెట్టి మూటగట్టి యా చిన్నమూటను కత్తితో కోయుట. మరల గుడ్డను తీయగా గుడ్డ సరిగానే యుండును. ఇవి రెండును కలిపి యొకవిద్య- మరియొకవిద్య యేమనగా నెవరో వీధి నాటకము లాడెడువారు వచ్చిరి. వారివద్ద కొన్ని పాటలు నేర్చికొనెను. ఈ రీతిగా నతడు గ్రామములో బహు సమర్థుడుగా, నుత్సాహవంతుడుగా, మర్యాదకల వాడుగా లెక్కలోనికి వచ్చెడువాడుగా సిద్ధమయ్యెను. ఈ భస్మమును దీయుట మొదలైన క్షుద్రవిద్యలచేత నతని కొకటి లాభించెను.

ఆ యూరిలో నొక సంపన్న గృహస్థు కలడు. అతని యింటిలో నతని భార్యకు పిశాచము పట్టెను. ఇతనితో ఆ పిశాచమును వదలించినచో నీకు కుంటపాల మిత్తుననెను. ఆ దినములలో పొలమిచ్చుట యనగా నెవ్వరు నెవ్వరికిచ్చెడిది లేదు. పొలమున్నచో చేతనైనచో నెవనికి వాడు దున్నికొనవచ్చును. దున్నుకొనుటకు సామర్థ్యముండవలెను. అనగా రెండెడ్లు, ఒక నాగలి, ఒక బండి దున్న కలిగియుండుట, శరీర కష్టము పడగలుగుట యివి యున్నచో,పరులెవ్వరు దున్నుకొని పొలమున్నచో, నది చవుటి పట్టు కాక పండునన్న యాశయున్నచో దున్ను కొనవచ్చును. పండించుకొన వచ్చును. పంటదినములలో రాజాధికారులు వత్తురు. రాజు యొక్క అరవపాలు తీసికొందురు. అనాదిగా గొంత పొలము కొందరి స్వాధీనములో నుండును. వారు వంశ పారంపర్యా చేసికొనుచుందురు. సంపూర్ణమైన యధికారము వేరికిని కలుగదు. ఒక డింకొకనికిచ్చినచో దానిని దున్నికొని పండించుకొనెడి యధికారము మాత్రమే యిచ్చును. దానము చేయుట, విక్రయించుట మొదలైన యధికారములు పొలములమీద నెవ్వరికి నుండవు. తాత్పర్యమేమనగా నెవడు పెట్టుబడి పెట్టి శరీరకష్టము పడగలడో వాడుమాత్రమే పొలమును చేసికొనగలడు. అట్టి పరిస్థితులలో నా సంపన్నుడు హరికిశోరమునకు కుంటపాలమిత్తు ననగా యర్థమేమనగా కుంటపాలము మీద వచ్చు గింజలు ప్రతి సంవత్సరము హరికిశోరమున కిత్తునని యర్థము. అనగా నా కుంట పొలమును హరికిశోరము పేర పెట్టుట యనగా నా యాసామి పండించి తానేదున్ని ప్రతి సంవత్సరము పంటను హరికిశోరమునకు తోలి పెట్టునని యర్థము. అనగా హరికిశోరము తలియు, చెల్లెంద్రును గుడ్డిలో మెల్లగా బ్రతుకవచ్చు నన్నమాట. అన్నకు తిండి యక్కరయే లేదు. తన తిండి తానెట్లో చూచుకొనగలడు.

కాని, ఆ పెద్దమనిషి భార్యకు పిశాచమును వదలించుట యెట్లు? ఇతని కావిద్య తెలియదే? ఇతనికి మంత్ర శాస్త్రము రాదు. కొన్నాళ్ళు శబరులతో తిరిగినమాట వాస్తవమే. వారేదో తంతులను జేసి నెరవు కొనుచుండగా నితడు చూచినది నిజము. యంత్రతంత్ర మంత్రములు మూడు. ఇతనికి యంత్రము తెలియదు. మంత్రము తెలియదు. తంత్రములను చూచెను. తా నొకనాడు అడవిలోనికి బోయి యొక

ర్యాత్రము నందు వారు చేయు తంత్రమును చూచెను. ఆ తంత్రము నిచ్చుట చేయ నెంచెను. గ్రుడ్డివాని చేతి రాయి తగిలినచో తగుల వచ్చు నని యా పని చేయుటకు తాను సమర్థుడనని చెప్పి వారి యింటిలో నొక ముగ్గువేసి యామె నందు కూర్చుండ బెట్టి కొబ్బరి కాయలు కొట్టుట, కర్పూరము వెలిగించుట, శంఖమూదుట ఎర్రని యన్నము నారగింప పెట్టుట, తాను నేర్చిన పాటలు పాడుట, తన నేర్చిన కర్రసాము కత్తిసాము నామె ముందు ప్రదర్శించుట - ఎట్టైన నేమి? ఇట్లు నాలుగైదు దినములు గడచిన తరువాత నా పిశాచము వదలిపోయెను. అన్ని పిశాచములు గడును పిశాచము లుండవు. మానవులలో కొందరు గడునువారు. కొంద రమాయకులు. కొందరు వెర్రిబాగులవారు. కొందరు నగము గడునువారు నన్నట్లే పిశాచము లలో గూడ నిన్నివిధము లుండును. ఎందుకుండవు? పిశాచము లనగా నేమి? చనిపోయిన జీవులే తమ కోరికలు తీరకయో, వారి స్వభావము లలో నంటిపెట్టుకొని కూర్చున్న కొన్ని దుష్టగుణములచేతనే, వారికి ప్రేతకర్మలు సరిగా జరుగక పోవుటచేతనో పిశాచములగును. భగ వంతుడు ప్రతిజీవికి కొంత యాయుర్దాయము లిఖించును. కొన్ని గండము లుండును. వాని కన లాయుర్దాయ మరువదియేండ్లను కొందము. నలువదియవయేట గండమున్నది. ఆ గండము తప్పెనా? అరువదియేండ్లును బ్రతుకును. తప్పదు? నలుబదియవ యేటనే చని పోవును. వాడు తక్కిన యిరువదియేండ్లును పిశాచమువలె బ్రతుకును. అదియేవో వెర్రిపిశాచము. ఇంతకును హరికిశోరమునకు, లేదా యతని కుటుంబమునకు కుంటపొలము మీది పంట రావలసిన యోగ్యత యున్నది. ఆమె కావ్యాధి కుదిరెను. వీరి కా పంట వచ్చుట యారం భించెను. హరికిశోరము సహజముగా దేశద్రిమ్మరి. కాని తల్లియు తన పెద్దన్నలు తిండిలేక బాధపడుచున్నారన్న యొక నన్నని వగవు మనసులో లేకపోలేదు. వారికి తాను చేయదగినది చేసినాడు.

హరికిశోరముయొక్క ప్రకృతిలో మరియొక లక్షణమున్నది. అతనిని పలుమంది బ్రాహ్మణు లాబ్దికమునకు నిమంత్రించుచుండగా వాని కొడలు మండి మెడలోని జందెమును త్రెంచివేసినాడు. నేను బ్రాహ్మణుడనుకాను పొమ్మన్నాడు. అతడెచ్చటపట్టిన నచ్చటే భోజ

నము చేయును. చతుర్థకులజులెవరైననునరే వారిండ్లలో భోజనము చేయుట కభ్యంతరములేదు. తాను బ్రాహ్మణుడనుటకంటె చతుర్థ కులజుడగుటనే వాంఛింతునని చెప్పును.

హరికిశోరమునకు వానితండ్రియొక్క కామప్రవృత్తి వచ్చెనని చెప్పబడినది. కాని వీని కామప్రవృత్తికి, తండ్రియొక్క కామప్రవృత్తికి చాలభేదము కలదు. ఇతని కామప్రవృత్తి యెంతసేపటికిని తానంద కత్తె లనుకొన్న స్త్రీల వెంటబడి తిరుగుటయు, వారితో పరాచికము లాడుటయు, వానిని పూసికొని తిరుగుటకు ప్రయత్నించుటయు. ఇంత మాత్రముతో నరిపోదు. స్నేహితులతో నామెకును తనకును నంబంధ మున్నదని కథలు కల్పించి చెప్పుచుండును. ఆకథలు చిత్రచిత్రముగ నుండును. తానొక యర్ధరాత్రమున నామెను గ్రామమువెలుపల నున్న తోటలోనికి రమ్మన్నాడు. ఎట్లు రమ్మన్నాడు? ఆమెకు కను గిలిపెను. ఆ కనుగిలుపులో నా యర్థమున్నది. ఆ యర్థ మామె కెట్లు తెలియును? తనతపశ్శక్తిచేత తెలియును. తాను పిశాచములను వద లించునుకదా! పిశాచములకు తానన్న భయము. ఆ కనుగిలుపులో నర్థమై యర్ధరాత్రమున నామె యూరిచివరనున్న చింతల తోపులోనికి వచ్చెను. అచట వారిద్దరు నంభాషించుకొనిరి. వారు కలసికొనవలయు ననుకొనుచుండగా నచటికప్పుడు రెండుదయ్యములు వచ్చెను. ఇత డా దయ్యములను పారద్రోలెను. వెంటబడి పరుగెత్తి తరిమెను. ఈలోగా ఆమె భయపడి యింటికి వెడలెను. మరునాడామెకు కనుగిలిపెను. ఆ కనుగిలుపు ఒక్కసారే పనిచేయును. ఈవిధముగా తననడుమ, నామె నడుమ శృంగారము చెడిపోయెను.ఏ పిశాచమునుతనకు కుంటపాలము నిచ్చిన యాసామి భార్యయొక్క శరీరమునుండి పారద్రోలెనో యా పిశాచమే తనమీద కసితీర్చుకొనుటకు మరియొక పిశాచమును తోడు తెచ్చికొని తన కీయపకారమును చేసెను. అప్పటినుండి తాను ప్రతి దినము రాత్రి రెండు జాములవేళ చింతలతోపులో దానికొరకు కాపు వేయుచుండెను. అది యొంటరిగా కనిపించినచో దాని దొక్కచించి డోలుకట్టును. హరికిశోరమునొద్ద నిటువంటి కథలు పదిపంద్రెండు కలవు. వానినే తన నలుగురు స్నేహితులవద్ద చెప్పును. అందరితో చెప్పడు. ఆనలుగురు నమ్ముదురా యనగా వారును నమ్మరు. వారు

నమ్మరని యితనికి తెలియును. ఎందుకట్లు చెప్పుననగా వానికొక స్త్రీ మీద కోర్కె యేర్పడును. అతనికి జారత్వముచేయు సాహసములేదు మరియు నొక స్త్రీయందు వానికిగల వాంఛ దాని సౌందర్యమును భావించి యామెతో మనస్సుతో నీరీతిగా భావించుటతప్ప యింకొక ప్రవృత్తి లేదు. అతని దృష్టి యే స్త్రీమీద పడినను నామె మరియొకని భార్యయగుటయో, యామె యలభ్యయగుటయో సంభవించుచుండెను. అతడు నలుగురైదుగురు బ్రాహ్మణకన్యలను చూచి మెచ్చికొనెను. ఇతడు బ్రాహ్మణకులమునుండి భ్రష్టుడు. ఇతని కా పిల్లల తండ్రులు తమ కూతుండ్రనీయరు. అవి వదలిపోయినది. మరియొకరిద్దరు స్త్రీలను పెండ్లియైన వారినిచూచి వారి సౌందర్యమునకు ముగ్ధుడయ్యెను. అరీతిగా నవి వ్యర్థమైనను, తాను నిర్ధనుడు. ధనికుల పిల్లలు తమకూతుండ్ర నితనికీయరు. బ్రాహ్మణులునరే, బ్రాహ్మణేతరులీయవచ్చునుగదా! ఆదినములలో కులభ్రష్టుడు కులభ్రష్టుడే. అగ్రకులమునుండి యొకడు భ్రష్టుడైనాడనగా తక్కిన కులములవారతనిని మన్నించరు. ఆ కులమునందతడు చెడిపోయెననగా మరి యే కులమునందతడు చెడిపోడు? నేడు బ్రాహ్మణాన్నమునువదలి శూద్రాన్నమును తినెను. రేపు గోసంగినింట నన్నమెందుకు తినడు? గోసంగి మాత్రము వీనిని రానిచ్చునా? వాడు పచ్చిమాంసమును తినడు. వీడు రేపు పచ్చిమాంసమును తినుటకు సిద్ధమైనచో నెవడేమి చెప్పగలడు? 'భ్రష్టస్య కా వా గతిః'? అందుచేత ధర్మము పూర్తిగాచెడని యాదినములలో భ్రష్టుడుభ్రష్టుడే. ఒకమెట్టు క్రిందికిదిగినాడు; రెండుమెట్లు క్రిందికిదిగినాడు అనిలేదు. ఒక్కొక్క కాలమునందు మనఃప్రవృత్తు లొక్కొక్కరీతిగా నుండును. ఒక్కొక్కదేశమునందు మనఃప్రవృత్తు లొక్కొక్కరీతిగా నుండును. అప్పటికి కలికాలమురాలేదు. అందుచేత మనఃప్రమాణము తావన్మాత్రముగా నిలచియుండెను. కాని యొక్కటి యున్నది. ఇతడు బ్రాహ్మణవర్ణమునుండి యెట్లు సంచ్యుతుడో యట్లే తక్కినవర్ణములందుగూడ సంచ్యుతులుందురు. కాని యితనివలె తమ భ్రష్టత్వమునుగూర్చి బాహాటముగా చెప్పికొనరు. ఇతనికి కుంటా పాలమిచ్చిన యాసామి చతుర్థకులజుడు. అతని భార్య కితడు కుదిర్చెను. ఆమెకు నెమ్మదించెను. వారి యింటిలో నితడు భోజనము

చేయుదుననెను. వా రితని కన్నము పెట్టిరి. ఎక్కడ పెట్టిరి? సావడిలో పెట్టిరి. తమ కులమువారు కానివారికి పెట్టెడి చోట పెట్టిరి. తమ వంటయింటిలో దేవుని పూజలు, పురస్కారములు నుందును. అక్కడికి వర్ణభ్రష్టులు రాకూడదు దేవుడు మైలపడిపోవును. హరికిశోరుడు పెద్దవాడైనకొలది నతని కా యూరిలో మూడు నాల్గు పేద శూద్ర కుటుంబములతో బరిచయము కలదు. ఇది తండ్రి నాటి పరిచయము. తండ్రి యా యిండ్లలో నుండెడివాడు. సంచరించెడివాడు. అచ్చటనే భోజనములు చేసెడివాడు. కాని యా భోజనములను చేయుట కప్పిపుచ్చెడివాడు. నలుగురికి తెలియునుగాని నోటితో నెవ్వరు ననరు. ఆ మూడు సంసారములలో నొక సంసారము నందు వాని తండ్రి కొక యనుబంధము కలదు. ఆ యనుబంధమును పురస్కరించికొనియో, మరి యే కారణముచేతనో హరికిశోరున కా యింటితో రాకపోకలు మెండు. హరికిశోరుడు నివసించు రెండు గృహము లా యూరిలో నున్నవనగా నొకటి తమ గృహము; రెండవది వారి గృహము. ఆ యింటిలో వారు పేదవారు. వారి కెక్కువ పొలములేదు సంసారము గడుపుకొనుటకుమాత్రమే వారి సంపాదన చాలును. వారికి రెండావుల పాడియున్నది. చెరువుకడుపులో వారు రాగులో తమిదెలో వేసికొందురు అది కొద్ది స్థలము. సంవత్సరమునకు తగిన గింజలనెట్లో పండించుకొందురు. బండియున్నది. దానిని కట్టుదురు. అదినములలో కిరాయి యనిలేదు. లేదనగా ధనరూపముగా లేదు. ఒకకుంచము గింజలు. ఒక అద్దెడు నువ్వులు. లేదా రెండుసేర్ల సెనగలు. కిరాయి యిట్లుండును. వారారీతిగా సంసారమును సాగించుకొనుచుండిరి. ఆ సంసారములో శాకయ్య లేచిపోయిననాటి కొకతల్లి, యొక తండ్రి, యిద్దరు సోదరులు,నొకసోదరి. అప్పటికాసోదరికి పదునేను సంవత్సరములు. ఆమె యన్నలిద్దరు నామెకంటె నొకడు నాలుగేండ్లు, నొకడైదేండ్లు పెద్దవారు. వారు పొలముపాట్లు చేయగలవారు. దేహపుష్టి కలవారు. అహంకారులు. శాకయ్యచెప్పెడి సిద్ధాంతములకు తండ్రిని బట్టి యనుకూలురు కాని తమచెల్లెలితో శాకయ్యకు సంబంధమున్నదని వా రాకట్టి శాకయ్యకు బుద్ధిచెప్పుటకు ప్రయత్నములు చేయుచుండిరి. తండ్రి కాదనును. తల్లియు నొప్పుకొనదు. చెల్లెలిని గ్రుచ్చి

గ్రుచ్చి యడుగగా నామె యేడ్చునుగాని యిదమిత్థమని చెప్పలేకపోయెను. చివరి కా యన్నదమ్ములిద్దరు నదియేమైననుసరే శాకయ్యను హతమార్చుటకు సిద్ధమైరి. వారిచెల్లెలే యీ సంగతి శాకయ్యతో చెప్పెను. అతనిని పారిపొమ్మనెను. అతడు పారిపోకముందు వారము పదిదినములు శాకయ్య వారియింటికి పోనేలేదు. ఆమె యన్నలిద్దరును తీవ్రప్రకృతులని యూరిలో నందరకు దెలియును. శాకయ్య పారిపోయిన తరువాత నెలతిరుగకముందు దామెతండ్రి చనిపోయెను. ఆమెతల్లి భర్తతో సహగమనముచేసెను. దానితో వారికుటుంబమునకు మంచి ప్రతిష్ఠ వచ్చెను. ఆమె యన్నలిద్దరిలో నొకడు వ్యాధిగ్రస్తుడయ్యెను. సంసారముగడచుట కష్టముగానుండ రెండవయన్న తనచెల్లెలి నొక సాటికులమువానికిచ్చి పెండ్లిచేసెను. పెండ్లియైన తరువాత నామె కొక కుమార్తె కలిగెను. తొమ్మిదినెలలు నిండలేదని కొందరు, నిండెనని కొందరు. ఏది యెట్లున్నను ఆమె తల్లిచేసిన సహగమనముతో నూరిలో వారి సంసారము నెడ కలిగిన సదభిప్రాయమంతయుచేత పరిసిపోయెను. ఆ పుట్టినపిల్ల కిప్పుడు పదునారు పదునేడేండ్లు. ఇంక నెక్కువ వయసేమో చెప్పలేము. ఆమె సరిగా తల్లివలె నుండును. హరికిశోరమునకు వారియింటిచుట్టు తిరుగుట చిన్నప్పటినుండియు నలవాటే. ఆమెకు పదుమూడు పదునాలుగేండ్లు వచ్చువరకు నిద్దరు నాడుకొనిరి. ఇతడు చిన్నప్పు డామెను చంకకెత్తికొని తిరిగెను. ఆ పిల్లతల్లికి హరికిశోరుడన్నచో పట్టరాని యభిమానము. ఆమె యన్నచో నితనికిని గొప్ప గౌరవము. ఆమె భర్త తన బావమరదితోబాటు చెరువు కడుపులోని పొలమును చేయును. దున్నును. బండిని కట్టును. సామాన్యమైన కృషీవలునివలె ప్రవర్తించును. ఆ కుటుంబముయొక్క పరిస్థితి పదునెను సంవత్సరములు కడచినను నట్లేయున్నది. పదునేనేమి? పదునెనిమిదేండ్లు గడచినవి. శాకయ్యమీద పగబూనిన యన్నదమ్ములలో నొకడు వ్యాధిగ్రస్తుడేయయ్యెను. తల్లిదండ్రులు పోయిరి. మిగిలిన యన్నకు విరోధము మాసెను. క్రమక్రమముగా హరికిశోరము గ్రామములో నొక మర్యాదను సంపాదించెను. అతని యండ వారికి గావలసివచ్చెను. వ్యాధిగ్రస్తుడైన సోదరుని పోషించవలెను. ఒకయెద్దు ముసలిదగును. లేదా చనిపోవును. అవులలో నొకటి యట్లే యగును.

మరల నెద్దును కొనవలయుననగా, నావును కొనవలయుననగా వారికి సామర్థ్యము లేదు. రెండావులును లేనిచో పాడిగడవదు. ఎద్దు లేనిచో వ్యవసాయము సాగదు, రాబడి తగ్గును. ఇట్టి యిక్కట్టులలో వారు హరికిశోరము తను వాడన్న మర్యాదతో వారి వీరి సాయమును పొందుటను సాధ్యమగు చుండెను. కడచిన నాలుగేండ్లుగా వారియింట నొక వర్తమానము బలిసెను. ఆయింటి యాడబడుచుయొక్క తొలి సంతానము పేరు శీలవతి. ఇప్పుడు హరికిశోరున కిరువది నాలుగేండ్లు. ఆమెకు పదునెనిమిదేండ్లు. వారిద్దరు నొకరి నొకరు ప్రేమించుకొను చున్నారు. మొదటి దినములలో నా పిల్ల తండ్రియు, మేనమామయు నీనంగతిని గుర్తుపట్టలేదు. హరికిశోరుడు పలుమంది స్త్రీలవంక చూచుట నే నామెను ప్రేమించితి నీమెను ప్రేమించితినని వట్టిమాటలు వారితో వీరితో చెప్పుట మొదలైన కథలనుబట్టి వాని ప్రేమ శీలవతిమీద నున్నదని వారనుకొనలేదు. శీలవతియు తాను చేసికొన్నచో హరికిశోరునే చేసికొనును; లేనిచో చనిపోవును. హరికిశోరుడుగూడ నిట్లే సిద్ధమాయెను. వ్యవహారము ముదిరిపోయెను. కాపనుటకు వీలులేదు. తొలినాడు శాకయ్యను వధించుట కన్నదమ్ములు సిద్ధపడిరి. ఈనాడు బావమరదులిద్దరును కలసి హరికిశోరు నేమియు చేయలేరు. ఈ గండమును తప్పించుకొనుట యెట్లు? కాని యొక్కటి నిశ్చయము. శీలవతీ హరికిశోరులు నిజముగా ప్రేమించుకొన్నారేగాని వారి యందింకొక్క దోసములేదు. అతడు వర్ణభ్రష్టుడు. అతనికి పిల్లనిచ్చినచో తమకులము వారిలో కొంత యలజడి బయలుదేరును. మేనమామ మిక్కిలి యాలోచించెను. తన బావమరది యొకనాడు బండికట్టుకొని దూరగ్రామమునకు పోగా తానును తన చెల్లెలును కలిసి హరికిశోరముతో నొక మాట చెప్పిరి. శీలవతి తన తండ్రికి కలిగిన సంతానము. ఆమె నతడు పెండ్లాడరాదు. శీలవతికికూడ నీ వార్త తెలిసెను. ఆమె మరునాడు చెరువులోపడి చనిపోయెను. హరికిశోరునకు పిచ్చియెత్తెను. ఆ పిచ్చి తన తండ్రిమీద పగగా మారెను. తన భార్యయొక్క మృతికి తండ్రిని చంపి ప్రతిక్రియ చేయుదునని శపథము పట్టెను. తండ్రి కొనము బయలుదేరెను.



హారి కిశోరము వెడలిపోయెనేగాని పదిదినములలో తిరిగి వచ్చెను. అతని కింటినుండి వెడలిపోయిన తరువాత 'తల్లి యేమగును? చెల్లెండ్రేమగుదు' రన్న ప్రశ్న పుట్టెను. అన్న మందకొడి. కూర్చున్న చోటినుండి కదలడు. తన ప్రియురాలు తనను వదలి చనిపోయినది. ఆ నామెతో చనిపోలేక పోయెనే! చనిపోయి యేమిచేయుదుము? స్వర్గమునకు బోవుదుమా? స్వర్గమున్నదా? ఒక స్త్రీని ప్రేమించినాడు. ఆ స్త్రీని పెండ్లిచేసికొనుటకు వీలులేక పోయినది. అందుచేత మరణింతువు. ఇతడింత ఏకకాంతాగత భావలగ్నుడు కదా, వీనిని స్వర్గమునకు తీసికొనిపోవుట న్యాయమని యింద్రుడేమైన నూహించునా? అతనికంత యౌదార్యమున్నదా? బ్రతికి యుందువు. తృప్తి యేమి? ఒక స్త్రీయందే లగ్నమనస్కుడై యుండుటచేత లాభమేమి? ఆ స్త్రీయొక్క జీవుడు సంతోషించునా? ఆ జీవుడు గాలిలో తిరుగుచుండునా? చనిపోయినంతనే యే జీవుని మార్గము వానిదేనా? లేదా కొన్నాళ్లు చనిపోకముందటి తన పరిస్థితులను గూర్చి, తన బంధువులను గూర్చి భావించుచుండునా? ఒక పురుషుడు, లేదా ఒక స్త్రీ మరణించును. బంధువులను వదలిపెట్టి యా జీవుడు పోలేడు. ఆ బంధువులుకూడ పదియో పాతికయో యేబదియో యేండ్లకు చనిపోవుదురు. ఆ బంధువులమీద మమకారము పెట్టికొని గాలిలో తిరుగుచున్న యీ జీవుడు వారు చనిపోయిన తరువాత నేమిచేయును? ఆ మమకారమెన్నాళ్ళు నిలచును? చనిపోవుట యెందులకు? బ్రతికి యుండగనే మమకారము లెన్నాళ్ళు నిలచుచున్నవి? స్త్రీ సంబంధ

మైన ప్రేమ వేనిమీద నాధారపడి యున్నది? పురుషుని యొక్క వయస్సుమీద నాధారపడి యున్నది. ఈ ప్రేమకు కారణము ఆ స్త్రీతోడి సంగమ సుఖమునందలి వాంఛయే కదా! వృద్ధత్వము వచ్చిన తరువాత సంగమ సుఖము లేదు గదా! తాను వ్యాధిగ్రస్తుడగును. ఆ స్థితిలో సంగమ సుఖము లేదు. ఆ స్త్రీ వ్యాధిగ్రస్తురా లగును. అప్పుడును లేదు. ఇద్దరిలో నొకరు వ్యాధిగ్రస్తులైనప్పుడు రెండవ వారికి తద్వాంఛయుండునా? ఎందుకుండదు? ఆ వాంఛ యారోగ్యమునుండి పుట్టినది. ఆ యిద్దరిలో నొకరికొకరు కారణాంతరములచేత వాంఛా పరిపూర్తి కలిగించలేని వారయినచో తద్వాంఛ వేరగు చోటికి మరలునా? కొందరిలో మరలును; కొందరిలో మరలదని చెప్పవలయును. ఎవరిలో మరలుచున్నదో వారు దుశ్శీలురు; ఎవరిలో మరలకుండ నున్నదో వారు సుశీలురనని యొక నిర్ణయముగా నున్నది. అందలి దుశ్శీలత్వమేమి, ఇందలి సుశీలత్వమేమి యన్న ప్రశ్నవచ్చినచో దానికేమి సమాధానము? ఈ ప్రశ్నను రెండు విధములుగా విచారించ వచ్చును. ఒకటి వైయక్తికముగా, రెండవది సాంఘికముగా. వైయక్తికముగా విచారించినచో ఇతడు శరీర సుఖమునుండి తనను తాను బహిష్కరించుకొను చున్నాడు. లోకమునందు ఒకడు శరీర సుఖము నుండి తనను తాను బహిష్కరించుకొన్నచో నది యొక గుణమా? గుణమని పరిగణింపబడుచున్నది. దానియందు గుణత్వ మెట్లారోపించబడును? లౌకికముగా జూచినచో దానియందేమి గుణమున్నది? అలౌకికముగా జూచినచో మనస్సునందలి యొక నిష్ఠ యున్నది. ఒక యేకాగ్రత యున్నది. ఏకాగ్రతకు లోకమునందు గౌరవమున్నది. ఎవడు తన మనస్సును నిశ్చలపరచి యేకాగ్రతచేత నొక కార్యమును సాధించుచున్నాడో లోకము వానియందు గౌరవము నెరపుచున్నది. లోకము గౌరవము నెరపుచున్నదనగా తత్ఫలాకాంక్షచేత గాని వాని యేకాగ్రత వలన కాదనుటకు వీలులేదు. ఆ యేకాగ్రత లేనిచో నీ ఫలములేదు. అందుచేత మానవులు ఫలమునందభిరుచికలవారైనను, ఫలమునందు ప్రధానమైన బుద్ధికలవారైనను దానికి కారణమైన యేకాగ్రతను తిరస్కరించుటలేదు. ఆ యేకాగ్రతను భావించుచునే యున్నారు.

దానిని గౌరవించుచునే యున్నారు. మానవులబుద్ధిలో నా యేకాగ్రత కొక ప్రత్యేకస్థానము కలదు. ఒకప్పుడా యేకాగ్రతవలన లౌకికమైన ఫలము కలుగవచ్చును. కలుగకపోయినను ఏకాగ్రత యేకాగ్రతయే. అందుచేత నొక పురుషు డొక స్త్రీయందు బద్ధమనస్కుడై వాని మనస్సు వ్యభిచరించకుండనున్నచో తదేకాగ్రతాలక్షణమును లోకము గౌర వించుచున్నది. ఈ యేకాగ్రతాభావము సర్వలౌకికమైన మహాకార్య సాధనరూపమైనదనిమాత్రమే గౌరవమా? ఒక వస్తువున్నది. ఆ వస్తువు లోకములో నొకకార్యమున కుపయోగపడవచ్చును. అందుచేత నా వస్తువునందు మనకొక యాదరమున్నది. అంతకుమించి యాదరము లేదు. ఏకాగ్రతకూడ నట్టిదేనా? విచారించినచో నంతకుమించినదేమో! ఏకాగ్రత లోకమునందు లౌకికమైన మహాకార్యములకు సాధనమెట్లగు చున్నదో పారలౌకికముగా దానియందొక యాధిక్యము కన్పించు చున్నది. మానవులందరు మరణించుచున్నారు. లోకమంతయు నశించు చున్నది. నేటి లోకము వందయేండ్లక్రిందటిది కాదు. వెయ్యి యేండ్ల క్రిందటి దంతకంటె కాదు. అందుచేత నీ యేకాగ్రత లోకమును దాటిన యొక నిత్యవస్తువునకు సంబంధించినదై యుండవలెను. నేటి లోకము వందయేండ్ల కిందటిది కాకపోయినను, నప్పటి దప్పటికంటె వంద యేండ్లక్రిందటిది కాకపోయినను నిట్లు మాటిమాటికి నశించిపోవుచున్న లోకములయం దొక సామ్యము కన్పించుచున్నది. అదియిది కాక పోయినను నదియిదే యన్నట్లున్నది. మా తాతగారంత వారింతవారు. ఆ తాత చనిపోయెను. ఈ చెప్పికొనుటయేమి? ఎందు కీ చెప్పికొనుట? ఒక చరిత్రగానో, పురాణముగానో దానిని మననముచేయుట యెందు లకు? ఇదియంతయు నొక మహాసమాహారమైన వస్తువు. ఈ లోక మొక్కొక్కవందయేండ్ల కొక్కొక్కలోకమనుకొన్నచో నన్నిలోకములు కలసి యొక్కలోకము. అట్లు భావింపబడుటకు కారణము ప్రధాన మైన యొక మహాద్రవ్యమునుండి భిన్నకాలములయందలి యీలోక మంతయు దానికి వికారమై యుండవలెను. అవస్తువున్నది, దానిని తాత్కాలికముగా జ్ఞానమందము. సంవిత్తు అన్నమాట యున్నది. ఈ మాట కర్థము జ్ఞానమే. కాని జ్ఞానమన్నశబ్దముకంటె సంవిచ్ఛబ్దమున కెక్కువ మర్యాదయున్నది. ఈ సంవిచ్ఛబ్దము ఆ ప్రధాన వస్తువుకు

చెప్పుచున్నట్లున్నది. ఆ జ్ఞానము లేనిచో నీలోకమేలేదు. తనుత జ్ఞాన మన్న యొక పదార్థము నిత్యమైయుండవలెను. ఆపదార్థమును సాధించుట కేకాగ్రత యవసరమేమో! అందుచేత లోకమునందు దృశ్యమానమగుచున్న యల్పాల్పమైన యేకాగ్రతాస్థానములకు గౌరవ మేర్పడుచున్నది. అందుచేతనే తనకు తన గ్రామమునందు గౌరవ మేర్పడినది. తాను ప్రేమించిన స్త్రీ తను వివాహ మసంభవమగుట చేత తటాకమునందు బడి మరణించినది. ఆమెను గూర్చి తన గ్రామము గొప్పగా చెప్పికొనుచున్నది. తద పేక్షయా తాను దుఃఖితుడు కాగా, లౌకికములైన విషయములయం దనసురక్తుడు కాగా తనను గూర్చి గొప్పగా చెప్పికొనుచున్నది. లోకమునందు మర్యాద యీ యేకాగ్రతా భావమున నున్నది. ఇంకొక దానికి లేదు. లోకమునందు సద్గుణములని చెప్పబడెడి సర్వవిషయములయందు నీ యేకాగ్రతా భావమే యున్నది.

ఒక స్త్రీ యందలి బద్ధానురాగ మెట్టిదో! ఆమెయే నాకు భార్య; నేనింకొక స్త్రీని వరించను అన్న తీవ్రతత్వములో లౌకికమైన యొక ధర్మమున్నది. స్త్రీ పురుష సంయోగమను కర్మ జరుగుచున్నది. తత్కర్మ సంబంధి సర్వవ్యాపారము నేనా స్త్రీ యందే నిర్వర్తింతును. అన్న వ్రతము వాని మనస్సునందలి యేకాగ్ర భావమును జెప్పు చున్నది. తల్లిదండ్రు లున్నారు. ఆ భావమును నీ వెన్నికొనలేవు. స్త్రీగత భావము నెన్నుకొనగలవు. తల్లిదండ్రులు, నన్నలు దమ్ములు అక్కలు సెల్లెండ్రు ఈ మొదలైన భావములను మానవు డెన్నుకొన లేడు. వాని జన్మచేతనే యవి స్థిరపడుచున్నవి. భార్యా విషయము నందొక్కచోటనే యెన్నికొనుట కన్పించుచున్నది. వాని దృష్టితోజూచి నచో నిది యాదృచ్ఛికము. యాదృచ్ఛికములైన విషయములందలి యేకాగ్రత యేకాగ్రతయై, నిర్ణీతములైన విషయములందలి యేకాగ్రత యేకాగ్రత కాదా? భగవంతుడు సహజముగా జన్మచేత నేర్పాటు చేసిన స్థానములు తల్లిదండ్రులు మొదలైనవి. కామ గుణముచేత నేర్పాటు చేయబడిన స్థానము భార్య. ఇది యెట్టిదో అవియు నట్టివే. అందుకనియే పురాతనమైన ధర్మము మాతాపితరుల యందలి భక్తి నేను చదివినవాడను గాకపోయినను విన్నవాడను గదా! ఈ స్త్రీగత

మైన యేకాగ్రతకంటె, నీ యేకాగ్రతవేత కలిగెడి సేవనముకంటె, శ్రద్ధ కంటె, పరిచర్యకంటె తల్లిదండ్రుల యందలి పరిచర్య యధికమై కన్పించుచున్నది. స్త్రీ యందు ఒకరు నెరపు శ్రద్ధాదులు తద్గతమైన యొక సుఖమును వాంఛించి చేయుచున్నట్లున్నది. తల్లిదండ్రుల యందు నెరపు శ్రద్ధాదులు వేరే మరేదియో వాంఛించి చేయుచున్నట్లు లేదే! ఏకాగ్రత యేకాగ్రత కొరకే పాటించబడు చున్నట్లున్నది. అనగా నది యచ్ఛమైన జ్ఞానలక్షణము. ఒక సుఖముమగోరి యొక స్థానము నం దేకాగ్రత వహించినచో నేకాగ్రతకున్న గౌరవము దానికున్నదిగాని దానినుండి మన మొక ప్రతిఫలమును వాంఛించుటయున్న యొక దోషముకూడ కలదు. తల్లిదండ్రులయందలి భక్తి యట్టిదికాదు. అది యేకాగ్రతకొర కేకాగ్రత. అది ధర్మము. ధర్మమనగా నిదియా! ఇన్నా ళ్లును నా కర్థముకాలేదు. ఏకాగ్రతయున్నది. నిత్యమైన వస్తువులోని భాగముకనుక ఆ భాగముయొక్క లక్షణమెందున్నదో, ఎచ్చట నీ స్వార్థములేదో! దేనిని నీ వాచరించినచో నా యాచరణయొక్క స్వరూప ఫలములు తన్నిత్యమైన జ్ఞానములోని భాగములో యది యాచరించుట ధర్మములోని భాగమని యర్థము. శ్రీరామచంద్రుడు పితృవాక్య పరి పాలనము చేసినాడు. అది సనాతన ధర్మము.

శ్రీరామచంద్రుడు ధర్మస్థాపన చేయుట కవతరించినాడు. పితృ వాక్యపరిపాలన మను ధర్మము నాచరించినాడు. ధర్మమనగా నేమగు చున్నది? పరమమైన బ్రహ్మ పదార్థమున కభివ్యంజకమైన యొక కార్యమగుచున్నది. ధర్మమన్న శబ్దమున కర్థమిది. మన మే కార్యము చేసినను దానియందు బ్రహ్మపదార్థము లేశముగానైన గోచరించుచు న్నచో నది ధర్మము. అది బ్రహ్మపదార్థవ్యంజకము. దానిచేత జీవుడు నిత్యుడు, జీవుడు పరమాత్మయొక్క లక్షణము. అత డీ నశించిపోవు లోకమునందు నముద్భవించుచున్నాడు. అతడు స్వస్వరూపానుసంధా నముచేసికొనుటకు ధర్మము నాచరింపవలయును.

ధర్మము నాచరించుట స్వస్వరూపానుసంధానమునకు మార్గము. ధర్మవ్యాధుని కథ పూర్వము వింటిని. అతడు తల్లిదండ్రులకు శుశ్రూషచేయుటచేత నాత్మజ్ఞానము కలవాడయ్యెను. అయ్యో! నేను తండ్రిని వధించవలయునని బయలుదేరితినా? ఆ తండ్రి నాకు

ద్రోహముచేసెనా? ఆ ద్రోహముయొక్క స్వరూపమెట్టిది? నేను నా కామముకొలది యీ స్త్రని వాంఛించితిని. ఈ స్త్రీ నావర్ణమునకు సంబంధించినదికాదు. నేను పతభ్రష్టుడనైతిని. ఈస్త్రియొక్క తల్లికి, నాతండ్రికి సంబంధమున్నది. నేనొకడను పుట్టుదునని, యామెయొక్కరుక పుట్టునని నా తండ్రికి తెలియనేతెలియవేమో! అయనయొక చతుర్థ కులస్త్రీయందు కలిగెడి స్త్రీసంతానమునందు తాను బ్రాహ్మణస్త్రీ యందు పొందెడి పురుషసంతానమును పరస్పరము ప్రేమించుకొనుట జరుగుననియు నారీతిగా తాను బ్రాహ్మణస్త్రీయందు కలుగు పురుషసంతానమునకు ద్రోహముచేయవలయుననియు నతనికి సంకల్పమున్నదా? విరోధమునకు కారణముండవలయును. ఒకడు బుద్ధిపూర్వకముగా మనమీద నుమ్మివేసెను. ఇంకొకడుమ్మివేయగా నకస్మాత్తుగా, ననూహితముగా మనమీద పడెను. రెండు నొకటియగునా? మొదటివాడు మనకు శత్రువు. రెండవవాడు శత్రువుకాదు. అచ్చట శత్రువెవ్వరున్నారు? పాపమతడు తనవారినితా నుమ్మివేసికొనుచుండగా నావేళకు మనమచ్చట నుండుటచేసినదెవరు? అతడు శత్రువు. భగవంతుడు లేనిచో నాపనిచేసినది మనమే. మనకు మనమే శత్రువులము. భగవంతుడు చేసెనందమా? భగవంతుడు మనకు శత్రువు. భగవంతుడు మనతో విరోధము పొందవలసిన యవసరమేమున్నది? ఏమయ్యా, భగవంతుడా! ఇదిన్యాయమా? నీవు వానిచేత నామీద నుమ్మివేయించితివి యన్నచో నతడేమనవలయును? ఆవేళకు నిన్నచ్చటికి రమ్మంటినా యనును. మన సమాధానమేమి? నాకుతెలియకుండ నావేళకు నన్నచ్చట నుండునట్లుచేసినది నీవేయనవలయును. అప్పుడేమగుచున్నది? మనకు స్వాతంత్ర్యములేదు. అతడు చెప్పినట్లు చేయుచున్నాము. అతడెందుకట్లు చెప్పుచున్నాడు?— భగవంతుడు నిర్దయుడనిగాని, క్రూరుడనిగాని, పనిలేనిమంగలివాడు పిల్లితల గొరిగినట్లు లోకములు నడపుచున్నాడనిగాని చెప్పుట మానవునియొక్క మహాజ్ఞానమునకు యోగ్యమైనది కాదు. అతడు లీలగా చేయుచున్నాడన్న దాని కర్థము పొసగదు. 'పిల్లికి చెలగాటము నెలుకకు ప్రాణసంకటము.' భగవంతుడు పిల్లియా? ఇచ్చటి యర్థమును విచారించినచో నిట్లు సమాధేయము కావచ్చును. ఒకతండ్రి తనకొడుకునకు తాను రాజై

నచో రాజ్యము నిచ్చిపోవుచున్నాడు. మరొకడు గొప్పధనము నిచ్చి పోవుచున్నాడు. ఇంకొకడు, ఆస్తిని అప్పులను చెరిసగముగా నిచ్చి పోవుచున్నాడు. మరియింకొకడప్పులనిచ్చిపోవుచున్నాడు నా తండ్రి యితనికన్న మంచివాడు. మా కప్పులనియలేదు. ఏమియునీయలేదు. దారిద్ర్యమునిచ్చిపోయినాడు. అనుభవించుటకుదారిద్ర్యమునిచ్చినాడు. ఆదారిద్ర్యము ననుభవించుట యెట్లు? దానికి శరీరముండవలయును. ఆ శరీరము నిచ్చినాడు. నా తండ్రి దుర్మార్గుడు; ఈ దారిద్ర్యము ననుభవించుటకు శరీరము నిచ్చినాడందుమా? నాకు నా స్వగ్రామములో కొంత పలుకుబడి యున్నది నాకు కత్తిసాము, కర్రసాము వచ్చును. ఏవో యల్పవిద్య లున్నవి. ఈ శరీరమున్నది గనుకనే యవి వచ్చినవి. దారిద్ర్య దుఃఖ మనుభవించు శరీరమిచ్చినాడని తండ్రిని తిట్టుదునా? ఈ విద్యలు సమార్జించి కొంత మర్యాద, పలుకుబడి, సామర్థ్యము సంపాదించుటకు యోగ్యమైన శరీరము నిచ్చినాడని తండ్రి యందు భక్తిని పూనుదునా? తండ్రి యిచ్చినాడనుట లౌకికము. వా డెవడో యిమ్మివేసినపుడు మనమచ్చట నుండుట యెట్టిదో యిదియు నట్టి దే. స్త్రీపురుషులు సంగమించుచున్నారు. రేతోరక్తయోగము కలిగినది. ఆ పిండమునందు నీయంతట నీవు వచ్చి ప్రవేశించితివి. అచ్చట నీ స్వాతంత్ర్యములేనిచో భగవంతుడు చేసినా డనవలయును. వాడెందుకు చేసినాడు? భారతదేశములో వింధ్యకు దక్షిణమున కృష్ణానదీతీరమునందు మా యూరిలో శాకయ్య యను పురుషుడు కలడు. వాడు దరిద్రుడు. వట్టి దరిద్రుడే కాదు. బహు దుర్లక్షణములు కలవాడు. వాని భార్యయొక్క గర్భమునందు తీసికొనిపోయి యీ జీవుని ప్రవేశ పెట్టవలయును. ఈ జన్మలో నీ జీవునకు హరికిశోరుడను పేరుండును. వాడు కొన్ని యనుభవించవలయును- అని నిర్ణయముచేసి కదా భగవంతు డిచ్చట నన్ను నా తల్లిదండ్రుల గర్భమునందు పుట్టించినాడు. భగవంతు డా నిర్ణయమును యాదృచ్ఛికముగా జేసెనా? ఇట్లనుభవించవలసిన స్థితి యీ జీవునియం దుండెనా? భగవంతుని పిల్లిని జేయుటకంటె నే నెలుకనగుటయే మంచిది. పిల్లి కనిపించి నంతనే యెన్నో యెలుకలు పోయి దాగికొనినవే యీ యెలుకయే యీ పిల్లికి కన్పించుట యెందులకు? కనుక నీ యనుభవించవలసిన

లక్షణము జీవునియందే యున్నది. దానినే మా పూర్వులు కర్మ యన్నారు. అందుచేత నేనిప్పుడు లేచిపోయి భార్యతోడి సుఖము నను భవించెడి యోగ్యత యీ జీవునకు లేదన్నమాట. తండ్రిని వెదకి యతనిని వధించవలయునన్న యీ తాత్పర్యమేమి? ఆమెను నేను ప్రేమించితిని. ఆమె చనిపోయినది. నేను యావజ్జీవము బ్రహ్మచారిగా నుందును- ఈ మొదలైన భావములం దేకాగ్రత కలదు. అట్లే తండ్రి వలన నా కీ యపకారము జరిగినది. అతడెచ్చట నున్నను నరే నేను పోయి వానిని పట్టుకొని వానిని సంహరింతును- ఈ భావమునందు గూడ నేకాగ్రత కలదు. ఏకాగ్రతా లక్షణము స్వస్వరూపానుసంధాన మునకు మార్గమైనచో మొదటిదై రెండవది యేల కాదు? అయ్యయ్యో! అయినచో మంచియు చెడ్డయు లేవు. ఒక మహాపురుషు డేకాగ్రత కలిగి యొక పెద్ద కాలువమీద వంతెనను నిర్మించును. అది లోకోప కారకమగుచున్నది. ఒక డావంతెనను పడగొట్టును. ఆపని చేయుటకు వానియందు నేకాగ్రత యున్నదనవలెను. కాని యదిలోకాపకారక మగుచున్నది. కనుక నేకాగ్రత యన్న గుణము ఫలితమును బట్టి విచారించుకొనవలయును. లోకమున కపకారమైన గుణము స్వోప కారకమగునా? సామెత యున్నది కదా! 'ఉట్టికెక్కలేనమ్మ స్వర్గమున కెక్కునా' యని.

ఇంత యూహించుచున్న హరికిశోరునకొక యబ్బురము తోచెను. తాను చదివినదేలేదు. విన్నది స్వల్పము. ఇంత యూహ యెట్లు చేయ గలిగెను? ఇంత యూహయు నముచితముగానున్నదా? ఎవనికిపడిన వానికూహలు వచ్చును. అట్లు తనకువచ్చిన యూహలా? వీనికేమైన నర్థమున్నదా? ఇదియంతయు పండితులతోచెప్పి వారంగీకరించినచో తాను చక్కగా నూహించగలిగెనని యనుకొనవలయును. చదువుకొన కుండ పండితుడగునా? తనమనస్సునకిప్పుడుగలిగిన బాధచేత మనస్సు వేడియెక్కి యిట్లూహించెనేమో! ఎక్కిన యూహలమాట యెట్లున్నను తల్లిదండ్రులయందు భక్తినెరపవలెనన్న యూహలో తప్పేమున్నది? అది ప్రహతమైనదే. తనతండ్రి యెక్కడికేగెనో తెలియదు. తల్లి యింట నున్నది. తానామెను వదలివచ్చినాడు. అది ధర్మము కాదుకదా! కనుక తాను మరల తన స్వగ్రామమునకుబోయి యామెను సంరక్షింపవల

యును. ఇన్నాళ్లును తాను మాతృపరిచర్య చేయలేదు. చెల్లెం(డ్రను గూర్చి విచారించలేదు. తనకంటె పెద్దవాడుగనుక నిదియంతయు తనయన్నయొక్క ధర్మమని యూరకుండెను. తనయన్న తన తల్లి తండ్రుల గర్భమున నెటువయించెనో తాను నట్లే యువయించెను. ఒకవ్యక్తి తాను తనతల్లితండ్రులయెడ జూపించవలసిన భక్తి చిన్నవాడగుటవేత తప్పిపోవునా? తాను పోనేపోరాదు. పోయినచో నింటిదగ్గర పరిస్థితులు జాగ్రత్తగాజేసిపోవలయును. మరియు తనతల్లి తనతండ్రి యున్నప్పుడు సుఖపడలేదు. ఇప్పుడును సుఖపడుటలేదు. ఆమె బ్రతుకు బ్రతుకంతయు బాధామయమైపోయెను. సంవత్సరమునకు మూడువందల యరువదిదినములైనచో నందులో వందదినములు తిండియేలేక, తక్కినదినములు తినీతినక ఇన్నిసంవత్సరములు మనుష్యులు బ్రతుకుదురా? ఆమెకిప్పుడు సుమారు నలుబదియైదేండ్లైన నుండవచ్చును. తల నరసిపోయినది. డెబ్బదియేండ్ల వృద్ధురాలివలె కన్పించుచున్నది. అయ్యో! యేమిబ్రతుకు? తానెచ్చటకోపోయి యాతండ్రిని చంపుటకు బయలుదేరుటకంటె నింటివద్దనుండి యీ తల్లిని బ్రతికించుట కేల ప్రయత్నముచేయరాదు? అది చెడ్డపని-యిది మంచిపనికదా! తండ్రినివెదకుచు బోవుటకంటె నింటిదగ్గరనుండియే తల్లిని బ్రతికించుట నిస్సంశయముగా మంచిపని.

మరికొంత యాలోచించినచో నాతండ్రి యెచ్చట నున్నాడో కనుగొని యతనిని గూడ నింటికి దెచ్చి యిద్దరను గలిసి పోషించినచో నింకను నధికమైన విషయము కదా! నిజమే కాని యతడెచ్చట నున్నాడో తెలియదు. అతనిని గూర్చి వెదకుట ప్రారంభించినచో నది యిప్పుడప్పుడే తేలెడి విషయము కాదు. ఈలోపుగా నీ తల్లి పరలోకగతురాలైనను కావచ్చును. ధర్మము చేయబోయి యధర్మము చేసినట్లగును. తాను తన తల్లిని పోషించగలడా? కలడు. తనకు కుంట పొలము మీది ధాన్యము వచ్చును. మరియు తనకు గ్రామములో కొంత మర్యాద కలదు. దానినిబట్టి సంపాదింప వచ్చును. నిర్వ్యవసాయుడైయున్న యన్ననుగూడ బోషించును "పితృనమో జ్యేష్ఠః" అని యందురు. తండ్రిని బదులన్నగారిని పోషించును. ఇదియంతయు నొక మహా ధర్మము నాచరించినట్లగును గదా! తాను మొలత్రాడు

గట్టి యీ కుటుంబము నీదుకొని వచ్చినచో గ్రామములో తనకున్న ప్రతిష్ఠ రెట్టింపగును. ధర్మము నాచరించుచున్నచో భగవంతు డను కూలపడును. అతనిమీద నాధారపడవలయును గాని మన యహంకారము పనిచేయదు.

హరికిశోర మిట్లూహించుచు తిరిగి స్వగ్రామమునకు బోవలయుననియే నిశ్చయించెను. అప్పుడు తానెచటనో యున్నాడు. అది యేదో యూరు. ఎట్లో యొకట్లు ఎవరియింటనో యొకరి యింట తినుచుండుటయు, తన తండ్రిని గూర్చి కొంత వృద్ధులైన వారిని పదునెన్మిది పందొమ్మిదేండ్ల క్రింద సరిగా తనవంటి పురుషుని-శాకయ్య యను పేరు గల వానిని- ఆహారపుష్టిగలవానిని- పదునేనిరువది దినములు నిరాహారముగ నుండగలవానిని- సౌందర్యవంతుని మీరు చూచితిరా, మీరెరుగుదురా మొదలైన ప్రశ్నలు వేయుటయు, వారు మేమెరుగమని చెప్పుటయు, ప్రతి స్థలమునందు రెండు మూడు దినము లుండుటయు, తరువాత నింకెదో గ్రామమో పట్టణమో పోవుటయు నిట్లుగా హరికిశోరు డీ పది దినములు గడపెను. ఎక్కడికి బోవుచున్నాడు? ఎందుకు బోవుచున్నాడు? హరికిశోరున కీ సంగతి తనకు తనకే తెలియదు. పది దినములలోననే తన పనియందలి వృథాత్వము భాసించినవాడు తా నీ ప్రయత్న మింకెన్నినాళ్లు చేయవలయును? సంవత్సరముల కొలది చేయవలెనా? అందుచేత నతడు తిరిగి స్వగ్రామమునకు బోవుటకే నిశ్చయించెను. ఆనాటి రాత్రి యా గ్రామమున నొక యింటి వారి నడుగగా తినుట కేదో యిత్తుమనిరి. ఒక రొట్టె పెట్టిరి. తినెను. ఇంత మజ్జిగ నిచ్చిరి. త్రాగెను. ఆ రాత్రికి వారి యరుగుమీద నిదురపోవుదు ననెను. వారు సరే యనిరి. అని, వారు మరల నిట్లన్నారు: "అయ్యా! మీరు మా యరుగుమీద పండుకొని నిద్రించుటకు మాకేమి యభ్యంతరములేదు. కాని మీ కిచట నిదురపట్టవేమోయని మా భయము. ఈ రాత్రి మా యింటి కొక యోగి వచ్చుచున్నాడు. ఆయన ప్రశ్నలకు సమాధానము చెప్పును. అంజనములు వేయును. ఈ రాత్రికి మా యిల్లు తీర్థమువలె నుండును. జనులు వచ్చుచుందురు, పోవుచుందురు. మీకు నిదురపట్టదని మా భయము. మీ రెచ్చటికైన నింకొక చోటికిబోయి నిదురించినచో మంచిది. తరువాత మీ యిష్టము."

అనగా హరికిశోరుడు ఇట్లనెను : "నేనిచ్చటనే పండుకొందును. నేనును రెండు మూడు ప్రశ్నలు వేయవలెను. ఆయన నాకు చెప్పు వేమో! నేనును నడిగెదను. మీ కభ్యంతరము లేదుగదా!"

అనగా, నా యింటివారు "మాకేమి యభ్యంతరము? ఆయన యూరకే చెప్పడు. ప్రశ్న కింతయని పుచ్చుకొనునట. అదియెంతయో మాకు తెలియదు. అయిన నెంతో యెక్కువగా నుండదనుకొందుము. సామాన్యముగా శేరో అర్ధ సేరో, తమిదెలో సజ్జలో రాగులో జొన్నలో తీసికొను ననుకొందుము. లేనిచో డబ్బును తీసికొన వచ్చును. మీరు డబ్బిచ్చి చెప్పించుకొన నెంచినచో నుండవచ్చును." అనగా హరికిశోరుడు వారితో నేమియు పలుకకుండనే యాగిపోయెను. అతని దగ్గర నేమైన డబ్బున్నదేమో! యేమైననేమి? అప్పటికే కొంత ప్రొద్దుపోయి నది. పోయినది గనుకనే వారు రొట్టెను పెట్టుట, ఇతడు తినుట, మజ్జిగ త్రాగుట సంభవించెను. అదియొక చిన్న గ్రామమగుటచేత చిన్న చిన్న గ్రామములలో నంత ప్రొద్దు పోయినంతనే సద్దుమణుగును గాన చాల ప్రొద్దు పోయినట్లుండెను. అందుచేత నా యోగి వచ్చు వేళ కెంతో కాలము పట్టెను.

అత డించుమించుగా నర్ధరాత్రమునకు వచ్చెను. ఆయన అజానుబాహువు. బలిష్ఠమైన శరీరము కలవాడు. మీసములు గడ్డములు పెరిగినవాడు. ఎర్రనివాడు. లావుపాటి మానిసి. అతడు ధరించిన కావిగుడ్డలు వలిపెములు. అతని గడ్డములు, మీసములు, తలయు పరిమళతైల సంస్కృతములు. అతనివద్ద నొక చిన్నపెట్టెయు, నొక దండమును కలవు. అతని వెంట నొక సేవకుడును గలడు. ఆ సేవకుడు పెట్టెను దీసికొని లోనికి వచ్చెను. ఆయన యోగదండమును బూనివచ్చెను. ఆయన వీధిలో నొక బండిమీద నుండి దిగి వచ్చెను. ఆ గ్రామములో పదిమంది యతనికొరకు ప్రతీక్ష చేయుచుండిరి. వారందరును గలసి లోనికి వచ్చిరి. ఎక్కడ కూర్చుండవలయు, నెక్కడ కూర్చుండవలయు ననగా వారియింటిలో వైశాల్యము గలిగిన స్థలము హరికిశోరు డెచ్చట నిద్రించుచున్నాడో యావేదికగానే నిర్ణయింపబడినది. ఈ నిర్ణయములో హరికిశోరుడు పొరుగూరివాడు. మార్గగామి. తాత్కాలికముగా వారియింట నేదో యారగించి యడుగు

మీన నిదురపోయి ప్రొద్దుననే లేచిపోవుద మనుకొన్నవాడు. ఈ కథను విని తాను గూడ ప్రశ్న చెప్పించికొని పోవుదమని యాగినవాడుగా నందరకు విశదమయ్యెను. యోగి కొక్కటి స్ఫురించెను. ఇతడు పొరుగూరి వాడు కనుక వాడు గింజలీయలేడు. అతని కే గ్రామములో పడిన నా గ్రామములో ధాన్యమును ప్రోగుచేసికొనుటయు, వానినన్నింటిని గ్రామములోని కోమటింటబోసి దాని వెలను దీసికొనుటయు, నాకోమటి వెల నీయలేనిచో దానికొరకు మరల వత్తునని యితడు వెళ్ళిపోవుటయు నిట్లు పలు గ్రామములయం దచ్చటి ధనముకొరకు తానో, తన ప్రతినిధియో తప్పక రావలసియుండుట చొప్పదు సుండగా నిట్టి పరగ్రామవాసులకు చెప్పినచో నా నాల్గు దబ్బులు చప్పున చేతిలో పడునని పూర్వమే తనకున్న యనుభవముచేత స్ఫురించెను. ముందర నతనికే చెప్పుమ నవెను. ప్రశ్న కిన్ని దబ్బులియ వలయునని చెప్పగా హరికిశోరు డిత్తుననెను. నిన్నగాని మొన్నగాని యైనచో నతడిత్తుననెడివాడు గాడు. తానేదో పెద్ద ప్రయాణము చేయ సంకల్పించినాడు. తన వద్ద నున్న కొంచెము విత్తమును వ్యయపెట్టినచో నది తను పలుదేశములు తిరుగు సంవర్బమున మంచిది కాదు. ఇప్పు డింటికి తిరిగిపో వెంచెను గదా! తనవద్ద నున్న సొమ్ములో కొంచె మితనికిచ్చినచో పెద్ద నష్టము లేదు. హరికిశోరుడు తెలికగా నైదారుదినములలో స్వగ్రామము చేరును. తెలిసినచో తన తండ్రియునికి తెలిసికొన వచ్చును. ఇట్లు నిర్ణయించి 'వల్లె' యనెను.

ప్రశ్న చెప్పు యోగి తాను ప్రశ్న చెప్పడు. అంజనము వేయును. ఒక స్త్రీ యొక్కగాని, యవివాహితుడైన పురుషుని యొక్కగాని దక్షిణ హస్తమునందు కాటుక పూయును. కొన్ని పూజలు చేయును. కొంత ప్రార్థనను నెరపును. ధూపదీపనైవేద్యములైన తరువాత ప్రశ్న చెప్పుట ప్రారంభమగును. ఆ వేళలో నొక పుల్లతో నాంజనేయునివలె నున్న బొమ్మ నొక దానిని వేయును. ఒక పదియేండ్లలోపు బాలకుడు వచ్చి యా యంజనములోని బొమ్మవంక చూచుచుండ వలయును. అంజనేయు డా ప్రశ్నకు సమాధానము చెప్పును. ఆంజనేయుడు చెప్పెడి మాటలు బాలునకు తప్ప మరి యెవ్వరికి వినిపించవు. ఆ యాంజనేయు డిట్లు చెప్పుచుండె, నిట్లు చెప్పుచుండెనని యా పిల్ల

వాడు తక్కిన వారితో చెప్పుచుండును. ఆ సమయములో నా పిల్లవాని యొడలు వానికి తెలియదు. కొన్ని ప్రశ్నల కాంజనేయుడు సమాధానము చెప్పడు. చెప్పకపోయినను యోగికి గిట్టవలసిన గింజలు గిట్ట వలసినవే. అది ప్రశ్న లడిగినవారి యదృష్టము.

ఆ యోగి పాదప్రక్షాళన మాచరించి తాను తన వెంట తెచ్చి కొనిన కృష్ణమృగ చర్మమునం దాసీనుడై కార్యకలాప మంతయు నెర వేర్చెను. ఇప్పు డిద్దరు కావలయును. చేతిలో నంజనము వేయించి కొనెడి వాడొకడు; పదియేండ్లలోపు పిల్లవాడొకడు. అందరి చేతులలో నంజనము పూయడు. యోగి వాని మొగమును జూచి ఇతడు పనికి వచ్చునని చెప్పవలయును. అట్లు చెప్పుటకు వాని ముఖ లక్షణములు యోగికి నచ్చవలెను. అంజనము పూసిన తరువాత నతడు జాము సేపైనను కదలకుండ మొద్దువలె కూర్చుండవలెను. అతడు చురుకైన వాడైనచో, నాలోచనా పరుడైనచో నట్లు కూర్చుండడు. అందుచేత కొంచెము మెదక మనిసి- కొంత స్థూలకాయుడు- మొగములో నవివే కము తనుముకొని వచ్చెడివాడు కావలయును. ఒకడు దొరికెను. వాని చేతి కంజనము పూసిరి. పదియేండ్లలోపు పిల్లవాడు కావలయును. వాడు వివేకికావలయును. చురుకైన పిల్లవాడు కావలయును. ఆ గృహస్థుని కుమారు డున్నాడు. వాని కెనిమిదేండ్లు. ఈ యోగి వచ్చు ననియు, తమ యింటనే బనచేయుననియు రెండు మూడు నాళ్లుగా చెప్పికొనుచున్నారు. వా డీ రెండు మూడు నాళ్ళు నిద్రయేపోలేదు. ఇప్పుడును మేల్కొనియే యున్నాడు వాడు సిద్ధమైనాడు. యోగి తన యోగదండముతో నా బాలుని మూర్ధమునందు స్పృశించి యేవో కొన్ని మంత్రము లుచ్చరించి కొన్ని శ్లోకములు చదివెను. వానికి ధూపము వేసెను. ఆ కుఱ్ఱవానికి తన యొడలు తనకు దెలియుట మాని వేసెను వాని నేత్రములకు నా యింకొక పురుషుని చేతిలో నున్న కాటుకలో నున్న యాంజనేయుడు బ్రతికియున్నట్లే కన్పించు చుండెను.

హరికిశోరుడు ప్రశ్నవేసెను. ఎవడు ప్రశ్నవేయునో యా ప్రశ్నను బాలకుడు తాను మరల నాంజనేయునకు వేయును. ఆ యాంజనేయుడు సమాధానమును చెప్పును. ఆ సమాధాన మెవ్వరికిని

వినిపించదు. ఆ సమాధానమును బాలకుడు మరల తన నోటితో నుచ్చరించును. ఫలితార్థ మేమనగా- ప్రశ్నలు వేయువాడు, సమాధానములు చెప్పెడి బాలకుడు నిద్దరి నడుమనే కథ యంతయు జరుగుచుండును. బాలకుడు మాత్రము ప్రశ్నలువేసెడి వానివంక చూడడు. అత డా యంజనముపూసిన చేతివంకనే చూచుచుండును. ఇట్లడుగ నారంభించెను—

హరికిశోరము :—"నేను మా నాయనగారిని గూర్చి యడుగుచున్నాను."

బాలకుడు మాటాడలేదు.

హరి :—"ఆయన యిప్పుడెచ్చట నున్నాడు?"

బాల :—"అతనికిప్పుడు సుమారు ఏబది సంవత్సరముల వయస్సుండునా?"

హరి :—"ఉండును."

బాల :—"అతని కేబదియేండ్లైనను నీవలెనే యుండును. అతడు సుమారు తన ముప్పదియవయేట లేచిపోయెను. అతడిప్పుడెట్లున్నాడో యప్పుడు నట్లేయున్నాడు. అంతకుపూర్వము పదియేండ్ల క్రిందకూడ నట్లే యున్నాడు."

హరి :—"అవును. మా తండ్రిని గూర్చి యట్లే చెప్పుదురు."

బాల :—"అతడు సరిగా నీవలెనే యున్నాడు."

హరి :—"అవును. నేనాయన ముక్కులోనుంచి యూడి పడ్డా నందురు."

బాల :—"అతడు చాల విచిత్రమైన ప్రకృతి కలవాడు. తాను భగవంతుని యొక్క యవతారముననును."

హరి:—"కావచ్చును. నాకు తెలియదు. ఇప్పుడాయన యెచ్చట నున్నాడు?"

బాల :—"నీకు తెలిసినను లాభములేదు. నీ వచ్చటికి పోలేవు."

హరి :—"పోగల్గుదునో పోలేనో! అట్టి స్థలమునందున్నాడని తెలిసినచో నాకొక తృప్తికదా!"

బాల:—"అది పెద్ద కొండ ప్రదేశము. హిమాలయ పర్వతములు—అగుమాగుము—అదియొక రాజ్యము. చెప్పెదను. నేపాల దేశము. నీ తండ్రి గొప్పవాడు. కాని యీయంతయు నాకెందుకు? ఆ దేశములో నొక నగరమున్నది. ప్రస్తుతము నీ తండ్రి యా నగరములో నున్నాడు."

హరి:—"ఆ నగరము పేరేమి?"

బాల:—"స్వామీ యాంజనేయా! నీవు చెప్పెడిది నాకర్థమగుట లేదు. నీ వుచ్చరించెడి యక్షరములు నాకు తెలియుట లేదు. అ—ది—ల—హ—అంతట బాలకుడు స్వామి మరియొక యక్షరము చెప్పుచున్నాడనియు, తన కా యక్షరము తెలియుట లేదనియు తనలో తానె యనుకొనుచుండెను.

హరి:—"నా తండ్రి యిప్పుడచ్చట నేమి చేయుచున్నాడు?"

బాల:—"అత డొక మత గురువు. ఒక మతమును స్థాపించినాడు. అచ్చట ప్రచారము చేయుచున్నాడు. వేలమంది యతనిని గురువుగా స్వీకరించుచున్నారు. అతడు మహారాజులు గూడ ననుభవించని భోగమనుభవించుచున్నాడు."

హరి:—"అతడచ్చట నంకెన్ని నాళ్లుండును?"

బాల:—"అది చెప్పుటకు వీలులేదు'—

తరువాత హరికిశోరుడు పది ప్రశ్నలు వేసెను. దేనికిని సమాధానములేదు. యోగి హరికిశోరుని విరమించుమని చెప్పి యింకొక పృచ్ఛకుని పిలచెను.

హరికిశోరునకు పట్టరానంత తృప్తి కలిగెను. తాను యోగికియ వలసిన విత్తమునకు మూడు రెట్లైన నాణెము తనవద్ద నుండెను. అతని వద్ద చిల్లరలేదు. అందుచేత నత డా నాణెమును నాణెముగా యోగి కిచ్చివేసెను. అచ్చటనున్న పదిమందియు హరికిశోరుడు ధనవంతుడని యనుకొనిరి. ఈ తతంగము పూర్తి యగునరి కించుమించుగా తెల్లవారెను. ఎవరిదారిని వారు పోయిరి. హరికిశోరుని నాయింటివారు వారి యింటిలో నానాడుండి వారి యాతిథ్యమును స్వీకరించి పొమ్మని బ్రతిమాలిరి. అత డా మధ్యాహ్నము బయలుదేరి తన గ్రామమునకు బోయెను. నాలుగైదు దినములకే యతడు తన గ్రామ

మును చేరెను. అట్లు హరికిశోరుడు వారము దినములలోననే మరల తన గ్రామము చేరెను.తరువాత నత డేమి వేయవలయునో యంతయు దారిలోనే నిశ్చయించుకొనెను. తానును దన తల్లియు గలిసి నేపాళదేశము పోవలయును. తల్లిని తనవెంట దీసికొని పోవును. నేపాలదేశమునకు బోవుటకు రెండేండ్లు పట్టవచ్చును. దారిలో తాను తన పొట్ట నింపుకొనవలయును; తల్లిని పోషించవలెను. తనకు గత్తి సాము వచ్చును. కర్రసాము వచ్చును. ఈ విద్యలను పల్లెలలో, పట్టణ ములలో తాను ప్రదర్శించి తమ యిద్దరికి గావలసిన యాహారమును సంపాదించును. నదులను దాటుటకు కావలసిన ధనమును సంపా దించును. పోవుటకు రెండేండ్లు బట్టును. తిరిగి వచ్చుటకు రెండేండ్లు బట్టును. అచట నొక యేడాది యుండవలయునేమో! మార్గ మధ్య మున బహు పుణ్యక్షేత్రములు గలవు. అన్నింటిని దర్శించినట్లగును. ఈ యైదేండ్లును తన చెల్లెండ్ర నిద్దరిని తన యన్నగారి కప్పగించి పోవలయును. ఆ కుంటపొలముమీద వచ్చెడి ధాన్యముతోబాటు వారికి సంవత్సర గ్రాసము సరిపోవునట్లుగా మరికొంత చూపి యైదేండ్లలో తాను వత్తునని గ్రామములోనున్న నలుగురైదుగురు పెద్దలకు జెప్పి తన తండ్రియున్నికి జెప్పి యాజనము వేయుగా వచ్చిన సమాధానములన్నియు వారికి దెలియజేసి యొకరిద్దరు వెక్కిరించిన మరి యిద్దరు విశ్వసించుటచేత నేదియో యొక విధ ముగా తాను లేనపుడు తన యన్నయు, చెల్లెండ్రును మరియు నుప వాసములు చేయకుండ బ్రతికెడి యుపాయముచేసి తల్లిని ఒప్పించి యామె తానంతటి ప్రయాణముచేయ లేననగా!—"చేయగల్గుదువు. నీ కిన్నా ళ్లాహారపుష్టిలేక యిట్లైతివి! అమ్మా! నీవు నడువలేనిచో నేను నిన్ను మోసికొని పోదును" అని మొదలైన వెన్నియో చెప్పి హరికిశోరము నెల రోజులలో నేపాళమునకు ప్రయాణము కట్టెను. అందరు నాశ్చర్యపడిరి. ఆ తండ్రి యెట్టివాడో వీడట్టివాడు. వీరు రాక్షసులు కాని వట్టివారు కారు. కాశికి పోయిన, కాటికిపోయిన నొకటియే యందురు. ఇంక నేపాళమునకు బోయినచో చెప్ప వలెనా?

# 12

నీలాచల మన్న గ్రామము గోస్తనీనది యొడ్డున నున్నది. ఈ గోస్తని చూచుటకు చిన్న కాలువవలె నుండును. దక్షిణదేశపు నదులకు, నుత్తరదేశపు నదులకు స్థూలముగా నొక భేదము గోచరించును. దక్షిణదేశపు నదులు చాల విశాలముగా నుండును. ఉత్తరదేశపు నదులు వరదలప్పుడు చెప్పలేము కాని తక్కినప్పుడు కొంత వెడల్పైనకాలువ వలె నుండును. ఈ సిద్ధాంతము సర్వత్ర పట్టదు. మెట్ట దేశములయందలి నదులు, పల్లపు దేశములందలి నదులు భేదముగా కనిపించును. పర్వతములందలివి యొడ్డు కోయనట్టి శిలలు గనుక నెక్కువ వెడల్పు కావేమో! అనాదినుండి యేర్పడిన యొక పడకయందే ప్రవహించుచుండును. పల్లపు దేశములయందు మట్టినేల యెక్కువగా నుండును. ఒడ్డును కోయుటకు వీలుగానుండును. నది యొక్క వేణి క్రమక్రమముగా విశాలమగుచుండును. పలనాటిలో చంద్రవంక నది యున్నది. అది పొంగి వచ్చినచో గ్రామములను ముంచివేయును. వట్టి యప్పుడు చూచినచో దాని వెడల్పెంత? మూడు నాలుగు గజములకంటె నెక్కువయుండదు. ఉత్తరహిందూ స్థానముననున్న గోస్తనికూడ నట్లే. చిన్నకాలువవలె ప్రవహించుచుండును. వరదవచ్చి నప్పుడు మిన్నును మన్నును నమావరించును. మరియు నొక్కటేపేరు భిన్నస్థలముల యందుగల నదులకుకూడ నుండును.

ఈ గోస్తని రామాయణమునందు ప్రసిద్ధమైన గోస్తనికాదు. ఇది వేరేయింకొక నది. అనది పెద్ద వరదలుగా వచ్చినప్పుడు నీలాచల

గ్రామము నదికి దగ్గరగా నున్న ట్లనిపించును. గాని వరదలు లే నప్పుడు నదికి పోవలయు నన్నచో నర్ధయోజనమైన పోవలయును. ఆ ప్రదేశమంతయు మెట్టనేల. శాకయ్య రత్నావళిని గోస్వామిని నచ్చట దించి తనదారిని తాను పోయెను. వారి కుండుటకు మాత్ర మొక చిన్న యిల్లున్నది. ఆ యిల్లు పోరంబోకలో నున్నది. గ్రామము యొక్క బయట నున్నది. అది యిల్లుకాదు. గుడిసెకాదు. మంచిపాకయుకాదు. అచ్చట నీళ్లు లేవు. మంచితీర్థము కొరకు గ్రామముయొక్క అతలి చివరకు పోయి బావినుండి నీళ్ళు తెచ్చికొన వలయును. వారికి బిందెలు లేవు. కడవలు లేవు. స్నానాదులు బావి వద్దనే చేసి యొక చిన్నకుండతో నీళ్లు తెచ్చికొందురు. ఆ జలము మధ్యాహ్నమునకైపోయినచో మరల నాకుండను గ్రహించి మరల నంత దూరము పోయి నీరు తెచ్చికొనవలయును. ఇట్లు దినమునకు మూడు సార్లైనను జలమును తెచ్చికొనవలయును.

శాకయ్య వారిని వదలిపెట్టి పోయి పదునాలుగు పదునేనేండ్లయి నది. అప్పటికి గోస్వామి పదియేండ్లవాడు. ఇప్పటికి పాతిక యేండ్ల వాడు. తొలుతటి దినములలో వా రన్నము తినలేదు. రత్నావళికి తన పూర్వ గ్రామము జ్ఞాపకమున్నది. తన బంధువులు జ్ఞాపకమున్నారు. వారిని గురించి చెప్పగా నా యూ రెక్కడ నున్నదో, యది యెంత దూరమో నీలాచల గ్రామవాసులకు తెలియనే తెలియదు. శాకయ్య వారితో గలసి యున్నప్పుడు రత్నావళి స్వగ్రామ ప్రశంస చేయలేదు. యదృచ్ఛయా యీ సంబంధ మేర్పడినది. భగవంతుడు కొన్నాళ్లా యుర్దాయ మిచ్చును. ఆ యాయుర్దాయ మున్నన్నాళ్లు బ్రతుకుటయే కదా ప్రధానము. ఇచ్చట నిట్లు బ్రతుకుద మనుకొన్నది. అతడు తమను వదలిపెట్టి వెళ్లినంతనే వారి బ్రతుకు బయటపడినది. శాకయ్య వెడలి పోయినతరువాత పదిదినము లన్నము లేకయే వారు కృశించిరి. గ్రామస్థులు కొంతదయదలచి వారి నెట్లో యొకట్లు బ్రతికించుచు వచ్చిరి. ఇట్లు ఏడాది రెండేండ్లు గడచినవి. గోస్వామికి గ్రాహకము వచ్చినది.

అతడు తల్లితో "నే నెచ్చటకో లేచిపోవుదును. నీ వీ గ్రామములో నుండుము. వారికి వీరికి పరిచర్య చేయుచుండుము. నీ

పొట్ట నీవు పోసికొమ్ము. నా బరువుకూడ నీ వెచ్చట మోయుదువు? నేను లేనిచో నీకు బతుకుట సులభమగును."

అనగా, నామె యిట్లనెను: "నాయనా! నీవుకూడ నెచటనైన పని పాటులు చేయవచ్చును. ఎవరివద్దనైన పాలికి కుదురవచ్చును. ఏ వృత్తియైనను తొలుత చేత గాకట్లుండును గాని వదలక దానినే యను సరించినచో రెండు మూడేండ్లలో నది చేతనగును. తల్లియైన భూదేవి యున్నది కదా! గునపముతో పదిగాట్లు పెట్టి యొక మొక్కను నాటి నచో కొన్నాళ్లకింతయో యొకంత యిచ్చును."

ఇట్టి మాటలను చెప్పగా నతడు తల్లిమాటల కంగీకరించ లేదు. "మనము పాలును పాటు చేసికొని బ్రతికెడివారము కాము. మన స్వగ్రామములో మన యాస్తి పోవుటవలన పేదవారమైతిమి కాని నా తండ్రి బ్రాహ్మణుడు. చదువుకొన్న వాడని నీవే చెప్పినావు. ఈ రహస్యము మనము బయట పెట్టరాదని నన్ను బ్రతిమాలినావు. నాకును దెలిసినది. భగవంతు డెప్పుడెట్లు చేయునో యట్లు చేయును. మనల నిట్లు జేసెను. నీవు నీ రహస్యమును దాచుచున్నావు గనుక మన మిచట గౌరవముగా నున్నాము. ఇంతకు మన యదృష్ట మే మనగా శాకయ్య కూడ బ్రాహ్మణుడే యయ్యెను. ఇచటికి రెండు మూడు యోజనముల దవ్వున పెద్ద పట్టణమున్నదట. నేనచ్చటికి బోయి చూచివచ్చెదను. ఇంతకంటె కొంచెము మెరుగుగా బ్రతుకుట కచ్చట వీలయినచో నిన్నచ్చటికి దీసికొని పోదును. నాలుగైదు దిన ములలో మరలివత్తును." అని చెప్పి పండ్రెండేండ్ల పిల్లవానిని వదలి పెట్టుట కిష్టములేని తల్లిని బలవంతముగా నొప్పించి యతడు వెడలి పోయి, పది దినములైన తరువాత రత్నావళి కొడుకుమీది యాన వదలుకొని కన్నీరు మున్నీరుగా నేడ్చుచుండ నొక మారు హఠాత్తుగా నామెవద్దకు వచ్చెను; వచ్చి యాపట్టణము పేరు 'మహాలస' యనియు, నచట నొక ధనవంతమైన బ్రాహ్మణ కుటుంబము కల దనియు, వారింటిలో పంట చేయుట కొకరు కావలయు ననియు, తాను వారియింటనే యైదారు దినములుంటి ననియు, తనతల్లిని తీసి కొని వత్తునని చెప్పి వచ్చితిననియు చెప్పి తల్లిని తీసికొని పోయెను. తల్లికొడుకు లిద్దరు నాల్గవ దినమున నా పట్టణము జేరిరి.

ఆ బ్రాహ్మణుని పేరు ధూర్జటి. ఆయన భార్య రేవతి. వారికిద్దరు మగపిల్లలు, నొక యాడపిల్లయు గలరు. ఆ రేవతి వ్యాధిగ్రస్తురాలైనది. వారికి సమృద్ధిగానున్నది. రత్నావళియు, గోస్వామియు నచట నొక యేడాది యుండునరికి వారి మంచితనము చేత వారు ధూర్జటి కుటుంబములోనివా రైయైనారు. ధూర్జటి కుమారు లిద్దరు- ఎనిమి దేండ్ల వా డొకడు, నా రెండ్ల వా డొకడు. గోస్వామి యీ పెద్ద వాని వద్ద నక్షరములు దిద్దుకొనెను. ఒక యేడాదిలో గోస్వామి చదువను, వ్రాయను నేర్చెను. ఇంటిలోని పనియంతయు గోస్వామి చేయును. వంట రత్నావళి చేయును. గోస్వామి పట్టణములో నున్న యొక పండితుని వద్ద రాత్రులయందు ప్రొద్దుపోయి చదువుకొనుచుండును. ఇట్లేడేండ్లు గడచినవి. గోస్వామి వ్యాకరణశాస్త్రము నంతయు జదివెను. చిన్నప్పటినుండి యలవాటు లేదు గనుకను, చెప్పెడువాడు లేడు గనుకను వేద మతనికి రాలేదు. వాల్మీకి రామాయణమును చదివెను. ఉపనిషత్తులు పఠించెను. పదేండ్లలో పెద్ద పండితుడయ్యెను. దీనికితోడు సంస్కృత భాషలో గొప్ప కవియయ్యెను.

ధూర్జటియింటిలో ధూర్జటి యతనిచేత పనులు చేయించుకొనుటకు కష్టపడుచుండెను. ధూర్జటి కుమారులకు చదువురాలేదు. ధూర్జటి గోస్వామినే తన పెద్దకుమారునిగా భావించుచుండెను. తన కున్న ధనము ముగ్గురు కుమాళ్లకు పంచనెంచుచుండెను. గోస్తని నది నీలాచల గ్రామమున కర్దయోజనము మెంనున్నచో మదాలస నగరమునకు రెండుయోజనముల దవ్వుననున్నది. గోస్వామి మదాలస నగరమున పదియేండ్లుండెను. పండితుడయ్యెను. ఎంతయో సంపాదించెను. పెద్ద గౌరవమును పడయుచుండెను. పండిత సభలకు బోవును. పెద్ద శాలువలను తెచ్చును. ఆ ధనమును ధూర్జటికిచ్చును. ధూర్జటి యా ధనమును గోస్వామి పేర వేర యుంచు చుండెను. తొలుతటి దినములలో రత్నావళి వారియింటిలోని వంటమానిసి. ఇప్పు డామె సర్వాధికారిణి. రేవతి దీర్ఘవ్యాధిగ్రస్తురాలైనది. అదియేమి చమత్కారమో! రేవతి సంతానమునందు రత్నావళి కెక్కువ మమకారము. గోస్వామియందు రేవతి కెక్కువ ప్రేమ. ధూర్జటి మరల పెండ్లియాడలేదు. ధూర్జటికి రత్నావళి యప్పగారు. ధూర్జటి కొక

యప్పగారుండెడిది. ఆమె పేరును రత్నావళియే. ఆమె చనిపోయినది. రత్నావళి వచ్చిన క్రొత్తలో ధూర్జటి కిది యొక యాదృచ్ఛికమైన పోలికగా నుండెడిది. తరువాత తరువాత తన యప్పగారే తిరిగి బ్రతికి వచ్చినదని నిజమనిపింప నారంభించెను. రేవతికి రత్నావళి యాడ బిడ్డ. మరియును పరమేశ్వరుని లీల యేమనగా ధూర్జటియొక్క చని పోయిన యప్పగారు వితవరాలు. భగవంతుని యనుగ్రహ ముండ వలయును గాని అతడు పొసగించెడునంత పొసగింపు మరియెచ్చట నుండదు.

వ్యవహారమంతయు నింత రమణీయమై యుండగా దీనివెనుక రెండు రహస్యములు దీనిలోనున్న శాంతికి భంగకరములుగా నుండెను. మొదటిది రత్నావళియొక్క మనస్సులోని దుఃఖము. భగవంతుడు తన కింకటి మంచి జీవితమును వ్రాసిపెట్టి తొలుత దుఃఖమును వ్రాసి నడుమ తన శీలము నట్లు భంగపరచెనేల? తనను భ్రష్టురాలను చేయనేల? ఈ దుఃఖ మామెకు వదలుటలేదు. తన కొడు కింత గొప్పవాడగునని తనకు తెలియునా? తాము ధూర్జటి సంసారమును వదలిపెట్టి వెళ్లినను వారికిప్పుడు నష్టములేదు. నష్టము ధూర్జటికి. తనను, తన బిడ్డను దుఃఖములో నింత యాదుకొనినవారి నింత వదలిపెట్టి పోవుటయా! వదలిపెట్టి పోయినచో తాను కృతఘ్నులు పోయెడి లోకమునకు బోవును. తాను శీలము చెడినదిగాని కులము చెడలేదు. తాను బ్రాహ్మణ స్త్రీయే. వారి కన్నము వండిపెట్టుటకు పనికివచ్చును. ఇది పరమ రహస్యము. మరియు రత్నావళి యప్పు డప్పు డనుకొనును - ఈ భావము గోస్వామికి మనసులో తగిలి తనను నిందించునో! తనను పరిత్యజించి పోవునో! యని. ఆ గోస్వామి యెంత మంచి బిడ్డ! వాడు చదివి కొలది శాంతుడగుచున్నాడు తప్ప కుత్సితోహలు కలవాడగుటలేదు. ఈ రహస్యము తనకును తనకొడుకు నకును మాత్రమే తెలియును. నీలాచల గ్రామవాసులకు గూడ తెలియదు. తమ యూరెచ్చటనో! ఈ పదునేనేండ్లలో తమ స్వగ్రామము వారెవ్వరు రాలేదు. కనిపించలేదు. ఈమె యిట్లుండగా గోస్వామియు నించుమించుగ నిట్లే యుండెను. అతడు తన తండ్రిని సరిగా నెరుగడు. శాకయ్యను మరచిపోలేదు. తన తల్లి తులసిమొక్కవంటిది.

పరమ యోగ్యురాలు. ఆమె జీవితములో భగవంతు డట్టి సన్నివేశమేల కల్పించెను? పదునేనేండ్లయినది. మరల గోస్తనీనదికి వరదలు లేవేమి! తన తల్లికి ఏకైక శీలభంగము కలిగించుటకే వచ్చెనా వరదలు? అట్టి తల్లి దుష్టురాలని తానామెను వదలిపోవలయునా? ఇదియా తన పాండిత్యము! ఇదియా తన యుపనిషత్తుల నధిగమించిన యభిజ్ఞానము! ఇంత యూహ గోస్వామి మనసులో మెలగుచున్నను నతడు తల్లితో నీ ప్రసంగము చేయడు. ఇంత పండితుడై ప్రొద్దుట లేచినంతనే ముందు రత్నావళి పాదములకు నమస్కరించును. తరువాత రేవతికి నమస్కరించును. పిదప ధూర్జటికి నమస్కరించును. అప్పుడు స్నానముచేసి జపాదులు నిర్వర్తించుకొని వ్యవహారములు చూచుకొనును. గోస్వామి యా యింటిలో తొలుత మూడు నాలుగేండ్లు పరిచారకునివలెనే యున్నాడనవచ్చును. తరువాత క్రమక్రమముగా నధికారియైనాడనవచ్చును. గోస్వామి దవ్వుదవ్వు గ్రామములకు పండిత పరిషత్తులకు బోవును. అప్పుడు వారితో వ్యవహారము కలవారు వచ్చి ధూర్జటిని పలుకరింతురు. ధూర్జటి యిట్లనును: "ఆ వ్యవహారము నాకు తెలియదు. మా పెద్ద పిల్లవాడు గ్రామములో లేడు. రెండు మూడు నాళ్లలో తిరిగివచ్చును. తిరిగిరండు" అని వారిని పంపించును. రత్నావళిస్థితి యీ గృహమునంత భద్రముగానుండి ఆమె తన శీల భంగమును మరచిపోనట్లే యీ యింటిలో గోస్వామి స్థితి యింత భద్రతరముగానుండి గోస్వామి శాకయ్యను మరచిపోలేదు.

శాకయ్య నీలాచల గ్రామమునుండి గోస్తనీనదిని దాటి వెడలిపోయెను. అపైన నయిదారు దినముల ప్రయాణములో గిరివ్రజ నగరమున్నది. అత డచ్చటికి వెళ్లియుండును. పదుమూడు పదునాలుగేండ్ల క్రిందట గిరివ్రజపురమునకు బోయిన శాకయ్య సంగతి నే డచ్చట నెవరికి దెలియును? అయినను గిరివ్రజపురమునకు బోవలయును. మరాలస నగరమునుండి గిరివ్రజపురమునకు బది దినముల ప్రయాణము. ధూర్జటి తనను దవ్వు గ్రామములకు బోనీయడు. ఎచ్చటికి బోయినను రెండు మూడు దినములలో తిరిగి రావలయును. లేనిచో ధూర్జటియొక్క వ్యవహారము చెడును. ఈ

ధూర్జటి తనను నమ్ముకొని కూర్చున్నాడు. ఈయన కొడుకులు వ్యర్థులుగా నున్నారు. ఆయన భార్య యావజ్జీవము వ్యాధిగ్రస్తురాలైనది. వీరిని వదలిపోయినచో వారేమి కావలయును? తాను కృతఘ్నుడగును. ఈ శాకయ్య సంగతి తనను దయ్యము పట్టుకొనినట్లు పట్టుకొనెను. వానితో దనకేమిపని? వానిని కనుగొని యేమి చేయును? ఏమి మాటాడును. వానిమీద పగ తీర్చికొనవలయునా? ఆ పగయొక్క స్వరూపమేమి? తన తల్లియు తానును నదిలో కొట్టుకొని పోవుచుండగా నతడు బ్రతికించెను. తరువాత దుష్టకృపని జేసెను. అరే! అత దాయుర్దాయమిచ్చెనే! వా డెంత యపకారము జేసినను సహింప వచ్చునే! ఆ యపకారమునకు లౌకికముగా బుట్టిన విపరీత పరిణామము లేవియు లేవు. ఆధ్యాత్మికముగా తన తల్లియొక్క జీవు డేమగునో తెలియదు. లౌకికముగా నీ భావము తన మనస్సులో, తన తల్లి మనస్సులో రెండు బడబాగ్నులవలె మండుచున్నవి. చల్లారిపోయిన లౌకికమైన యీ నిప్పును మరల రగుల్చుట యెందులకు? గోస్వామి వంద సార్లు సమాధానము చెప్పికొనును. మరల వందసార్లు పాత గాయము సెలవేయును.

ఇట్లుండగా గిరివ్రజపురములో మగధరాజైన సహదేవునకు పట్టాభిషేకము వచ్చినది. ఈ పట్టాభిషేకము సహదేవునకు చిన్ననాడే జరిగినది. కాని యతనికి వయస్సు వచ్చిన తరువాత, నతడు మహావీరుడైన తరువాత మరల నా పట్టాభిషేకము తెలిసిన కాలములో చేసికొనవలెనన్న యాశ యతనికంకురించెను. అతడు మహావీరు డయ్యెను. తండ్రికంటె నధికుడా యన్నంత వీరుడయ్యెను. అతనిని గురించి యనేక కథలు చెప్పబడుచుండెను. ఐరావతము యొక్క బిడ్డయైన యేనుగును సహదేవుడు సంపాదించెను అత డా యేనుగు మీదనెక్కి యుద్ధము చేయుచుండగా సృష్టిలో నతనిని గెలిచెడివాడుండడట. తన తండ్రి యొక్క చావునకు హేతువులైన కృష్ణభీమార్జునుల మీద పగ సాధించుట కతడు నిశ్చయించెను. కొద్దియేండ్లలో కౌరవులకు, పాండవులకు యుద్ధము వచ్చునట. కొన్నియేండ్ల క్రింద వారు వారు జూదమాడుటయు, పాండవు లోడిపోవుటయు, వారరణ్యావాసము చేయుటయు సంభవించెను. అరణ్యావాసము పూర్తికా వచ్చుచున్నది.

ఒక్కయే డజ్ఞాతవానమున్నది. అదియైన తరువాత దుర్యోధనుడు పాండవులకు వారి రాజ్యమియ వలయును. ఆయన యీయడు. కనుక కురుపాండవులకు యుద్ధము తప్పదు. ఈ కథలు దేశమందు ప్రతి పట్టణమునందు చెప్పుకొనుచుండిరి. ప్రతి పల్లెయందు చెప్పుకొనుచుండిరి. మాగధులు మాత్రము పాండవులోడిపోవుదురందురు. సహదేవుడు దుర్యోధనుని పక్షము జేరి కృష్ణ భీమార్జునులను సంహరించునని చెప్పుకొందురు. అందందు వృద్ధులైన బ్రాహ్మణులు "పాండవులే గెలుతురు; భగవంతుడైన శ్రీకృష్ణుడు వారి పక్షమునందున్నా"డని చెప్పుదురు.

గోస్వామికి గురువున్నాడు. ఆయన శాండిల్యుడు. ఆయన గోస్వామికి తొలుత వ్యాకరణశాస్త్రమును చెప్పెను. తరువాత సూత్రములను పఠింపజేసెను. ఆయన గోస్వామి కుపనిషత్సారములు చెప్పనంతసేపు ఉపనిషద్భాగమందు ప్రతిపాద్యమైన వస్తువు శ్రీకృష్ణుడని చెప్పుచుండును. ఆయన యదుకులమునందు జన్మించెను. దేవకీ వసుదేవుల గర్భమునందు జన్మించెను. యశోదానందు లాయనను పెంచిరి. ఆతడు పూతనను సంహరించెను. గోవర్ధనగిరినెత్తెను. కాళియాహి నణగద్రొక్కెను. కంసుని వధించెను. కృష్ణుని యన్నగారు బలరాముడు. కృష్ణుడు సాక్షాత్తు శ్రీ మహావిష్ణువు. బలరాముడాదిశేషుని యవతారము. ఈ మాటలు గోస్వామి వినుచునే యుండెను. శ్రీకృష్ణదేవునితో విరోధము పెంచికొనిన సహదేవుడన్నచో నతనికి గౌరవ మెట్లు కలుగును? గోస్వామి కెంతసేపటికిని ద్వారకా నగరము పోవలయునని, శ్రీకృష్ణస్వామి దర్శనము చేయవలయునని. ఇదికాక యింకొక విషయమున్నది. తాను శాండిల్యునివద్ద నుపనిషత్తులే కాదు, వ్యాకరణశాస్త్రముకూడ పఠించెను. అనేకములైన క్లిష్టఘట్టములు తచ్ఛాస్త్రములో వచ్చినప్పుడెల్ల శాండిల్యు డిట్లనుచుండును. "ఈ సంగతి యనిరుద్ధునకు దెలియును. ఆయన నడుగవలెను. ఆయన ద్వారకానగరమున నుండును. నే నిచట మదాలసలో నుంటిని" అనును. అనిరుద్ధు డెవడు? శ్రీకృష్ణదేవుని మనుమడు. శ్రీకృష్ణుని కుమారుడు ప్రద్యుమ్నుడు. ప్రద్యుమ్నుని కుమారుడు అనిరుద్ధుడు. ఆ యనిరుద్ధుడు వ్యాకరణశాస్త్రమునందు నిష్ణాతుడట. గోస్వామి చదివి

నది వ్యాకరణము, వేదాంతము. ఈ రెండు తన కభిమాన విద్యలు. రెండు విద్యలకు పరమార్థభూతులైనవారు ద్వారకానగరములో నున్నారు. ఇద్దరును తాతయు మనుమడును. వాగ్దేవి నుపాసించుట లోని చరమస్థితి యనిరుద్ధునియం దున్నది. పరబ్రహ్మోపాసన యొక్క చరమస్థితి శ్రీకృష్ణునం దున్నది. తాను ద్వారకకు పోక గిరి వ్రజమునకు పోవు టెందులకు? ద్వారకకు పోవలయునన్న కోరిక యాత్మను పట్టుకొని కూర్చున్నది. గిరివ్రజమునకు పోవలయునన్న కోరిక ప్రాణములను బట్టుకొని కూర్చున్నది. నీవు వేదాంతములను పఠించుము. నీ గురువు శాండిల్యునివంటి మహర్షి కానిమ్ము-"ఓరీ! గోస్వామి! నీ జీవున కింకను నా పరిపాకము రాలేదు. పరమయోగ్యు రాలైన నీ తల్లియొక్క శీలములో నపబిందువు నొలికించిన యా శాకయ్యను జూడుము. వానిమీద పగతీర్చుకొనుము. ఓయి! పగ లౌకిక మైనది. నీవు యుద్ధ వీరుడవు కావు. వానిని వధించలేవు. వానిని వాగ్వా దమునం దోడింతునన్నచో వాడు అపండితుడు. అచ్చటికిబోయి నీవు వానితో 'నా తల్లికి ద్రోహముచేసితి'వని యధిక్షేపోక్తులు పలికినచో 'నూది కొరకు సోదెకుపోయినచో పాతరంకులు బయటపడి న'ట్లగును. ఓయి! గోస్వామి! జీవుల కర్మలకు నీవు కర్తవా? పోయి శాకయ్యను చూడ వలెనన్న కోరిక నుపసంహరింపుము. విరమింపుము. ఆ భావమును చంపుము" — అని మాటిమాటికి నతని యాత్మ బోధించుచుండును. అతని మనస్సు మాటిమాటికి వానిని రెచ్చ గొట్టుచుండును. ఆ శాకయ్యను బోయి కలిసికొనుము. నీ తల్లి పరమయోగ్యురాలు. ఆమె జీవితములో నీ మచ్చ కలిగినది. ఆ మచ్చ పోవుటకేమైన మార్గమున్న దేమో! ఉన్నదో లేదో నీకు తెలియదు. భగవంతునకు తెలియవల యును. ఆ మచ్చ నివారింపబడుటకు భగవంతుడేమైన త్రోవజూపు నేమో! పాండిత్యము వట్టి పాండిత్యము. పాండిత్యమనగా శబ్దార్థ పరి జ్ఞానము. శాస్త్రీయములైన చర్చలను నెరపెడి నేర్పు. నా కది తెలియు నిది తెలియునన్న యహంకారమునకు పట్టు. విషయములు తెలిసి యేమి ప్రయోజనము? చర్చితములై నిర్ధారితములైన విషయముల యందు మనస్సు నిలుపవలయును గాని!

ఇట్లుండగా గిరివ్రజపురాధిపతియైన మగధదేశాధీశ్వరుడైన సహదేవ మహారాజు పట్టాభిషేకము పేర తాను జేయు మహోత్సవము చుట్టు పట్ల రెండు మూడు రాజ్యముల యందున్న మహాపండితుల నందఱను పిలిపించుచుండెను. మహాలనపురము మగధరాజ్యములో లేదు. శాండిల్యుని శిష్యులతో సహా ఆ యుత్సవములకు రావలయునని వార్తవచ్చెను. అచ్చట శిష్యులతో నన్ను యొక్క మాటయే కాదు. తమ శిష్యుడైన గోస్వామినికూడ తీసికొని రావలయునని వార్తవచ్చెను. పండితులకు రాజాభిమానము వేరు, పాండిత్యము ప్రదర్శించి సన్మానములు పొందుట వేరు. రాజెవడైన నేమి? రాజులకు రాజులకు మధ్యనున్న వైరములతో పండితులకేమి సంబంధము? రాజులు రాజులు యుద్ధమాడుదురు. తాను పాలించెడి రాజ్యమునందు వారు ధర్మమును నెరవు చున్నచో రాజునందు దోషమేమున్నది? ఈ పండితుడు తానొక రాజ్యమునందున్నాడు. పొరుగు రాజ్యపు రాజునకు తన రాజ్యపు రాజునకు విరోధము. ఆ రాజు పండిత సన్మానము చేయుచున్నాడు. పైగా నీ కొరకు కబురంపినాడు. నీరాజు నిన్ను వెళ్ల వలదనిన పండిత పరిషత్తు దేనికి? ధర్మనిర్ణయము కొరకు. నీరాజునకు ధర్మముతో సంబంధము లేదా? నీ రాజిట్టివాడైనచో నతడు రాజుగానుండుటకే పనికిరాడు. ఇచట నంతకంటె గొప్ప విషయమున్నది. శ్రీకృష్ణుడు సాక్షాత్పరమేశ్వరుడు. ఏ రాజు నిన్ను ధర్మ పరిషత్తునకు పిలుచుచున్నాడో యారాజు ధర్మపరిషత్తునకు వ్యతిరేకి. ఆ పరిషత్తునకు నీవు వెళ్లరాదు. ఇది శాండిల్యుని వాదన.

గోస్వామి యనునుకదా! "సభలయందు ధర్మనిర్ణయముకొరకు చర్చలు జరుగునుగాని, శ్రీకృష్ణుడు పరమాత్మయగునా కాదా యన్న చర్చ జరుగునా? ఆ సభయందు భగవంతునిగూర్చిన నింద ప్రవర్తిల్లినచో నేను నిరాకరింతును—లేచివత్తును. అంతియేకాని వట్టి ధర్మనిర్ణయము జరుగు సభలోని కెందుకు బోరాదు?

శాండిల్యు డిట్లనెను: "ఓయి! నీకు ధనవాంఛ యున్నదా? కీర్తివాంఛ యున్నదా? ధూర్జటి నీకు తన కొడుకులతోబాటు భాగమును పెట్టుచున్నాడు. నీవును గొంత సంపాదించితివి. నీవు వివాహితుడవు కావు. నాలుగైదు సంబంధములు రాగా నేను వివాహము

చేసికొనని నిరాకరించితివి. నీ తల్లిని నీవు పోషించవలసిన యవసరములేదు. అందుచేత నీకున్న ధనము నీకు చాలును. చాలుటయే కాదు. కొల్లలో కొల్లలు. ఇంక కీర్తిని వాంఛించితివా? నశిష్యుని నన్ను రమ్మనుచు శిష్యులలో నీ పేరు చెప్పబడినది. అనగా గిరివ్రజపురమునందలి పండిత పరిషత్తునకు నీ పేరు తెలియునని యర్థము. ఇంతయేకాదు, ద్వారకానగరమునందు గూడ నీపే రెరుగుదురు. నా సహాధ్యాయులు, నాకాప్తులు, నాగురువులు, నాశిష్యులలో నగ్రేసరుడవైన నిన్ను భారతదేశమందంతటను చెప్పికొందురు. నీకు కీర్తి తక్కువగాలేదు కాని నీవు భిన్నప్రదేశములకు బోయి నీ కీర్తిని నీవు ప్రత్యక్షముగా జూచికొనవలెనన్న కోరికయున్నచో బొమ్ము."

అనగా, గోస్వామి యిట్లనెను: "ఆచార్యోత్తమా! నాకు కీర్తి యక్కరలేదు; ధనముకూడ నక్కరలేదు; ఎందుకో నాకు గిరివ్రజపురము పోవలయునని యున్నది. అది యిందుకని నేనును చెప్పలేను. తమ రనుగ్రహించినచో వెళ్లివత్తును. అజ్ఞుడనైన నన్ను మీరు విజ్ఞునిగా జేసితిరి. నా కర్మవశమువలన నా విజ్ఞతలో నొక లోపము కన్పించుచునే యున్నది. నేనొక ప్రయత్నముమీద నున్నాను. ఆ ప్రయత్నము కొనసాగినచో నాప్రయత్నముయొక్క చివరిదశయందా లోపము పూర్తియగునేమో యని యాశపడుచున్నాను" అని. గోస్వామి కనులవెంట ధారగా బాష్పములు జార్చెను.

శాండిల్యుడు శిష్యుని గిరివ్రజపుర ప్రయాణమున కంగీకరించెను. గోస్వామికి ధూర్జటి రత్నావళులనొప్పించుట దీనికి పదిరెట్లు కష్టమయ్యెను. రత్నావళి యొప్పుకొన్నది గాని ధూర్జటి యించుకయు నొప్పుకొనలేదు. రత్నావళికేమి! జీవితము సుఖముగా గడుచుచున్నది. అదియేలనో! ఆమెకు తన కొడుకు గోస్వామి యెంతవాడైనను ధూర్జటి పెద్దకొడుకైన మేధావనునుపైననె దెక్కువ యనురాగము. అతనికి చదువు రాలేదుగాని సామాన్యమైన పరిజ్ఞానము కలదు. వ్యవహారమంతయును తండ్రి గోస్వామిచేత చేయించును గాన నతడు పట్టించుకోడు. వ్యవహారము తెలియనివాడు కాడు. లౌకికజ్ఞానముకలవాడే. రత్నావళి యప్పుడప్పుడు ధూర్జటితో ననుచుండును. మీరు మేధావసువున కన్యాయము చేయరాదు. అతడు పండితుడుకాక పోవచ్చును.

అందరును పండితులగుదురా? మేధావసువు బ్రాహ్మణుడుగాడు. దురా చారవంతుడుగాడు. అనాచారవంతుడుగాడు. గోస్వామి వివాహముచేసి కొనుచున్నాడు. అతనికైనగాని ఇతనికి చేయునని మీరు పట్టుబట్టుట నా కేమియు రుచించలేదు. మీ రిద్దరు తండ్రికొడుకులు, గోస్వామి మీకు దయాపాత్రుడు. ఒక దయ కవధియుండవలయును. ఇట్లు నాలుగైదుసార్లు రత్నావళి చెప్పెను. ధూర్జటి వినుపించుకొనలేదు. ఇప్పుడు గోస్వామి యిట్లు పోవుదుననగా రత్నావళి యంగీకరించుట యేలననగా గోస్వామి కొన్నాళ్లు పట్టణమున లేనిచో ధూర్జటికి మేధావసువుమీన నభిమానము కుదురునని తాత్పర్యము. గోస్వామి లేక పోవుటచేత చెడిపోవు వ్యవహార మేమియును లేదు. ధూర్జటితోబాటు రేవతిగూడ గోస్వామి పోవుట కిష్టపడుటలేదు. ఆమె యనిష్టమున కేమియు హేతువులేదు. తనకు గోస్వామి చక్కగా పరిచర్య చేయును నని యామె యూహ. మేధావసువు కొంపెము దులిపికొని తిరుగునని యామె యుద్దేశ్యము. అంతయు భ్రాంతియే. ఈ సృష్టిలో భ్రాంతికాని దేది? మనకొకదాని యందిష్టమనగా మనకు కలిగెడి యనేక భ్రాంతులలో నొక భ్రాంతియందధిక భ్రాంతియని యర్థము. చివరికేమైన దనగా గోస్వామి యెవ్వరిచేతను వారింపబడినట్లు లేదు. గురువైన గాండిల్యునిమాటకే పట్టింపులేదాయె. ఈ వ్యవహారము నాలుగైదు దినములు గడచినది. గోస్వామి యెట్లును వెడలిపోవును. తా నంగీకరించలేదన్న యప్రతిష్ఠ ధూర్జటి కెందుకు? "అబ్బాయీ! నీవు వెడలిపోయినచో నీతల్లి నెవరు పోషింతురు" అనుటకు గూడ వీలు లేదు. గోస్వామికి కొంత ధనమున్నది. ఆ ధనముతో నామె సుఖముగా బ్రతుకవచ్చును. అంతియగాక రత్నావళి లేనిచో నిల్లేమగును? మేధావసువునకు భార్యయైన వచ్చినచో గొంత జూచుకొనవచ్చును.

ఒకనాటి ప్రొద్దున గోస్వామిని ధూర్జటియే పంపించెను. కొంత విత్తమిచ్చి పంపించెను. అవసమున్న మొక మాసములోనైన తిరిగి రమ్మని పంపించెను, గోస్వామి రేవతినిగూడ నొప్పించెను. "అమ్మా! నాకు నిజముగా తల్లివి నీవు. రత్నావళికాదు. ఆమె యూరకే నన్ను కడుపున గన్నది. ఇంకను చాల యున్నవి. నీతో చెప్పుటకు నాకిష్టము లేదు. నేను నిన్ను వదలిపోను" అని గోస్వామి గట్టిగా చెప్పెను.

గోస్వామి యిట్లు చెప్పుచుండగా రత్నావళి ప్రక్కనే యుండెను. ఇంక నెన్నియో యున్నవి యన్నమాట కర్థమేమి? ఇన్నియేండ్లు గడువగా నట్టి మాట గోస్వామి యిప్పుడు ననలేదు. ఆ మాటలోని యర్థము రత్నావళికి మాత్రమే తెలియును. రేవతి యేమనుకొనెను? ఇల్లు నడుపుటలో భోజనాది నదుపాయములు చేయుటలో కొడుకునందలి ప్రేమ వెలయించుటలో నెప్పుడో తెలియకుండ రత్నావళి గోస్వామి మనస్సును కష్టపెట్టెనని యనుకొనెను. అంతియేకదా! లోకమును కొందురు. కాని రత్నావళి మనస్సు చెవుక్కుమన్నది. గుండెయు ఫెడేలుమన్నది. ఏమిరా? ఈ బిడ్డ తాను తన విషయము మరచిపోయినా డనుకొనగా నది దైవికమైన యాపద యనుకొని సర్దుకొనినాడ. కొనగా నిది తన మనస్సులో మాత్రమె బడబాగ్నిగానున్న దనుకొనెను గాని వాని యుదారమైన మనస్సులో దానికి స్థానము లేదని యనుకొనగా చిట్టచివరి కీ నాటికి ఆత్మస్వరూపమిట్లు నిట్ట నిడివిగా గోచరించినదని రత్నావళి మిగుల దుఃఖపడెను. కాని యొక్కటి ధైర్యమయ్యెను. రేవతియందు గోస్వామి నెరపిన ప్రేమ వ్యాలయు దఘ్నముగానున్నది. గోస్వామి తప్పకుండ తిరిగి వచ్చును. వచ్చిన తరువాత తనతోడి యతని ప్రవర్తన యెట్లుండునో తెలియదు. ఇంకొక్క యూహ తోచినది. అతడు వచ్చెడు వేళకు తనదారిని తాను పోయినచో — ఎట్లు పోవును? — పోవుట కొక్కటే మార్గమున్నది. ఆ మార్గము పరమేశ్వరునకు తెలిసినది. అది జరిగినచో నెంత బాగుగానుండును. ధూర్జటి తనను, తన బిడ్డను నెంత ప్రేమగా చూచుచున్నను తా నిన్నాళ్లు బ్రతికినది తన బిడ్డకొరకేగదా! ఆ బిడ్డను గూర్చి తన కిప్పుడు భయము లేదుకదా! తానెట్లైననేమి? తాను బ్రతకియున్నన్నాళ్లు తన బిడ్డకు తనయునికి మనశ్శల్యము. ఇన్నాళ్లకు తెలిసినది. ఇతడు వివాహము చేసికొననంట కిదియా కారణము? ఇది కావచ్చును. తాను తనదారిని బోయినచో నతని కీ మనస్సంకటము తప్పును. అతడు వివాహమాడును. ధూర్జటి వెడలిపోయిన తరువాత రత్నావళి యింటిలోనున్న యందరకు నిచ్చలు బాష్పపరిలులి తనయనాంతయై కానిపించెను. వారు గోస్వామి వెళ్లుట దానికి కారణముగా భావించిరి. ఆమె కొంతసేపటికి తన గుండెను తానే సర్దుకొనును. అంతటిబిడ్డ

అంతటికొడుకు దూరదేశము పోగా నెవరు దుఃఖింపరు? గోస్వామి పోయిన దేమి దూరదేశము? నెల దినములలో తిరిగి రావచ్చును. ఈవరకు పోయినచోట్లుకూడ నాలుగైదు దినము లుండివచ్చినవే! ఒకసారి పది దినము లుండివచ్చెను ఒక జీవుడు దుఃఖపడుచున్నచో నా దుఃఖముయొక్క లోతు ఆ జీవునకే తెలియవలయును. చూచెడి వారి కా దుఃఖమంత వెక్కసముగా నుండ నక్కరలే దనిపించును. ఒక్కొక్కప్పుడు కారణము మిక్కిలి స్వల్పమైనదిగా నుండును.

గోస్వామి వెడలిపోయెను. అది పదిదినముల ప్రయాణము. మూడు దినములైన తరువాత గోస్తనీనది నుత్తరించెను. గోస్తనీనది దాటువరకు నత డెరిగినభాష; దాటినంతనే భాష కొంచెము వేరుగా నుండెను. మరి రెండు దినములు ప్రయాణము చేసిన తరువాత వారు మాటాడెడి భాష మారిపోయినది. అదియు ప్రాకృతమేయైనను అది వేరు ప్రాకృతము. దానిని మాగధప్రాకృత మనవచ్చును మాగధ ప్రాకృతమునందు తానదు వరకు వచ్చిన దేశప్రాకృతముకంటె నధిక సంస్కృత శబ్దములు కలవు. అతడు సంస్కృత వ్యాకరణమును పఠించెను. ఆనాడు సంస్కృత వ్యాకరణమును పఠించెడివారికి చిన్న ప్రాకృతముల స్వరూపమునుగూడ చూచాయగా చెప్పుచుండెడివారు. గోస్వామి మగధములో నాలుగైదు దినములు ప్రయాణము చేసెను. ఇంక రెండు దినములలో గిరివ్రజపురము చేరును.

ఆ రాత్రి యందు ఒక గ్రామములో నొక బ్రాహ్మణుని యింట నాతిథ్యమును స్వీకరించెను. ఆ బ్రాహ్మణు గృహములోని పరిస్థితులు మిక్కిలి వికటముగా నుండెను. అది కిరాతుని గృహమా, బ్రాహ్మణుల గృహమా యనిపించెను. పట్టి కసాయి కొంపవలె నుండెను. వారు శాక్తేయులా? భోజనశాలయందు దగ్నికుండమున్నది. హోమములు జరుగుచున్నవి. 'అగ్నయే స్వాహా' యని వినబడుటలేదు. భీకర చండీనామములతో హోమములు జరుగుచున్నవి. హవిస్సు హయ్యంగవీనము కాదు. గోధుమల యన్నము కాదు. సజ్జల పిష్టాకము కాదు. అన్నియు మాంసపిండములు. ఆ మాంసము కూడ గోమాంసము, మహిషమాంసము. గోస్వామి తలతిరిగిపోయెను. వాని యింట భోజనము చేయుటయా? వలదా? అది యేమి మతము?

మతల వారు బ్రాహ్మణులే! వైదికులే! వారియింట నధ్యయన మున్నది. కొడుకు లుపనీతులు. ఒకదానికొకటి లంకె యందుట లేదు. వారి ప్రకృతులు తీవ్రములుగా నున్నవి. ఇన్నాళ్లు గోస్వామి తన శరీరముయొక్క లక్షణ మెట్టిదో! తన యారోగ్య మెట్టిదో! తన శరీర సౌష్ఠవ మెట్టిదో! ఎన్నడు విచారించికొనిన పాపముం బోలేదు. నేడు విచారించెను. వారొకవేళ తనను వధించి తన మాంసమును చండికి హోమము చేయుదురేమో! ఆయింట నొక తండ్రి యున్నాడు. ఇద్దరు కొడుకులున్నారు. వారు ముగ్వురును తన నేమియైన చేయదలచినచో తానేమికావలయును? అప్పటికి రాత్రి కొంచెము గడచినది. అందరును భోజనమునందు కూర్చుండిరి. ఈనాటికి తనకాపదలేదు. గోస్వామి యిట్లనుకొని భోజనముచేసిన తరువాత మరియొక చోటికిపోయి పండుకొందమనుకొన్నాడు. వారు పోనిత్తురా? భోజనములో వారు దేవికి నైవేద్యముచేసిన మాంసములే వడ్డించిరి. ఆనాడు అనగా నీనాటికి సుమారు ఐదువేలనూటయేబదియేండ్ల క్రిందటనాడు బ్రాహ్మణులు సకృత్తుగా మాంసాహారమును చేసెడివారే! కాని యింత చిత్తవిత్తుగా తినుటలేదు. మరియు గోమాంసము నవివక్షితమైన సర్వ మాంసమును తినుటలేదు. ఏదో మాంసమును కొన్నియిండ్లలో తినుట కలదు. అది కుందేటిమాంసము కావచ్చును. హరిణమాంసమును క్షత్రియులు తినెడివారు. బ్రాహ్మణులు మత్స్యములను తినెడివారు. ఆచారవంతులీరెంటినిగూడ పరిహరించెడివారు. గోస్వామి వానినన్నిటిని పరిహరించి తానెదో నాలుగుమెతుకులు గతికెను. ఇంక నిద్రాసమయము వచ్చెను. తననువధించెడి ప్రయత్న మేమియు కన్పించుటలేదు. వారు చెవులు కొరికికొనుటలేదు. ప్రక్క చూపులు చూచుటలేదు. ఏమియు నెరుగనట్లుండి యర్ధరాత్రమున హఠాత్తుగా వధించుట జరుగునా? భోజనానంతరమున గూర్చుండి గోస్వామియు వారును ప్రసంగించుకొనుచుండిరి. వారి మతమునుగూర్చి గోస్వామి ప్రశ్నవేసెను. "వారు శాక్తేయులు. ఆశాక్తేయముకూడ నొక విలక్షణమైనది. దానికి జరాసంధశాక్తేయమని పేరట. దేవికి పరమప్రీతికరమైనది క్షత్రియుని యొక్క కపాలము. జరాసంధుడు ప్రభువగుటచే నట్లుచేయగలిగినాడు. తామెట్లు చేయగలుగుదురు? అందుచేత తమయొక్క కార్య

కలాపములలో క్షత్రియశిరఃకపాలహోమములేదు. ఎవడైన సామాన్య క్షత్రియుని వధించి యేమిలాభము? వధించక యేమిలాభము? దేవికి ప్రీతికరమైన కార్యముగాదు." మొదలైన వాక్యములు చెప్పను నా గృహస్థు నవ్వుచు నిట్లనెను: "మేము నిన్ను చంపి నీ మాంసమును హోమముజేయుదుమనుకొంటివా? మేమట్లు చేయము. మేము గిరివ్రజపురమున కితలనున్నాము. అపురమున కాతలిదెవవాయన్నారు. వారు శాక్తేయులుకారు. పేరునకు తాముకూడ శాక్తేయులమందురు. వారు నరమేధముచేయుదురు. అయ్యా! తమపేరు ఏమని చెప్పినారు? గోస్వామి యనిగదా! అయ్యా! గోస్వామి! నేడు భారతదేశమున నొక మతమనియున్నదా? ఒక యాచారమని యున్నదా? భిన్నప్రదేశముల యందు భిన్నమతములున్నవి. భిన్నహోమములున్నవి. భిన్నములైన కలాపములున్నవి. పరదేశీయులు చెప్పగా మేము విన్నాము- ఇట్టి మేధములు మగధమునందే యెక్కువయని. ఇచ్చటినుండి కాశ్మీరమునరకు పదిపదునెనుదేశములు కలవు. ఒక్కొక్కదేశములో నొక్కొక్కమతము. ఒక్కొక్క సంప్రదాయము. పేరునకందరును బ్రాహ్మణులే. వృత్తులువృత్తులే! మతములు మతములే! విశ్వాసములు విశ్వాసములే! మేము పరదేశములనుండి యతిథులు వచ్చినప్పుడు మా యీ మాంసాదిహోమములు చేయము. కాని మీరు హఠాత్తుగా సంభవించిన యతిథులు, పరిహరించుబడియెందుకని నిర్ణీతమైన హోమాదులు చేసితిమి. మేము క్రూరులముకాము. మాకిది పరంపరయా వచ్చుచున్నది. ఈ మాంసములను మేము కొందుముగాని మేమే జంతువులను చంపి మాంసమును సమకూర్చికొనము. మాతమ్ము డొక డున్నాడు. అతడీ మాంసహోమములను మానివయుడని మాతో పోరాడినాడు. మేము సంప్రదాయమును వదలించికొనలేక యనుసరించుచున్నాము. అతడు మాతో వివాదపడి వెడలిపోయెను. మాకును వానిపోయిన దుఃఖముచేత నప్పటప్పుడీ యాచారములను వదలిపెట్ట వలయుననిపించును నీకేమియు భయములేదు. సుఖముగా నిద్ర పొమ్ము. నీకంత భయముగానున్నచో నీగ్రామమున నీకిష్టమైన చోటికి బోయి పండుకొను"మనగా, గోస్వామి యచటనే పండుకొనెను. అతనికి నిదురమాత్రము పట్టలేదు.

## 13

గిరివ్రజపురమున సభలు జరిగెను. శాండిల్యముని రానందులకు పలు మంది పండితులు. పలు మంది మునులు, పలు మంది ఋషులు మాటిమాటికి నడిగిరి. గోస్వామి శాండిల్యుని శిష్యుడగుట యెంతో ఘనమయ్యెను. ఆ సభలలో నిజానికి గోస్వామికి నెక్కువ ప్రసక్తి లేకపోయెను. అవి ధర్మశాస్త్రముల సభలు. శ్రౌత కర్మలను గూర్చిన సభలు. కాని వైయాకరణుడన్నచో నందరికిని గౌరవమే. ఉపనిషత్తు లెరిగినవాడన్నచో చాల గౌరవమే కాని యెవ్వరును పట్టించు కొనుచున్నట్లు లేదు. గోస్వామి కాశ్చర్యము వేసినది. ఉపనిషద్విద్య యందింతయనాదరమేమి! అందరును కర్మబద్ధులు. క్రతునివిష్ట బుద్ధులు. స్వర్గగతభావులు. ఇంద్రుడే త్రిలోకాధిపతి. అతనిని మించిన దైవము లేదు. శివకేశవులను చెప్పుదురు. కాని వారికిని ప్రపంచక మునకు సంబంధము లేనట్లున్నది. వారింద్రుని కంటె గొప్పవారగుట నిజమే. రుద్రుడు ప్రళయకాలమూర్తి. అతడు సంహారమున కధిపతి. మానవునకు జన్మమెత్తినది సుఖము లనుభవించుటకు. ఆ సుఖముల నిచ్చువా డింద్రుడు. సుఖములలో పరమోత్తమమైనది స్వర్గసుఖము. అంతకంటె సుఖములేదు. ఆ స్వర్గమున కధిపతి యింద్రుడు. అందు చేత మానవులకుద్ధ్యేయు డింద్రుడు. ఆ స్వర్గమును పొందుట క్రతు వులద్వారా జరుగును. అందుచేత శ్రౌతము పరమోత్తమమైన విద్య. ఇది బాహాటమైన సిద్ధాంతము. అభిప్రాయము. ఇందులో నుండి మరి యొక యుపసిద్ధాంతము బయలుదేరెను. నిజమే. క్రతువులే సర్వ సాధనములు. కాని క్రతువు దేవతలను గూర్చియే చేయనక్కరలేదు.

అంతఃకంటె నధికులైయున్నారు. శివు డున్నాడు. శక్తికలదు. శైవులును పాశుపతులును వారి దైవమునకు శక్తి తక్కువయని యందురు. శాక్తేయులు శక్తికి శివకేశవులు కూడ లొంగిపోవలసినదే యందురు. పరస్పరవాదములు బలియుచుండును.

గోస్వామియొక్క యదృష్టమేమనగా గురువైన శాండిల్యుని ప్రసాదమువలన నితఁ డుపనిషద్వాది. అచ్చట నుపనిషత్తులను పట్టించుకొనెడివా డెవడును లేడు. వేదము ప్రధానముగా నింద్రుని గూర్చి చెప్పునని, శివునిగూర్చి చెప్పునని. శక్తినిగూర్చి చెప్పునని వాదోప వాదములు జరిగెను గాని వేదప్రతిపాదకమైన విషయ ముపనిషత్సి ద్ధాంతమని యెవరును వాదించెడివారు లేరు. మరియు యాగములు చేయుటలో చేసెడి కలాపములలో నున్న యాచరముల యందలి వాదనలే యధికముగా నుండెను. గోస్వామికి సర్వత్ర గౌరవముండెను. ఎవరికిని మహారాజు కనిపించలేదు. తత్ప్రతినిధులు - మంత్రులో ఇతరాధికారులో వత్తురు. సన్మానములు నెరవుదురు. గోస్వామికి గొప్ప వైయాకరణుడని గొప్ప సన్మానము జరిగెను. ఇతనికి సన్మానము చేసినవాడు ప్రతాపసేనుఁడను నొక వృద్ధమంత్రి! అయనకు గోస్వామి యందెందుకో యొక యాదరము కలిగెను. దానికి కారణము గోస్వామి యాగవిషయిక విజ్ఞాన విరహితుడగుటయే. ఆ మంత్రికి యాగము అన్నను క్రతువులన్నను శాక్తేయమన్నను తలనొప్పి. అయన గోస్వా మిని తన యింటికి భోజనమునకు రమ్మనెను. ఒక మంత్రి యొక పండితుని తన యింటి కతిథిగా పిలచినచో నది పెద్ద గౌరవము. గోస్వామి ప్రతాపసేను నింటికి భోజనమునకు బోయెను. ప్రతాపసేనుని భార్యగూడ వృద్ధురాలే! ఆ యింటిలో నింకెవ్వరు నుండినట్లు కన్పించ లేదు.

అతిథ్య స్వీకారానంతరమున గోస్వామి మంత్రిని బలుకరించెను. "అయ్యా! తమకు సంతానము లేదా! ఉన్నచో తమ పుత్రులు దూర దేశములం దుండిరా? వారు సేనాపతులా? రాజసేనను ప్రవర్తింప జేయుచు నెందైననేగిరా?"

ఇట్లతడడుగుచుండగా ప్రతాపసేను డేమియు మాటాడలేదు. ఈ ప్రశ్నలా మంత్రికి కష్టము కలిగించుచుండెనని గోస్వామి యిట్లనెను,

"అయ్యా! క్షమింపవలెను. మీ సంతానము లుప్తమైనదేమో! తెలియక పరామత్నగా నడిగితిని. స్త్రీసంతానమైన నున్నదా?" యని యడిగెను. ప్రతాపసేనుడు దానికిని సమాధానము చెప్పక లేచి నిలుచుండి తన వెంట తమ్మని గోస్వామికి చెప్పెను. ఇద్దరును సౌధోపరిభాగమునకు బోయిరి. అచటకూడ వసతి స్థలములు కలవు.

మంత్రి గోస్వామి నొక గది ముందర నాపియిట్లనెను: "పండితుడా! నీవు వయస్సుచేత చిన్నవాడవు. బాలమునివి. నీవు యాజ్ఞికుడవుకావు. క్రతు సంధాతలన్నచో నాకు భయము. వారి ప్రవర్తన యిట్లుండు ననుటకు వీలులేదు. వారి హోమద్రవ్యము లిట్టివనుటకు వీలులేదు. పేరునకు బ్రాహ్మణులు. కొందరు పాశుపతులు. కొందరు గాణాపత్యులు. కొందరు రహస్యముగా కాపాలికులు. కొందరు శాక్తేయులు. ఆ శాక్తేయులలో పలువిధములు. ఇది ద్వాపరయుగాంత కాలము. ధర్మము భ్రష్టమగుచున్నది. నేను నీతో నొక రహస్యము చెప్పెదను. ద్వాపరాంతమున ధర్మము భ్రంశమగుటకు ప్రాగ్దేశముల యందు జరాసంధుడు కారణము. ఇది రహస్యము సుమా! నేనిట్లన్నానని తెలిసినచో నా తల తెగిపోవును. స్వర్గసుఖము మాట ఇంద్రునకు తెలియును. అచట రంభాద్యప్సర స్సంభోగము కలుగునట. ఇచట నే యాజ్ఞికుడును స్త్రీ సంయోగమును పరిహరించునట్టు కన్పించుట లేదు. పురాతనమైన యీ వేదమత మెట్లు నిలువ పెట్టబడునో నాకు తెలియదు. ధర్మమను పేర కుటిలక్రూర యాగములు చేయబడుచున్నవి. ఈ గదిలో నా కూతురున్నది. ఆమె పేరు నాలాయని. పదునేను సంవత్సరముల క్రిందట నిచటి కొక యోగివంటివాడు వచ్చెను. అతడు డాంభికుడట. అతనిని గూర్చి నేనేమి చెప్పవలయును! అప్పటికి నా కొక కొడుకుండెడు. తరువాత నతడు చనిపోయెను. నా భార్యయు కూతురైన యీ నాలాయనియు నా చనిపోయిన కొడుకును నొకనాటి మధ్యాహ్నమున శివాలయమునకు బోయిరి. నా కప్పుడొక పిచ్చి యెక్కిన యేనుగుండెడిది. దానిమీద పోయిరి. మట్ట మధ్యాహ్నమున నా గజము యొక్క మదము వృద్ధిపొంది నా సంసారము నశింపబోవుచుండగా నొక బ్రాహ్మణుడు వారిని రక్షించెను. అతడు బ్రాహ్మణుడో కాడో! పండితుడు మాత్రము కాడు. క్రతువులు చేసెడివాడు కాడు.

అతని దేమతమును కాదు. అత డహింసావాదియట! అతనిని గూర్చి నా కూతునకు దెలియును. నా కూతురును వాడును పరస్పరము ప్రేమించుకొనిరట. నా కూతును ప్రేమించినవాడు మరియొకడు కలడు. అతడొక సేనాని. నే నీమెను తత్పూర్వమే యతనికిచ్చి పెండ్లి చేసినచో తీరిపోయెడిది. కాని దైవమట్లు సంధానపరుపలేదు. ఆ సేనాపతి పేరు కాలంజరుడు. అత డీ యోగిని వధించుటకు ప్రయత్నించెను. ఆ యోగి పారిపోయెను. నా కూతురు వివాహమును మానెను. ఆమె యెప్పుడు నీ గదిలో నుండును. క్రిందికి రాదు. నీవంటి సత్పురుషు లెవరైన వచ్చినచో వారేమైన నామెను మంచి మార్గమునకు త్రిప్పుదు రేమో యని వారిని దెచ్చి యామెను చూపింతును" అని, ప్రతాపసేనుడు గోస్వామిని లోనికి దీసికొనిపోయెను.

గోస్వామి యా మంత్రియొక్క దుహితను జూచెను. ఆమెకు నలుబది యేండ్లుండవచ్చును. మొగమునందొక పిచ్చికళ యున్నది. నడుమ నడుమ కన్నులయందు వివేకము కొట్టవచ్చినట్లు మెరయును. ఒకప్పు డున్మత్త స్త్రీవలె మాటాడును. మరి యొకప్పుడు వివేకిగా మాటాడును. ఒకప్పుడు చురుకుగా గనిపించును. శరీరావయవములు వేగవంతములుగా నుండును. ఇంతలో మన్ను దిన్న పామువలె నగును. మాటాడదు. ఆమె లక్షణము విచిత్రముగా నుండెను. గోస్వామి తా నామెను పలుకరించవచ్చునా? ఆమె సమాధానము చెప్పునా? చెప్పినచో నెట్లు చెప్పును? ఆమె తనంత తాను మాటాడుటలేదు. పలుకరించినను సమాధానములేదు.

అంతలో ప్రతాపసేనుడు గోస్వామిని ప్రక్కకుపిలిచి ఇట్లనెను: "అయ్యా! నే నిచ్చటనుండగా నామె మాటాడదు. కనుక నేను క్రిందికి పోవుదును. నీవామెతో మాట్లాడి యామె యేమనునో దయచేసి నాకు తెలియజేయు"మని ప్రతాపసేనుడు వెడలిపోయెను. గోస్వామి మరల వచ్చి కూర్చుండెను. అంతటనితడు ప్రశ్నలువేయుటయు నామెయని సమాధానములుచెప్పుటయు జరిగెను.

గోస్వామి:—ఏమమ్మా! నీవైరాగ్యమునకు హేతువేమి? లోకము మీద నీకెందుకు విరక్తికలిగినది?

నాలాయని:— ఇది ప్రపంచము కాదు. ఇదియొక కసాయిదుకాణము. ఇవి రాజ్యములు కావు. ఇవి కబేళాలు. అనగా వధప్రదేశములు. జరాసంధమహారాజు నా చిన్నప్పుడే వధింపబడెను. ఆయనను వధించినవారెవరో తెలియునా? నీకు తెలిసియేయుండును. నీవు చిన్నవాడవు. నీకు పాతికయేండ్లుండునా?

గోస్వామి: ఒకటిరెండు తక్కువగనుండును. దానికేమిగాని మరి లోకమెట్లుండవలెనని నీయూహ?

నాలాయని:— హింసలేకుండ నుండవలయును. మనుజులందరు హింసాపరులే!

గోస్వామి:—హింసాపరుడుకానివాని నెవనినైన జూచితివా?

నాలాయని:— చూచితిని. అతడొక్క హింసాపరుడు కాకపోవుటయేకాదు. అహింసయతని సిద్ధాంతము. అతని మతము.

గోస్వామి:— అతడేమిచెప్పుచున్నాడు?

నాలాయని:— నన్నతడు ప్రేమించినాడు నేనతనిని ప్రేమించితిని. అతనిని వధించుటకిచ్చట ప్రయత్నములు జరిగినవి. నా తండ్రి వారిలోనున్నాడని నాకు సందేహము. అందుచేతనతడు పారిపోయెను. నాతోకూడ చెప్పకుండ పారిపోయెను. నేను విగతభర్తృకనైతిని. నా బ్రతుకిట్లాయెను.

గోస్వామి:—అయ్యో! నిన్నెంతహింసపెట్టినాడు!

నాలాయని:— అతడు నన్ను హింసపెట్టలేదు. తక్కినవారు పెట్టినారు.

గోస్వామి:—అవునమ్మా! నన్నడిగినచో నిన్ను హింసపెట్టినవాడతడే! ఏలయనగా నీవతనిని ప్రేమించితివి. అతడులేకుండ నీవు బ్రతుకలేవు. అతడు వెడలిపోయినచో నీవు బాధపడుదువని యతనికి దెలియును. అది నిన్ను హింసించుటయని యతనికి దెలిసియుండవలెను. అతడహింసాపరుడుకదా! నిన్నెందుకు వదలిపోయినాడు? తనప్రాణములను తాను కాపాడుకొనుటకు బోయెను. అనగా నతనికి నీయందుకంటె నీకుజరిగెడి హింసకంటె స్వంతప్రాణములమీద నభిమానము. తనసిద్ధాంతమునందుకంటె తనయందే యతనికి మక్కువ యెక్కువ. ఒకపురుషు డొకస్త్రీని ప్రేమించెననగా తనప్రాణములమీద

కంటె నామె ప్రాణముపమిద నధికానురాగ ముండవలెను. అతడు నిన్నా రీతిగా ప్రేమింపలేదు. మరియు నింకొకటి చూడుము. తానట్లు లేచి పోయెను. నీవు మంత్రికూతురవు. నవు లేచిపోయినతరువాత మీ యెత్తుకు తగనివానిని నీవు ప్రేమించుచుంటివని వీరు నిన్ను హింసించ వచ్చును. బాధించవచ్చును. కులమునకు కళంకమువైతివని నిన్ను వధించవచ్చును, మీతండ్రి మంచివాడుగనుక నట్లుచేయలేదు. తాను వధింపబడునన్న భయమునతో నొకవేళ నీవు బంధింపబడినను వధింప బడవచ్చునన్న సందిగ్ధమైనచోట నిన్ను పరిత్యజించిపోయెను. అత డహింసావాది యెట్లగును? ఓయమ్మా! అహింసయనగానేమి? కత్తి పెట్టి యొక జంతువుయొక్కయో మానిసియొక్కయో కంఠమును కత్తిరించుట మాత్రమే హింసయా? ఇంక హింసలేదా? ఇప్పుడు నీవు వరించినవాడు నీయెడ చేసినది హింస యనక హింసలేకుండ సృష్టి యెట్లుండునమ్మా!

నీవు నీ తల్లిగర్భమున నుదయించితివి. నేను నా తల్లిగర్భమున నుదయించితిని. అందరు తల్లులు తొమ్మిదిమాసములు మోసికదా సంతానమును కందురు! స్త్రీ సంతానమును కనుటకుండెంత బాధ పడును? కొందరెక్కువ బాధపడుదురు. లోకమున ప్రతికాన్పు జరిగిన తరువాత నిజమునకు పతి స్త్రీ మరల జన్మయెత్తినట్లు భావింతురు. ఇదియంతయు హింసకదా! అహింస నెవరుచనిరి? స్త్రీపురుషుల సంగ మమువలన స్త్రీకి గర్భము కలుగుచున్నది అమె ప్రసవించువేళ కలుగు హింస యెంతయని చెప్పవలయును?

అదియట్లుంచి యీ యోగి యెవరు? ఎచ్చటివాడు? అతని యాకారవిశేషమెట్లుండును? నీవార్చెడివాడవా తీర్చెడివాడవా? నీ కెందుకు చెప్పవలయుననకుము. ఆర్చితీర్చ గలుగుటలు విషయము తెలిసినతరువాత తెలియగలిగినవి.

నాలాయని:—అయ్యా! నీవుచెప్పెడిమాటలు కొన్ని బాగుగా లేవుగాని కొన్ని బాగుగనే యున్నవి. శిశుప్రసవము హింసకాదు. అది యెవ్వడును చేయులేదు. ఒకడింకొకనిని బాధపెట్టినచో నది హింస యగును. రెండవది యెవడైనను తనప్రాణమును ముందు రక్షించు కొనును. ఒకటి చూడుము-అతడు పారిపోయెను. పారిపోకుండ

నున్నచో నిస్సంశయముగా వధింపబడెడివాడు. అతడు బ్రతికి యున్నచో నన్ను మరలనెప్పుడైన కలసికొనవచ్చును. నీ వాదన సరిగాలేదు.

గోస్వామి :—ఆయన పేరు నేను తెలిసికొనవచ్చునా?

నాలాయని :—అయన యీ దేశమువాడు కాడు. ఆయన యాంధ్ర దేశీయుడు. బ్రాహ్మణుడు.

గోస్వామి: —బాగున్నది పేరుకూడ చెప్పుము.

నాలాయని: —ఆయనపేరు శాక్యసింహుడు.

గోస్వామి :—బ్రాహ్మణుడనుచున్నావు. పేరుచివర సింహశబ్ద మేమి?

నాలాయని : —ఈయూరిలోనే యతడు శాక్యసింహుడైనాడు. ఏనుగును నియమించుటచేత నందరు నతనిని సింహమన్నారు.

గోస్వామి :—అయినచో నతని పేరేమి?

నాలాయని :—శాకయ్య.

అంతట గోస్వామి నిమేషకాలము దిగ్భ్రాంతిపొందియుండెను. అంతట మరల నిట్లనెను: "అతడు చామనచాయవాడు. అజాను బాహువు. ఇంతజుట్టుకలవాడు. గడ్డమును మీసములును పెరిగిన వాడు. వాని నెప్పుడును తైలసంస్కృతములుచేసి యట్టిపెట్టుకొను వాడు. కావిరంగువేసిన పట్టుబట్టలు కట్టుకొనువాడు. అతడన్నము లేకుండ నిరాహారముగ పదిపదేనుదినములుండగలవాడు. అతని కన్నులలో నెఱ్ఱనిగీతలుండును. అతనిపాదముల నెప్పుడైన నీవు పరీక్షించితివా? మాయమ్మ పరీక్షించినది. అతనిపాదములయందు శంఖ చక్రములు కలవు. అతడు నవ్వును. లోకమోహనముగా నుండును. నేను మరికొన్ని చెప్పెదను నీవేమియుననుకొనకుము. అతడైనచో నగును. కానిచో కాడు. అతనిని నీవు ప్రేమించితివనగా నిన్నతడు వశముచేసికొనెనని యర్థము. అతడు నిన్ను పొందెనని యర్థము. అతడు స్త్రీని తనవశముచేసికొనుటలో నొకమార్గమున్నది. అతనికి స్త్రీయొక్క కళాస్థానములు తెలియును. వాడు స్త్రీనితత్స్థానములయందు స్పృశించును. స్త్రీ కరగిపోవును. వానికి వశమగును. ప్రతిసమాధానము చెప్ప లేదు. మానవజన్మలో నిదియొక రహస్యమున్నది. శరీరమునందు

కొన్నిస్థానములుండును. ఆస్థానములందొక యొడుపుగా స్పృశించి నచో, నొకయొడుపుగా వానియందు చక్కిలిగింతకలిగించినచో వాని యందు స్త్రీయైనచో స్త్రీస్వభావము, పురుషుడైనచో పురుషభావము మేల్కొనును. దాని నెదుర్కొనుట మానవస్వభావమునకు సాధ్యము కాదు. ఆ శాకయ్య యీ విద్యయందు నిష్ణాతుడు. నీవు చెప్పిన వతని యందు సరిపోవుచున్నవి. నేను చెప్పినవికూడ సరిపోయినచో సిగ్గు విడచి నాతో చెప్పుము. నేనతనినె వెదకికొనుచు వచ్చుచున్నాను.

నాలాయని చాలసేపు మాటాడలేదు. గోస్వామి యామెను బతి మాలెను. అతడేనా యని గ్రుచ్చి గ్రుచ్చి యడిగెను. చివరకామె యతడేనని చెప్పెను. చెప్పి యతనిని నీ వెఱుగుదు వనెను.

గోస్వామి :—అమ్మా! నీవు క్షత్రియవు. అతడు బ్రాహ్మణుడు. అతనిని నీవు ప్రేమించుటయేమి? ఈ ప్రేమించుటకు హద్దు పద్దు నుండవలె గదా! ఇతర కులము వానిని ప్రేమించుట యెట్లు? లోకమునందు మనుజులయందు కొన్ని శక్తులుండును. శక్తులు రెండు విధములు. ఒకటి లౌకికమైనది. రెండవది యలౌకికమైనది. ఒకరాజు-ఒకమంత్రి-ఒకసేనాని-ఒక పండితుడు. ఒక మహావీరుడు-ఇవి లౌకిక ములైన శక్తులు. అలౌకికము లెట్లుండుననగా వాడు విభూతిపెట్టి జ్వరాదులు మాన్పించును. వట్టిమేనునుండి భస్మమును పుట్టించును. కనులలో కనులుంచి చూచి మైకమును గ్రమ్మించును. ఏవియో మంత్రములు చదివి తాత్కాలికముగా లౌకికములైన శక్తులను విజృంభింపకుండ జేయును. ఇవియన్నియు క్షుద్రవిద్యలు. మహా యోగు లుందురు. మహోపాసనా పరులుందురు. వారుపాసించు దైవములు వారికి కనిపింతురు. ఇతరుల యాపదలను బాపుదురు కొందరు తమ తపస్సుయొక్క యాధిక్యముచేత లోకము క్షుద్రమని తెలిసి దీనినుండి విరక్తి పొందుదురు. ఒక సేనాపతికిని, సైనికునకును భేదము లేదు. ఒక మహాపండితునకును పది శబ్దముల యర్థము తెలిసిన వానికిని భేదము లేదా! అట్లే యోగశక్తులకును భేదము కలదు.మనకు వివక్షత తెలియ వలెను. యోగశక్తులు పారలౌకికములైనవి. స్త్రీ పురుష సంగ మాదులు లౌకికములైనవి. ఈ లౌకికములైన వానిని సాధించుటకు పారలౌకికములైన శక్తుల నుపయోగించువాడు నన్నడిగినచో పరమ

తుచ్చుడు. పారలౌకికములైన శక్తులయొక్క పరమార్థ మెచ్చటనున్న దంగా నిహభోగవిషయమే మందున్నది. తన వద్దనున్న రత్నముతో తోట కూరను కొనెడి వానివలె యోగి తన యోగశక్తిని వినియోగించి స్త్రీ సంగమమును సంపాదించును. నీవు మంత్రి కూతురవు. నీ యెత్తు వేరు. వాని యెత్తు వేరు. ఈ యుపవక్షిత స్త్రీ పురుష సంగమము లోక మునకు. చేటుదెచ్చును. దానిని గురించి వివరించుట యెందులకు? ఆ శాకయ్యను నీవు చూచితివి కదా! వాని వయస్సెంత యను కొందువు?

నాలాయని:—స్వామీ! తమరి వయస్సెంత యున్నదో యతనికి నంతే వయస్సనుకొందును.

గోస్వామి:—నా వయస్సు పాతికయేండ్ల లోపు. అత డిచ్చటికి వచ్చినప్పుడు వానికి ముప్పదియేండ్లపైని యుండును. ఈ రహస్యము నాకు తెలియును. నాది ఒక పెద్ద కథ. నేను నీతో నొక రహస్య మును చెప్పుచున్నాను. నా కప్పటికి తొమ్మిదేండ్లో, పదేండ్లో! ఇప్పుడు మద్గురు కటాక్షమువలన పండితుడను, వివేకినికూడ చెప్పవచ్చును. అప్పుడు పదియేండ్ల పిల్లవాని కుండవలసిన తెలివితేటలు కూడ లేవు. నేనును మా తల్లియు వరదలలో గోస్తనీనదిలో కొట్టుకొని పోవుచుం టిమి. అతడును వరదలలో చిక్కుకొని యొక కొండకొమ్మును పట్టు కొని నిలచియున్నాడు. మమ్మిద్దరను రక్షించినాడు. అప్పు డతనిని చూడవలెను. అతడమపదియేండ్ల వానివలెనున్నాడు. నా తల్లికి మానభంగము చేసినాడు. ఆమె శీలమును భంగపరచినాడు. అతడు దరిద్రుడు. తరువాత మేమొక గ్రామమునకు పోయితిమి. అచట నా తల్లి యతని భార్యవలె, నే నతని కుమారునివలె నటించ నొక యర్ధ రాత్రమున పారిపోయి వచ్చినాడు. అతని పూర్వచరిత్ర నాకు తెలి యదు. దానిని కనుగొనుటకే నేను బయలుదేరితిని. ఇచ్చట వాని తొలిజాడ తెలిసినది.

నాలాయని:— అతడు నీకు గనిపించినచో నేమి చేయుదువు?

గోస్వామి:—నేనేమి చేయగలుగుదునమ్మా! ఏమి చేయగలు గుదును! నిన్నొక సేనాని ప్రేమించెనట. ఒకనినము నేను సేనానినైన నైనచో వానిని సంహరింతును. నేను బ్రాహ్మణుడను. ఒక శాస్త్రమును

చదివినవాడను. ఉపనిషత్తులు నేర్చినవాడను. నేను వాని నేమి చేయగలను?

నారాయని:— మరి వెవకుట యెందుకు?

గోస్వామి:— ఎందుకో మనకేమి తెలియును? ఇంతమంది పండితులు రాగా మీ నాయనగారికి నామీద ననురాగమెందులకు? ఆదర మెందులకు? ఆదరము కలిగెను పో! నన్ను తీసికొనివచ్చి నిన్ను చూపించుట యెందులకు? నీవలన వానికథ నాకు తెలియుట యెందులకు? ఇది దైవముచేసిన పని. ఆ దైవము వానిని నాకు గన్పింపజేయునో—కన్పింపజేసి నాచేత వానికి ప్రతిక్రియ చేయించునో! ఆ ప్రతిక్రియ యెట్లుండునో నాకు తెలియదు. తల్లీ! నీకొక్క మాట చెప్పెదను. నా కొక్క విషయము స్ఫురించినది. అతడు నా తల్లిని పాడుచేసినట్లే, నిన్ను పాడుచేసినట్లే తత్పూర్వ మెందరిని పాడు చేసెనో! అతడు నన్నును నిన్నును వదలిపోయి పదుమూడు పదు నాలుగేండ్లైనది. తరువాత నింకెందరిని పాడుచేసెనో. ఇది యంతయు పాపముకదా! నీవు చేసినది పాపము. నీవతనిని ప్రేమించితివి. వాడు నీ కులమువాడని ప్రేమించితివా? మహాపండితుడని ప్రేమించి తివా? వాడు చేసిన యొక చిన్న యుపకారమునకు వానికి లొంగి పోయితివి. అయ్యో! లోకములో నొకరికొకరు ఉపకారము చేయకూ డదా? ఉపకారము జరిగినచోట నెల్ల పరమార్థమైనది స్త్రీ పురుష సంగమమా! నిన్నతడు పెండ్లియాడ లేదు. నీ స్త్రీత్వమును భంగపరచెను. నే నొక్కటి యడిగెదను చెప్పుము. అతనిని నీవు ప్రేమించితి ననుచుంటివికదా! రహస్యమును దాచకుండ చెప్పుము. అతడు నీ కుపకారము చేసెను. నిజమే. దానివలన నీకు కృతజ్ఞతా భావము కలిగినది. వానిని పెండ్లిచేసికొనవలయునని, వానియందు కామసుఖములు పొందవలయునని, వానియందు సంతానమును కనవలయునని నీ కుండెనా? లేదుగదా! వాడు తనయంతట తాను నీ శరీరమును స్పృశించి నీయందు కామోద్రేకమును కలిగించెను. ఆ కామోద్రేకము కలిగిన నిముసములో నీవు నీవర్ణమును, నీకుటుంబ మర్యాదను, నీయాధిక్యమును, నీభవిష్యత్తును సర్వమును మరచి పోయితివి. అనగా అతడు నిన్ను మోసగించెను. సర్వజనులకు

శరీరమున్నది. శరీరసుఖమనునది యొకటి యున్నది. తత్సుఖాను భూతి కలిగించుటకు అతని నొసటనే ప్రొద్దుపొడువలేదు.సర్వపురుషుల కీ శక్తి కలదు. సర్వస్త్రీల కీవాంఛకలదు. అట్టి సంయోగ మెంత పరీక్షితమై యుండవలెను? ఒకరి నొకరు తాత్కాలికముగ మోహపెట్టి బురదలో దించినచో వారు పాపము చేసినట్లు. ఈ పాపములను అత డనుభవించవలెను. అనుభవించును. అతడు చేసిన పాపములు రెండు నే నెరుగుదును. నా విషయములో చేసిన పాపము చాల చెడ్డది. నీ వవివాహితవు కావున నీయెడల చేసిన పాపము కొంత తక్కువది. నాకు నిన్ను చూపించిన భగవంతుడు నాకు వానినిగూడ చూపించును. నాచేత వానికి ప్రతిక్రియకూడ చేయించును.

నాలాయని:— నేను నీవెంట వత్తును. వానిని జూడవలయు నని యున్నది.

గోస్వామి:— అనగా వానియందు నీకు మమకారము పోలేదని యర్థము.

నాలాయని:—కాదుకాదు. నీవు కన్పించెడి వరకు పోలేదు. నీవు చెప్పిన మాటలనుబట్టి నా కా మోహము విరిగిపోయినది. అతడెట్టి వాడో! తాత్కాలికమైన మోహముచేత స్త్రీలు లోకమునందు భ్రష్టలగు చున్నారు.

గోస్వామి:— నీవు నావెంట రావలదు. నే నత డెచ్చటనున్నాడో కనుగొని నిన్నతనివద్దకు నిస్సందేహముగా తీసికొని పోయెదను.

నాలాయని:— ఇది వాగ్దానమా?

గోస్వామి:— వాగ్దానము. నిన్నేకాదు. సాధ్యమైనచో నాతల్లిని గూడ వానివద్దకు తీసికొని పోవలయునని యున్నది.

నాలాయని:—అయ్యా! నీవు వయసుచేత చిన్నవాడవు. పండి తుడవు కావచ్చును. ఎవరో మహా తపస్సంపన్నులు, మహా శక్తిమం తులు,కొన్ని సిద్ధులు సంపాదించినవారు నీ వనుకున్నట్లు చేయవచ్చు నేమో! నీకు సాధ్యమగునా?

గోస్వామి:— అగునని నాకు గోచరించుచున్నది. మాది 'మదాలస' నగరము. నే నింటివద్ద బయలువేరి యిప్పటికి పదునేను దినములైనది. ఈ పదునేనుదినములలో నాకు నాలుగైదు విచిత్రము

లైన యనుభూతులు కలిగినవి. తరువాత రెండు మూడు స్వప్న ములు వచ్చినవి. కడచిన రాత్రి నాకొక స్వప్నము వచ్చెను. ఆ స్వప్న ములో మనమిద్దరము మాటాడితిమి. ఇప్పుడేమి మాటాడితిమో అప్పు డదియే మాటాడితిమి. నా గురువు శాండిల్యముని. ఆయన పరమర్షి. ఋషు లడవులయం దుందురు. నా గురువు నగరమునందుండెను. ఇంతియే భేదము. ఆయనకు నాయందు మహానురాగము. నాకాయన పతత్త్వమును బోధించినాడు. నిర్గుణమైన పరబ్రహ్మమును జెప్పి సగుణమైన పరబ్రహ్మమును నిరూపించిపెట్టినాడు. నేనుపనిషద్వా దిని-కాని యా యుపనిషదర్థమంతయు నా మనస్సులో, నా యాత్మలో శ్రీకృష్ణదేవుడుగా తాండవించుచున్నది. భగవంతుడైన శ్రీకృష్ణుడు నాకు బహువిషయములను స్ఫురింపజేయుచున్నాడు. స్వప్నముల యందు వెలయించుచున్నాడు. ముందు జరుగబోవునది నాకు నిరూ పించిపెట్టుచున్నాడు. ఆ కృష్ణదేవుని నే నింతవరకు చూడలేదు. ఆయన తనమూర్తిని దాచి తనశక్తిని నాయందు వెలయింపజేయు చున్నాడు. అందుచేత నాకు శాకస్యు కనిపించును. నేను వానికి ప్రతిక్రియకూడ చేయగలుగుదును.

నాలాయని :—ఆ ప్రతిక్రియయొక్క స్వరూపమేమి ?

గోస్వామి :—నాకు దెలియదు. అత డీరీతిగా బహుస్త్రీలను వంచించెను. ఈ పాపమంతయు అతనిచేత ననుభవింపజేయవల యును. అతనిచేత వంచింపబడిన స్త్రీల కా పాపము మిగులరాదు. నా తల్లి మహాయోగ్యురాలు. ఆమెను నీవు చూడవలయును. తొలినాడు మా గ్రామములోగాని, మలినాడు మా మహాలసానగరమునగాని సర్వ జను లామెను దేవతయనుకొనిరి. ఆమెను నడిమికాలములో నతడు వంచించెను. వంచించుటయనగా.నామెకు తెలియకుండ కర్మానుభూతి కొరకు శరీరమునంటుకొనియున్న జీవునిలో శరీరసంబంధమైన కామ మును అతడు శరీరబలముచేత విజృంభింపజేసి యామెచేత నూహింప బడనట్టి, వాంఛింపబడనట్టి యొక దుష్కార్యమును చేయించినాడు. చేయించినాడనుటకంటె నతడు చేసినాడనుట న్యాయము. ఇట్లు చేసి నచో కొంతపాలు స్త్రీకిమాత్రము లేదాయని ప్రశ్నింతువేమో! పశువు కంటె తక్కువవాడు శవముతో సంగమించవచ్చును. మూర్ఛాగ్రస్త

రాత్రైన స్త్రీతో సంగమముచేయవచ్చును. అతడు తాను నేర్చిన విద్య చేతనో, వానియందు ద్వాపరపురుషుని లక్షణములుండుటచేతనో స్త్రీని తాత్కాలికముగ మూర్ఛాగస్తురాలివలెనో, తనయొడలు తాను తెలియనిదానివలెనో చేసి యతడు రమించును. ఇచట నొక ప్రశ్న యున్నది. అది ఆ స్త్రీయొక్క కర్మలో వ్రాసిలేదా యన్నది. కర్మలో వ్రాసియున్నదనగా నామెయొక్క జీవసంపుటిలో నొకభాగమని యర్థము. నూటికినూరుపాళ్లు వ్రాసియున్నదనియే చెప్పవలయును. ఆ జీవసంపుటిలో నట్టిలక్షణము లేనిచో నట్టిపరిస్థితి కలుగదు. అట్టి సంఘటన మేర్పడదు. కాని కర్మయనునది చిత్రచిత్రములుగా నుండును. ఒకకర్మ తత్పూర్వకర్మకు ఫలమైనది. మరియొక కర్మ అప్పుడే ప్రారంభించును. ప్రారంభించుటకు జీవసంపుటిలో దాని కనుకూలమైన కొన్నిలక్షణములుండును. ఆ లక్షణములు కొన్ని విస్పష్టముగానుండును. కొన్ని యవిస్పష్టముగానుండును. విస్పష్ట ముగానున్న లక్షణములయందు నావ్యక్తియొక్క వాంఛకూడ దాని యందనుషక్తమైయుండును. అవిస్పష్టమైన వానియందు ఆ వ్యక్తి యొక్క వాంఛ లేదు. అది జరుగును. దాని నావ్యక్తి జాగ్రత్తచేత పరిహరింపవచ్చును. వాంఛకలచోట ప్రయత్నముచేత పరిహరింప వచ్చును. ఆ జీవున కవిదితమై సంఘటిల్లిన కర్మయందు వ్యక్తికి స్వశక్తిలేదు. నీవిషయమున, నాతల్లివిషయమున నే నూహించిన ప్రకా రము నీవంటి బహుస్త్రీల విషయమున నీసంఘటనము విస్పష్టా విస్పష్టములైన రెండుపద్ధతులచేతను జరిగినది. వారించుటకు మీకు శక్తియున్నది; లేదు. ప్రయత్నముచేయవచ్చును: చేయరాదు. ఇది యొకానొకకర్మ ప్రారంభించిన సమయము. దానిచేత నొక పాపము కలుగుచున్నది. పాపమనగా నేమియునులేదు. ఒక యసత్కార్యము జరుగగా దానికి ఫలపరంపర యుదయించుట. పుణ్యపాపములు రెండు నింతియే. ఒకకర్మ జరుగును. అది సత్కర్మయైనచో పుణ్యము ననుభ వించుటకు స్వల్పస్వల్ప కార్యపరంపర ప్రారంభించి తత్ఫల కణపరంపర యనుభూతికి వచ్చుచుండును. పుణ్యమునం దెట్లో పాపమునం దట్లే. ఇది సుఖదాయి; అది అసుఖదాయి. పాపమనుటచేత నేదియో యనుకొందుము. దుఃఖము

నొనగెడి ఫలసంపదను సమకూర్చెడి కర్మ. ఈ కర్మను నశింప జేయుటకు మార్గమున్నది. దాని పేరు జ్ఞానము. జ్ఞానము కర్మను నశింపజేయును. నేను పరమాత్మను- అహంబ్రహ్మాస్మి అను జ్ఞానము గనుక నుదయించినచో-వానియందు నిష్ఠకుదిరినచో కర్మ నశించును.

గోస్వామి యిట్లు మాటాడుచుండగా గోస్వామి నేత్రములయం దొక కాంతి తళతళలాడ నారంభించెను. నాలాయని యతని కన్నుల లోనికి జూచెను. నాలాయనికి వాని కన్నులలో నొక బాలుడు- నీల వపుష్కుడు- నవకింకిణీక జాలాభిరామజఘనుడు- దిగంబరుడు శార్దూల దివ్యనఖభూషణ భూషితుడు -తలపైని నెమ్మిపించియము వాడు- చేతిలో వేణువు కలవాడు-నృత్యము చేయుచున్నట్లు కన్పిం చెను. ఇది చాల విచిత్రముగా నుండెను. కన్నెంత? కంటిలో నల్ల పాప యెంత? ఆ పాపలో కన్పించుచున్న యీ మూర్తి యెంత? ఆ మూర్తి సువ్వగింజంతలేదు. కాని యేడెనిమిదేండ్ల బాలునివలె నున్నాడు. అంత యిసుమంతయైన మూర్తిలో నిన్ని లక్షణములు కన్పించుచున్నవేమి? ఇది యెట్లు? నాలాయనికి తన యొడలు తనకు తెలియుట లేదు. ఇంతలో గోస్వామికి తన యొడలు తనకు దెలిసెను. నాలాయని తన మాటలు వినుటలేదని తెలిసెను.

అతడు నాలాయనితో నిట్లనెను:-"ఏమమ్మా! నీవు సామాన్యు రాలవు కావే. నీ వైకల్యయత్వము ననుభవించుచున్నావు. ఇట్టి నిన్ను వా డెట్లు మోసము చేసెను?"అనగా నాలాయనికి మరల స్మృతి కలిగెను. అతని ప్రశ్నయు మనస్సునకు స్ఫురించెను.

ఆమె యిట్లనెను:-"అయ్యా, నీ వెవరవు? ఆ కృష్ణు డెట్లుం డునో నీకు తెలియునా?"

అని యడుగగా గోస్వామి :-"నాకు తెలియదమ్మా! నే నా ప్రభు దర్శనము చేయలేదు. నేను ద్వారకకు బోవలయునని యనుకొను చున్నాను."

నాలాయని "నీ కనులలో నేనతనిని జూచితిని" అని, తాను చూచిన రూపమును వర్ణించెను.

గోస్వామి తలక్రిందులై పోయెను. అతడు నాలాయని పాదము లపై బడి "నీకు భగవంతుడు కన్పించెను. ఆయనకు నీ మీద నెంత

దయ! నీమీద నున్న దయలో స్వామికి నా మీద లేశభాగమైన లేదే! నాకు గనిపించదే" యనెను.

నాలాయని యిట్లనెను :–"అయ్యో! ఏమి మోహము! భగవంతుడు నీలో నున్నాడు. నాలో లేడు. నీలో నుండి నీకు గన్పించుట యెట్లు? బయట నున్నవాడు కన్పించును. లోననున్నవాడు కన్పించునా? అతడును నీవును వేర్వేరైనచో నీ కతడు కన్పించును. ఇరువురు నొకటియైనచో కన్పించుట యెట్లు ?"

అంతట నిద్దరును చాలసేపు మౌనముగ నుండిరి. కాలము గడచుచుండెను. నాలాయని తండ్రియైన ప్రతాపసేనుడు వారి నిద్దర నచ్చట వదలిపెట్టి తాను వెడలిపోయెను. పొద్దుటిపూట భోజనానంతరమున ప్రొద్దువాటారబోవువేళ ప్రతాపసేనుడు గోస్వామిని నాలాయని వద్దకు తీసికొని వచ్చెను. ప్రొద్దు క్రుంకబోవుచుండెను. ఇంతసేపును వారు గదిలోననే యున్నారు. ప్రతాపసేనుని భార్య భర్తతో నిట్లనెను: "మన మిది యొక క్రొత్త బెడదను కొనితెచ్చుకున్నామూయేమి! వా డా నాడు పిల్లను పాడుచేసెను. ఈమె నేను వానిని తప్ప మరియొకనిని వివాహమాడనని కూర్చున్నది. వాడు యోగినని వచ్చెను. నేడు ఇతడు వచ్చెను. ఇతడు పండితుడనని వచ్చెను. అతనిని వదలి ఇతనిని పెండ్లి చేసికొందుననునా? కానిచో నప్పుడు వివాహమును పరిత్యజించెను. ఇప్పుడు ప్రాణములే పరిత్యజించునా? అనాడు వాడు తప్పించుకొని పోవుటకు కోటలోని సామాన్యజనులందరు, సేవకులందరు, చిన్న యుద్యోగస్థులందరు వానికి సాయపడిరి ఇతని కట్టి శక్తిలేదు. ఇతడు మనకు ద్రోహముచేసినచో వీనిని మనము శిక్షింపవచ్చును.

అనగా, ప్రతాపసేనుడు :—ఛీ! ఛీ! పొరపాటుపడుచున్నావు. అతడు కుఱ్ఱవాడైనను యోగ్యుడు. పరమసాత్త్వికుడు. క్షుద్రవిద్యలు నేర్చినవాడు కాడు. మహాపండితుడు. సభలకు వేయిమంది పండితులు వచ్చిరి. ఇతని నందరును గౌరవించినవారే. అతడు యాగదతుడుకాదు. ఉపనిషత్పరమార్థవేత్త. అయినను పోయి చూచివత్తును

ప్రతాపసేనుడు వారున్న గదివద్దకు బోయెను. హఠాత్తుగా లోనికి బోకుండ వా రేమి మాటాడుచున్నారో వినవలయునని తలుపుచాటున నిలుచుండెను. గోస్వామి మాటలు వినపడుచుండెను: "అమ్మా.

నీవింత వివేకవతివి. నీయాత్మలో నెంతపుణ్యమున్నది. నీకు భగవంతుని మూర్తి కన్పించినది.నీవు చూచిన మూర్తి నాగురువుకూడ నింత విస్పష్టముగా చెప్పలేదు. నేనే యట్లు భావించలేదు. ఇదియెవరో మహర్షులకు గన్పించవలసిన మూర్తి. ఈ మూర్తినిగూర్చి నేను తరువాత నాలోచించెదను. అదియట్లుంచుము. నీవు నన్నొక ప్రశ్నవేసితివి. వేసితివో లేదో నాకు జ్ఞాపకములేదు. నీచేత నతడొక పాపపుకర్మ నారంభముచేయించినాడు. కర్మయనగా నేమిటో నీకర్థము చెప్పితినిగదా! ఆ పాపమనుభవించినచో ననుభవింపవలెను. లేనిచో జ్ఞానముచేత నశింపజేయవలయును. అయ్యో! తల్లీ! జ్ఞానమిట్లుండునా? రూపసహితముగానుండునా? నాకవగతమగుటలేదు. కాని నాకొకటి స్ఫురించుచున్నది. పాపము ననుభవించనక్కరలేదు. ఎవనికైన నొసంగవచ్చును. పూర్వమింద్రుడు వృత్రాసురుని వధించెను. వృత్రాసురుడు బ్రాహ్మణుడు. ఆతనికి బ్రహ్మహత్యాపాతకమంటుకొనెను. ఆ పాపము క్రూరదంష్ట్రాన్వితమై చీకిరిబాకిరి జుట్టుతో, దిస్సమొలతో పరమవికారాకారముగా నింద్రునకు గన్పించెను. ఆయన యా బ్రహ్మహత్యామహాపాతకమును మీ స్త్రీలకును భూమికిని మరియెవరికో పంచిపెట్టెను. అదిసాధ్యమైనచో మీపాపము నేను నీనుండి తొలగించి మరల నతడే పొందునట్లు చేసెదను.ఇది నా దృఢసంకల్పము. ఈ సర్వపాపమును అతడే యనుభవించుగాక! ఇది నీకొరకు చేయుటలేదు. నాకొరకే చేయుచున్నాను. అనగా తెలియునుగదా! నాకు పరమపూజ్యమైన స్థానము చెడిపోయినది. ఆస్థానమును రక్షించుకొనుటకు చేయుచున్నాను. ఆస్వామి నాలోనున్నచో మిమ్ములందరను మీ మీ పాపముల నుండి తొలగించెదను. మిమ్ము రక్షించెదను. మీ పాపములన్నిటిని మరల వాడేస్వీకరించునట్లు జేసెదను. నీతో మాటాడుటవలన నాకొక్కటి బాగా తెలిసినది. నా యీ మహాకార్యమును భగవంతుడు నిస్సంశయముగా నాచేత ప్రవర్తింపజేయును. ఈ పాపము నతడు స్వీకరించుట యెట్లు? నీవు మనసా సంకల్పింపవలయును.నాకీ పాపమక్కరలేదు; అతనిపాపమును వానికే యిచ్చెదను అని నీవు సంకల్పము చేసినచో నతడు స్వీకరించుటనుగూర్చి విచారింతును."

ప్రతాపసేను డీమాటలను వినెను. అతనికేమియు నర్థము కాలేదు. మరునాడు గోస్వామితో నాలాయని తాను తన దృఢసంకల్పమును జెప్పెను. తన పాపమును తాను పరిత్యజించుటకు సిద్ధముగా నున్నది.

# 14

ఎచ్చటికో పోదమనుకున్న గోస్వామి మరల పదిదినములలో మదాలసా నగరమునకు బోయెను. ధూర్జటి మిక్కిలి సంతోషించెను, అందరును సంతోషించిరి. ఎక్కువ సంతోషించనిది రత్నావళి యొక్క తెయే. గోస్వామికి స్వప్నములు వచ్చుచుండెను. అవి చిత్రచిత్రములుగా నుండెను. భవిష్యత్తులో చేయగలిగినదంతయు విస్పష్ట మగుచుండెను. ఒకనా దర్ధరాత్రమున గాఢసుషుప్తిలో నుండగా నతడు తల్లిని మేల్కొలిపి ఈ కథయంతయు చెప్పెను. ఆమె పాపమును తాను పరిత్యజించునా? ఆ పరిత్యజించుటకు గాఢసంకల్పము చేయునా? అపాపము మరల శాకయ్యాయందే నిక్షేపింతును. అని యామెతో చెప్పెను.

ఆమె చాల విచారించి, "నాయనా! నాలాయనికిని నాకును కొంతభేదము కలదు. ఆమె ఆతనిని కలిసికొను నాటికి అనధిగత పురుష సంపర్క;నే నధిగతపురుష సంపర్కురాలను.ఈ భేదము మాలో నున్నది. నన్నతడు మోనముచేసిన మాట నిజమే. అపుడు నా యొడలు నాకు తెలియని మాట నిజమే. కాని యెదో యొక లోతైనచోట తత్సుఖ వాంఛ నాకు లేదనుటకు లేదు. నా కింతకు పూర్వము లేదు. కాని అతడు దానిని నాయందు ప్రేరేపించెను. నా యందా వాంఛ నగము

ప్రబుద్ధమై నగము నిద్రితమై యున్నది. నే నీ బ్రతుకు బ్రతుకలేను. నే నాపాపము నాచరించుటయు నిన్ను బ్రతికించుటకు, నీకాధారము కలుగుటకు చేసితిని. ఆ పాపము నాకక్కరలేదు. నిలువున నాదేహము మాడిపోయినను సరే నేను దానిని పరిత్యజించుచున్నాను. నీవు దీని కొనిపోయి అతని పాపము నతనికిమ్ము. అందులోని కొంతభాగము నాకు మిగిలినచో భగవంతునితో చెప్పుము. దాని యనుభూతి నాకు భవిష్యజ్జన్మలలో లేకుండ నీ జన్మలోననే నేను దగ్ధమైపోవునట్లు చేయుమనుము. కాని నాకొక వాగ్దానమిమ్ము. నా వారిని నేను పోయిన తరువాత నీవు పెండ్లిచేసికొని సుఖముగా నుండుము. ధూర్జటిని వదలిపెట్టకుము రేవతిని వదలి పెట్టకుము. రేవతి యవధ్యూరాలు. నీవు పెండ్లియాడుము. మేధావసువునకు పెండ్లి చేయుము. మీ యిద్దరి భార్యలు వచ్చి రేవతిని సుఖపెట్టవలయును నీ వీ వాగ్దానమును చేసినచో నే నీ పాపమును పరిత్యజింతును. అతనినే యనుభవింప నిమ్ము. అందులో నాకెంత భాగమున్నదో దానికొరకు నేను దగ్ధురాలనై పోయెదను.'' అనెను.

గోస్వామి వాగ్దానము చేసెను. ధూర్జటితో నిట్లు చెప్పెను: "నేను రెండునెలలలో వత్తును. నిస్సందేహముగా వత్తును. వచ్చి నేను పెండ్లియాడెదను. మేధావసువునకు పెండ్లి చేసెదను. ఇది శపథము. మీరు నాకు వరుసకు మేనమామలైనను నిజానికి తండ్రివంటివారు. నేను మీతో నబద్ధమాడినచో భగవంతుడైన శ్రీకృష్ణదేవుని కపచారము చేసినట్లు.

గోస్వామి మరల నింటినుండి పోవుచుండగా ధూర్జటి, రేవతి, యతని యిద్దరు తమ్ములు కన్నీరు కార్చిరి. చాల దుఃఖపడిరి. అతడు వారి నోదార్చెను:—"మీకు భయమక్కరలేదు. నేను నిస్సందేహముగా తిరిగి వత్తును నా కొక మహాకార్యమున్నది. ఆ కార్యమును చేసి తిరిగి వత్తును.''

ఆయింటిలో కంటి వెంట తడిబెట్టనిది రత్నావళి యొక్కతెయే. కాని వారు దుఃఖించుచుండగా నయిన నామె దుఃఖపడుట లేదు. ఆమె యొక శిలావిగ్రహమాయెను. చూచెడివారాశ్చర్యపడిరి. ఈ కొడు కింత మహానుభావుడు. ఆమె యెంత మహానుభావురాలో!

గోస్వామి యింటినుండి బయలుదేరి వెడలిపోయెను. అతని పద్ధతి యేమో తెలియుటలేదు. ఒక సందేహములేదు. ఒక విచారణ లేదు. హిమాలయ పర్వతములన్నియు తనకు తెలిసినట్లు తదుపత్య కలయందు తనకు సర్వథా పరిచితియున్నట్లు, ఆ ప్రాంతములయం దెన్ని దేశములున్నవో యున్నిటిని తా నెరిగినట్లు. ఆ గ్రామమునకు పోవుటకు కొండలలోనుండి మార్గము. అచ్చట వాగున్నది. ఇచ్చట నదిని తరించవలయును. ఆ గ్రామ మిచ్చటి కింతదూరముననున్నది. ఆ గ్రామములో నా గృహము సందు మలుపు తిరిగినతరువాత నాల్గవ యిల్లు. ఆ గుహలో నా ఋషి తపస్సు చేసికొనుచున్నాడు. ఆనాటి కాసత్రమునం దొక పురుషు డా వేళనుండును. ఇట్టి విచిత్రమైన యభిజ్ఞానముతో సంచరించుచుండెను. "అయ్యా! ఎచ్చటికి బోవు చున్నారు?" "ఆ గ్రామమునకు బోవుచున్నాను." "అచ్చట నెవరి నైన నెరుగుదురా?" "ఎరుగుదును." "వారి నామధేయము?" గోస్వామి నామధేయమును జెప్పను. "ఏమిపనిమీద పోవుచున్నారు?" గోస్వామి చెప్పడు. వారు నొత్తిడి చేయరుగదా! ఏదో రహస్యము కాబోలు! అని వా రూరకుందురు.

గోస్వామి ప్రథమశః—హిమాలయ పర్వతములో పశుపతియా లయమున్నది. ఆ ఆలయమునకు వెనుక కొన్ని గుహలున్నవి. ఆ గుహలోనికి బోయెను. ఆ గుహలో నొక మహర్షి కూర్చుండి తపస్సు చేసికొనుచుండెను. ఆ తపస్వి గోస్వామిని చూచెను.

తపస్వి:— "రండి! రండి! మీకొరకే ప్రతీక్షించుచున్నాను. మీకేమి కావలయును?"

గోస్వామి:—మహర్షీ! పూర్వము దేవేంద్రుడు తన బ్రహ్మహత్యా పాతకమును పంచిపెట్టినాడు. అది యెట్లు సాధ్యము?

తపస్వి:— వారిమీద నింద్రునకు సర్వాధికారమున్నది అయన త్రిలోకాధిపతి గనుక. ఒక తండ్రి యున్నాడు. అతనికి గొంత యప్పున్నది. నలుగురు కొడుకులకు నాల్గు భాగములుగా పంచియిచ్చును. నలుగురకు నాల్గు బాధ్యత లప్పజెప్పును. వారు కాదనుటకు వీలులేదుకదా! ఆ రీతిగా నింద్రుడు చేసినాడు.

గోస్వామి:—అదినరే! పాపమనునది జీవు సంటుకొని యుండును. ఇది నేను వానికిచ్చితిననుటతో సరిపోవునా? ఆ జీవుడు తన క్రిందివాడగుటతో సరిపోవునా? అతలివారు మేము దీనిని పరిగ్రహింపమన్నచో నేమిచేయవలెను? కొందరు కొడుకులు తండ్రి యిచ్చిన ఋణముల నంగీకరించక పోవచ్చును. ఒకడు నాకీ ఋణములతో ప్రసక్తిలేదు. నేనుపోయి సన్యసింతుననవచ్చును.

తపస్వి:— ఆ పాపముల జేయునతడు, స్వీకరించునతడు నిద్దరు నంగీకరించవలయును. అంతటితో సరిపోలేదు. దానికి కొన్ని హోమములున్నవి. కొన్ని అథర్వమంత్రము లున్నవి. స్వీకరించువాడు తానొక దీక్షను పొందవలయును. ఆ హోమములు చేయవలయును.

గోస్వామి:- ఇంద్రుడున్నాడు. పాతక మాచరించినది యింద్రుడు. పంచిపెట్టబడినవారికి నీ పాతకమునకు సంబంధము లేదు. ఒక పురుషుడున్నాడు. పదిమంది స్త్రీలను పాడుజేసినాడు. ఆ పురుషుడు పాపము జేసినాడు. ఆ స్త్రీలకును పాపమున్నది. తమ పాపము నా స్త్రీలు వానికి సంక్రమింపజేయ నెంచుచున్నారు. అతడు స్వీకరింపవచ్చునా? అతడొక్కడు హోమములనుజేసి తానీ పాపములను సంక్రమింప జేసికొనగలడా!

తపస్వి:— కలడు. ప్రధానముగా పాపములను స్వీకరించెడి వానిమీద నాధారపడి యుండునుకదా! అతడు స్వీకరింతునన్నచో నభ్యంతరమేమున్నది? అతడే హోమములు చేయవలెను. కాని యిందులో నొక విషయమున్నది. ఈ హోమములను జేయించెడివా డుండవలెను. ఇంద్రునకు బృహస్పతి చేయించెను. అప్పటికి బృహస్పతి బ్రహ్మచారి. నాటికి స్త్రీకామన లేనివాడు. అట్టివాడు కావలెను. మరియును వాడు బ్రహ్మవిద్యావేత్త కావలయును. హోమములు జరిగినన్నాళ్ళు తనయందు సర్వకర్మ ఫలదాతయైన యీశ్వరు ననుసంధానముచేసికొనవలెను. ఆయనుసంధానమునందు సంశ్లథము జరుగరాదు. కర్మఫలదాతయైన యీశ్వరుడు వానియందుండును. అతనికది సాధ్యమగును. స్వీకరించెడివాడు 'మమ' 'స్వీకరోమి' 'మయిస్వాహా' మొదలైన శబ్దముల నుచ్చరించుచుం

వలెను. 'కర్మఫలదాతస్వాహా' యన్నప్పుడెల్ల నతడు హోమము చేయుచుండవలెను.

గోస్వామి:— ఆ మంత్రములు నాకు మీరు చెప్పవలయును.

తపస్వి:—నీవిచట నాల్గుదినములుండవలెను. కర్మకాండ యంతయు నిరూపించి చెప్పెదను.

గోస్వామి:—నాయందు తమకింత యనుగ్రహమెందుకో నా కవగతమగుటలేదు.

తపస్వి:— ఓయీ! ఇంద్రుడు తన బ్రహ్మహత్యాపాతకమును పంచినదెప్పుడో నీకు తెలుసునా? అది యనేకకల్పములక్రింద జరిగినది. ఆనాడు బృహస్పతి యెట్లుండెనో నీవట్లుంటివి. కర్మఫలదాతయైన యీశ్వరుడు నీయందావేశించియున్నాడు.

గోస్వామి:—తమరికెట్లు దెలియును?

తపస్వి:—నేనిచ్చట నుంటినని నీకెట్లు దెలియును?

గోస్వామి నాల్గుదినము లచ్చటనుండి హోమద్రవ్యములు త్రవ్వవలసిన కుండములు, హోతయు నుద్గాతయు కూర్చుండవలసిన స్థలములు, కావలసిన సంభారములు నత్వమును దెలిసికొనెను. మంత్రములు స్వాధ్యాయముచేసెను. అయిదవదినమున నచ్చటినుండి వెడలిపోయెను.

ఏనాడు నిరాలంబయున్న మూడు పేరుగల గీలా శాకయ్యతో నర్ధరాత్రమునందు తదుపన్యాసానంతరమున శిష్యులు దవ్వుగానుండగా మాటాడి 'నీ పేరిదియో నీ వేశమేదియో నీవు విడిగా పత్రముమీద వ్రాయుము. నేను విడిగా పత్రముమీద వ్రాయుదును. సరిపోయినచో నీవు నా భర్తనని ప్రసంగము చేసెనో యానాటికిది దినములక్రింద శాక్యసింహుడున్న గదిలో గోస్వామి ప్రత్యక్షమయ్యెను. శాకయ్య యొక్క నలుగురి శిష్యుల నెట్లు తప్పించి కొనెనో ఆ లోని కెట్లేగెనో! బ్రహ్మకు తెలియవలెను. అతనిని జూచి శాక్యసింహుడు నివ్వెరపోయెను. నీవెవ్వడవు? ఇచ్చటి కెట్లు వచ్చితివని యడిగెను.

గోస్వామి యిట్లనెను:— నా పెరు గోస్వామి. నా తల్లిపేరు రత్నావళి నేను నీలాచల గ్రామమునుండి వచ్చితిని. నేను నీకు గుర్తున్నానా? అది పదునేనేండ్ల క్రిందటి మాట.

శాకయ్య:—అగును. గుర్తున్నావు. పెద్ద వాడవైనావు. నీతల్లి క్షేమముగా నున్నదా ?

గోస్వామి :—ఉన్నది. నన్ను నీ దగ్గరకు పంపించినది.

శాకయ్య :—ఎందుకు ?

గోస్వామి :—ఆమెను నీవు పాపములోనికి దించితివి ఆమె యీ పాపమును పరిత్యజించవలచుచున్నది. ఒక గడ్డు సమయములో కృతజ్ఞతా భావముచేత నామె మనస్సు దిమ్మకొని యుండగా నీవు స్త్రీశరీర గతసంధులు, కళాస్థానములు తెలిసిన వాడగుటచేత నామె యంగీకారము లేకుండ నామె జీవునిలోనున్న స్త్రీ భావమును శరీరముద్వారా ప్రబుద్ధము చేసి యామె యొక్క శీలభంగమును గావించితివి. ఆ స్థితిలో పాపముచేసిన వాడవు నీవు. ఆమె పాపము చేయలేదు. ఆమె పాపము చేయునట్లు చేయబడినది. ఆమెకు మాత్రము దానిపైన బాధ్యతలేదా యనగా నున్నది. అది స్వల్పము. నీది యధికము. ఆ స్వల్పమును నీవు స్వీకరించినచో నామె యుత్తమ లోకములకు బోవును. ఆ యల్పమైన పాపమును నన్ను స్వీకరింపు మని యడుగుటకు నన్ను పంపించినది

శాకయ్య :—నే నిచ్చటనుంటినని నీకెట్లు దెలియును ?

గోస్వామి :—కడచిన పదుమూడు సత్సరములనుండి నిన్ను వెదకుచున్నాను. నేనేకాదు నీ కొరకు చాలమంది వెదకుచున్నారు.

శాకయ్య : — నేను పాపపుణ్యముల నంగీకరించను. అవిలేవు.

గోస్వామి :—మరియు నయము. లేనివానిని స్వీకరించితి ననుటలో తప్పేమియున్నది ?

శాకయ్య :—అట్లైనచో స్వీకరించితిని.

గోస్వామి :—స్వీకరించితి నంటివి కదా! ఆ మాటనుండి తొలగవు కదా!

శాకయ్య :—నే నెప్పుడు నబద్ధమాడ లేదు.

గోస్వామి :—పాపపుణ్యములు లేవు కదా! అబద్ధమాడినచో తప్పేమి ? అది పాపహేతువనియే కదా!

శాకయ్య :—కాదు. నావద్ద కొన్ని శక్తులున్నవి. నేనబద్ధమాడినచో నా శక్తులు నా నుండి తొలగిపోవును. అందుచేత నబద్ధమాడను.

గోస్వామి :—ఒక శక్తి తొలగిపోవుటకు నబద్ధమాడుటకు గల సంబంధమేమి? అబద్ధమాడినచో నా శక్తి యేల తొలగిపోవలెను?

శాకయ్య:—పెద్ద ప్రశ్న వేసితివే! నే నింతవరకూహించలేదు. నిజమే.

గోస్వామి:—అబద్ధ మాడుటవలన నొక పాపము సంభవించును. ఒక దోషము కలుగును. పరమేశ్వర స్వరూపమైన ధర్మమునందు లోపము కలుగును. ఆ యొకానొక ధర్మమునకు, నీ శక్తికి సంబంధ మున్నది. నీ యందు కొన్ని శక్తులున్నవి. అవి యెట్లు కల్గినవి? వానికి రూపము కలుగుట యెట్లు? శూన్యమైన స్థలమునుండి విభూతి పుట్టింతువు. అచట విభూతి యెట్లుద్భవించినది? ఇచట రెండు విషయము లున్నవి. దృశ్యము, అదృశ్యము. అదృశ్యమునుండి దృశ్యము కలుగుచున్నది. దీని వెనుకనున్న యాధారమేమి? ఒక మంత్రము. అదృశ్య మనగా పరమేశ్వర సృష్టమైన యొక ధర్మము. ఆ ధర్మము మంత్ర క్షరములయం దారోపింపబడినది. అనగా శబ్దముకాని యొక ధర్మము. ఒకశక్తి శబ్దమయమైనది. అ మంత్రమువలన దృశ్యము కలిగించుచున్నది. అనగా దానికి రూపము కలిగించుచున్నది. అనగా పదార్థము సంభవించుచున్నది. తొలుత నశబ్దమైనది సశబ్దమెట్లైనదో అపదార్థమైనది పదార్థమగుచున్నది. ఇట్టిదే పాపము. అది కనిపించదు. ఫలించును. అదృశ్యమున శబ్దము నపదార్థమైనది సశబ్దమై దృశ్యమై పదార్థముగా పరిణమించుచున్నది కనుక పాపమున్నది. దానిని నీవు స్వీకరింతునని వాగ్దానము చేసితివి.

శాకయ్య:—ఓయి! గోస్వామీ! నీ వెంతవాడవైనావు! అనాడు మందమతి వనుకొంటిని. నీ తల్లి నీకు చదువు చెప్పించినదా?

గోస్వామి:—శాండిల్యుడన్న యొక మహర్షి నాకు గురువు.

శాకయ్య :—సరే! నీ తల్లి యొక్క పాపమును నేను స్వీకరింతును. నీకు గావలసిన దింతియే కదా! ఇంక నీవు వెడలిపోవచ్చును.

గోస్వామి యచ్చటనుండి కదలలేదు. శాకయ్య యతనిని పొమ్మనెను. గొస్వామి యిట్లనెను: "నే నా పాపమును స్వీకరింతు ననుటతో సరిపోలేదు. ఎందుచేత? నీవు మంత్రము నుచ్చరించినపుడు

కదా యీ భస్మము కన్పించినది. అట్లే నీ వా పాపమును స్వీకరించు టకు కొన్ని మంత్రము లున్నవి. కొన్ని హోమములున్నవి. వానిని చేసినగాని నీ వా పాపమును స్వీకరించుట పూర్తికాదు.

శాకయ్య:—నాకా హోమములు తెలియవు. నాకా మంత్రములు రావు.

గోస్వామి:—నా కా మంత్రములు వచ్చును. నా కా హోమ ములు తెలియును. నీ చేత చేయింతును.

శాకయ్య:—నేను చేయను. చేయుట నాకు సాధ్యముకాదు.

గోస్వామి:—చేయనిచో నీవబద్ధ మాడినవాడ వగుదువు. నీకున్న శక్తులన్నియు నేడే యంతర్హితములగును.

శాకయ్య:—కావు.

గోస్వామి మరల 'రేపురాత్రికి వత్తు'నని వెడలిపోయెను. వెడలి పోవుచు నిట్లనెను: "నీవే నిర్ణయించుకొనుము. నీ శక్తులన్నియు నేటి నుండి పని చేయవు. నీవు హోమముల కంగీకరించినచో మరల బనిజేయుటకు ప్రారంభించును."

మరునాటి రాత్రి మరల గోస్వామి వచ్చెను. "ఏమి! హోమ ములు చేయుట కంగీకరింతువా?" అని ప్రశ్నించెను. శాకయ్య తల వంచుకొని యంగీకరింతుననెను.

గోస్వామి:—పాపమని యున్నదా?

శాకయ్య:—ఉన్నట్లే యున్నది.

గోస్వామి:—నీ మతమేమి?

శాకయ్య:—అహింస.

గోస్వామి:—అహింసచేత నిట్టి శక్తులు గలుగునా?

శాకయ్య:— కలుగవు. అది వట్టి మానసికమైన వ్యవహారము. అది వట్టి దయాలక్షణము. దయచేత శక్తులు కలుగవు. మంత్రములచేత కలుగును.

గోస్వామి:—హోమము లెప్పు డారంభింతము?

శాకయ్య:—నీ యిష్టము. కాని యిచ్చట చేయుటకు వీలులేదు. ఎన్నాళ్లు చేయవలయును?

గోస్వామి:—ఎన్నాళ్లో కాదు. ఒక్క యర్ధరాత్రమున ప్రారంభించవలయును. తెల్లవారవరకు బూర్తియగును.

శాకయ్య:—ఇచ్చటనే చేయవలయునా? చేయనగునా?

గోస్వామి:—ఇచ్చట కాదు రాజధానియందు చేయవలయును. అన్నియు నే నేర్పాటు చేసెదను.

శాకయ్య:—నే నీ నగరమును వదలిరాను!

గోస్వామి:—పొరపాటుపడు చున్నావు. నీ శిష్యులు నీ ప్రతిష్ఠ నీ యూరిలోననే నిలిచి యుండుటకు వాంఛించుటలేదు. వారు నిన్ను రాజధానికి తీసికొని పోనెంచుచున్నారు. తీసికొని పోదురు. నీకు తప్పదు. మహారాజు జితేవాస్తి పాండవులకు మిత్రము. ఆయన నిన్ను చూడవలయును. నీవు బుద్ధావతారమని యాయన గ్రహించవలయును.

శాకయ్య:—నేను బుద్ధావతారమునా?

గోస్వామి:—ఆ సంగతి తరువాత చెప్పెదను. నీవు రాజధాని నగరము చేరిన తరువాత నేను నీ వద్దకు వత్తును. హోమ సంభారము లన్నియు సిద్ధముచేసి యుంచెదను. రాజధానిలో నీ కొక యుద్యాన వన మధ్యమున వసతి యేర్పరతును ఆ యుద్యానములోని కెవ్వరికిని ప్రవేశముండదు. నీ శిష్యులకు గూడ ప్రవేశముండదు. అచట నొక పెద్ద సౌధమున్నది. ఆ సౌధములో నీ వుందువు. హోమము లచ్చట చేయవలయును:

శాకయ్య:—అప్పటికి నీ వెట్లు రాగలవు?

గోస్వామి:—ఇచటి కెట్లు వచ్చితిని? అట్లే వత్తును.

శాకయ్య:—అది యెందు కెట్లున్నది?

గోస్వామి:—గీలాయన్న యొక స్త్రీని నీ వెరుగుదువా? తరువాత నామె తన పేరును నిరాలంబయని మార్చుకొన్నది. ఆ స్త్రీ నిన్నొక దినమున కలిసికొనును. ఒక రాత్రిపూట కలిసికొనును. ఆమెను నీవు పంపివేయుము. ఆ తరువాత నాల్గు దినముల కామెను రాజధాని నగరమున నర్ధరాత్రమున నా యుద్యానవనములో వచ్చి కలిసికొనుమని చెప్పుము. ఆమె నిన్ను కలిసికొన్న తరువాత రెండవ దినమున నిచట నున్న మహాసంపన్నులైన నీ శిష్యులందరు నిన్ను రాజధానికి

దీసికొని పోదురు. ఇది దిలహరి నగరము. ఇచట సేనానులున్నారు. గొప్ప గొప్ప వారున్నారు. కాని యందరకును ప్రాముఖ్యము లేదు. రాజధానిలో నున్న యధికారులకున్న ప్రాముఖ్యము వీరికి లేదు. నీ ద్వారా వారంద ప్రాముఖ్యము నంపాదింపనెంచు చున్నారు. నీచేత రాజ దర్శనము చేయించి మహారాజును నీకు శిష్యుని చేయించి వారు నీకు ప్రథమ శిష్యులు. కనుక రాజధానిలోనున్నవార ప్రాముఖ్యము తగ్గించి నీ ద్వారా వారు సర్వ రాజ్యకార్యములను తమ చేతులలోనికి తెచ్చుకొనుటకు పెద్ద ప్రయత్నము చేయుచున్నారు. అది నీకు తెలియదు. నీకు తప్పదు.

శాకయ్య :—ఓయి! గోస్వామీ! నీ వెవ్వడవు? నిజముగా నా రత్నావళి కుమారుడవేనా? ఆనాటి నీ మందమతి యెక్కడ? ఈనాటి నీ తెలివి యెక్కడ? ఇవి యన్నియు నీ కెట్లు తెలియును?

గోస్వామి :—ఓయి! అది యంతయు నెందులకు? నేపాల రాజయిన జితేదాస్తి పాండవులకు స్నేహితుడు. పాండవులు శ్రీకృష్ణ భక్తులు. నీవు కృష్ణ విరోధివి. నా మాట విని నీవు జితేదాస్తి మహారాజును నీకు శిష్యునిగా జేసికొనుము. శ్రీ కృష్ణుడు హింసావాది. నీవు అహింసావాదివి. కౌరవులకు పాండవులకు యుద్ధము సమీపింపబోవు చున్నది. అది పెద్ద హింస. ఆ హింసలో నేపాలదేశపురాజు పాల్గొన బోవుచున్నాడు. నీ వతని వారింపుము. ఇది నీ కిష్టమేగా?

శాకయ్య :—నా కిష్టమేగాని నీ మాటలను వినకొలది నాకు భయము వేయుచున్నది.

గోస్వామి :—నేను వెడలిపోవుచున్నాను. నేను మరల నిన్ను రాజధానిలో నీకు ప్రత్యేకింపబడెడి యుద్యానవన సౌధములో కలసి కొందును. కాని నాకిచ్చెడొక వాగ్దానము చేయవలయును.

శాకయ్య :—చేసెదనుగాని చేసినంతనే వచ్చెడు బాధ యిదియే కదా! ఆ మాట నేను నిలబెట్టుకొనవలయును. నిలబెట్టుకొలేనిచో నాయందున్న శక్తులు పోవునట్లున్నవి. అవి పోయినచో నే నింక గురువునేమి?

గోస్వామి :—నీ వూహించగలుగుదువని నేననుకొనలేదు. నీకు గూడ నూహాశక్తియున్నది. చూచితివా! నీవు గురువగుటకు నీ కల్ప

శక్తులు కావలయును అవి నిలబెట్టుకొనుట కబద్ధమాడరాదు. అబద్ధ మాడినచో పాపము వచ్చును. పాపము కలిగినచో శక్తులు పోవును. శక్తులు పోయినచో గురువవు కావు. కాకపోయినచో నీ యహింసా సిద్ధాంతము వమ్మయి పోవుచున్నది. శ్రీ కృష్ణ విరోధము వ్యర్థమై పోవుచున్నది. ఇదియంతయు నెట్లున్నది. ఇదియొక పథకము. దీని యందు భిన్నాంశము లున్నవి. ఒకవాని కొకటి యతికి యున్నవి. సృష్టియనగా సూక్ష్మములో నింతియే. సరే దానికేమి! నాకు వాగ్దానము చేసెదవా?

శాకయ్య :— వాని స్వరూపము తెలియకుండ నెట్లు చేయుదును?

గోస్వామి :—వాని స్వరూపము వేరేలేదు. అదికూడ నిట్టిదే. నీవు నా తల్లినివలె పలుమంది స్త్రీలను పాడుచేసితివి. ఇట్లే పాడు చేసితివి. వారిలో కొందరు నా తల్లివలెకాదు. వారవివాహితలు. అవి యన్నియు పాపములు. ఇది యెక్కువ పాపమో, యవి యెక్కువ పాపములో నాకు తెలియదు. వారియందరి పాపములను గూడ నీవు స్వీకరించినచో వారందరుకూడ నీవలన సంప్రాపించు నధోగతులకు బోరు.

శాకయ్య :—నేను వారిపాపములను స్వీకరింపవలసిన యవసరము లేదు.

గోస్వామి :—గీలా జ్ఞాపకమున్నదా ?

శాకయ్య :—ఆమె యెవ్వరో నే నెరుగను.

గోస్వామి :—నాలాయని జ్ఞాపకమున్నదా ?

శాకయ్య :—జ్ఞాపకమున్నది. ఆమె గిరివ్రజ పురమునందలి మంత్రి కూతురు.

గోస్వామి :—శీలావతి జ్ఞాపకమున్నదా ?

శాకయ్య :—శాలావతియా! శాలావతియా! అవు నామె మా స్వగ్రామమునందలి చతుర్థకులజురాలు.

గోస్వామి :—నీ వచటినుండి పారిపోయి వచ్చినప్పు డామె గర్భవతి.

శాకయ్య :—కావచ్చును. ఓయీ! నీ వెవడవు?

గోస్వామి :—శాలావతి జ్ఞాపకమున్నదా ! తత్వావళి జ్ఞాపకమున్నదా ? నాలాయని జ్ఞాపకమున్నదా ! గిలా జ్ఞాపకములేదా ! వారందరు గిలాకు పూర్వులు. పూర్వులు జ్ఞాపకముండి పరజ్ఞాపకము లేకపోవుటేమి ? భోటియాల యడవిలో తెలిప్పయన్న యోషధికొరకు తిరిగితివి. వేయియేండ్లు బ్రతుకవలెనని. ఎందుకయ్యా యనగా నింక సుమారు నలుబది యేబది యేండ్లలో ద్వాపరయుగము గడచి పోవును. కలియుగము వచ్చును. కలియుగము పదకొండు పండ్రెండు వందల సంవత్సరములు గడచిన తరువాత బుద్ధుడుదయించును. ఆయన యుదయించుపరకు నీవు బ్రతికియుండి యీ సంప్రదాయ మతని కప్పజెప్పి వెళ్లవలయునని. ఓయీ ! ఆ బుద్ధుడు నీవలె దొంగకాడు. జారుడుకాడు. అతడు నిజముగా భగవదంశ సంభూతు డగును. అతనిని బండితు లాశ్రయింతురు. అతని మతము జగద్విఖ్యాతమగును. వానికిని నీకును బోలికేమి ! అతనికి 'శాక్యముని' యని పేరుండును. శాకయ్యా యనుపేరు సింహము తగిలించుట తోడనే శాక్యసింహుడైనది. వానితో నీకు దురాశపుట్టినది. ఆ తెలిప్ప కొనము నీవు తిరుగునప్పుడు నీకొక యాటవిక స్త్రీ కన్పించినది ఖడ్గ విద్యా నిపుణురాలైన యొక వృద్ధ స్త్రీయొక్క లోపల నొకవలె, బయటికి గుడిసెవలె కన్పించెడి నివాసమునందు నీ వా గిరియన్న స్త్రీతో రెండు నెలలు సంసారము చేసితివి. జ్ఞాపకము వచ్చినదా ?

శాకయ్య :—వచ్చినది.

గోస్వామి :—మరియు పదిమంది స్త్రీలు కలరు. వారందరి యొక్క వ్యవహారము నీకి పది దినములలో తెలియగలదు. నాకు చేయవలసిన వాగ్దానమేమనగా నీ పదునాలుగు పదునేనుమందిచేత నీవు చేయించిన పాపమునంతయు నీవు స్వీకరింపవలయును. స్వీకరింతునని నాకు వాగ్దానము చేయుము. నేను వెడలిపోదును.

అప్పటికి తెల్లవార వచ్చుచుండెను. శాకయ్యా నిస్తబ్ధుడై యుండెను. గోస్వామి వెళ్ళుదు ననెను.

శాకయ్యా:—ఓయీ ! నీవు వెళ్లవద్దు. ఆ పదిమందికూడ నెవరో నాకు తెలియజెప్పి పొమ్ము. నేను సిద్ధపడియుందును. లోకమునం దెందరు వ్యభిచారములు చేయుటలేదు ! అందరిని నీ

విట్లు శిక్షించుచున్నావా? నా మొగముననే యేల ప్రొద్దుపొడిపించు చుంటివి?

గోస్వామి :—బాగుగా నడిగితివి. ఇంక సుమారు నలుబది యేబది యేడులలో కలియుగము ప్రవేశించును. అప్పటికి ధర్మము విశ్లథమగును. ఇది ద్వాపరాంతము. ద్వాపరాంతమునందుకూడ కలి లక్షణములు చాలగలవు. అవి యన్నియు నీయందు మూర్తీభవించి యున్నవి. కావున భగవంతుడు నిన్ను కలికి ప్రతినిధిగా దీసి కొన్నాడు.

శాకయ్య :—తీసికొని యేమి చేయును?

గోస్వామి:—అది నీకు హోమావసానమున దెలియగలదు.

శాకయ్య :—ఆ పదిమంది గూడ నెవ్వరో చెప్పుము.

గోస్వామి :—అవి నీకే తెలియగలదు. ఇంక పది దినము లున్నది కదా! వారు వారు నీ వద్దకు వత్తురు.

శాకయ్య :—అయినచో నీవు వచ్చినంత సులభముగా రాగలుగుదురా?

గోస్వామి :—నేను చెప్పినట్లు విన్నచో రాగలుగుదురు. వారందరి పాపములు నీవు స్వీకరింతునని వాగ్దానమిమ్ము. వారందరు నిన్ను రహస్యముగా కలసికొనగలరు. నీ గురుత్వము నిలుచును. ఈ యూరిలో నీ ప్రతిష్ఠ పోదు. రాజధానిలోగూడ పోదు. నిన్నుగూడ బుద్ధావతారముగా పరిగణింతురు.

శాకయ్య :—అట్లే! నేను వాగ్దానము చేయుచున్నాను. వారి యందరి పాపములను స్వీకరింతును. ఆనాడెప్పుడో నీవు చేయించెడి హోమమునందు నేను వానినన్నిటిని స్వీకరింతును.

గోస్వామి వెడలిపోయెను. తూరుపున సూర్యుడు మందేహాభిధు లైన రాక్షసులతోయుద్ధము చేయుచుండెను. సూర్యుని శరీరము తత్క్షతజ రక్తంబయ్యెను.

ఆ మరునాడు రాత్రి యెవ్వరును రాలేదు. వారము దినము లెవరును రాలేదు. గోస్వామి చెప్పిన మాటలలో నిజమున్నదా? అతడు నిజముగా నా తత్పావళి కుమారుడేనా? మొగము యొక్క శవళికలు చూచినచో నాతడే యనిపించెను. పదునాలుగు పదునేను

సంవత్సరముల క్రిందటి మాట. అతడే కావచ్చును. అతడు కాక పోవచ్చును. మానిసిని బోలిన మానిసు లుందురు. అతడు తన పూర్వకథ యంతయు జెప్పెను. అతని కెట్లు దెలియును? అతడు నిజముగా గోస్వామియైనచో నొకవేళ తెలిసినచో తన తల్లియైన రత్నా వళి కథ తెలియ వచ్చును. కొంతదూరములో నున్న నాలాయని కథ యైనను దెలియ వచ్చును. శాలావతి కథ తెలియుట యెట్లు? అది అసంభవమైన విషయము. గీలా విషయము తెలియుట యంతకంటె నసంభవము. అతడెవడో కొన్ని విద్యలు తెలిసికొన్నయోగి. వారికి మనిషిని జూచి మొగమును జూచి వారి మనస్సులలోని సంగతులు తెలిసికొను శక్తి యుండును. భూతమంతయు చక్కగా చెప్పుదురు. భవిష్యత్తు తెలియదు. భూతము మన మనస్సులలో నాడుచుండును. మన మొగములు చూచి తెలిసికొను శక్తి వారి కేదో యుపాసనవలన తెలియును. కొన్ని క్షుద్రశక్తులుండును. క్షుద్రమంత్రము లుండును. అనేక శాస్త్రములు-పక్షిశాస్త్ర మని యొకటి- ఆ పక్షి చెప్పునట. అతడు నాకంటె నెక్కువ విద్యలు తెలిసినవాడు. నన్ను బెదరించుటకు వచ్చి నాడు. నన్ను భయపెట్టి నా వద్దనుండి యేమి సంపాదించవలెనని? నా వద్దనున్న విద్యలు తన వద్ద లేవేమో! అవి సంపాదించుట కిదియొక మార్గమే. అపరగండము జేసి సంపాదింపవలచి నట్లున్నది. కాని నేను వానికి వాగ్దానము చేసితిని. ఆ వాగ్దానము చెల్లించవలయునా? వలదా? చెల్లించ నక్కరలేదనగా నా శక్తులు నా యందు లోపించినట్లు కన్పించెను. అతడు దానికి హేతువును కల్పించి చెప్పినాడు. అతడు గొప్ప తార్కికుడు. పొసగించి మాటాడగలడు. ఆ పొసగించుటలో నెంత నేర్పున్నది! అత డేమైన పండితుడా! నా వలెనే యచ్చట నచ్చట నేవియోయేవియో విని నన్ను బుకాయించుటకు వచ్చినాడా! కానిమ్ము! వాని మాటలలోని యాథార్థ్యము కొలది దిన ములలో తెలియును గదా! మొదటిది గీలా రావలయును. ఇప్పుడా గీలా యెట్లుండును? అప్పుడది యడవిపిల్ల. ఆ ముసలిది దానికి కత్తి సాము సమృద్ధిగా నేర్పినది. కాని యితడెంత చూచినట్లు చెప్పెను. 'తిలిప్స' సంగతి చెప్పెను! అది యంతయు భూతముకదా! అతడు

చెప్పిన భవిష్యత్తు దినము దినము గడచుచున్నది. ఎవ్వరును వచ్చుటలేదు.

ఇట్లెనిమిది దినములు గడచెను. ఎనిమిదవ నాటిరాత్రి తన యుపన్యాసమైన తరువాత నా స్త్రీ వచ్చెను. ఆమె గీలా! తాను తన పేరును, దేశమును వ్రాసెదననెను. శాకయ్యాను గూడ వ్రాయుమనెను. అప్పటి కర్ధరాత్రము దాటినది. శాకయ్యాకు హఠాత్తుగా గోస్వామి చెప్పిన దంతయు స్ఫురించెను. అతడు గీలా వచ్చునని చెప్పెను. వచ్చినది. తక్కిన వా రెవ్వరో యెవ్వరో వత్తురనెను. వారు రాలేదు. అతడు చెప్పినది పూర్తిగా నబద్ధము కాదు. పూర్తిగా నిజముకాదు. ఆ యర్ధ రాత్రమునందు సామాజికు లందరు వెడలిపోయిన తరువాత, శిష్యులు దూరముగా తొలగిన తరువాత నీ గీలా వచ్చెను.

అప్పుడు శాకయ్యా యిట్లనెను:—నిజమే! నీ పేరు గీలా! నా పేరు శాకయ్యా. మన మిద్దరము భార్యా భర్తలము కాకపోయినను నీకు నాకు సంబంధ మున్నది. పదునేనేండ్ల క్రింద నేను నీతో రెండు నెలలు సంసారము చేసితిని. ఇచట నా కుటీరమున్నది. అది యే కాంతప్రదేశము. మన మచ్చటికి పోదము. తక్కిన యన్ని విషయ ములు నచ్చట మాటాడుదము.

అని శాకయ్యా గీలాతో చెప్పి శిష్యులను పిలచి "ఈమెనాకు పూర్వము శిష్యురాలు. ఈమె నా వద్ద కొంత యోగాభ్యాసము చేసి నది. ఆమెకు నే నొక యోగరహస్యము చెప్పుదు నంటిని. చెప్పలేదు. ఆమె మరల నన్ను వెదకికొనుచు వచ్చినది." అని ఆమెను తన వెంట స్త్రీలు ప్రవేశింపరాని తన యాశ్రమములోనికి దీసికొని పోయెను.

వీరిద్దరు నచ్చటికి చేరెడు వేళకు నాశ్రమము కిటకిట లాడు చున్నది. ఆశ్రమములో పదిమందియో పండ్రెండు మందియో నుండిరి. అందరును కూర్చుండిరి. ఎవరును మాటాడుటలేదు. ఆశ్రమము బయట నిశ్శబ్దముగా నున్నది. లోన దీపములు వెలుగుచున్నవి. అవి తాను వెలిగించిన దీపములు కావు. అతడు తన యాశ్రమములో నొక్క దీపమునే వెలిగించును. అది గాలి కారిపోకుండ నొక మూల నుంచును. ఇప్పుడు పది దీపములున్నవి. జ్యోతులవలె నున్నవి ఆశ్రమాంతఃప్రదేశమంతయు దేదీప్యమానముగ నున్నది. ఎన్నడును

లేని వెలుగు తన యాశ్రమమునుండి యిట్లు కనిపించగా చుట్టుపట్ల నున్న జన మేమనుకొందురు? ఏమనుకొందురు? గురువుగా రేదో వినూత్నమైన తపస్సిద్ధి కొరకు ప్రయత్నించు చుండి రనుకొందురు.

గీలా వారందరను జూచి నివెఱపోయెను. ఆమె ద్వారము వద్దనే నిలుచుండెను. శాకయ్యా లోనికిబోయి "మీ రందరు నెవరు? ఎందుకు వచ్చితిరి? నా యనుజ్ఞలేకుండ లోని కెందుకు ప్రవేశించితిరి? ఈ దీపము లెక్కడివి?" యని యడిగి యందరి వంకను జూచెను. అందరి మొగములును పరిచితములవలె నున్నవి. నుంత దవ్వున నొక స్త్రీ. ఆమె వయస్సేబది యుండవచ్చును. ఆమెవద్ద నొక కుఱ్ఱవాడుండెను. వాని వయస్సు పాతికయేండ్లుండ వచ్చును. వా రిద్దరెవరు? ఆ స్త్రీ యెవరు? ఆ బాలకుడెవరు? ఆ బాలకుడు చూచుటకు తనవలెనే యున్నాడు. ఇంతలో నొక పురుషుడు లేచి నిలుచుండెను.

అతడు శాకయ్యతో నిట్లు చెప్ప నారంభించెను: "నాపేరుకాలంజరుడు. నేను మగధాధిపతులైన సహదేవ మహారాజుగారి యొక్క సేనాధిపతులలో నొకడను. నీ వెరుగుదువు. మహామంత్రియైన ప్రతాపసేనుని కుమార్తెను నాలాయనిని నేను ప్రేమించితిని. ఆమెను నీవు పాడుచేసితివి. ఆ రోజున రాత్రి నిన్ను వధించెడి వాడనే! కాని కోట లోని బహుజనులు నిన్ను దాటవేసిరి. ఆ నాడు బ్రతికిపోయితివి. ఆ నాలాయని నాటినుండి వివాహ మాడలేదు. నీవు తిరిగివత్తువని యెదురు చూచుచున్నది. ఇన్నాళ్ళకు నీవు నాకు కన్పించితివి. ఒకయేడా! రెండేండ్లా! ఇప్పటికైనను నీవు నాకు కన్పించెడివాడవుకావు. ఆ మహానుభావుడు గోస్వామి నీ వింటుంటివని చెప్పి యిచ్చటికి రహస్యముగా వచ్చుటకు మార్గమునుగూడ నుపదేశించినాడు. నే నిచ్చటికి రాకమున్నె వీరందఱిచట నుండిరి. నీవు ముందర వారితో మాటాడి పంపించుము. తరువాత నా సంగతి తేల్చికొందును.

అంత నింకొకడు లేచి యిట్లనెను: "ఓయీ! నాపేరు దూరచక్షువు. నేను నా మిత్రులతోకలసి నిన్ను వధించుటకు వెంటబడి తరిమితిని. అప్పుడు గోస్తనీనది వరదలమీద నున్నది. నీవు వరదలో దూకితివి. ఎట్లును నశించి పోవుదు వనుకొంటిమి. మా యూరునకు మేము చేరితిమి. నీవు నా భార్యను పాడుచేసితివి. ఆమె నన్ను వదలి

లేచిపోయినది. నీ వెప్పటనైన కనిపింతువేమో! నీమీద పగ తీర్చు కొందమని కత్తి బొడ్డులో పెట్టికొనియే దేశదేశములు తిరిగితిని. ఇంక లాభములేదు. నా బ్రతుకునకు ప్రతీకారము నేను చేయగలిగిన గీత నా మొగమునందు వ్రాయబడ లేదని నేను నిశ్చయించికొనగా నా భార్య కొన్నాళ్ళకు తిరిగి నా వద్దకు వచ్చెను. వచ్చి ఏమన్నదనగా!- అయ్యా! నేను పాపము చేసితిని. నిజముగా చేయలేదు. అతడు నన్నర్థరాత్రమున నిద్రవేళ నాతో పాపము నెరపెను. నాకు కొంతవేళకు మెలకువ వచ్చినది. ఆ సుఖము నేనెన్నడు నెరుగను. మెలకువ వచ్చికూడ ప్రయోజనము లేకపోయెను. తరువాత తరువాత యోచించితిని. అతడు నాకు మందో మాకో పెట్టెను. నీ యందు విరక్తురాలనై పోలేదు. ఆ పాపముచేసిన మేనితో నీతో సంసారము చేయుట నా కిష్టము లేదు. అందుచేత లేచిపోయితిని. ఆ నా పాపము నతడు మరల స్వీకరించినచో, నీ కంగీకారమైనచో నేను మరల వత్తునని చెప్పెను. నేను నీకొరకై వెదకుచుంటిని. ఆ గోస్వామి ఎవరు? అతడే నాకును నీ యునికిని చెప్పెను. నా భార్య యొక్క పాపమును నీవు స్వీకరింతునని నాకు వాగ్దానము చేసినచో నేను వెడలిపోయెదను. లేనిచో ఇచ్చటనే ప్రాణము విడలెదను." అనెను.

ఇట్లే తక్కిన పదిమందియు నొకని తరువాత నొకడుగాలేచి తమ దేశముపేర్లు, తమ పేర్లు, తమకూతురో కోడలో సమీపబంధువో ఒక స్త్రీ యొక్క చేటును గూర్చి చెప్పి వారు వారందరు తమరు తమరు తమ బుద్ధిపూర్వకముగా నతనిని ప్రేమించలేదనియు, వారిని హఠాత్తుగా నీత డొక మైకమును క్రమ్మించి వారి శీలమును చెరపెననియు, వానిని శపించుచు నుండిన సంగతి, వారందరకు గోస్వామి కనిపించి వారి వారి యెల్లపాపములను శాకయ్యా స్వీకరించినచో వారి జీవితములు చక్కబడునని చెప్పుటచేత వారి పాపములను శాకయ్యా స్వీకరించునో లేదో తెలిసికొనిరమ్మని చెప్పుటచేత తాము తాము వచ్చితిమని చెప్పిరి.

అందరి వాక్యములయందు గోస్వామి వినిపించుచుండెను. అందరు చెప్పగా మిగిలినది దూరాన నిలుచున్న స్త్రీయును శాకయ్యాను పోలియున్న బాలుడును. శాకయ్యా వారివంక జూచెను. ఆ బాలు

డేదియో మాటాడబోవుచుండగా నా స్త్రీ వానిని వారించి యిట్లనెను:
"నాపేరు నాగేశ్వరి. పేరు జ్ఞాపకమున్నదా శాకయ్యా?" తల పంచికొనెను.
ఆమె యిట్లనెను:-"నేను నీ భార్యను. మన కారుగురు సంతానము.
వీడు రెండవకుమారుడు వీని పేరు గుర్తున్నదా"—శాకయ్య మాటాడ
లేదు. ఆమె గుర్తున్నది. చెప్పలేదు. వీని పేరు హరికిశోరము.
మీరు లేచివచ్చు నాటి కితని కెనిమిదేండ్లు. మీరు లేచివచ్చి యిరువది
యేండ్లయినది. ఇప్పుడితనికి ఇరువది యెనిమిదవయేడు. నా కిప్పుడు
నలుబది యెనిమిదేండ్లు. మే మిద్దరము మనయూరునుండి బయలు
దేరి రెండేండ్లయినది. ఈ పిల్లవాడు తొలుత మిమ్ము వధించవలెనని
తలచినాడు. తరువాత తరువాత పితృవధము వేయరాదని మాని
వేసినాడు. మీరు శాలావతితో సంబంధము పెట్టి కొంటిరి. మీరు లేచి
వచ్చు నాటికి శాలావతి గర్భవతి. తరువాత నామె పెండ్లి చేసికొనెను.
పెండ్లియైన క్రొత్తలోననే—కిశోరసింహుడు తల్లి నాపి "అమ్మా!
మనదేశపు భాషవచ్చును గాని యీ ప్రాంతములందలి బాష రాదు.
నీవు చెప్పెడిమాటలు తక్కినవారికి తెలియుటలేదు. నే నారు
నెలలుగా నిచ్చటి బాషలు కొంత కొంత నేర్చితిని. నేను
చెప్పెదను. వీరందరకుగూడ తెలియును." అని తల్లినాపి కొంత
నేపాళము, కొంత మాగధము, కొంత ప్రాకృతముగా మొదటి
నుండియు నతడు శాకయ్యతో జెప్పెను. అతడు చెప్పుచుండగా
నందరకును దెలిసెను. గీతాకూడ గ్రహించెను. అతడు తనను పొందు
నాటికే యతని కారుగురు సంతానము. ఆ నిలుచున్న దతని భార్య.
ఆ మాటాడెడివా డతని కుమారుడు. అతనికిప్పుడు వయస్సెంత
యుండును? అరువది యేండ్లుండవచ్చును. ఎంత వయస్సు కల
వాడుగా కన్పించుచున్నాడు? పాతిక యేండ్లవాడుగానున్నాడు. ఎదుట
నున్న కొడుకెట్లున్నాడో అట్లున్నాడు. ఆ కొడుకు సరిగా తండ్రి
పోలిక. అతనికికూడ కావిగుడ్డలు గట్టి మూర్ధజములకు గడ్డమునకు
మీసలకు తైల సంస్కారము చేసినచో నా యిద్దరిలో నెవరెవరో
తెలియదు.

అంతట కాలంజరుడు "ఓయి! నీ బ్రతుకు బయటపడినది
కదా! నీ వద్దనేవో క్షుద్ర విద్యలున్నవి. వయస్సుతో నీ దేహము మారుట

లేదు. నాకు నాలాయనిని కాకుండ జేసినావు. నేను నిన్ను సంహరించె దను. వచ్చి నాతో కత్తియుద్ధము చేయుము. నీకు చేతగానిచో నిప్పుడు నిన్ను నేను చంపబోవుచున్నాను."

అనగా, గీలా "నేను నా భర్తను చంపనీయను. నాకు ఖడ్గవిద్య బాగుగా తెలియును. నేను నిన్ను వధించి నా భర్తను నేను రక్షించి కొందును. నీనుండి రక్షించుకొందును.అతడు నాకు చేసిన ద్రోహమున కతనిని నేనే వధింపవలయును."

హరికిశోరము:—నాకును కత్తిసామును కఱ్ఱసామును చేత నగును. నేను సేనాపతిని కాకపోవచ్చును. నీవలె నావద్ద నాటవికమైన ఖడ్గ విద్యాలక్షణములు లేకపోవచ్చును. కాని నీవు నా తండ్రిని సంహ రించుటకు నేనంగీకరించను. నేను నిన్ను గెలుతును గెలువను. నీవు నా తండ్రిని వధించకుండ చూడగలను అనెను."

అంతట దీర్ఘచక్షువు ఇట్లనెను:—మీరు మీరుపశమింపుడు. నేనొక్కటి యడిగెదను ఏవమ్మా! నాగేశ్వరీ! నీవు నీ భర్తను దీసి కొని మీ దేశమునకు దీసికొని పోనెంచుచున్నావా?

అని యడుగగా హరికిశోరుడు తల్లితో నీ మాటలు చెప్పి యామె మాటలు విని దీర్ఘచక్షువుతో నీ మాటలు చెప్పెను:—అతడిప్పటి కైనను వచ్చి న్యాయముగా సంసారము చేయుదునన్నచో నా కభ్యంతరము లేదని యామె యనెను.

గీలా "ఇట్టి దుర్జనుడు నాకక్కరలేదు.ఆ నాడు నావలె నితడును యౌవనమునందుండె ననుకొంటిని. ఇతనిని వధించుటయే నా యభి మతము. ఈ తల్లి కొడుకులకు గూడ నిటువంటి భర్తమీద ఇటువంటి తండ్రిమీద వ్యామోహముండుట మంచిది కాదనుచున్నాను అనెను.

అప్పు డా పదిమందిలో నొకడు లేచి యిట్లనెను: "గీలా! మే మందర మిచట సమావేశమగుటకు గారణము గోస్వామి. నేనందరను కనుగొన్నాను. ఇందరకు నిచ్చటి యితని పాలకువ చెప్పినది గోస్వామి. ఇచ్చట మనమందరము సమావేశమగుటకు రహస్యమార్గ ముపదేశించి నది గోస్వామి. ఇతడు భంగపరచిన స్త్రీలయొక్క యందరిపాపముల నితడు స్వీకరించుట కంగీకరించినచో మనదారిని మనము పోవుదము.

గోస్వామి మనందరకదియే చెప్పెను. ఆయన యితనిచే సర్వపాప ఫలము స్వీకరింపజేయును.

అనగా గీలా యిట్లనెను: "నేను పాపము చేయలేదు. నా పాప ఫల మిత డనుభవింప నక్కరలేదు—"

అప్పు డచటికి గోస్వామి వచ్చెను. గీలాతో నిట్లనెను: "నీ వితనిని వదలిపెట్టి గుళూచితో పదునేనేండ్లు సంసారము చేసితివి. నీవు పాపము చేసితివి. మీ నీవారజాతి యాచార మిచ్చుట పనికిరాదు. తరువాత నీవు చేసిన పాపము నితని ననుభవింపజేసెదను. అందరును వెడలిపొండు."

# 15

రాజధానిలో నొకగొప్ప యుద్యానవనము. అందులో నొక సౌధము న్నది. శాకయ్యా యా సౌధమునకు నిన్నటిప్రొద్దున గొనిరాబడి నాడు. అతడు సౌధమునంతయు పరిశీలించెను. అది మహాభవనము. మొత్తముమీద పం(డెండు గదు లుండును. దక్షిణదిశయందు రెండు గదులుతప్ప తక్కిన గదులన్నియు నతని స్వాధీనమునందుంచ బడెను. ఆరెండు గదులకు సమానముగా (ప్రక్కనానుకొని రెండు గదులున్నవి ఈ గదులలోనుండి యాగదులలోనికి బోవలయును. కాని యాగదులు మూసియున్నవి. ఇనుపకమ్ములు బిగించియున్నవి. ఈగదులేమి యని శాకయ్యా యడుగగా నా యుద్యానవన మొక మహామంత్రిదని, యామంత్రియొక్క యేవో సంభారము లాగదులయందు వేసి బీగమును తగిలించిరని చెప్పిరి. మొన్నటివఱకు నా సౌధమంతయు మంత్రి యధీనమందే యున్నది. శాకయ్యా యా గదులను గూర్చి యేల నడిగెననగా వాడుకొనుటకు వీలైనగదులన్నియు తన

యధీనమునందే యున్నవి. అమరునాడేకదా గోస్వామి హోమములు చేయుదునన్నది. తనకుదెలియకుండ నతడు చేయలేడు. అతడు హోమములు నెరపినచో తన పదిగదులలో నొకగదిలో నెరపవల యును. హోమమునగా కుండమును త్రవ్వుటయో నిర్మించుటయో చేయవలయును. శాకయ్యా యేనా డా సౌధమునందు ప్రవేశించునో యామరునాటిరాత్రికి గోస్వామి చెప్పిన హోమములు జరుగుట. ఆ సౌధములోనికి శాకయ్యతప్ప మరియెవ్వరును పోరాదు. అచ్చట సేవ కులుకూడ లేరు. శాకయ్యా తనకు గావలసిన పనులు తానే చేసి కొనును. అతని కెప్పుడును సేవకు లక్కరలేదు. సౌధమునుండి యుద్యానవన ప్రవేశద్వారము నొద్దకు తేలికగా రెండువందల గజముల దూరమున్నది. ఉద్యానవనము చుట్టును పెద్ద ప్రాతిగోడ. కోటగోడవలె నున్నది. ఆ కోటగోడను లంఘించుట సులభముగాదు. గోస్వామి దీని లోనికి రానేలేదు. అదియంతయు సమూతకల్పన. తనతో నెవరైన మాటాడవలయునన్నచో నుద్యానవన ప్రధానప్రవేశద్వారమునం దిద్దరు సైనికులున్నారు. వారిలో నొకడు వచ్చి తనతో చెప్పును. రెండవవాడచ్చటనుండి కదలడు. తనయనుజ్ఞ లేకుండ రాజుకాదు మంత్రికాదు, సేనాపతికాదు, ఎవ్వరును లోనికివచ్చుటకు వీలులేదు.

ఈ కట్టుదిట్టమును శాకయ్యా తన భక్తులద్వారా చేసెను ఎవరో మంత్రులో సేనాపతులోయైనచో మాత్రమే శాకయ్యా చూచును. శాకయ్యా దర్శనముచేయుటకు మూడుదినములు నిషేధింపబడినవి. ఈమూడు దినములు గురువుగారు తపస్సమాధిలో నుందురు. అమరునాడు అనగా నేడు ఏదినమునరాత్రి గోస్వామి హోమములకు నిర్ణయించెనో యానాటి మధ్యాహ్నమునుండి ప్రొద్దువాటారువరకు శాకయ్యాను రెండేనుగులమీద నంబారీకట్టి యూరేగింతురు ఆ రెండేనుగుల వెనుక పదియేనుగులు వచ్చుచుండును. ఆవెనుక వందగుఱ్ఱములు నడచు చుండును. ఆవెనుక దిలహరినగరములోని రాజధానిలోని పెద్దపెద్ద యుద్యోగస్థులందరు తమ గుఱ్ఱపుబండ్లమీద వచ్చుచుందురు. ఈ వరు నకు నిరువదెనల రథములు నడచుచుండును. అవి యుద్ధములలో నుపయోగించెడి రథములు. వానియందు రథికులు ధనుష్పాణులై యుందురు. చక్రరక్షకులు, పతాకారక్షకులు, హయరక్షకులతోపాటు

రథములు నడచుచుండును. వెడల్పైన యాస్తరణముపైన బిగించ బడిన రెండేనుగు లీ యూరేగింపునకు ముందర నడచుచుండును. ఆ రెండేనుగులముందర ననేకవాద్యములుండును. సర్వప్రదేశముల యందు ఖడ్గపాణులైన సైనికులు, బల్లెములు ధరించిన సైనికులు సర్వ రక్షాధురీణులై యుందురు. హౌదామీద నొక్క శాకయ్యయే యుండును. హౌదాకు నాల్గుదెసలను వాని సన్నిహితశిష్యులును ఖడ్గపాణులై వామహస్తములు హౌదామీదనుంచి నిలుచుందురు. హౌదాకు ముందు శాకయ్య శిష్యులలో మహావీరుడైన ఖడ్గవిద్యానిపుణుడు కత్తి యొరనుండి తీసి చేతిలో గ్రహించి నిలుచుండును. అతనిచేతిలో కత్తి యుండగా ముందునుంచిగాని, మూలలనుంచిగాని యెవడును శాకయ్యమీదికి నేదియును విసరలేడు. బాణము వచ్చినను నితడు దానిని కత్తితో వంచగలడు. అతడంత సమర్థుడు. ఊరేగింపు మిట్ట మధ్యాహ్నమునుండి ప్రొద్దు క్రుంకబోవుచున్నవన్న వేళదాక సాగెను. నిర్ణీతమైన దాని ప్రకారము ఊరేగింపు చివరకు జితేషాస్త్రి మహారాజు యొక్క రాజభవనము ముందాగును. గురుపూగాయ వచ్చును. మహా రాజు లోనుండి వెలికివచ్చి గురుపుగారిని పిలుచుచెను. శాక్యసిం హుడు ఆ నేనుగులమీదనుండి దిగి మహారాజు కృతనమస్కారము లను స్వీకరించి లోనికి దీసికొని పోబడును. ఇది నిర్ణయము.

ప్రధాన సేనాపతులును, మంత్రులును మహారాజుతో మాటాడి వారి యంగీకృతిని పొందిన విషయము. శాకయ్య తన యుద్యానవన భవనమునుండి బయలువెడలునప్పుడే తాను తిరిగి వచ్చునప్పటికి నుద్యానవనములోనికి నెవరిని పోనియరాదని కట్టుదిట్టము చేసెను. ప్రధాన ద్వారముపద్ద సైనికు లిద్దరు కాపు. ఇరువదమంది నేర్పాటు చేసెను. ఉద్యానవన ప్రాకార కుడ్యమున్నది. ఆ కుడ్యమునకు నాల్గు మూలలయందు మరియు, నందందు రెండువందలమంది సైనికులు నిలుపబడిరి. లోనికెవరిని రానియకూడదు. శాకయ్య యిట్టి కట్టుదిట్టముతో నూరేగింపునకు బయలుదేరెను. ఊరేగింపు పూర్తియైనది. పైన హౌదా కట్టిన రెండేనుగులును రాజభవనము ముందు వచ్చి నిలచినవి. మంత్రులు మహారాజువద్దకుబోయి శాక్య

సింహులు విచ్చేసినారు. ప్రభువులువచ్చి వారికి స్వాగతము నెతప వలెనని మనవిచేసిరి.

జితేదాస్తి మహారాజుల వారిట్లన్నారు:—ఔనయ్యా! నిన్న నే నాలోచించలేదు. కౌరవ పాండవయుద్ధము సమీపించుచున్నది. దుర్యోధనుడు రాజ్యభాగ మీయడు, యుద్ధము తప్పదు. శ్రీకృష్ణదేవుడు యుద్ధము జరుగుటకే సర్వథా ప్రయత్నించును. నాకు యుద్ధము జరుగుట యిష్టములేదు. జరిగినచో నేనును, నా సైన్యమును పాండవుల పక్షముననుండి యుద్ధము చేయుదుము. అతల శ్రీకృష్ణుని భగవంతు డనుకొనుచున్నారుగదా! ఈతల మన మితనిని భగవంతుడను కొనుచున్నాము. అతడు హింసావాది. భూభారమును తగ్గించుటకు యత్నించును. ఈతడహింసావాది. అతడు యుద్ధము చేయుటకు సర్వథా ప్రయత్నించును. ఇతడు యుద్ధమును నాపవలెను. ఇతనిని హస్తినాపురమునకు దీసికొనిపోయెదను. ఇతడు తన తపశ్శక్తిచేత కౌరవ పాండవులను యుద్ధవిముఖులను చేయవలెను. కృష్ణునితో వాదించి యహింసా సిద్ధాంతమును నిలుపవలెను. ఆ వాగ్దానమును శాక్యసింహుడు నాకు చేసినచో నతనికి స్వాగతమిత్తును. అతనిని నాయింటనే యుంచికొని యారాధింతును. అతనిని నావెంట హస్తినాపురమునకు దీసికొనిపోదును సర్వభారత దేశమునందలి సర్వ ధాత్రీపతులు తమ తమ సైన్యములతో కౌరవపాండవుల యుద్ధమునకు వత్తురు. నేనొక్కడను పోను. పాండవులతోడి నా మొగమోటమి యేమికావలయును? ఒకవేళ యుద్ధములో పాండవులు గెలుతురను కొందము. వారు నన్ను మిత్రద్రోహిగా పరిగణింతురు. కాదు కౌరవులు గెల్తురు. నేను పాండవులయొక్క చెలిమికాడనని వారు నన్ను మన్నించరు. నన్నీ సంకటమునుండి శాక్యసింహుడు తప్పించవలయునుగదా! ఒక్క మన యీ చిన్నదేశములో నహింసను స్థాపించినందువలన నేమి ప్రయోజనము? సర్వ భారతదేశమునందున నతడు తన మతమును స్థాపించవలెను. ఇది మంచి వీలైన సమయము. ఇతడు హస్తినాపురమునకు వచ్చి శ్రీకృష్ణునితో వాదించి యహింసాతత్త్వమును స్థాపించినచో భారత దేశమంతయు కొలది కాలములో నహింసా మతమును స్వీకరించును. అంతటి మహాతపస్వికి

నిది పెద్దపని కాదు. నా విన్నపముగా చెప్పి యాయనయంగీకరించి నచో నేనువత్తును. అయిన నాకావాగ్దానము చేయవలయును. అప్పుడు నే నాయనను రాజభవనములోనికి దీసికొని.వచ్చెదను" అని చెప్పగా మంత్రులందరు నొకరి మొగము లొకరు చూచుకొనిరి.

ఒక మంత్రిమాత్రము సాహసించి యిట్లనెను: "మహారాజా! మనమాయనను తొలుత పిలిచినప్పు డీ నియమమును చేయలేదు.ఇది క్రొత్త నియమము.

అనగా మహారాజు మరల నిట్లనెను: నిజమే! ఇది క్రొత్త నియమమే. నేను నిన్న చెప్పలేదు తప్ప నేననుకొన్ననే. అంత సామర్థ్యము లేనివానికి మీరందరింత చేయుదురని నే ననుకొనలేదు. అతడే భగ వంతుడని మీరు చెప్పుచున్నారు. భగవంతున కిదియెంతటి పని ? కాదు నేడు నేనితనికి శిష్యుడనగుదును. పాండవుల పక్షమున రేపు నేను యుద్ధము చేయవలెనా? వలదా? నేడు నే నీయనకు శిష్యుడనై యహింసాసిద్ధాంతమును స్వీకరించి రేపుపోయి పాండవుల పక్షమున యుద్ధము చేయుదును. చేయనిచో మన రాజ్యమునకు నేనిందాక చెప్పిన యాపద యున్నది. మీరే చెప్పుడు,

అనగా, నా మంత్రి నిరుత్తరుడయ్యెను. వారిలో కొందరుపోయి శాకయ్యతో నీ మాటలు చెప్పిరి. దిలహరినగరమునుండి వచ్చిన కొందరుద్యోగులకు, సేనాపతులకు గోపము వచ్చెను. అందరును గోప మును బూనగా రామరు డిట్లనెను, ఈ సర్వమును చేసినది రామ రుడే. శాకయ్యకు ప్రియశిష్యుడు రామరుడే కదా! ఇతడే దిలహరి నగరమున ద్యూతగృహము లేర్పరచి మహాధనమును సంపాదించిన వాడు. ఇతడే తనకున్న పలుకుబడితో శాకయ్యచేత రాజదర్శనము చేయించవలయునని, రాజును శాకయ్య యొక్క శిష్యుడుగా చేయ వలెనని భవిష్యత్తునందు తాను మహామంత్రి కావలయుననియు నూహించినవాడు. అందరు కోపించుచుండగా నతడిట్లనెను. "నిజమే! మహారాజుగారు చెప్పినది చాల నిజము. మన మహింసాసిద్ధాంతమును స్థాపింపవలయును. గురువుగారు దానికి సమర్థు"లని మహారాజు మాటలకు రామరుడు అంగీకరించెను. తక్కినవారందరు చల్లబడిరి. రామరు డాలోచించెను. మంత్రులందరును వట్టి మంత్రులు కారు.

వారు సేనాపతులును యుద్ధవీరులును కావలెను. తాను సేనాపతియు కాడు. యుద్ధవీరుడును కాడు. అహింసాసిద్ధాంతము ఖలిసినచో మంత్రి యైన వాడవిశానక్కరలేదు. అపుడు తాను తన గురువు యొక్క సాహాయ్యముతో మహామంత్రి కావచ్చును. అప్పుడు మహారాజుయొక్క మాటలన్నియు మంత్రులును, సేనాపతులును శాక్యసింహునితో మనవి చేసిరి. శాక్యసింహు డాలోచించెను.

ఆ దినము తనకు చాల మంచిదే! ఇంత యూరేగింపు, ఇంత యుత్సవము జరుగుట సామాన్యజాతకములో నుండదు. తన పాదములయందు శంఖచక్రము లున్నవి. చిన్నప్పుడు తన జాతకము చూచి యాతని ప్రతిష్ఠ పదిదిశల నావరించును; ఇతడొక మతకర్త యగునని జ్యోతిష్కులు చెప్పినమాట నిజమగుటకు నేడు ప్రారంభించినది. ఇంతవరకు ఘటించుగా తానైనట్లే! కాని చివరికి యుద్ధంకి వచ్చినది. తానిప్పు డబద్ధమాడి తా నా పని చేయుదునని యిప్పుడు రాజును తన శిష్యునిగా జేసికొనుటయా. మానుటయా యన్నది ప్రశ్న. మానినచో తన గౌరవమంతయు పోవును. ఇంతమంది జనములో తాను వ్యర్థుడగును. ఇచ్చట రెండు ప్రశ్నలున్నవి. మొదటి ప్రశ్న - నేటిరాత్రి గోస్వామి వచ్చునా? హోమములు జరుగునా? దాని ఫలిత మేమగును? ఇది. ఈ గండము గడచినచో రాజునకా వాగ్దానము చేయవచ్చును. తా నతనివెంట హస్తినాపురమునకు బోవుటయు నచటి నభలో వాదించుటయు తరువాతి మాట! అప్పటి మాట చూచికొనవచ్చును. కౌరవపాండవ యుద్ధము జరుగుటకు రెండు మూడేండ్లు పట్టవచ్చును. పాండవు లప్పటి కజ్ఞాతవాసమే చేయుట కారంభించలేదు. వారి యజ్ఞాతవాసములో దుర్యోధను డెట్లును వారిని కనుగొనును. మరల వారు పదుమూడేండ్లరణ్యావాసము చేయవలయును. శకుని మహావివేకి. బ్రతికియుండగా పాండవులు రాజ్యముచేయుటకు వీలులేనట్లుగా చేసెను. ఆ యుద్ధమును వారించవలయునన్న ప్రశ్నయే లేదు. కనుక దానిని గూర్చిన భయములేదు. ఇంక గోస్వామి వ్యవహారమే మిగిలియున్నది. ఇదివరకే తాను గోస్వామి కథరామతాదులతో చెప్పి వానిని తన కడకు రాకుండ జేయవలయు ననుకొన్నాడు. అతడు తనవద్ద కెట్లువచ్చునో తనకు తెలియదు. అతడే కాదు. తన

భార్య, తన కొడుకు కిశోరుడు, కాలంజరుడు, దీక్షచక్షువు మరి పది మంది దిలహరినగరమున తన పరమశిష్యుడైన భారద్వాజుడు ఖడ్గ విద్యాపరమనిపుణుడు. తన హెూదాముందు కత్తి పుచ్చుకొని నిలు చున్నవాడు. వానిని దాటి యర్ధరాత్రమున తన కుటీరములోని కెట్లు వచ్చిరి? అచటినుండి వారెట్లు వెడలిపోయిరి! ఆ రహస్యమార్గమేమి? అట్లు వారి రాజధానిలో తానున్న యుద్యానవన సౌధములోనికి రా గలుగుదురా? ఇది నలుగురకును దెలిసినచో తన కప్రతిష్ఠకదా? తానార్గురు బిడ్డలతండి కదా! భార్యయు కుమారుడును ప్రత్యక్షముగా కనిపించుచున్నారు కదా! తన యొక్కని మాటయే నిజమా? వారందఱబద్ధము చెప్పుచున్నారా? ప్రజలు నమ్మవలదా? కాదయ్యా! భారద్వాజుడు తనను రక్షింపుననగా గీలా ఖడ్గవిద్యానిపుణురాలు! కాలంజరుడు సేనాని. తన కొడుకు హరికిశోరుడు కూడ ఖడ్గ విద్యా నిపుణుడేగాని యావేళకు వాడే వైపున చేరునే! అతడు మాట్లాడిన మాటలలో తీవ్రతయున్నది. వాని తల్లి మాటిమాటికి వానిని వారించు చున్నది. శాలావతీ సంతానమును వాడు ప్రేమించుటయేమి! అది తనకు చెల్లెలగుటచేత నా పెండ్లి విఘటితమగుట యేమి! అది తటాకమునబడి చచ్చుటయేమి! ఈ రీతిగా నేను వానికి విరోధినగుట యేమి! పండ్రెండు దినముల క్రిందట నా కుటీరములో నా కథ యంతయు ప్రత్యక్షముగా నున్న హరికిశోరుడు నావైపునకుండి యుద్ధము చేయుట నేను విశ్వసింపలేను. గీలా యేమన్నది? ఇతరు లను నన్ను చంపనీయనన్నది. తానే చంపుదునన్నది. నాగేశ్వరిమాత్ర మట్లూహించక యింకొకరీతిగా నెట్లూహించును? ఆమెను నేనేమి సుఖపెట్టితిని? మెడలో మంగళసూత్రముకట్టిన యాచారమునకు బద్ధు రాలై నాయందు సంతానముగన్నది. లోకమంతయు నేదోయొక భావమునందు లగ్నమై బద్ధమైయుండుటచేతగాని లేనిచో లోకమే సాగదు కుటుంబవ్యవస్థ సంఘవ్యవస్థ రాజ్యవ్యవస్థ నన్నియును ప్రతి వాడు తద్భావమునందు జన్మచేత బద్ధుడైయుండుటచేత సాగు చున్నది. జితేదాస్తిమహారాజు. అందరు నతడు మహారాజన్నచో తద్భావమునందు బద్ధులైయున్నారు. నేను గొప్ప మత గురువును. రామదాదు అందరు తద్భావము నందు బద్ధులై యున్నారు. తద్భా

వము విఘటితమైనచో రాజు రాజుకాదు. మంత్రి మంత్రికాదు. గురువు గురువుకాదు. తండ్రి తండ్రికాదు - భార్యభార్యకాదు - ఇట్లు శాతయ్య యూహించుచు చాలసేపు మాటాడలేదు.

రామతుడు "స్వామీ! మహారాజుతో తమ యంగీకారమును చెప్పమందురా?" యని యడిగెను.

అంత శాతయ్య యిట్లనెను:— ఓయీ! రామతా! రాజుగారిట్లు క్రొత్త నియమము నేర్పాటు చేయుదురని నాకు తెలియదు. నేను మతప్రవక్తను. అంద రహింసా సిద్ధాంతము నంగీకరించుడని బోధించెడివాడను, వాదించెడివాడను కాను. నా మతము మీ కిష్టమైనచో స్వీకరింపుడు. భారతదేశమంతయు రెండు పక్షములై ఎదురుబదురుగా నిలుచున్నప్పుడు నే నా నడుమను బోయి నిలుచుండి "అహింసా పరమో ధర్మః! మీరు యుద్ధమును మానుడని చెప్పినచో వారు కత్తులను నూరుకొని పదునుబెట్టుకొని వచ్చినవారు పదనుబెట్టిన శ్రమకూడ వారికి తీరదే! నాకు రాజదర్శన మక్కరలేదు. ఆ రాజ దర్శనము నేడుకాదు. మూడు నాలుగు దినములైన తరువాత చేయుదును. నేను సన్యాసిని. నేను మహారాజును సన్యాసిపోయి చూచినట్లు చూడవలయునుగాని యొక మహారాజును మరియొక మహారాజు చూచినట్లు చూడవచ్చునా? నేను మూడు నాలుగు దినములలో కాలినడకతో రాజభవనమునకు వత్తును. మీరందరు నావెంట రావచ్చును. అప్పుడు వచ్చి రాజున కాశీర్వాదముజేసి నేను రాజును నా శిష్యునిగా జేసికొందును. ఇప్పుడు మనమందరము తిరిగిపోదము. నాకేర్పరచిన భవనమునకు నే నీ యేనుగులమీద పోను. నడచి పోదును.

అని వారెంతచెప్పినను వినక హౌదానుండి దిగి తన నలుగురు శిష్యులు నాల్గువైపులను నడచిరాగా రామతాదులు ననుసరించి రాగా ఏమి జరిగినదో తెలియక ప్రజలందరు గగ్గోలు పడుచుండగా నటు రాజునుగాని, యిటు గురువునుగాని నిందించుటకు వీలులేక పోవుచుండగా నింక నాల్గు దినములలో గురువు మరల వచ్చును. రాజు నిస్సంశయముగ నతనికి శిష్యుడగునన్న ధైర్యముతో పెద్దలందరును మహాధికారులందరును సంచరించుచుండగా రాత్రి కొంత

ప్రొద్దుపోవువేళకు శాకయ్యో తన నిర్మిత భవనమునకు బోయెను. అత డందరను ప్రధానద్వారమునం దాపెను. తాను లేనప్పుడు సౌధప్రవేశము నెవ్వరు చేయలేదని నిర్ధారణ చేసికొనెను. నాల్గు కుడ్యములందున్న సైనికులను ప్రశ్నించెను. ఎవ్వరు రాలేదు. ఆ రాత్రి రాత్రియంతయు నీ సైనికులలో నెవ్వరు నచటినుండి కదలరాదు. ఈ నియమము చేసెను. అతడు మరియు నొక్క దానిని చేసెను. భారద్వాజుని తనవెంట లోనికి దిసికొనిపోయెను. భవనద్వారమున నతనిని నిలబెట్టెను. లోనికెవ్వరును రాకూడదు. వనములో నేదడుకలిగినను భారద్వాజుడు పోయి పరీక్షించి రావలెను. లోనినుండి యేదైన ధ్వని వినిపించినను భారద్వాజుడు వచ్చి చూడవచ్చును. తాను కాక యింకొక పురుషుడు తన సౌధములో గనిపించినచో వానిని భారద్వాజుడు సంహరించవలెను. ఈ కట్టుదిట్టము చేసెను. లోనికి బోయెను. పోయి యిట్లు విచారించెను. "నేను చేసినది న్యాయమా! వారి యందరి పాపములు నేను స్వీకరింతునంటిని. ఇది మాట తప్పుటయేకదా! తప్పినచో నా శక్తులు నాకుండవు. ఒకసారి యనుభూతమైన విషయము," అని శాకయ్యో తాను స్నానము చేయుచోటికి బోయి "నాకు స్నానమునకు నీరము కావలయు"నని కోరెను ఆ మంత్రము నుచ్చరించెను. దినదినము ప్రత్యక్షమగుచున్న జలము నేడు ప్రత్యక్షముకాలేదు. శాకయ్యో దినదినము కాశ్మీరపుటడవులలో దొరకు కొన్ని ఫలములను తాను నేర్చిన యొక మంత్రశక్తిచేత నేర్చెను. ఆ ఫలములను కోరెను. అవి రాలేదు; ఇట్టి శక్తులు శాకయ్యోయొద్ద పదియున్నవి. అవి పనిచేయుటలేదు. ఏమి చేయవలయును? తన క్షుత్తు పమాణము మీరినది. జామున రసేపు వీను గులమీద పోవగా వాని యొడలు హూనహూనమైనది. స్నానముచేసి భోజనముచేసి గోస్వామి వచ్చువరకు నిదురపోవుద మనుకొన్నాడు. అది సాధ్యమగునట్లు లేదు. బయటకువచ్చి భారద్వాజుని చూచి "ఓయీ! నేను పొరపాటు పడితిని. నాకోసమెవ్వరు వత్తురు? నీవు వెడలిపోవచ్చునని వానిని వనప్రవేశ ద్వారమువరకు పంపించి తాను లోనికి వచ్చెను. స్నానము చేసెను. అతగించెను. అతని యొడలు అతనికి తెలియదు. తన మంత్రములు తనకు పనిచేయుచున్నవి.

వాగాన భంగ దోషము పోయినది. గోస్వామి వచ్చి మేల్కొలుపును. కదా యని నిద్రపోయెను.

రాత్రి రెండుజాములు దాటినది కాబోలు! గోస్వామి వచ్చి నిద్రలేపెను. శాకయ్య యాశ్చర్యపోయెను. "నీ వెట్లు వచ్చితివి?" అనెను.

గోస్వామి:— అవి నేను తరువాత చెప్పెదను. హోమములు చేయుటకు నీవు స్నానమును చేయవలెను. స్నానముచేసి తొందరగా రమ్ము.

శాకయ్య:— జలములులేవు.

గోస్వామి:— నీదగ్గర నామంత్రమున్నదే కదా! ఒకసారి పని చేయలేదు. రెండవసారి పనిచేసినది. నీవు వాగ్దానమును నిలువబెట్టుకొన నెంచుచున్నావు. అందుచేత పనిచేసినది స్నానముచేసిరమ్ము.

శాకయ్య:— నీవిచ్చటికెట్లువచ్చితివో చెప్పినచో నేను వచ్చెదను.

గోస్వామి:— నీవు స్నానముచేసిరమ్ము. నేను నీకు చెప్పెదను.

శాకయ్య స్నానముచేసి పాడిబట్టలు కట్టుకొనివచ్చెను. గోస్వామి యతనిని ఏరెండుగదులు తాళముచేసియున్నవో యారెండు గదుల లోనికి దీసికొనిపోయెను. ఆగదులలో దీపములు వెలిగింపబడియున్నవి.

శాకయ్య:— ఈ గదులకు బయట బీగములు వేసియున్నవి. వానినెట్లు దీసితివి?

గోస్వామి యిట్లుతీసితినని చూపించెను. ఒకతలుపులో నొక చెక్కను తొలగించవచ్చును. ఆచెక్కలోనుండి చేయిజొనిపి తాళమును తీయుటకు వీలున్నది. శాకయ్య నవ్వెను. ఇట్లనెను: "నేను నీవేదో మహాశక్తులుకలవాడవనుకొన్నాను. ఈ సాధమును నీ వెరుగుదువన్న మాట. ఈ కిటుకులన్నియు నీకు దెలియునన్నమాట.

గోస్వామి మాటాడలేదు. ఆగదిలో హోమముచేయుటకు నిటుకలతో కుండము కట్టబడియున్నది. అది పురాతనమైనది. నేటిదికాదు. లోన దీపములు వెలుగుచున్నవి. హోమములు చేయవలసిన సంభారములన్నియు సిద్ధముగానున్నవి. స్రుక్స్రువములున్నవి. అటవికములైన వస్తువులలో జంతువుల శరీరాస్థులనుండి శృంగములనుండి సిద్ధముచేసెడి పాత్రలు గరిటెలు కొమ్ములు మొదలైనవానిలో శాకయ్య

యెరుగనివేవియులేవు. శాకయ్యా వానినన్నిటిని పరీక్షచేసెను. ఒకపాత్ర ఖడ్గమృగముయొక్క ప్రోథమునందలి ఖడ్గమునుండి సిద్ధముచేసినది. మరియొకటి సింహముయొక్క దంష్ట్రమునుండి సిద్ధముచేసిన పాత్ర. మరియొకటి ఏనుగుదంతమునుండి చేసినది. అన్నిటికంటె నాశ్చర్యము "తిలిప్ప"యన్న సర్పమున్నది.

గోనవము, 'తిలిప్ప' 'శయువు' 'సాహసము'నన్న నాల్గు మహా సర్పములు కలవు. ఇవినాల్గును అజగరజాతివి. పెద్దసర్పములు. ఈ తిలిప్ప తక్కిన యజగరములనుండి భిన్నమైనది. తక్కిన యజగరములు మిక్కిలి కదలవు. అవి కొండచిలువలు. అంతపెద్ద శరీరములను మోసికొనిపోలేవు. ఒచ్చటనే చుట్టవేసికొనియుండును. సమీపమునకు వచ్చిన జంతువులను భక్షించును. తిలిప్ప యట్టిదికాదు. ఇది యంతటిదేహముతో తాను సంచరించుచుండును అందుకనియే దానికి తిలిప్పయన్న పేరుకూడ వచ్చెను. దాని ముఖము ఎలుగుబంటి ముఖమువోలె నుండును. గోనవమునకు నాపుముట్టి. దీనికి భల్లూక ప్రోథము. దానిమొగమునందొక పెద్ద దంష్ట్రముండును. ఆ కోరతో చేసిన స్రుక్స్రువములందున్నవి. వానినిచూచి శాకయ్యా యాశ్చర్యపోయెను. ఇదినీవెట్లు సంపాదించితివని గోస్వామి నడిగెను.

గోస్వామి యిట్లనెను:— "ఇవి నేను సంపాదింపలేదు. ఇవి యన్నియు నిచ్చటనేయున్నవి. అదినాకు తెలియును. ఓయీ! కలి కాలము సుమారు నలుబదియేండ్లలో ప్రారంభముకాబోవుచున్నది. ఇది ద్వాపరాంతము. ఈ నేపాళదేశమును నేటికి వేయియేబదియేండ్ల క్రిందట భుక్తమానుడన్నరాజు పాలించుచుండెను. అప్పటి రాజవంశముపేరు గోపాలవంశము. ఆ గోపాలవంశపురాజులు ఎనిమిదిమంది రాజ్యము చేసిరి. తరువాత నీ నేపాళదేశము కిరాతవంశరాజులకు స్వాధీనమైనది. కిరాతులనగా కిరాతులుకారు. ఈ నేపాళదేశములో మిక్కిలి దక్షిణమునందున్న దేశమునకు కిరాతదేశమని పేరు. అచ్చటి రాజులు నేపాళసింహాసనము నాక్రమించుకొనిరి. ఈ కిరాత రాజులు నేటికి రెండువందల తొంబదియేండ్ల క్రింద నేపాలరాజులైరి. ఈ వంశములో జితేదాస్తి మహారాజు ఏడవవాడు. గోపాలవంశపు రాజులెనమండుగురే. ఈ నడుమ నహిర్వంశమని యొకటి యున్నది.

వారు ముగ్గురు రాజులు. వారి కాలములో నేపాళము భద్రముగా లేదు. అందుచేత నాలంబరుడను రాజు అహిర్వంశపురాజులలో మూడవవానిని వధించి నేపాళరాజ్యమును స్వీకరించెను. ఆ మూడవ రాజు సరిగా నీవంటివాడు. వాని పేరు సుచాలుడు. అతడు నీకున్న శక్తులు కలవాడు. ఇట్లు పలుమంది స్త్రీలను తనకున్న విద్యలచేత మోనము చేసినవాడు. సువ్రతుడన్న యొక యోగి వానిచేత నేనిప్పుడు నీచేత చేయించ బోవుచున్న హోమములు చేయించి యా పాప ములన్నియు నతడు స్వీకరించునట్లు చేసెను. ఈ సాధనము లన్నియు నప్పటివి.

శాకయ్యః—ఇవి యన్నియు నీ కెట్లు దెలియును?

గోస్వామి "ముందు నే నిచ్చటికెట్లు వచ్చితినో నీకు దెలియ జేసి యివి నాకెట్లు వచ్చినవో తెల్పెదను" అని గోస్వామి శాకయ్యను రెండవ గదిలోనికి దీసికొని పోయి యచట నున్న రాతిని చూపించి దీనిని "నేను తొలగించితిని."

శాకయ్యః—దీనిని నీ వెత్తగలవా?

గోస్వామి దానినెత్తి కనిపించెడి రంధ్రము మీద మూసి మరల దించెను.

శాకయ్యః—నీకింతటి బలమున్నదా?

గోస్వామిః - నీవీ గదిలోనుండి పోలేవు. నేను నీ మెడపట్టుకొని నులిమినచో నీ గొంతునుండి నప్పుడికూడ రాదు. అట్లు నిన్ను వధింప గలను. ఈ గదులకు మరల బయట తాళములు వేసెదము. నీ వేమైనావో యెవరికిని దెలియదు. ఈ పెద్ద రంధ్రములోనుండి మార్గ మున్నది. ఈ హిమాలయపర్వతములలో పశుపతిక్షేత్ర మని యొకటి యున్నది. ఆ క్షేత్రము వెనుక కొన్ని గుహలున్నవి. ఒక గుహలో నొక మహర్షి యున్నాడు. ఆయన యీ నాటివాడు కాడు. నాలుగైదు కల్పములనుండి యున్నాడు. ఇంద్రుడు వృత్రవధ చేయుటవలన తనకు గలిగిన బ్రహ్మహత్యాపాతకమును స్త్రీలతోపాటు మరి యిద్దరకు పంచెను. ఆనాటివాడు. ఆయనయే నా కివియన్నియు జెప్పెను. అవి నాకిట్లు తెలియును.

శాకయ్యః—నీవు నన్నిచ్చట చంపుదువు. నేనయిపునానవాలు లేకుండ పోదును. తక్కిన వారు వచ్చి యీ గది తలుపులుదీసి యీ

రహస్యమును దెలిసికొందురు. ఈ మార్గము వెంట నా ఋషియు చోటికి బోదురు. అతనిని వధింతురు.

గోస్వామి నవ్వెను. ఇట్లనెను: "కాల మతిక్రమించుచున్నది. హోమమును ప్రారంభింపవలయును."

శాకయ్య:— హోమ ద్రవ్యమెట్టిది? ఆ పాత్రలలో నెచ్చటను కన్పించలేదే.

గోస్వామి "నీవు చూడలేదు. అచ్చట నొక పాత్రయున్నది. ఈ పాత్రలనన్నింటిని నీవు చూచితివి. గుర్తుపట్టితివి. దానిని గూడ గుర్తు పట్టగలవేమో! రమ్ము చూపించెదను" అని యతనిని దీసి కొనిపోయి యా హోమద్రవ్యముంచిన పాత్రను చూపించెను. అది వట్టితిత్తి. శాకయ్య దాని యాకారమును జూచెను. అతడు నివ్వెర పోయెను. "ఇది యేమి? ఇది యే జంతువు యొక్క మర్మాంగము?" అని యడిగెను.

గోస్వామి:—నీకు తెలిసినదన్న మాట. ఇది నేటిదా? కల్పాదుల నాటిది. దీని రహస్యము చెప్పుమని నే నా ఋషినడిగితిని. అతడు చెప్ప లేదు. నేనూహించితిని. నా యూహ నేను చేసితిని. నీ యూహ నీవు చేయుము.

శాకయ్య:— అయ్యో! గోస్వామి! నా కింత శిక్షజేయవలెనా? నేను నీ తల్లిని పాడుచేసితినను మాట నిజమే! నీ వింతటివాడ వగుదువని నే ననుకొంటినా? లోకములో జారత్వమును చేయుటయందు నే నే ప్రథముడనా? నీ వెందు కింత సంకల్పించితివి?

గోస్వామి:—ఓయీ! ఇది నా సంకల్పమా? నే నెవడను? నీవు గొప్ప జాతకుడవు. నీపేరు నేపాళ రాజవంశ పశస్తియున్నన్నాళ్లునుం డును. బుద్ధావతారమునకును నీకును సంబంధములేదు. అయినను నీవుకొందరిచేత బుద్ధావతారముగా పరిగణింపబడుదువు. అయదృష్టము నీకు పట్టినది. నీ వాంధ్రుడవు. నీ దురదృష్ట మక్కడనున్నది. అయిదు వేల సంవత్సరములు కడచిన తరువాత నాంధ్రులలో నొక మహా గ్రంథకర్త యుదయించును. వాడు నిన్ను త్రవ్వి బయటకు దీయును. నీ యథార్థ స్వరూపమును నిరూపించును. అతడు నీకు నిజమైన శత్రువు.

శాకయ్య:— నాకు సాధ్యమైనచో నేను అతనిని నాశనము చేసెదను.

గోస్వామి:— అనాటికి నీ శక్తులు ప్రబలముగా నుండును. వానిని నీవు నాశనము చేయవచ్చును. నీవుపోయి వాని నావేశింప వచ్చును. అదియంతయు ఖండశఃజరుగును. వానిని నీవుగాని తదితరములైన కలిశక్తులుగాని ఎక్కువ చేయలేవు. వాడు కొద్దిలో జ్ఞానాగ్ని దగ్ధకర్ముడు. నీవు శ్రీకృష్ణ విరోధివి. అతడు శివకేశవులకు పరమ భక్తుడు. బ్రహ్మపదార్థజ్ఞాత. తన కోపమునంతయు నధర్మమునందు తీర్చుకొనుచుండును. నీమీదకూడ తీర్చును.

శాకయ్య:— వానిపేరు నాకు చెప్పుము.

గోస్వామి:— ఓయీ! ఇప్పుడు వానిపేరు గోస్వామి. అప్పు డేమో నాకు తెలియదు. గోశబ్దమునకు 'వాక్కు' అని యర్థము. వాడు వాక్స్వామి. వాక్పతి. ఆ వాక్కు సంస్కృతవాక్కు కాదు. అప్పటి కాంధ్రభాష యెట్లుండునో. అది వాని వాక్కు. అది వాడు చేసికొని నపురాకృతకర్మము.

అంతట గోస్వామి హోమమును చేయ ప్రారంభించెను. శాకయ్య యజమానస్థానమున గూర్చుండెను. గోస్వామి మంత్రములు చదువును. తాను స్వాహాయన్నప్పుడెల్ల నా తలిప్ర జిహ్వాస్థిక్కృత స్రుక్కుతో హోమము చేయవలెను. "మయిస్వాహా" ఈ రెండు మాటలను శాకయ్య యుచ్చరించుచుండవలెను. మొదటి హోమము చేసి యగ్నిలో నీ ద్రవ్యమును వేయవలసిన వేళ శాకయ్యకొక సందేహము తోచెను. ఈ ద్రవ్యమేమి ద్రవ్యమని. గోస్వామి చెప్పెను. నీకు నాల్గు సర్పముల పేర్లు చెప్పితిని గదా! గోనసము,తలిప్రము,శయువు, వాహసము-ఈ నాలుగు సర్పముల యొక్క విషమిది.

శాకయ్య:— ఇది యెట్లు సంపాదించితివి?

గోస్వామి:— అది యిచ్చటనే యున్నది. సుబాలుడు హోమము చేయగా మిగిలియున్నది.

శాకయ్య:—ఈ హోమ ఫలము నన్నంటునని యెట్లు నిరూపింపనగును ?

గోస్వామి:—ఎట్లా? ఈ విషములో వాహసమన్న సర్పము యొక్క విషముకూడ నున్నది. వాహసమనగా వాయువుచేత నవ్వునది యని యర్థము. గాలిచేత నవ్వును. వాయువు లోకమునందలి వాసనలను వహించువాడు. కర్మకుకూడ వాసన యుండును. వేదాంతులు పూర్వజన్మవాసన యందురు. ఆ వాసనను వాయువువహించు

చుండును. వాయువనగా ప్రాణము ఆ ప్రాణములందు పూర్వజన్మ కర్మలయొక్క వాసన నిండియుండును. వాసన యన్నది గౌణార్థము కాదు వాచ్యార్థమే. వాసనయే రెండర్థములు కలది. ఘ్రాణమునకు దెలిసెడి పాంచభౌతికములైన పదార్థములయందలి పృథివీగతమైన గుణ మొకటియు, కర్మల యొక్క గుణమొకటియు. ఈ వాహన సర్పవిషము దాని ఫలమును నిన్ను పొందించును.

మొదట శాలావతీ హోమము జరిగెను. తరువాత రెండు మూడు హోమములు జరిగిన తరువాత నాలాయనీ హోమము జరిగెను. పదునాల్గింటిలో పది జరిగెను. శాకయ్య తన చేతివంక జూచుట తటస్థించెను. ఆ చేయి చేయివలె లేదు. ఒక మాడిపోయిన కట్టెవలె నుండెను. ఎడమచేతితో కుడిభుజమును తట్టికొనెను. అచ్చట భుజమున్నట్లు లేదు. ఒక యెముక యున్నట్లుండెను. తాను హవిర్విషమును వర్షించుచున్న స్రుక్కునచ్చట పెట్టి కుడిచేతితో నెడమ భుజమును దాకెను. అదియు బొమికెవలెనె యుండెను. తన ఱొమ్ము వంక జూచికొనెను. ఆ పొగలో నతనికి తన ఱొమ్ము కన్పడలేదు. పాదములు కన్పడలేదు. మొగమును శిరస్సును దాకి చూచుకొనవలెనన్న యూహ యతనికి స్ఫురించలేదు.

అతడు గోస్వామితో నిట్లనెను :—ఏమయ్యా! యీ పాపస్వీకారము క్రమముగా జరుగుటలేదే! ఇంతవరకు మా తల్లిపేరు రాలేదే!

గోస్వామి :—అది చిట్టచివరకు వచ్చును నీవేమైనను ధనమును పోగుచేసితివా? నీవు నీ ధనము నెవరికైన నీయదలచితివా?

శాకయ్య :—నా ధనమును నేనెవ్వరికి నీయను. తక్కిన హోమములు చేయుము.

గోస్వామి మరల మూడుహోమములు చేయించెను. ఇంకొక్క హోమమే మిగిలియున్నది. అది రత్నావళి హోమము.

గోస్వామి యిట్లనెను :—ఓయీ! నీవిందాక రెండుభుజములను తడుముకొంటివి. భుజములులేవు. బొమికెలున్నవి. ఇప్పుడు తడుముకొనుము. అచ్చట నేమియునులేవు. శాకయ్య యొదలంతయు తడిమి చూచుకొనెను. అచ్చట నొడలనియున్నట్లులేదు. రెండు చేతులెత్తి శిరస్సును తడుముకొనెను. చేతులెత్తినట్లులేదు. శిరస్సు కన్పించలేదు. చేతులు దింపినట్లులేదు. శాకయ్య 'ఏమయ్యా! నాకు శరీరమే లేనట్లున్నదే! నేనింక హోమము చేయుటయేమి?'

గోస్వామి :—శరీరములేనిచో హోమము చేయుటయెట్లు? ఇంక హోమముగూడ నున్నదిగదా! ఆ హోమముగూడ పూర్తియైన తరువాత నాతో మాట్లాడవచ్చును. నీ యాస్తి యెవరికైన నియ్యవలెనన్నచో నాతో చెప్పుము. ఇది చివరిసారి. ఈ హోమమైనతరువాత నీవు నాతో మాట్లాడుటలేదు. నీవేమియు చేయగలుగుటలేదు.

శాకయ్య : —నేనంతయు ధూమమయముగానైతిని. నాయొడలు నాకు కన్పించుటలేదు. మేను తాకవలయునన ను తగులుటలేదు. చివరకు నన్నిట్లుచేసితివి. నేనింక జితేదాస్తిమహారాజునకు గురువును కాదలచుచున్నాను. శ్రీకృష్ణునితో వాదింపవలచుచున్నాను.

గోస్వామి :—అదినరె! నీ యాస్తి యెవ్వరికిమ్మందువు? ఎంత యున్నది? ఎక్కడనున్నది?

శాకయ్య :—నావద్ద ధనమున్నది. కొన్నివేల హేమనిష్కములున్నవి. దిలహరినగరమున నా కుటీరములో నొక్కటియే భల్లాతచక్రమున్నది. దానిక్రింద గోతిలోనున్నవి. నాకిద్దరు కొడుకులున్నారు. ఒకడు నీవుచూచిన హరికిశోరుడు. రెండవవాడు వీనికంటె పెద్దవాడు. ఆధనము వారికి గైవసముచేయుము. నేను నా ధనమును మూడుభాగములుచేసి వారిద్దరకును నీకును నొసంగదలచితిని. ఇప్పుడు నీకీయను. నీవు దుర్జనుడవు. ఆ చివరిహోమము చేయించుము.

గోస్వామి చివరి హోమమును చేయించెను.

అచ్చట శాకయ్యలేడు. అతనికిబదులొక వికారరూపమున్నది. అది గాలిలో లేచినది. లోతునకుపోయిన కనులు, చింపిరిజుట్టు. కాష్ఠమువంటి యాకారము. కన్నులు మండుచున్నట్లున్నవి.

గోస్వామి యిట్లనెను :—ఓసి పిశాచమా! నీవుపోయి గాలిలో విహరింపుము. శ్రీకృష్ణదేవుని యాజ్ఞయైనది. నీవు వృద్ధిపొందుదువు!

కృష్ణనామోచ్చారణము చేసినంతనె యాపిశాచమంతర్హితమైనది.

మరునాడు రాజభటులు భరద్వాజాదులు రామతాదులును శాక్యసింహముకొరకు వెదకిరి. మరునాడు పగలు రెండుజాములవరకు శాక్యసింహముయొక్క గుర్తులేక సాహసించి భారద్వాజుడును రామతుడును భవనములోనికిబోయి చూచిరి. అతని జాడలేదు. ఆ మూడవ దినమున ప్రక్కనున్న రెండుగదుల తలుపులను పగులగొట్టించి చూచిరి. అగదులలో నేమియులేవు. అగదులు వట్టి శూన్యములుగా